గీ. భీమనయు ననంతనయును బెద్దనయును
దాతనయుఁ జెప్పినట్టి ఛందములు గూర్చి
ప్రకరణములొప్పఁ జేసెను బ్రహ్మసంఖ్య
నానర లింగమగుంటతిమ్మనసుకవియు.

(వి-వి.)—

అసమగ్రము. వ్రాఁత ముచ్చట గూర్చుచున్నది. తప్పులు లేవు. శైథిల్యము కలదు. గ్రంథపాతములును గలవు.

ఇది యాంధ్రభాష కొక లక్షణగ్రంథము. లింగమగుంట తిమ్మకవి యేతద్గ్రంథకర్త. ఈ తిమ్మకవి వైష్ణవహితుఁడు; తిరుమలయ భట్టరు శిష్యుఁడు; సర్వార్య పౌత్త్రుఁడు; లక్ష్మణయ్యకును, దిమ్మాంబకును బుత్త్రుఁడు; రామకవికిఁ దమ్ముఁడు; ప్రథమశాఖ బ్రాహ్మణుఁడు; కాశ్యప గోత్రుఁడు; వృద్ధకుండికా నదీతీరమందలి లింగమగుంటయందు నివసించువాఁడు. తనయన్న రామకవి రచించిన వామనపురాణ మత్స్యపురాణాది కృతులకుఁదానే లేఖకుఁడుగా నుండెనఁట! ఈతనియన్న కృతులు లభించుట లేదు. ఈ సులక్షణసారమందు లక్ష్యములుగా నుదాహరింపఁబడిన పెక్కు పద్యము లప్పకవీయమందును జేరినవి. ఇందు గోకర్ణచ్ఛందస్సు, ఉత్తమగండచ్ఛందస్సు, భీమచ్ఛందస్సు, అథర్వణచ్ఛందస్సు, అనంతచ్ఛందస్సు, కవిసర్పగారుడము, శ్రీధరచ్ఛందస్సు, కవిగజాంకుశము, సర్వలక్షణశిరోమణి, సర్వలక్షణసారసంగ్రహము, కావ్యచింతామణి, కావ్యాలంకార చూడామణి, ఆంధ్రభాషాభూషణము, మొదలగు ప్రాచీనలక్షణగ్రంథములందలి పద్యములుకూడఁ జేకొనఁబడినవి. ఇందు లక్ష్యములుగా, శూద్రకరాజ చరిత్రము ఆదినారాయణ చరిత్రము మొదలగు గ్రంథములనుండికూడ గొన్ని పద్యము లుదాహరింపఁబడినవి. ఆ గ్రంథములిప్పుడు చేకుఱుట లేదు. ఈ ప్రతి తుదనున్న పద్యమువలన నీ సులక్షణసారము తొమ్మిది ప్రకరణములు గలదిగా రచింపఁబడినట్లు

తెలియుచున్నది. కాని యట్టి ప్రకరణవిభాగము లిందుఁ జూపట్టుట
లేదు. ఈప్రతి యసమగ్రమగుటయేకాక సంకీర్ణము నైయుండును.

## R. No. 12.

Palm-leaf 14½ × 1¼ inches. Foll 142. Lines, 6 in a page. Telugu. Much injured.

Presented by P. Sītārama Śāstri of Guntur in 1910-11.

జైమినిభారతము.

JAIMINIBHĀRATAMU.

This is a Telugu rendering in eight Āśvāsas of the Sanskrit work Jaiminibhārata—Aśvamēdhaparvan. The author of the work is Pillalamarri Pina Vīrabhadrakavi, son of Gādayāmātya and pupil of Bhāratītīrtha. The work is dedicated to Sāluva Narasiṁharāja. The author gives his own genealogy as well as that of his patron, for which see extracts below.

Complete.

**Beginning:**

శా. శ్రీలావణ్యపయోనిధి త్రివళివిదిమధ్యారోమావళీ
వ్యాళానల్పసుఖైకతల్పుఁడు జగద్వ్యాపారలీలావతా
రాలంకారవిహారి శౌరి సదయుండై సాక్షుండక్షమా
పాలాగ్రేసరు నారసింహుని సదాభద్రశ్రియుక్తుం జేయుతన్.

* * * *

మ. కవులన్ బంకజగర్భసన్నిభుల వర్ణింతు వల్మీకసం
భవులన్ వ్యాసులఁ గాళిదాసుబిలహ్లాను బాణున్ మయూరుఁ
[శుకుఁ
భవభూతిన్ శిశుభద్రు మల్హణుని ఘంటామాఘునిన్ జోరు భా
రవి మానన్న యభట్టుఁ దిక్కకవి నెఱ్ఱాప్రెగ్గడన్ సోమునిన్.

1045



క. సాళువనరసింగమహీ
పాలుని నత్యంత ఘనకృపాళుసి ననుహ్రా
త్పాలితనగరీవశ్య
త్పాలుని నాచేయుకృతికిఁ బతిఁ గావిఁతున్.

వ. అని ప్రబంధంబు చెప్ప నుద్యోగించు సమయంబున.

వ. ఆరాజపరమేశ్వరుం డొకనాఁడు కురు కరూశ మగధ మరాట లాట ఘోట గాంధారాది సింధు పరివేష్టిత వసుంధరా రమణకిరీట మణిగణ కిరణ జాల బాలాతప స్మేర తరుణ చరణార విందుండు . . . . ఐ . . . . పేరోలగంబుండి పురాణేతిహాసకథాప్రసంగంబుల వినోదించుచు.

* * * *

క. నామది నిరతము భారత
రామాయణకథలఁ బ్రేమరంజిలునంమన్
జైమినిభారత మనఁగా
భూమి నపూర్వము పురాణములు గణియింపన్.

గీ. ఆపురాణంబుగనఁ దెనుఁగయ్యె నేని
చెప్ప నేర్చిన కవియుఁ బ్రసిద్ధుఁ డేని
తెలుఁగు నుడికారమునమించు గలిగెనేని
కుందనము కమ్మవలచినచందమౌను.

వ. అని సభాసదుల మొగంబు చూడ నవధరించిన రాజసత్తము చిత్తమెఱింగి వారిట్లని విన్నవించిరి.

క. పరతి నైతిఁగనో పిన
పీరన దేవరతలంపు విఖ్యాతముగాఁ
బేరును బెంపునుగనఁదన (మ?)
పేరుగ రచియింపఁబూనెఁ బెశలఫణితిన్.

క. ఈతయుఁ దండ్రియు నగ్ర
భ్రాతయునుం దాను భువనభాసురకృతిని
ర్మాతలు పిల్లలమఱివి
ఖ్యాతునిఁ బినవీరుఁ బోలఁగలరే సుకవుల్.

*          *          *          *

క. అని విన్నపంబుచేసిన
ననుఁ గనుఁగొని యలరి నాథనమ్మ ఋణముగాఁ
దినక యుపార్జించె యశో
ధన మిటుగావలదె యాశ్రితత్వం బనుచున్.

*          *          *          *

వ. . . సమీపంబునం గొలిచియున్న నన్నుం గృపాతరంగి తాపాంగంబున విలోకించి మామకమనోరథం బెఱింగినట్లు హృద్యా నవద్యగద్యపద్యానుబంధంబుగాఁ బ్రబంధం బంధ్రభాషను జెప్పనుద్యో గించితివి జైమిని భారతంబునం దశ్వమేధపర్వంబు నిర్విఘ్నంబు గా రచియింపుమని యానతిచ్చినఁ బ్రసాదంబని యంగీకరించి నమ్మ హా ప్రబంధంబునకు మంగళాచారంబుగాఁ దదీయవంశావళివర్ణనం బభివర్ణించెద.

సీ. . . . . . . . . . .
దానవారాతి దక్షిణేతరకరంబు
రాజితం బౌదు వెలుఁగుంచె రాజకులము
వైరవాఘ్నుండు దనకుఁ బుట్టంబుగాన
కువలయానందకరలక్ష్మి కొమరుమిగిలి.

శా. ఆవంశంబున నుద్భవించె నమితక్ష్మాధీశకోటీరకో
టీవిన్యస్తవినూత్నరత్ననికరాటీవిస్ఫురత్పాదరా
జీవద్వంద్వుఁడు గుండశౌరి జయలక్ష్మీకంఠగాబంధుగ
గ్రైవేయాంతర పద్మరాగ సఖదోఃఖడ్గప్రతాపార్యుఁడై.

మ. జననం బందిరి గుండభూవిభునకున్ సంధాకబంధాగిగో
రనయున్ శ్రీనిధివీరయాభభుఁడు నుత్యతీర్త్తిమాడయ్యాయున్
ఘనతేజోనిధిగుండబ్రహ్మఁడును సంగ్రామస్థలీపార్థస
జ్జనమందారులుసాళ్వమంగనృపుఁడున్ సావిత్రిమంగాంకుఁడున్

* * * *

సీ. దురములోదక్షిణ సురతాను సెదిరించి
కోనివచ్చి కం (సంబు?) పరాయనికిని చ్చి
సామ్రాజ్యముననిల్పి స బురాయస్థాప
నాచార్యబిరుద విఖ్యాతిఁ గాంచె
శ్రీరంగవిభుఁ బ్రతిష్ఠించి యర్వదివేలు
మాడ లద్దేవు నుప్రాశిక (?) నొసఁగె
మధురాసురత్రాణు మడియించిపగపక్షి
సాళువబిరుదంబు జగతినెఱపి

గీ. గబ్బితనమునఁ దేజి మొగంబుగట్టి
తఱిమినగరంపు గవఁకులు విఱుగఁద్రోలి
తాను వేసినగవఁకు లుద్ధవడి వంచె
సాహసంబు నుప్పాంగు సాళ్వమంగు.

గీ. అట్టిసాళ్వమంగయకు సింగవిభుగుండ
శౌరి గౌతరాజ సావడిక్షి
తీశహాస్నమాన వేశ్వరాణ్ణామణి
నాథు లనఁగ సుతులు నమదహోతులు.

గీ. చక్రవర్తులతోడుత సంతువచ్చు
వీర లార్వురలోపల వినుతకీర్త్తి
గౌదవతీజన పర్యాయ మదనమూర్త్తి
మతరాజవసుంధరాకాంతునకును.

గీ. . . . . . . . . . .
సంభవించిరి సుతులు సౌజన్యయుతులు
హరిపదధ్యానరతులు లోకైకనుతులు
గుండపరివృఢ సాళువకువలయేశ
బొప్పజననాథ సాళ్వతిప్పవిభులు.

వ. . . . . . . వీరలయందు.

ఉ. గుండమహీవిభుండు తనకుంగులభామినిఁ మల్లమాంబగాఁ
గుండలికుండలుండు వలిగుబ్బలిపట్టియ వైనతేయవా [హను
హుండును నాదిలక్ష్మియుఁ బయోరుహగర్భుఁడు వాణియుం
డ్రుండును జహ్నుకన్యయును దుల్యముగా నుతికెక్కె నిమ్మహిన్.

ఉ. ఆమహితానుభావునకు నాసుచరిత్రకు నుద్భవించి రు
ద్దామయశోధనుల్ విజయధాములు విక్రమభీము లాహవ
స్థేములు సార్వభౌములు ప్రసిద్ధులు తిమ్మనరేంద్రచంద్రుఁడున్
శ్రీమదహోబలేశ్వరనృసింహుఁడు యంశమునన్ నృసింహుఁ
[డున్.

క. శ్రీవేంకటాద్రినాథదయావర్ధితరాజ్య.

* * * *

మ. కనకాద్రి ప్రతిమానధైర్య జగదేకస్తుత్యసౌభాగ్యమో
హనలీలానుతపంచబాణ నిజబాహాశౌర్యరేఖావిరా
జినయోపాయవిహార బోనగిరి చెంజీ కొండ ధారాపురీ
పెనుకొండాద్యఖిలైకదుర్గహరణప్రేంఖత్ప్రతాపోదయా.

శా. పాంచాలప్రమిళాంగమాగధశకప్రాగ్జ్యోతిషక్ష్మాభృ
త్పంచాస్య ప్రతివర్షదత్త వివిధోపగ్రాహ్య రత్నాంశుమ

తాఁచీ వేంకట కాళహస్తి నగరీకల్యాణసౌధాంచల
ప్రాంచద్వ్యాసన సాళ్వశంకితశశప్రాలేయరుణ్మండలా.

**End:**

సీ. . . . . . . . . . .
కల్లరులచేతదర్పించుఁ గలియుగంబు.

* * * *

క. ఆసమయంబున ధర్మజ
నే సోమకులంబు ననుజనించి కుటిలులన్
శాసించి ధరణిపాలన
సేసెదఁ దగ సాళ్వనారసింహుఁడ నగుచున్.

చ. అని వినిపించి శౌరి శమనాత్మజుఁ డర్మిలి నిచ్చుపూజ నై
కొని సకుటుంబుఁడై నృపతికోటిభజింపఁగ ద్వారకాపురం
బునకనురక్తితో నరిగి పూర్వపదంబుల నిల్పె రాజులన్
జననుతుఁడాయుధిష్ఠిరుఁడు సర్వధరిత్రియు నేలె నున్నతిన్.

* * * *

క. ప్రేమమున శ్రోత వక్తకుఁ
జామీకరదంతితురగచామగములునా
నామణివిభూషణంబులు
గ్రామము కృపచేయవలయు గ్రంథసమాప్తిన్.

క. అని జైమిని వినిపించిన
జనమేజయజనవరుండు సంతసమున న
మ్మునివరుని గారవింపుచు
వినియెం దరువాతికథలు వేడుక ననుచున్.

సీ. నీకునుమల్లమాం బాకుమారునకు సో
మకులాంబునిధిపూర్ణి మాధునకు

భారతకీర్తికిఁ దులాపురుషాదిదానాంబు
జంబాలితాస్థాన సౌధునకును
పరరాజభీకరధరణీవరాహుని
కాత్రేయగోత్ర పవిత్రునకును
గుండయ నరసింహ కువలయేశ్వరునకు
నభ్యుదయ పరంపరాభివృద్ధి
గీ. కరముగాఁ భారతీతీర్థగురుకృపాస
మృద్ధసారస్వతుఁడు సతర్కపీంద్రసఖుఁడు
కుకవిమల్లకపోల్లసత్కశలహస్త
పల్లవుఁడు చెప్పెఁ బినవీరభద్రసుకవి.

* * * *

మత్త. శర్వరీశకులావతంసయశః ప్రతాపవిభూషణా
గర్వితాహితరాయమీసర గండభీకరవిక్రమా
పూర్వవిశ్వవసుంధరాభృద పూర్వవృత్తచమత్క్రియా
నిర్విశేషవితానబంధుర నిత్యసత్యగుణోదయా.

**Colophon:**

ఇది శ్రీభారతీతీర్థశ్రీచరణ కరుణాపాత్ర గాదయామాత్యపుత్త్రి వినయవిద్యాసముద, పినవీరభద్ర ప్రణీతంబైన జైమినిభారతంబునం దశ్వమేధపర్వంబునం దష్టమాశ్వాసము.

(వి-వి.)—

సమగ్రము. అత్యంత శిథిలము. మొదటి పత్రములు మిక్కిలి శిథిలములై కొంత లోపించినవి. గ్రంథపాతములు మెండుగాఁ గలవు. వ్రాంతచక్కఁగానున్నది; కాని స్పష్టము కాదు.

సంస్కృతమున జైమినిమునిప్రణీతమగు భారతము నశ్వమేధ పర్వమున కిది తెనుఁగింపు. ఆశ్వాసము లెనిమిది. గాదయామాత్య పుత్త్రుఁడును, భారతీ తీర్థుల శిష్యుఁడును నగు పిల్లలమఱ్ఱి పినవీర

భద్రకవి యేతత్కృతికర్త. సాళువ నరసింహరాజు కృతిభర్త. కృతికర్తయొక్కయుఁ గృతిభర్తయొక్కయు వంశ వృత్తాంతాదికము పైనుదాహరింపఁబడిన పద్యములవలన నెఱుఁగనగును.

## R. No 13.

Paper. $8\frac{3}{8} \times 5\frac{3}{8}$ inches Foll. 119. Lines, 8 in a page. Telugu. Good

Restored from a MS of the Library in 1910-11.

చిక్కదేవరాయవిలాసము.

CIKKADĒVARĀYAVILĀSAMU.

A description of Cikkadēvarāya, a king of Mysore, who reigned at Śrīrangapaṭṭaṇa, and of his court. There are no particulars of historical value in it. The work is in the form of Yaksagāna, which is a kind of dramatic composition. Rather, it is a poem set to music and intended to be sung.

Complete

**Beginning :**

శా. శ్రీరంగైకవిహారిశౌరి భువనక్షేమంకరప్రాభవా
దారస్ఫారకృపాకటాక్షములచేతన్ విశ్వవిశ్వంభరా
ధౌరంధర్యకళావిశేష విలసద్బాహార్గళుం డైనమై
సూరి శ్రీచిక దేవరాయలకు నిచ్చున్ శాశ్వతైశ్వర్యముల్.

---

వ. మఱియు నారంగస్వామి సేమని వర్ణించుచున్నాఁడు.

కుచుచజంపె.

చుట్టుకైదువు కేలువాఁడు, తమ్మిఁ, బుట్టునెదువు మేలువాఁడు.

**End :**

చ. అనిలోకత్రితయంబునంగలుగు వారాకార రేఖాకళా
ఘనకీర్తి ప్రతిభా విశేషములు వక్కాణింప శ్రీరంగప
ట్టనసామ్రాజ్యధురంధరుండవయి వేడ్కన్ ధాత్రిఁ బాలించుచున్
మనుమీ శ్రీ చిక దేవరాయనృపచంద్రా సాంద్ర తేజోనిధీ!

(బి-బి.)—

సమగ్రము. వ్రా.తబాగుండలేదు. శిథిలముకాదు. క్రొత్తగా వ్రాయింపఁబడిన దగుటచే దృఢముగా నున్నది. గ్రంథపాతములు లేవు.

శ్రీరంగపట్టణ ప్రభువగు మైసూరి చిక్కదేవరాయని వర్ణించు నీ యక్షగాన మెవ్వరిచే రచింపఁబడెనో తెలియదు.

## R. No. 14.

Paper. $13\frac{1}{2} \times 8\frac{1}{2}$ inches. Foll. 485. Lines, 20 in a page. Telugu Good.

Transcribed for the Library in 1910—11 from a MS of T. Rāmācār of Bangalore.

జ్యౌతిషఫలగ్రంథము.

JYAUTIṢAPHALAGRANTHAMU.

This is a Telugu version of the Sanskrit work on horoscopy by Vēmulavāda Bhīmakvai. The author of the Telugu version is not known. The work is partly in Sīsapadya and partly in prose. They are in some places so mixed togather as to obscure the sense.

Complete.

**Beginning:**

సీ. శ్రీకరంబై ధరఁజెలువు గాంచినయట్టి
భీమపురంబునఁ బ్రేమమీఱ
భీమేశ్వరుండును బ్రియముతో భక్తుల
కోర్కెలొసంగుచుఁ గొమరుమిగుల
నొకనాఁడు తత్పురి యువతులు కొందఱు
భక్తి భీమేశ్వర భవనమునకుఁ
బోయి పుత్త్రిల వెంట ముగ్ధత్వమున నొక
విధవకుమారుని వేడ్క గోర

నా లేమముగ్ధతకపహసించుచునల
భీమేశ్వరుఁడు పుత్త్రిఁ బ్రీతినొసఁగ
నాకాంతగర్భిణియై కాంచెఁ దనయుని
గలియుగాఁడని ప్రేమ గడలుకొనఁగఁ
ప్రభవ వర్షంబున శ్రావణమాసంబు
శుక్లపక్షంబున శోభనంబు
మీఱ: పంచమి శుక్రవారంబు నలహస్త
యందుఁ గన్యాలగ్నమందు వెలయ
వెలిపెట్టి రకాంత విధవ పుత్త్రినిఁ గాంచె
నని నింద మెడఁ గట్టి యఖిలజనులు
నంతఁ దత్తనయుండు నైదేండ్లబాలుఁడై
పురి బాలకులతోడఁ బోసఁగ నాడ
జను లెల్ల గోళకుండని నిందచేసిన
రోషించి యాతండు దూషితయని
రా యెత్తి తల్లిపై వేయఁబోయిన నది
భీమేశ్వరుఁడు తండ్రి వేయు మనిన
వెసఁ జని యాతని వేయ నుంకించిన
భీమేశ్వరుఁడు దయ పెద్దగలిగి
ప్రత్యక్షమై పుత్ర! రమ్మని తగఁ జీటి
పశుపక్షిమృగములు ప్రాణికోట్ల
కల్పించుకడునన్నయదియును నడచును (?)
చెప్పినకవనము యుర్విలోనఁ
గలిగించు శక్తియుఁ గరమొప్పజనులకు
బిడ్డలనాయువు పెంపుదనర
సంపద లొసఁగెడి సామర్థ్యమును మఱి
కానిది యౌనని యైనదెల్లఁ
గాదని . యిట్టులు కావించుబలమును
మున్నును రాఁగలయదియుఁ దెల్పఁ

ప్రావీణ్యమును నిచ్చి ప్రబలుమనీవని
వరమిచ్చెఁ బదియాఱు వర్షములకు.
(సరస్వతి సహాయమై) యతఁడెట్లుచెప్పినవట్ల చే
యుచునుండె సరి లేనికీర్తిచే జగతియందు। వెలసి।
యతఁడుచెప్పిన శాస్త్రమందధికభక్తి
కలిగి నిజమనితలఁచినఁ గల్గుశుభము
కోర్కెలెల్లను ఫలియించు గురుతరముగ
సకలజనులకుఁదప్పదు జగతిలోన.

ప్రభవ సంవత్సర చైత్రమాసంబున మేషలగ్నంబున జననమం దిన యాతనికి లగ్నమందున రవి రేరాజు బుధ శుక్రులు రెంట రాహువు ఉచ్చుఁడగు నాఱింట శని యెన్మిదింటఁ గేతు తొమ్మిదింట గురువు పదింటఁగుజుఁడు రహినుచ్చనీచ గ్రహంబులున్న గడింపసింధు దుర్గము జన్మసీమయగును.

**End:**

శశివంశములు వర్ధిలుచుండు నేపునవావశము లేక యింద్రదతా రన రేశువంశమందు దత్తపుత్త్రునిఁగాంచి నిరువదిన రేశులు ఇందు ధరణి సంపదలంబొంపొంది అబ్ధి తీరంబగును ఇందుధరణికి నింతులు ననుజాతులు అభిషిక్తమైన శశికడు వేద అక్షి అబ్దములకు భువిని విడుతురు. అనుచుఁజెప్పితి నింతయుఁదప్పదు నిజము భీమేశ్వరా జ్ఞయు.

(వి-వి).—

సమగ్రము. వ్రాత బాగున్నది. యథామాతృకముగా వ్రా యఁబడుటచే నందలిదోషములన్నియు నిందును జేరినవి. శైథిల్య ముగాని గ్రంథపాతములుగాని లేవు.

ఇది వేములవాడ భీమకవి రచించిన ల్లగల సంస్కృత జ్యోతిష గ్రంథమునకుఁ దెలుఁగని తోఁచుచున్నది. గ్రంథము చాలమట్టునకు సీసపద్యములతో రచింపఁబడినది. నడుమనడుమ వచనమును గలదు.

కాని యీ సీసపద్యములు నీవచనమును సంకరమై మిక్కిలి తబ్బిబ్బులగుటచే గ్రంథమర్థము కానంతటిదశకు వచ్చినది. జన్మకాలమునుబట్టి స్త్రీ పురుషులకుం గల్గు మంచి చెడుగులను దెల్పు జాతకభాగజ్యోతిషవిషయ మిందుం గలదు. ఈ జ్యోతిశ్శాస్త్రకర్తయగు వేములవాండ భీమకవి వృత్తాంతము పై నుదాహరింపంబడిన పద్యముల మూలమునం దెలిసికొనంగూడును.

## R. No. **15**.

Palm-leaf. 16⅜ × 1¼ and 14⅛ × 1¼ inches Foll. 14. Lines, 5 in a page. Telugu. Injured.

Presented by P Sītārāma Śāstri of Guntur in 1910-11.

(*a*) సుమతిశతకము.

SUMATIŚATAKAMU.

Foll. 1*a*—8*b*.

This is a centum of verses containing ethical rules and erotic sentiments The stanzas containing rules of conduct are generally taught to boys. The author of the work is known to be Bhadrabhūpāla as he himself mentions this as his work in Nītiśāstramuktāvali.

Here there are 77 stanzas.

**Beginning :**

క. శ్రీ (స్త్రీ?) ల యెడ వాదు లిడకుము
బాలురతోం జెలిమిచేసి భాషింపకుమీ
మేలైన గుణము విడువకు
మేలినపతి నింద సేయ కెన్నండు సుమతీ!

**End :**

క. ఎప్పుడు (సంపద వ?) చ్చిన
నప్పుడు కులమెల్లంజేరు నదియె ట్లనినన్
దెప్పలుగం జెఱువునిండినం
గప్పలు పదివేలుచేరుం గదరా సుమతీ.

(వి-వి.)—

అసమగ్రము. 77 పద్యములు గలవు. వ్రాఁతయొక్క మాదిరిగా నున్నది. తప్పులంతగా లేవు. శైథిల్యము కలదు. అందందు గ్రంథపాతము లల్పముగాఁ గలవు.

నీతిశృంగారబోధకములగు పద్యములుగల యీ గ్రంథ మెవరిచే రచింపఁబడెనో యిందుఁ దెలుపఁబడియుండలేదు ; కాని నీతిశాస్త్రముక్తావళి రచించిన భద్రభూపాలుఁడే దీనినిగూడ రచించినట్లా గ్రంథమునఁగలదు. ఇందలి ప్రతి పద్యమును 'సుమతీ' యను సంబోధనముతో ముగియుచున్నది.

(b) సుమతిశతకము.

SUMATIŚATAKAMU.

Foll. 9*a*—14*b*.

This is the same as the last, but some verses are different and there are also different readings.

Here there are only 56 stanzas

(వి-వి.)—

అసమగ్రము. 56 పద్యములు మాత్రమే కలవు. వ్రాఁత చక్కఁగానున్నది. దోషములు గలవు. శైథిల్యకలదు. గ్రంథపాతములు లేవు.

ఇది నె 14*a* రున వర్ణింపఁబడిన గ్రంథమేకాని యందుఁగల పద్యములు కొన్ని యిందు లేవు. కొన్ని పద్యములకుఁ బాఠభేదములు గలవు.

---

## R. No. 16.

Palm-leaf. 13×1¼ inches. Foll. 96. Lines, 6 in a page. Telugu. Injured.

Presented by P. Sītārāma Śāstri of Guntur in 1910–11.

పట్టాభిరామవిలాసము.

PAṬṬĀBHIRĀMAVILĀSAMU.

This is a Prabandha in five Āśvāsas, in the first four of which the story of the Rāmāyana is related. In the last Āsvāsa is given an account of the construction of a temple for a newly consecrated idol in the form of Pattābhirāma in Haubuganēśapēta in Koṇḍavīdu country at the instance of the author's patron, Manūri Vēnkatarāya, a Brahmin of the Mādhva sect. The author of the work is Nāgalinga, son of Vīrēśalinga, grandson of Śambhulinga and a descendant of Śrīpati Panditārādhya. For fuller particulars regarding the author and his patron, *see* extracts below.

Complete.

**Beginning**:

శా. శ్రీ సీతాలలనాలలామవిలసచ్ఛృంగారసామ్రాజ్యశో
భాసౌభాగ్య విభాసమానుఁడగుచున్ బట్టాభిషిక్తాప్తిచే
శ్రీ సాకేతమునన్ వసించు విజయశ్రీరాముఁ డుద్యద్ఘనా
వాసున్ వేంకటరాయచంద్రుని మహైశ్వర్యాన్వితుం జేయుతన్

---

క. తెనుఁగుఁగవిత్వము సెప్పిన
ఘనులను శ్రీనన్నయార్యకవినాథునిఁ తి
క్కనసోమయాజి భాస్కరు
ననఘమతిం బోతరాజు నభినుతి సేతున్.

*

రమ్యగుణశ్రేణీ ! వెంకటరాయమణీ.

*

వ॥ .................. ..................రిందు గొలువుండు
సమయంబునం గాంచి పండితవరేణ్యు లిట్లని ప్రశంసించిరి.

సీ. నాటకాలంకార నైపుణ్యగణ్యుండు
సరస సాహిత్య విశారదుండు
సంస్కృతాంధ్ర ద్విభాషా వ్యాకరణవేత్త
షడ్విధ ప్రకృతి భాషాచణుండు
బంధకవిత్వ నిబంధనాభిజ్ఞుండు
చిత్రకవిత్వ విశేషశాలి
సమధిక యమకాతి చాతురీధౌరేయుఁ
డచల జిహ్వానిరోష్ఠ్యాదినిపుణుఁ

గీ. డమిత శాంతుఁడు చతురకావ్యప్రణేత
పండితారాధ్య వంశసంభవుఁడు శంభు
లింగపౌత్త్రుండు వీరేశ లింగపుత్త్రుఁ
డంగజాకారి శ్రీ నాగలింగసూరి.

క. అతనిం బిలిపించి సుస
మ్మతిగా బహుమతినొసంగి మహనీయమతిన్
గృతినంది కీర్తిసెందుము
వితతాఖిల గుణగణేయ! వేంకటరాయా!

* * * *

చ.ననుశ్రీసాంబపగా బుజద్వయ మరందస్వాదుధారా నిమ
జ్జనమత్త భ్రమరాయమాణ హృదయున్ సంపూర్ణసాహిత్యస
జ్జన సంస్తుత్య విచిత్ర కావ్యరచనాసామర్థ్యకూలంకషున్
వినయ శ్రీనిధిఁ బిల్వఁబంచి పలికెన్ వేడ్కల్ మదిం బర్వఁగన్.

క. రాజులు హెచ్చఁగ సత్కవి
రాజులు మెచ్చంగ భోజరాజచరిత్రం
బోజ రచించితి వన్నిటఁ
బూజితుఁడవు నాగలింగ బుధజనమౌళీ.

క. పూర్ణ ప్రజ్ఞాచార్యుని
పూర్ణ కటాక్షేక్షణమున భూమీస్థలిలో
వర్ణితమై మధ్వమతం
బర్ణవముగ వెల్లివిరిసిన ట్లలరారెన్.

*  *  +  *

గీ. అట్టి మధ్వమతంబున నవతరించి
గురుభరద్వాజ గోత్ర విస్ఫురితుఁ డనఁగ
వరయజుర్వేద శాఖాప్రవర్తకుఁడనఁ
బ్రబలెఁగొండల రాయభూపాలమౌళి.

*  +  *  *

ఉ. ఆజనపాలమౌళి వినయాన్వితయై తగుకొండపిటియ
ప్పాజితనూజఁ గోనమను భాసితసబ్బినవీసుసంతతిం
దేజముమించు వేంకటపతిప్రభుపుత్త్రికయైన శాయమాం
బాజలజాక్షి నిర్వుర వివాహముగాంచి చెలంగె నుర్వరన్.

గీ. ఆ నెలంతుక లిర్వురలోనఁ బెద్ద
భార్యయైతగు కోనమాంబావధూటి
యందుఁ బొందెక నిర్వురునందనులను
గాంచెను సహస్రకరసుధాకరులనంగ.

క. ఆరసికులలో నగ్రజు
డారసికన నరసవర రసాధిపమణి...... ..

*  *  *  *

క. ఆమను జేశుని తమ్ముఁడు
ధీమణి వెంకన్న . . . . .

*  *  *  *

గీ. దండి వినుకొండ బెల్లముకొండ కొండ
వీటి దుర్గంబు నీమూఁటి నూటిదనర

మేటి తనమునఁ బాలించి మించెనౌర
ధీవరుండన వెంకపృథ్వీవరుండు.

గీ. పరఁగఁ గొండలరాయభూపాలరత్న
మలరి రెండవ సతి శాయమాంబయందు
నందనుల నిర్వురను గాంచె నందమొదవ
నందులో నగ్రజన్ముఁ డప్పాజివిభుఁడు.

* * *

ఉ. అతనికిఁ దమ్ముఁడక్రూపథరాధిప చంద్రుఁడు

* * *

క. ఆసుగుణాంబుధి సబ్బని
వీసుకు లేశుఁడగు కృష్ణవిభునకు సుతయై
భాసిల్లుచుండు వేంకాం
బాసతి నాసతిని మించి పరిణయమయ్యెన్.

క. ఆలలనయందుఁ గల్గి

. . . . వేంకటాద్రి పార్థివుఁడలరెన్.

క. పొంకముగఁ బెండ్లియాడెని
రంకుశుఁ డప్పాజివిభుఁ డనాహతసుగుణా
లంకారుం డుమ్మెత్తల
వెంకార్యునితనయయైన వేంకటలక్ష్మిన్.

ఉ. ఆలలనావతంసమున కాత్మజుఁడయ్యెను వేంకటేశభూ
పాలకమౌళి . . . . . . .

* * * *

గీ. ధీరుఁడానృపాల తిలకుండు శుభలీలఁ
జబుకు పద్మనాభసచివతనయ

లలితగుణకదంబ లక్ష్మాంబ నుద్వాహ
మగుచు నగణితముగ నెగడె జగతి.

ఉ. ఆజలజాక్షియందుఁ జతురాస్యుని మోములనం గృపాఘున
ప్పాజిన్నపాలు సర్వసుగుణాకరు శ్రీనరసింహమూర్తి నా
నాజనపాలవంద్యు రమణప్రభు జానకిరాయశేఖరున్
దేజ మెలర్పఁ బుత్త్రులనతిప్రథితాత్ములఁ గాంచెనల్వురన్.

* * + +

క. ఆరమణధారుణీప్రమ
దారమణుఁడు పెండ్లి యాడెఁ దమితీఱఁగ ల
క్ష్మీరమణిని విలసితగళ
హీరమణిని రాజ్య భోగహితలాలసుఁడై.

* + * *

క ఆవనరుహనేత్రకుఁ బ్రే
మావహుఁడై జననమందె నప్పాజిధర
ణీవరుఁడు . . . .

గీ. మఱలవేంకటరమణభూవరుఁడు పరమ
పావనచరిత్రయై మించుభారతీస
తీమణిని బెండ్లియాడి యద్దేవియందు
విదిత వేంకటగోపాలవిభునిఁ గనియె.

*

శా. ధీమంతుం డతిశాంతచిత్తుఁడు మహాధీరుం డుదారుండునౌ
శ్రీమత్కొండలరాయధీవరుఁడు లక్ష్మీభామినీరత్నముం
బ్రేమాసాగరు చిల్కచిల్కమను సంప్రీతిన్ సముద్వాహమై
భూమిం గీర్తివహించె సంతతము సంపూర్ణప్రభావంబునన్.

ఉ. ఆమహనీయమూర్తితనయాగ్రకుటుంబినియైనలక్ష్మమాం
బామణియందు సర్వగుణభాసితయైతగురుక్మమాంబికన్

ధీమణియైన రెండవసతీమణి చిలకమ్మయందుఁ గృష్ణుని౯
రామునిఁ గాంచెఁ గృష్ణబలరామసమానులభాసమానుల౯.

క. ఆరుక్మిణీసతీమణి
నారూఢిగఁ బెండ్లియాడె నప్పాజీధా
త్రీరమణీరమణుఁడు.

* * * *

ఉ. ఆజలజాక్షియం దిరువు రాత్మజులై ప్రభవించిమించి ర
ప్పాజిధరాపురందరవిభాసితభవ్యయశఃప్రతాపవి
భ్రాజితమూర్తిమత్కుముదబాంధవతామరసాప్తు లిద్దఱ౯
దేజ మెలర్ప నివ్వసుమతిం జనియించిన రీతి దెల్పుచు౯.

క. ఆయిద్దఱిలో నగ్రజుఁ
డాయుఃకీర్తులను మించె ననఘుతెరగుఁ
స్థేయుఁడు శ్రీమద్వేంకట
రాయమహీవల్లభుండు ప్రాభవ మెనయ౯.

క. ఆయనఘున కనుజుండై
శ్రీయుతుఁ డనఁ దనరె నౌర చిరతరకీర్తి
స్థేయుండగు వేంకన్నా
రాయనరేంద్రుండు సుకవిరాజులు మెచ్చ౯.

* * * *

గీ. ప్రబలుఁడగు సబ్బినీవిసురామరాయ
విభునకుఁ దనూజయై మించు వెంకుబాయి
ననఘమతిఁ బెండ్లియాడి విఖ్యాతిఁ గాంచెఁ
బ్రథితగుణతతి వేంకన్నగాయనృపతి.

* * *

క. శ్రీమద్వేంకటరాయమ
హీమహిళావల్లభుండు హృదయంగమశో

భామహిత శేషనూంబా
భామ హితప్రేమదనరఁ బరిణయమయ్యెన్.

*   *   *   *

క. పావనమానూరికులను
ధావననిధిజనితపూర్ణతరచంద్రునకున్
భావుకగుణసాంద్రునకును
శ్రీవేంకటరాయచంద్ర పృథ్వీంద్రునకున్.

వ॥ . . . . . . . అభ్యుదయపరంపరాభివృద్ధిగా నాయొనర్పంబూనిన పట్టాభిరామవిలాసంబునకుఁ గథాక్రమం బెట్టిదనిన.

**End :**

పంచచామరము.

పరిస్ఫురత్పరాక్రమ ప్రభావభూతియుగ్ధరా
వరాధినాథయూథసత్సువర్ణపూర్ణతాలస
త్కిరీటకోటికోటిభాగదీపితాబ్జరాగభా
విరాజమానశోణపాదపీఠదేశభాసురా.

**Colophon :**

ఇది శ్రీసరస్వతీసతీనిరంతరానుకంపా సంపాదిత కవితామాధురీధురీణ కౌశికగోత్రపవిత్ర శ్రీపతిపండితారాధ్య వంశపయఃపయోరాశిరాకాసుధాకరాయమాన విద్వత్కవికంఠీరవ శంభులింగారాధ్యపౌత్త్ర వీరనారాధ్య సత్కవిపుత్త్ర సకలసుకవిజనవిధేయ నాగలింగాభిధేయ ప్రణీతంబైన పట్టాభిరామవిలాసంబను మహాప్రబంధంబునందు సర్వంబును బంచమాశ్వాసము.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత యొకమాదిరిగా నున్నది. నిర్దుష్టము కాదు. శైథిల్యము కలదు. గ్రంథపాతములును గలవు.

ఇది పట్టాభిరామవిలాసమను పేరుగల యైదాశ్వాసముల ప్రబంధము. నాల్గాశ్వాసములలో శ్రీరామచరిత్రమును నైదవ

యాశ్వాసమునందుఁ గృతినాథుఁడగు మానూరివేంకటరాయభూ
నాథుఁడు కొండవీటియొద్దనున్న హ బుగశేశుపేటయందు నూతన
ముగా దేవాలయము నిర్మించి యందుఁ బట్టాభిరామదేవుఁ బ్రతి
ష్ఠించుట మొదలగు వృత్తాంతమును వర్ణింపఁబడినది గ్రంథకర్త
పండితారాధ్యవంశ్యుఁడును, శంభులింగ పౌత్త్రుఁడును, వీరేశలింగ
పుత్త్రుఁడును నగు నాగలింగకవి ఇతఁడు శైవబ్రాహ్మణుఁడు. కృతి
భర్త మాధ్వబ్రాహ్మణుఁడగు మానూరి వేంకటరాయ భూపా
లుఁడు. కృతికర్తను గూర్చియుఁ, గృతిభర్తృ వంశాదివృత్తాంత
మును గూర్చియు విశేషములు పై నుదాహరింపఁబడిన పద్యముల
మూలమున నెఱుఁగునది.

## R. No 17.

Palm-leaf. $18\frac{1}{8} \times 1\frac{1}{4}$ inches Foll 177. Lines, 6 in a page. Telugu. Very much injured

Presented by P. Sītārāma Śāstri of Guntur in 1910–11.

ప్రభులింగలీలలు.

PRABHULIṄGALĪLALU.

This is a work in five Āśvāsas giving an account of the lives of Vīraśaiva saints : by Koccerlakōṭa Rāmakavi.

The work here breaks off in the fifth Āśvāsa.

(వి-వి.)—

అసమగ్రము. ఆదినుండి యైదవ యాశ్వాసమునఁ గొంతవఱకే కలదు. అతి శైథిల్యముచే గ్రంథము రూపుమాసియున్నది. గ్రంథపాతములు కుప్పతెప్పలుగాఁ గలవు అనేక పత్త్రములు నశించినవి. ఉన్నపత్త్రములు కొన్ని తారుమారయినవి. వ్రాఁత బాగున్నది. తప్పులుగలవు.

ఇది కొచ్చెర్లకోట రామకవిచే రచింపఁబడిన పద్యగద్యాత్మకమగు ప్రభులింగలీలలను శైవప్రబంధము. ఈ ప్రతి యత్యంతశిథిలమవుటచే విషయవివరణము చేయఁబడదయ్యె.

R. No. **18**.

Paper. 11 × 9 inches. Foll 213. Lines, 18 in a page. Telugu. Good. There are omissions owing to the injured condition of the original from which this was copied.

Restored from a MS. of the Library in 1910–11.

గాధేయోపాఖ్యానము.

GĀDHĒYŌPĀKHYĀNAMU.

This is a Prabandha in five Āśvāsas on the story of the life of Viśvāmitra, which is here presented as having been told by Śatānanda to Rāma The author of the work is Anantanārya, son of Lingakavi and grandson of Rēvūri Kālahastikavi He had four brothers: Kālahastikavi, Ēkāmrakavi, Gurvakavi and Śivānandakavi. The work is dedicated to Kṛsnarāja of Salem, whose genealogy contained in the introduction is summarized and given in the Telugu notes below This MS. contains only four Āśvāsas of the work.

**Beginning:**

శా. శ్రీలావణ్యసముల్లసద్వ్రజవధూశ్రేణీకుచోద్యన్మహా
శైలగ్రామణులన్ వహించుటకు దోశ్శక్తిం బరికించి (పంగా
నా ?) లన్ క్రేలను గావవే (ద్రే ?) ల ధృతశైలాధీశ మాబాలగో
పాలబ్రహ్మముఁ బ్రోచుఁగాత ముద మొప్పం గృష్ణుసేలాధిపున్.

*   *   *   *

సీ. ఉర్వి శబ్దశాసనోభయకవిమిత్ర
శంభుదాసబిరుదచారుతరుల
నన్నపార్యతిక్కననమరేంద్రు నెఱ్ఱన
(నన్నపార్యాదిక్కనమఖీంద్రు నెఱ్ఱన ?)
పొగడు (బ్రెగడ?) కవితనెగడఁ బొగడువాఁడ.

*   *   *   *

వ॥ వెండియునజాండ . . . . . . . . . .
. . . . . . . . . . . . . . .
. . . . . . . . నరలోకగండబిరుదసముజ్జ్వ
లుండును . . . . . . . . . . . . . .

యాదవరాయ రాజ్యస్థాపనాచార్యుండును . . . .
గంగువాడ హాదినెంటుమన్నియరగండాకుండును, గానాంబికా
చిన్నభూపాలప్రభుతపఃఫలాభ్యుదయుండును . . . . .
నగు కృష్ణమహీమహేంద్రుండొకనాండు . . . ఓలగంబుండి.

సీ. ఘనమానికులమాన్య కౌండిన్యగోత్రప
విత్రు నాపస్తంబసూత్రమహిత
గతిహరిదేవ్వారి కాళహస్తికవీంద్ర
పౌత్త్రులింగకవీంద్ర పుత్త్రుంగాళ
హస్తిమహాకవియనుజన్ము నేకామ
కవిశిఖామణి గుర్వకవితిలక శి
వానందసుకవులయగ్రజన్ముని ఘటి
కాశతగ్రంథ సంఘటనలేఖి

గీ. నీశతక లేఖ్య కవితాప్రకాశకుని ది
నప్రబంధనిబంధను నను ననంతుం
దనరుచిరబోధయుతమనోవనరుహమున
దనరునెనరునం గనుం గొని యనియె నిట్లు.

క. ఆలింతురో లాలింతురో
పాలింతురో మూఢజానపతు లశులరస
శ్రీలాలిత మోహానపాం
చాలీలాలిత్యనిత్యచంచత్కవితల్.

మ. తనరంగమజ్జనకుండుం ద్విజ్జనకుండుంగ దారావళీదండకా
ద్య నవోద్యద్భువదీయచాటుకృతులం దారావళీదండకాం
చనకీర్తుల్ గని కాంచనాంబరగజాశ్వగ్రామభూషాదులం
దనియ న్నిన్నుబహూకరించిరిగదా తాత్పర్యధుర్యాత్ములై.

చ. సుగతులకెకుర నీదుమ్మదుసూక్తులయందు మరందకందళిం
బమరుటయెంతయంత వినుమా నినుమాబిరుదంచునెంచు మా
కమితరసానుసారసముదారభవత్కృతికన్యకావతి
త్వము సమకూర్పుమా మతిపితామహతామహనీయవర్తనా.

క. ముఖ్యాద్యర్థరతిశ్రుతి
సౌఖ్యావహసంస్కృతాంధ్రసందర్భోద్య
ద్విఖ్యాతిగాథేయో
పాఖ్యానముకృతియొనర్పు మా మాకెనయన్.

* * * *

కృతిపతివంశావతారంబు ప్రశంసించెద.

సీ. ముల్లోకములయందుఁ గల్లోలవతితన
యందు సముత్పన్నమై చెలంగ
నాదిత్యమండలం బహరహంబును దన
సన్నిధానము సారెసారెకోర
దోషాకరప్రభా స్తోమంబు తనచేతి
నపనీత మగుటెంచఁ నధిగమింప
ఆశ్రితాళులఁజేర నరిగెడునెడల భ
వ్యాసక్తి తనకు నవ్యాహతముగ

గీ. చిత్రచారిత్రమైన లక్ష్మీకళత్ర
చరణశతపత్రమునఁ దుర్యజాతికుశల
ధుర్యరీతిజనించె నందునుతిగాంచె
గంబళంబనుకులము సత్కర్మఫలము.

**End:**

ఉత్సాహ.

అలఘుశీల ! సుజనలాలనైకలోల ఖేలనో
జ్జ్వలదవేలరజతశైలశరమరాళభారతీ
వలవిశాలకరివిశాల వత్య (?) మూలకీర్తికం
దళవిశాలవిభవసేల నగరపాలనోత్సవా !

**Colophon:**

ఇది శ్రీమద్వామదేవసేవాహేవాక ప్రభావాకలితలలితకవితావైభవ లింగకవితనూభవ నిరంతర తత్త్వచింత నానంతనార్యప్రణీతంబైన గాథేయోపాఖ్యానంబను మహాప్రబంధంబునం జతుర్థాశ్వాసము.

(వి-వి.)—

అసమగ్రము. నాల్గాశ్వాసములుమాత్రమే యిందుఁగలవు. ఐదవయాశ్వాసమునకు శుద్ధమగు కాకతప్రతి వేఱ కలదు గావున నదియిందు వ్రాయఁబడలేదు. ఇదియును శిథిలమయిన యీ పుస్తకశాలలోని తాళపత్రప్రతినిబట్టి వ్రాయఁబడినదే. వ్రాఁత బాగుండలేదు తప్పులు మెండుగాఁగలవు. స్థూలదృష్టిని గొన్ని సవరింపఁబడినవి. మాతృకలోని గ్రంథపాతము లిందును జేరినవి.

ఈప్రబంధమున విశ్వామిత్రుచరిత్రము శ్రీరామునకు శతానందుఁ డుపదేశించినట్లు వర్ణింపఁబడియున్నది. రేవూరి కాళహస్తి కవీంద్రునకుఁ బౌత్త్రుఁడును, లింగకవీంద్రునకుఁ బుత్త్రుండును, గాళహస్తి మహాకవికిఁ దమ్ముండును, ఏకామ్రకవి, గుర్వకవి, శివానందకవులకగ్రజుండును నగు ననంతనార్యునిచే నీ ప్రబంధము రచింపఁబడినది. ఈ కవి సామర్థ్యాదులు పై నుదాహరింపఁబడిన పద్యములంబట్టి తెలిసికొన నగును. ఈ గ్రంథము సేలము ప్రభువగు కృష్ణభూపతి కంకితము సేయఁబడినది. ఆ కృష్ణభూపతి వంశచరిత్ర మీ క్రిందఁ దెలుపఁబడుచున్నది—

చతుర్థ జాతి, కంబళవంశమున సాలన్నపతి మూలపురుషుఁడు. (వంశవర్ణనమునందొలి పత్రము సగము విఱిగిపోవుటచేఁ గొంత వంశచరిత్రము విడువవలసి వచ్చెను) చిన్నభూపాలునకుఁ దిరుమలక్షితివిభుఁడు జనించె. ఆతనికిఁ జీలమ్మ చెల్లకమ్మ యన నిద్దరు భార్యలు, చీలమ్మకుఁ బెద్దవిభుఁడు జనించెను. ఆతనికి రంగాజమ్మ మహిషి. వారి కుమారుఁ డాదిభూపతి-ఇఁకఁ జెల్లకమ్మకు రామ

చంద్రవిభుఁడు జనించె. అతనిభార్య తిమ్మాంబిక. వారిర్వురకుఁ బెద్దళభూవిభుఁడు, కృష్ణనరపతి, పుత్త్రులు. వీరిలో రామచంద్ర విభుఁడు రాజయ్యె. అతని తమ్ముఁడు లక్ష్మణక్ష్మాపతి. అతనికి అక్కమాంబ, బొమ్మమాంబిక, సత్యభామమ, ఓబళమ, అచ్చమ్మ, కిచ్చమ్మ, తిమ్మాంబిక, తెవ్వానమ్మ, శ్రీరంగమ్మ, ఇందువదనమ్మ, జానకమ్మ, వేంకటాంబ, వరదమ్మ, అనువారు భార్యలు. అందు అక్కమాంబకు రామక్షమాపతి, రఘుపతివిభుఁడు కుమాళ్లు. బొమ్మమాంబకుఁ జిన్న నరపాలుఁడు జనించె. సత్యభామాంబకుఁ దిరుమలక్ష్మా విభుఁడు జనించె. ఓబళమ్మకుఁ, గస్తూరిరంగశౌరి జనించె. అచ్చమకు నచ్యుతనృపతి, గోవిందక్ష్మాపతి, వేంకటనృపతి, అను ముప్వురు జనించిరి. కిచ్చమ్మయందు నరసింహవిభుఁడు, పాలప్రభుఁడు, నను నిర్వురుద్భవిల్లిరి. తిమ్మాంబయందుఁ బెద్దళవిభుఁడు, తిరుమలనరపతి, లక్ష్మణనృప , జనించిరి. తెవ్వానమ్మయందు నగ్గితిమ్మనృపతి జనించెను. శ్రీరంగాంబయందు వేంకటధీరుఁడును ఇందువదనమ్మయందు రామప్రభుఁడును జనించిరి. జానకమ్మయందు నవనీతకృష్ణనృపతి జనించె. వేంకటమకు వేంకటకృష్ణేంద్రుఁడు జనించె. వరదాంబయందుఁ గొండనృపతిపుట్టెను. ఇది లక్ష్మణనృపతి సంతానము. ఈ లక్ష్మణనృపతి తమ్ముఁడు వేంకటభూధవుఁడు. అతనికిఁ దిమ్మమ, లక్ష్మమ,మల్లమ, ఎఱ్ఱమ భార్యలు. లక్ష్మమయందు రఘునాథశౌరి, మల్లమయందు వేంకటకృష్ణభూవిభుఁడు గిరివాసనృపతి జనించిరి. ఎఱ్ఱమకు జనించిన వేంకటకృష్ణపృథ్వీశుని తిమ్మమ పెంచుకొనెను. ఇది వేంకటవిభు సంతతి. అతని తమ్ముడు కృష్ణనృపతి. అతనికి దాదమ, చిన్నమ, నాచారమ, గురువమ, భార్యలు అందుఁ జిన్నమయందు వేంకటవసుమతీవిభుఁడు, నాచారమ్మయందు లక్ష్మణవిభుఁడు, జనించిరి. గురువమ్మయందు కృష్ణభూవిభుఁడు జనించె. వీరికెల్లఁ జిన్ననృపతి యగ్రజుఁడు. అతనికిఁ గామమ, బొమ్మమ, తిరుమలమ్మ, ఎఱ్ఱమ, చీలమ, అళగాజమ, వెంగమ. మల్లమ అను నెనమండ్రు భార్యలు. అందు,కామమకు జానకమ్మ, కృష్ణభూజాని, వేంకటనృపతి,తిరుమలా

ధిపతి జనించిరి. అందుఁ గృష్ణభూపతి భార్య్య చీలాంబ. ఇంక బొమ్మమ యందు బాలాంబ, తిరుమలమ్మ, రామనృపతి, జనించిరి. ఎఱ్ఱమ యందు లక్ష్మణప్రభువు, పెద్దళనృపతి, జనించిరి. చీలమ్మయందు బొమ్మమయు, అళగాజమయందు దాదమాంబిక, వెంగమయందు గోవిందవిభుఁడు, జనించిరి మల్లమయందు కిచ్చమ జనించెను.

మ. అనుజుల్ వీరలుభక్తితోఁ గొలుచుచున్ హర్షంబుగావింపఁగాఁ
బినతండ్రుల్ తనయంగరక్షణముతోఁ బ్రేమంబునంబూనఁగా
జనకుం డెతగుచిన్న శౌరికి మహైశ్వర్యంబునన్ యాపరా
జ్యనుత శ్రీఁబ్రజ నేలుఁ గృష్ణవిభుఁ డుద్యద్ధర్మనిర్వాహియై.

క. ఏతాదృశబృశవిశదకు
ణాతిశయోద్ధారునకుఁ బరాఖిలభుజా
శాత సిధారునకుఁ బ్ర
ఖ్యాతదయాధారునకు జయాధారునకున్.

* * *

## R. No. 19.

Paper. 7¾ × 5½ inches. Foll. 49. Lines, 26 in a page. Telugu. Good.
Presented by P. Lakshmayyagāru of Guntūr in 1910-11.

భగవద్గీత (వచనము).

BHAGAVADGĪTA(VACANAMU).

This gives the Telugu meaning of the Sanskrit Bhagavadgītā. It is learnt from another MS. of the Library that the author of the work is Tupākula Anantabhūpāla. It is dedicated to God Gōpāla.

Complete.

**Beginning :—**

క. శ్రీరమణీహృదయప్రియ
సారసపత్రాయతాక్ష! సకలాధ్యక్షా!

భూరికరుణావిలాసా!
శ్రీరాజితసుగుణజాల! శ్రీగోపాలా.!

వ॥ అవధరింపుము భవదీయచరిత్రాతిశయ ప్రకారంబైన శ్రీమహాభారతంబున భీష్మపర్వంబునందుఁ గౌరవశ్రేష్ఠుండైన ధృతరాష్ట్రుండు వ్యాసవరప్రసాదలబ్ధదివ్యజ్ఞానసంపన్నుండగు సంజయువలన భూగోళవిస్తారంబును, జంబూఖండనిర్మాణంబును, భవ్వన్న దేశప్రవర్తనంబును, విని (కౌరవులును పాండవులును) కురుక్షేత్రంబున యుద్ధసన్నద్ధులైయున్నమనవారును పాండవులును నేమి గావించిరనియడిగిన ధృతరాష్ట్రుంజూచి ॥౧॥ సంజయుండిట్లనియె॥ వ్యూహాకారముగా నిల్చియున్న పాండవబలంబు వీక్షించి దుర్యోధనుండు ద్రోణాచార్యసమీపంబునకుంజని యతనితో నిట్లనియె ॥౨॥ నీ శిష్యుండైన ధృష్టద్యుమ్నునిచే వ్యూహాకారంబుగా నిల్పియున్న పాండవబలంబుంగనుము ॥3॥

**End:**

రాజేంద్రా! అద్భుతంబగు నీపుణ్యసంవాదంబు తలంచి మఱియు సంతోషించెద ॥౭౫॥ రాజోత్తమా! అద్భుతంబైన హరివిశ్వరూపంబుఁ దలంచి యత్యాశ్చర్యంబున మాటిమాటికి నానందంబు నొందెద ॥౭౬॥ యోగేశ్వరుండైన కృష్ణుండును, ధనుర్ధరవర్యుండైన యర్జునుండును నెచ్చటనుండు రచట నైశ్వర్యంబును జాల దిగంతవిశ్రాంతంబైన కీర్తియు నీతియు శాశ్వతంబుగానుండునని నానిశ్చయంబు ॥౭౭॥

**Colophon:**

ఇది శ్రీమన్మహాభారతమునందు సకలశాస్త్రనిర్ణయ మోక్షయోగంబనునది పదునెనిమిదవయధ్యాయము.

(వి-వి.)—

సమగ్రము. వ్రాంతకాగున్నది; కానిఁ కొన్నిచోట్ల స్పష్టముగాఁ దెలియుటలేదు. తప్పులుగలవు. శైథిల్యము లేదు. గ్రంథపాతములు లేవు.

శ్రీమహాభారతమందలి భీష్మపర్వమునఁగల భగవద్గీతాశాస్త్ర
మున కిది యథాశ్లోకమగు నాంధ్ర వచనము. గ్రంథకర్త పే రిందుఁ
దెలుపఁబడియుండలేదు. కాని, యీ పుస్తకశాలయందుఁగల ప్ర
త్యంతరమునఁ దుపాకుల యనంతభూపాలుఁడు కర్తయని కలదు.
ఇందలి వచనమునకు సంస్కృతశ్లోకముల ప్రకారము సంఖ్యవే
యఁబడినది. గ్రంథాదిని గల పద్యములవలన నీ కృతి గోపాలస్వామి
కంకితమయినట్లు గుఱుతింపనగును కృత్యవతరణము కొంతయుండి
యీ ప్రతియందు లోపించెనో తెలియదు.

## R. No. 20.

Palm-leaf. $15\frac{3}{8} \times 1\frac{1}{4}$ inches Foll. 184. Lines, 7 in a page. Telugu. Very much injured.

Presented by P. Sītārāma Śāstri of Guntūr in 1910-11.

భాగవతము (ఆఱుస్కంధములు).

BHĀGAVATAMU (SKANDHAS 1–6).

This is a Prabandha composed by Bammera Pōtarāju, the subject matter being the same as the Sanskrit Bhāgavata. This MS. contains only the first six Skandhas; and as it is very much injured, no extracts are given.

The scribe's name and the date of transcription as found in the MS. are given below.

అసమగ్రము. వ్రాఁత బాగున్నది తప్పులును గలవు. మిక్కిలి
శిథిలమయినది. గ్రంథపాతములు కుప్పతెప్పలుగా నున్నవి.

బమ్మెర పోతరాజాదులచే రచింపఁబడిన యాంధ్రభాగవతకృతి
యందలి మొదటి యాఱుస్కంధము లిందుఁగలవు. పుస్తక మతిశిథి
లముగా నుండుటచే విషయవివరణ మింకఁ జేయఁబడదయ్యె.

ప్రతివి లేఖకుఁడు గ్రంథాంతమం దిట్లు వ్రాసికొన్నాఁడు.

"ఈశ్వరనామసంవత్సర చైత్రశుద్ధ ౧౦ వఱకు పకానర్స రాజు పౌత్రుడున్ను నర్సరాజుపుత్రుడునైన కొండయ ప్రతినున్న ప్రకా . . . . . ఇష్ట దేవతయైన శ్రీకృష్ణులకు ప్రీతిగా సమర్పించెను"

R. No. **21.**

Palm-leaf. 17⅜ × 1⅝ inches. Foll. 179. Lines, 7 in a page. Telugu. Injured.

Presented by P. Sītārāma Śāstri of Guntūr in 1910–11.

భారతము (ఉద్యోగ భీష్మ పర్వములు).

BHĀRATAMU (UDYŌGA AND BHĪṢMA PARVAS).

This is the work of Tikkana Sōmayāji ; and this MS. contains only the Udyōga and Bhīṣma parvas.

**Beginning :**

క. శ్రీ గౌరీవల్లభ (పల్లవ?) పుట
యోగాశ్రయమంజరీసముజ్జ్వలమూర్తీ
యోగీంద్రసంతతాంత
ర్యాగమపరిపాకరూప ! హరిహరనాథా !

**End :**

మా. శరణగహితవృత్తిగ్రావ్యా భక్తప్రవర్తీ .
కగణగమనలీలా ! గాఢకారుణ్యశీలా
స్మరణశుభదమూర్తీ ! మధ్యరశ్మిప్రవర్తీ
చరణవిస(ర?)మహేం(దిం?)ద్రా ! సంతతానందసాంద్రా.

ఇది శ్రీమదుభయకవిమిత్ర కొమ్మనామాత్య పుత్త్ర బుధారాధనవిరాజి తిక్కనసోమయాజిప్రణీతంబైన భీష్మపర్వంబునందుఁ ద్వితీయాశ్వాసము సంపూర్ణము.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత బాగున్నది. తప్పులంతగా లేవు. శైథిల్యముకలదు. గ్రంథపాతములు లేవు. తిక్కన సోమయాజి ప్రణీతమగు భారతేతిహాసమందలి యుద్యోగభీష్మపర్వములు మాత్రమిందుఁగలవు.

---

## R. No. 22.

Palm-leaf. $17\frac{1}{4} \times 1\frac{5}{8}$ inches. Foll. 34. Lines, 6 in a page. Telugu. Good.

Presented by Avvāri Ullaki Sāstri of Guntūr in 1910-11.

భారతము (స్త్రీ మహాప్రస్థానిక పర్వములు).

BHĀRATAMU (STRĪ AND MAHĀPRASTHĀNIKA PARVAS).

Same work as the last The portions contained in this MS. are Strīparva and Mahāprasthānikaparva.

(వి-వి.)—

సమగ్రము. శైథిల్యము లేదు. గ్రంథపాతములు లేవు. వ్రాఁత బాగున్నది. తప్పు ల తగా లేవు. తిక్కన సోమయాజి విరచితమగు నాంధ్ర భారతమందలి స్త్రీపర్వమును, మహాప్రస్థానిక పర్వమును, నిందుఁ గలవు.

## R. No. 23.

Palm-leaf. $18 \times 1\frac{3}{8}$ inches. Foll. 348. Lines, 6 in a page. Very much injured.

Presented by P. Sītārāma Śāstri of Guntūr in 1910-11.

భాస్కరరామాయణము.

BHĀSKARA RĀMĀYAṆAMU.

This is a poem in Telugu with the same subject matter as Vālmīki's Rāmāyaṇa. The author of this work is Bhāskara;

but he composed only some of the Kāṇḍas, while some others were done by his son, Mallikārjunabhaṭṭa, by Ayyalārya and by Kumārarudradēva. This MS. contains Kiskindhākāṇḍa, Sundarakāṇḍa, and Bāla and Yuddha Kāndas (incomplete). It is noteworthy that the Sundarakāṇḍa is here dedicated according to the first verse to Sāhini Māra, the patron of Bhāskara, and according to the last verse to Śiva to whom Mallikārjuna dedicates his portion of the Rāmāyaṇa.

కిష్కింధాకాండము.

**Beginning :**

క. శ్రీరమణీప్రియ రమణీ
శ్రీర మ్యోరుకుచకుంభ సేవా లో (ల ?)
స్ఫారదృగాశ్రయ నేత్రాం
భోరుహ పూజాప్రహృష్ట పురుషవిశేషా (శిష్టా ?)

వ. ఘనులగు రామలక్ష్మణులుఁ గార్ముక బాణకృపాణ పాణులై.

**End :**

క. శరనిధి నున్న భుజంగము
నిరవుగఁ బక్షములనడుమ నిడుకొని గరుడం
డురుగతిఁ దెచ్చువిధంబున
నురువడిఁ దెచ్చెదను లంక నున్న మహీజన్.

మాలిని.

సురనుతపదపద్మా! శుద్ధవిజ్ఞానసద్మా!
హరిణకలితహస్తా! యాపగాసిక్తమస్తా!
హరిహరసురరమ్యా! యంచితధ్యానగమ్యా!
స్ఫురదురుగిరిచాపా! పుణ్యపీఠి ? స్వరూపా!

**Colophon :**

ఇది శ్రీమదష్టభాషాకవిమిత్ర కులపవిత్ర భాస్కరసత్కవి పుత్త్ర మల్లికార్జునభట్ట ప్రణీతంబైన శ్రీ రామాయణంబను మహాకావ్యంబునందుఁ గిష్కింధాకాండమునందు సర్వంబు నేకాశ్వాసము.

సుందరకాండము.

**Beginning:**

క. శ్రీరమణీ హృదయేశ్వర
కారుణ్యసుధాంబురాశి కల్లోలభవ
శ్రీరంజితవరవైభవ
సారయశశ్శ్రీవిహార! సాహిణిమారా!

వ. అంత హనుమంతుం డిట్లనియె.

**End:**

క. అరుణ తటకరకలి తోజ్జ్వల (?)
ఖరకిరణోన్నమిత తేజ కమనీయభవ
చ్చరణసరసిరుహ సేవా
కర ?రణ ప్రమథయూథ! గోపీనాథా!

మాలిని.

సవనభు భివం (నం?) ద్యా సర్వలోకైకవంద్యా
రవిశశిశిఖినేత్రా రమ్యవారా (మా?)ర్ధగాత్రా
భువననివహనేతా భుక్తిముక్తిప్రదాతా
ప్రవిమల గుణసంగా పార్వతీప్రాణసం (లిం?) గా!

**Colophon:**

ఇది శ్రీమ దష్టభాషాకవిమిత్రకులపవిత్ర భాస్కర సత్కవి పుత్త్ర మల్లికార్జునభట్ట ప్రణీతంబైన శ్రీమద్రామాయణమహాకావ్యంబునందు సుందరకాండము సంపూర్ణము.

(వి-వి.)—

అసమగ్రము. తొల్తఁ గిష్కింధాకాండమును, పిదప సుందరకాండమును, దర్వాత బాలకాండమును, బయిని యుద్ధకాండమును గలవు. అందుఁ గిష్కింధాకాండమును, సుందరకాండమును, సమగ్రములుగాఁ గలవు. బాలయుద్ధకాండము లసమగ్రములు. వ్రాఁత యొకమాదిరిగా నున్నది. తప్పులు మెండు అతిశిథిలము. గ్రంథపాతములు కలవు.

సంస్కృతమున వాల్మీకిమహర్షిచే రచింపఁబడిన రామాయణ మహాకావ్యమున కిది తెలుఁగు. ఇందు సమగ్రముగానున్న కిష్కింధాసుందరకాండములు భాస్కరపుత్త్రుఁడగు మల్లికార్జున భట్టారకునిచే రచింపఁబడినట్లు గద్యములందుఁగలదు ; కాని, సుందరకాండమంతకును, మల్లికార్జునభట్టారకు డేకర్తయనునెడఁ జిక్కు వాటిల్లుచున్నది భాస్కరరచనము సాహిణిమారుని కంకితము సేయఁబడెను. మల్లికార్జునభట్టారకరచనము శివున కంకితము సేయఁబడెను సుందరకాండమున నాదిపద్యము సాహిణిమారుని సంబోధనముగాను, దుదిపద్యములు శివుని సంబోధములుగాను నున్నవి. ఈ కాండ మొకరి మల్లికార్జునభట్టారకుని కృతియే యగునప్పు డాదియందును శివునిసంబోధనమే యుండవలసియుండును. భాస్కరుఁడే సాహిణిమారునిపేర నీకాండమును కూడ రచింప మొదలిడి యేలయో విడనాడఁగా మల్లికార్జునభట్టారకుడుఁ బూరించెనేమో ! ఎల్లప్రతులందును సుందరకాండాదిని సాహిణిమారునిఁ గూర్చియే చెప్పఁబడినపద్యముకలదు.

---

## R. No. 24.

Paper. 7½ × 5⅝ inches Foll 16. Lines, 26 in a page. Telugu. Good.

Presented by P. Lakshmayyagāru of Guntūr in 1910–11.

మహిమస్తవటీక

MAHIMASTAVAṬĪKA.

This contains the Sanskrit text of Puspadanta's Mahimnastōtra, a eulogy on Śiva, and the Telugu meaning word by word, together with an analysis of the stanzas into the words composing them.

Complete.

**Beginning:**

శ్లో. మహిమ్నః పారం తే పర మవిదుషో యద్య సదృశీ
స్తుతి ర్బ్రహ్మాదీనా మపి తదవసన్నా స్త్వయి గిరః

అ థావాచ్య స్సర్వ స్స్వమతిపరిణామావధి గృణ౯
మమా ప్యేష స్తోత్రే హర నిరపవాదః పరికరః.

పదచ్ఛేదము.

మహిమ్నః, పారం, తే, పరమ్, అవిదుషః, యది, అసదృ శీ, స్తుతిః, బ్రహ్మాదీనామ్, అపి, తత్, అవసన్నాః, త్వయి, గిరః, అథ, అవాచ్యః, సర్వః, స్వమతిపరిణామావధి, గృణ౯, మమ, అపి, ఏషః, స్తోత్రే, హర, నిరపవాదః, పరికరః.

అర్థము-

హే హర!=ఓయి సాంబశివుడా, తే=నీయొక్క, మహిమ్నః=సామర్థ్యముయొక్క, పరమ్=ఉత్కృష్టమయిన, పారమ్=అంతమును, అవిదుషః=గుర్తెఱుగనివానికి, స్తుతిః=స్తోత్రము, అసదృశీ యది=అయోగ్యమయినట్టాయెనా, తత్=అప్పుడు, బ్రహ్మాదీనామపి=బహ్మాదులయొక్కానున్ను, గిరః=వాక్యములు, త్వయి=నీయందు, అవసన్నాః=క్షీణాలయినవి, అథ=అటుతర్వాతను, స్వమతిపరిణామావధి = స్వబుద్ధియొక్క పరిపాకమానట్టుగాను, గృణ౯=స్తోత్రము చేస్తున్నటువంటి, సర్వః=సమస్తమయినటువంటి, జనము, అవాచ్యః=పల్కశక్యముకానిది, మమాపి=నాకున్ను, స్తోత్రే=స్తోత్రమందు, ఏష పరికరః=ఈసాధనసంపత్తి, నిరపవాదః=అపరాధంలేనిది

**End:**

శ్లో. శ్రీపుష్పదంతముఖపంకజనిర్గతేన
స్తోత్రేణ కిల్బిషహరేణ హర పియేణ
కంఠస్థితేన పఠితేన సమాహితేన
సంప్రీతిమా౯ భవతి భూతపతి ర్మహేశః.

శ్రీపుష్పదంతునియొక్క ముఖపద్మంవల్లనుండి బయలువెళ్లేష్యంటి, కిల్బిషహరేణ=పాపమును హరించేవ్యంటి, హరప్రియేణ=శివప్రియమయినవ్యంటి, కంఠస్థితేన=కంఠమందువున్నవ్యంటి, స

మాహిం తేన=స్వస్థచిత్తము చేతను, పరితేన=పరివంచబడ్డమువంటి, స్తోత్రేణ=మహిమ్నస్తోత్రం చేతను, భూతపతిః=భూతాలకు నాయకుడైనమువంటి, మహేశః=శివుడు, సంప్రీతిమాన్=లెస్సగా సంతోషముకలవాడై, భవతి=అవుచున్నాడు.

గ్రంథావసానమునఁ బ్రతివిలేఖకుఁడిట్లు వ్రాసెను:—

"విళంబినామ సంవత్సర పుష్యబహుళ 2 బుధవారము పగలు మూడుజాములవఱకు కోడూరు కనకరాజు మహిమ్న స్తవము సంపూర్ణముగా వ్రాసి, ప్రతిని ఉన్నక్రమాన ఆకెళ్ల బ్రహ్మకర్తగారికి పరబ్రహ్మార్పణంగా యిచ్చెను.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁతబాగున్నది. తప్పులు కలవు. శైథిల్యము లేదు. గ్రంథపాతములు లేవు.

సంస్కృతమునఁ బుష్పదంత ప్రణీతమగు శివ మహిమస్తవమునకుఁ బదవిభాగమును వ్యావహారికపుఁదెల్గునఁ బ్రతిపదటీకయును గలవు. మూలముకూడ వ్రాయఁబడియున్నది.

## R. No. 25.

Palm-leaf 17 × 1¼ inches Foll 35, Lines, 5 in a page. Telugu. Much injured.

Presented by P. Sītārāma Śāstri of Guntūr in 1910–11.

(*a*) మహిమస్తవటీక.

MAHIMASTAVAṬĪKA.

Foll. 1*a*–23*b*.

Same work as is described in the last number.

Complete

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత యొకమాదిరిగా నున్నది. నిర్దుష్టము కాదు. శైథిల్యము కలదు. గ్రంథపాతములును గలవు.

ఇది నెం 24 రు న వర్ణింపఁబడిన గ్రంథమే

(*b*) ప్రౌఢానుభూతివ్యాఖ్య.

PRAUDHĀNUBHŪTIVYĀKHYA.

Foll. 24 *a*–35*b*.

This contains the Sanskrit text and the word for word Telugu meaning of Prauḍhānubhūti which describes the Advaitic self-realization.

Complete.

**Beginning:**

శ్లో. అద్వితీయాపరిచ్ఛిన్నసచ్చిదానందమూర్తయే।
దక్షిణామూర్తిరూపాయ మహ్యమేవ నమోనమః.

శ్లో. ప్రౌఢః ప్రౌఢనిజానుభూతిగ(ళి?)ళితద్వైతేంద్రజాలోగురు
ర్గూఢంగూఢమహాఘదుష్టకుధియాం స్పష్టం సుధీశాలినామ్।
స్వాంతే సమ్యగిహానుభూత మపి సచ్ఛిష్యావబోధాయ త
త్తత్త్వం సంస్కృతవాక్సమస్తజనతానైజం నిజాలోకనాత్.

టీక॥ ప్రౌఢః = దేహేంద్రియాదివిలక్షణమైన సాక్షిచైతన్య ప్రకాశంబనేను అని నిశ్చయించుకుని, విధినిషేధాలవల్లను భయపడక ధీరుడైవున్నటువంటి, ప్రౌఢనిజానుభూతిగళితద్వైతేంద్రజాలః, ప్రౌఢ = నిస్సంశయమైనటువంటి, నిజానుభూతి = స్వరూపాపరోక్ష నిశ్చయము చేతను గ(ళి?)ళిత = మింగబడినటువంటి, ద్వైత = దృశ్యప్రపంచమనెడి, ఇంద్రజాలః = ఇంద్రజాలము గలిగినటువంటి, గురుః = బ్రహ్మవిష్ణు , గూఢమహాఘదుష్టకుధియామ్-గూఢ = అనాదికాలాననుంచిఅణఁగివున్నటువంటి, మహాఘ = కామక్రోధాత్మకమైన మహాపాపము చేతను, దుష్ట = మలినమైనటువంటిదిగనుక నే, కు = తత్త్వమును గ్రహించనేరనటువంటి, ధియామ్ = బుద్ధులుగలవార్లకు, గూఢమ్ = తెలియశక్యము గానటువంటిన్ని - సుధీశాలినామ్, సు = తత్త్వమును గ్రహించనేర్చునటువంటి, ధీ = బుద్ధి చేతను - శాలినామ్ = ఒప్పుచున్నటువంటి మహాత్ములకు, స్పష్టమ్ = కరతలామలకమువలె విశదమైనటువంటిన్ని, నిజాలోకనాత్ - నిజ = తనస్వరూపముయొ

కర్త, ఆలోకనాత్ = చూచుటవల్ల, సమస్త జనతా నైజమ్-సమస్త = సకలమైనటువంటి, జనతా = ప్రాణి సమూహమునకు, నైజమ్ = స్వరూపమైనటువంటిన్ని, ఇహస్వాన్తే = పరిశుద్ధాంతఃకరణమందు, సమ్యక్ = లెస్సగాను, అనుభూతమపి = అనుభవింపబడ్డదైనాగాని న్ని, తత్ = మహావాక్య ప్రసిద్ధమైనటువంటి, తత్త్వమ్ = ప్రత్యగభిన్న బ్రహ్మతత్త్వమును, సచ్ఛిష్యావబోధాయ-సత్ = సాధనచతుష్టయ సంపన్నుడైనటువంటి, శిష్య = శిష్యునకు, అవబోధాయ = స్వరూపసాక్షాత్కారము కొఱకు, సంస్కృతవాక్ = గ్రంథరూపంచేతను లెస్సగా అనుసంధానంచేసెను.

**End:**

శ్లో. స్వారస్యైకసుబోధచారుమనసే ప్రౌఢానుభూతిస్త్వియం
దాతవ్యా నతు మోహదగ్ధకుధియే దుష్టాంతరంగాయచ।
యేయం రమ్యవిటార్పితోత్తమశిరః ప్రాంతే చకాస్తి స్వయం
సా చేన్మర్కటహస్తదేశపతితా కిం రాజతే కేతకీ

టీక॥ స్వారస్యైకసుబోధచారుమనసే- స్వారస్యైకసుబోధ అంతస్సారము లెస్స తెలిసేటి(యుట)యందు చారు = మంచిదైనటువంటి, మనసే = మనస్సుగలిగినటువంటి అధికారికొఱకు, ఇయం = ఈ, ప్రౌఢానుభూతిః = ప్రౌఢానుభవము అనే గ్రంథము, దాతవ్యా = ఈయతగినది. మోహదగ్ధకుధియే, మోహ = దేహాత్మభ్రమచేతను, దగ్ధకుధియే-కు = చెడిపోయినటువంటి - ధియే = బుద్ధిగలిగినవానికొఱకున్ను, దుష్టాంతరంగాయచ = రాగద్వేషములచేత చెడిపోయిన అంతఃకరణము కలవారల కొఱకున్ను, న దాతవ్యా = ఈయతగినది కాదు ; యేయం = ఏ గేదంగి రేకు, రమ్యవిటార్పితా, రమ్య = రసికుండైనటువంటి, విట = విటునియందు, అర్పితా = పెట్టబడినదౌకుంచూన్నా, ఉత్తమశిరః ప్రాంతే, ఉత్తమ = కిరీటాదికముచే నలంకరించబడినటువంటి, శిరః = శిరస్సుయొక్క, ప్రాంతే = మీదను, స్వయం = తాను, చకాస్తి ప్రకాశించునో, సా కేతకీ = ఆ గేదంగి రేకు, మర్కట

టహస్తదేశపతితా-మర్కట=క్రోతియొక్క, హస్తదేశ=చేతిలోవ లను, పతితా చేత్=పడినట్లాయనా, రాజతే కిం=ప్రకాశించునా?

"పదిహేడు శ్లోకాలు సంపూర్ణంగావున్నవి."

(వి-వి.)—

సమగ్రము. వ్రాంత బాగున్నది. నిర్దుష్టముకాదు. శైథిల్యము మిక్కుటముగాఁ గలదు. గ్రంథపాతములును గలవు.

సంస్కృతమునఁగల ప్రౌఢానుభూతియను నద్వైతగ్రంథము నకు వియ్యాది టీక. ఇందు సంస్కృతశ్లోకములును గలవు. టీక రచించినదెవరో తెలియదు.

R. No. **26**.

Palm-leaf. 13¼ × 1¼ inches. Foll. 16. Lines, 5 in a page. Telugu. Much injured.

Presented by P. Sītārāma Śāstri of Guntūr in 1910-11

మాతృశతకము.

MĀTṚŚATAKAMU.

A century of verses in praise of the mother, in Campakōtpala-mālikā metre. Contains only 22 verses.

**Beginning:**

ఉ. శ్రీకరవాంఛితార్థఘనసిద్ధికిఁ గావ్యపటుత్వవృద్ధికిన్
ప్రాకటభక్తి . . . . . . . .
. . . . చింతనకుం బ్రతిసేసి భద్రముల్
దాకొనియుండునట్లుగముదంబునఁ దల్లినిబోల రెవ్వరున్.

**End:**

చ. వినఁగనసిద్ధమింతయును వేదరహస్యము సప్తతంతులున్
ఘనమ... ...... సేవలునుగాంచనషోడశదాన ధర్మముల్
దనరఁగనాచరించి తలిదండ్రులప్రీతియొనర్ప కున్న నా
యనువుఫలంబులన్నియు . . . . .

(వి-వి.)—

అసమగ్రము 22 పద్యములు గలవు. వ్రాంత యొకమాదిరిగా నున్నది నిర్దుష్టముగాదు. శైథిల్యము విశేషముగాఁ గలదు. ఇది "తల్లినిఁబోలరెవ్వరుణ" అను మకుటముతో మరియు చంపకోత్పలమాలికావృత్తముల శతకము. రచించిన దెవరో తెలియదు. మాతృపూజ యిందుఁ బ్రతిపాదింపఁబడినది.

R. No. **27**

Paper. $7\frac{5}{8} \times 6\frac{1}{4}$ inches. Foll. 22. Lines, 12 in a page. Telugu. Good.

Presented by P. Laksmayyagāru of Guntūr in 1910–11.

యోగీంద్రవర్యశతకము.

YŌGĪNDRAVARYAŚATAKAMU.

This is a century of verses which are addressed to Dattātrēya and treat of some philosophical and religious topics, such as the bondage of Saṁsāra, the three desires, etc. The author of the work is Kondayya, a Brahmin of Vēginādu and son of Baṇḍlapalle Nāgayapradhāni.

Incomplete.

**Beginning:**

సీ. శ్రీకరాకార శాశ్వ(?)త నిత్యపరిపూర్ణ !
ఆనందయోగ విద్యావిహార
రూపవిక్రమకళాదీపప్రకాశ యో
గాధ్యక్ష యోగికులావతంస
నారదస్తుతపూర్ణ . . . చితవినోద
కరుణాకటాక్షవీక్షణవిశాల
భూతిలేపన జగత్ఖ్యాతచారుచరిత్ర
సకలలోకాధార సగుణరూప
గీ. పరమపావన మహనీయ భవ్యగాత్ర
విశ్వస . . . యోగీంద్ర వినుతిలోల

చిరశుభాకార మోక్షలక్ష్మీవిహార
సాంద్రరుచిధుర్య దత్తయోగీంద్రవర్య.

**End:**

సీ. పరతత్త్వవాచ్యార్థభావంబు లన్నియు
వేర్వేఱ నొక్కొక్క విధముగాఁగ
సీసపద్యంబులఁ జెలువంగ శతకంబు
చెప్పితి సత్కవిశ్రేష్ఠు లలర
పరఁగ దత్తాత్రేయగురునంకితంబుగా
నానేర్చువిధమున నవ్యముగను
వేఁగినాటికులాబ్ధివిధుఁడను బండ్లపు
ల్లన్వయుఁడను నాగయప్రధాన
గీ. సుతుఁడ శ్రీవత్సగోత్రుండ సుకవి కొండ
ధన్యుఁడ వెలయ నాచంద్రతారకముగఁ
జిరశుభాకార! మోక్షలక్ష్మీవిహార
సాంద్రరుచిధుర్య! దత్తయోగీంద్రవర్య.

(వి-వి.)—

అసమగ్రము 26 పద్యములుమాత్రమే కలవు. వ్రాఁత బాగున్నది. తప్పు లంతగా లేవు. ఒకటి రెండు పత్రములం దించుక గ్రంథపాతములు కలవు. శైథిల్యము లేదు.

"చిరశుభాకార! మోక్షలక్ష్మీవిహార! సాంద్రరుచిధుర్య! దత్తయోగీంద్రవర్య!" యను మకుటముతో ముగియు నీ సీసపద్య శతకము వేఁగినాటిబ్రాహ్మణుండును బండ్లపల్లె నాగయ్య ప్రధానుని కుమారుఁడునునగు కొండయ్యచే రచింపఁబడినది. సంసారబంధనము, ఈషణత్రయము, అసత్యభ్రాంతి, అష్టకష్టములు, అష్టపాశములు, క్షుద్రప్రశంస, తాపత్రయప్రశంస, అష్టమదములు, సప్తవ్యసనములు, ఈ మొదలగు విషయము లొక్కొక్కటి యొక్కొక్కపద్యమందు రూపింపఁబడినవి.

## R. No. 28.

Palm-leaf. 15¼ × 1¼ inches. Foll 26. Lines, 5 in a page. Telugu. Very much injured.

Presented by P. Sītārāma Śāstri of Guntūr in 1910–11.

యోగీంద్రవర్యశతకము.

YŌGĪNDRAVARYAŚATAKAMU.

Same work as the one described under the last number.

Complete.

(వి-వి.)—

సమగ్రము. వ్రాంత యొకమాదిరిగ నున్నది. నిర్దుష్టము కాదు. శైథిల్య మపరిమితముగ నున్నది గ్రంథపాతములు తండో పతండములు

ఇది నెం. 27 రు న వర్ణింపఁబడినగ్రంథమే కాని వేఱు కాదు.

## R No. 29.

Paper. 7¾ × 5⅛ inches Foll 8. Lines, 22 in a page. Telugu. Good.

Presented by P. Laksmayyagāru of Guntūr in 1910–11.

రత్నశాస్త్రము.

RATNAŚĀSTRAMU.

This is a Telugu version of the Sanskrit work on this subject by Agastya. It treats of the distinguishing features of the nine precious gems, their characteristics, etc. The author of the work is Bhairava, son of Gaurana, and a devotee and protege of Bhramarāmbā. The author's other works are Śrīrangamāhātmya and Kavigajāṅkuśa.

Complete.

**Beginning**:

క. శ్రీ వెలయఁగఁ బద్యములను
పావననవరత్నకుసుమ బహువిధపూజా (పఱ్ఱిఁటెలఁబూజల్ !)

గావించెద ముదిగొండ
శ్రీవీరేశునకు భక్తచింతామణికిన్.

క. తన్నుఁ బ్రియ మాఱ వేఁడిన
మున్ను మునీంద్రుల కగస్త్యముని చెప్పినయా
సన్నుతమణిలక్షణములు
చెన్నుగఁ గ్రోడీకరించి చెప్పెదఁ దెలియన్.

క. భ్రమరాంబాదేవీవర
సముదితనిరవద్యహృద్యసాహిత్యకళా
క్రమవిమలప్రతిభావ (భోప ?)
క్రమవిక్రమశాలియైన గౌరవ(న ?) సుతుఁడన్.

క. భైరవుఁడ నుభయభాషా
పారీణుఁడ లోభిభవనభవభూమివ్యా
పారాధికారదుష్కవి
ఘోరపిశాచుల నదల్చుకొను భైరవుఁడన్.

**End:**

ఉ. ఈ నవరత్నలక్షణము లెన్నికమాన్పుమువాక్యమాలతీ
సూనము లెప్పుడున్ నిరతసుస్థితితోడుతవీరభద్ర స
? న్మానితసత్ఫలంబు లగునట్టుముదంబునఁబూజసేసెదం
గానవిలోలమాభ్రమరగాచుచునుండుము సర్వకాలమున్.

గ్రంథాంతమునఁ బ్రతివిలేఖకుఁ డిట్లు వ్రాసికొనెను :—"జయ నామసంవత్సర వైశాఖ శు ౧౦ ఆదివారమువఱకు ప్రతిలో ఉన్న క్రమాన పూర్ణంగా వ్రాసెను."

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత చక్కఁగా నున్నది. తప్పులు మెండు. శైథిల్యము లేదు. గ్రంథపాతములు లేవు.

సంస్కృతమున నగస్త్యమునిచేఁ జెప్పఁబడిన రత్నశాస్త్రము నకిది తెనుఁగు. భ్రమరాంబావరప్రసాదలబ్ధకవితావిలాసుఁ

డును గౌరనకుమారుఁడు నగు భైరవకవిచే రచింపఁబడినది. ఈ భైరవుఁడే శ్రీరంగమాహాత్మ్యము, కవిగజాంకుశము, నను గ్రంథముల రచించినవాఁడు. నవరత్నపరీక్షయు, వాని గుణములును, దాల్చుటవలని ఫలములును, నిందుఁ జెప్పఁబడినవి.

---

## R. No. 30.

Paper. 7½ × 6 inches. Foll. 14 Lines, 22 in a page Telugu. Good.

Presented by the same owner as the last in 1910-11.

రాజయోగప్రకాశిక.

RĀJAYŌGAPRAKĀŚIKA.

This is a treatise in Yōga describing in colloquial Telugu the physiological details of the human body, the different means of concentrating one's attention, the different kinds of concentration, etc

Incomplete.

**Beginning:**

లోకమందు మనుష్యుఁడు తన యంగుళాలచేత ౯౬ అంగుళాలప్రమాణము ౮ జానలపొడుగు నాల్గుజానల వలయము ౩౩ కోట్ల రోమద్వారములున్నా ముప్పదిరెండు మూళ్ల పెద్దపేగులున్నా ౯౨ సంధులున్నా ౯౦ పెద్ద యెముకలున్నా ౮ పలాలు గుండెలున్నా ౪౦౦ రుధిరమున్నా ౩౬౦ పలాలు మాంసమున్నా, సోలెడు పైత్యమున్నా, అరసోలెడు శ్లేష్మమున్నా, అరసోలెడు శుక్లమున్నా ఇన్నింటితో గూడుకుని వుండేటి(ది ?) యీ శరీరం. ఇన్నిటికిన్నీ యీ జీవుడు వున్నాడు గనుక శాంతికల్గి మనుష్యాకారమైవుండి (డును ?) ఆజీవులకు పరబ్రహ్మ సాక్షియై సకలభూతాలలో వున్నాడు.

**End:**

సుషుప్తియందు జీవుడు అవిద్యయందు లీన మవుచున్నాడు గనుక ఆనందమయప్రకాశం. ఈ పంచప్రకాశాలు ఆత్మను

పారలువలె కప్పుకొని వుండును. శరీరమందు దశావస్థలుగలవు అవి యేవంటే :

(వి-వి.)—

అసమగ్రము. వ్రాఁత యొకతీరుగా లేదు విస్పష్టముగాదు. శైథిల్యము లేదు. గ్రంథపాతములు లేవు.

ఇందు యోగాభ్యాసవిధములు యోగభేదములు మొదలగునవి వివరింపఁబడినవి. గ్రంథము వ్యావహారికభాషలోఁ గలదు. రచించినవాఁడెవరో తెలియదు.

## R. No. 31.

**Palm-leaf.** 11⅛ × 1⅛ inches. Foll. 56. Lines, 5 in a page. **Telugu.** Good.

Presented by B. Lakṣmīkānta of Guntūr in 1910–11.

(*a*) రాజయోగామృతసారము.

RĀJAYŌGĀMRTASĀRAMU.

Foll. 1*a*–45*b*.

This is a Telugu version, consisting of three Prakaraṇas in stanzas of Dvipada metre, of the dialogue between Kapila and Dēvahūti, regarding Yōga as explained in the third Skandha of Śrībhāgavata The work was composed by Tarigonda Veṅkamāmbā, a lady, who won the favour of Vīranarasiṁha.

Complete.

**Beginning:**

ద్విప. శ్రీగణనాథు నాశ్రితపరిపాలు
నాగమసంవేద్యు నాధారసదను
ననిశంబుఁ గీర్తించి యతిభక్తి పెంచి
యనువొందఁ దరికొండ వారిని మహాను
? భావుని భవ్యవిగ్రహు (వైభవు ?)ని భావించి
పావనమూర్తిని బరమసాధనుని

వేదాంతవేద్యుని విశ్వతోముఖుని
నాదవినోదుని నళినలోచనుని
ఆదినారాయణు ననిశంబు నాద్య
మనములోన రహస్యమార్గమందుంచి—

కుదురుగా నదియట్టు గురుపరంపరను
సదమలభక్తితో సన్నుతించుచును
విహితోక్తి నత్యంత విఖ్యాతి నమరు
సర్వయోగీ ప్రజల సమ్మతిగాఁగ
నుర్విలోపల రాజయోగసారంబు
వలనొప్ప ద్విపదకావ్యముగా రచించి
యలరుశ్రీహరికి సమర్పింపఁ దలఁచి
మున్నుగా నాచందములు తేటగాఁగ
విన్నవించెద మీకు విశదంబుగాను
వినరయ్య కవులార ! విద్వాంసులార !
వినరయ్య మీరెల్ల విమలాత్ములార !
ఘనయతిప్రాస సంగతుల నే నెఱుఁగ
వరుస నాక్షేపింపవలదు సత్కృపను
శ్రీకరంబుగ నారసింహులకరుణ
నీకథాప్రారంభ మేర్పఱించెదను—

**End:**

కనుక నీయమనస్కఘనతరాభ్యాస
మున నెప్డుఁబరిపూర్ణముగ నిండియుండు
మానసయగు వేంగమాంబికారచిత
మైనట్టి రాజయోగామృతసార
మందెన్నఁగాఁ దృతీయప్రకరణము
పొందుగాఁ దరిగొండపురధాముఁడైన

పీరనృసింహుఁడు వెలయఁ గైకొనియె
ధారుణి నాచంద్రతారార్కముగను.

ప్రతిలేఖకుఁడు గ్రంథాంతమం దిట్లు వ్రాసికొనెను :—

"ధాతనామ సంవత్సర ఆషాఢ బ ౨ శనివారము రోజున ఈ గ్రంథము సమాప్తము అయినది. చెన్నంసెట్టి సుబ్బారాయని స్వహస్తము".

(వి-వి.)—

సగ్రము. వ్రాఁత బాగున్నది. నిర్దుష్టము కాదు. శైథిల్యము లేదు. గ్రంథపాతములు లేవు.

ఇది శ్రీమద్భాగవతమందలి తృతీయస్కంధమందుఁ గల కపిల దేవహూతి సంవాదరూపమగు యోగశాస్త్ర విషయమునకు పీర నరసింహవరప్రసాదిని యగు తరిగొండ వేంకమాంబయను విదుషి చే ద్విపదరూపమున మూఁడు ప్రకరణములుగాఁ జేయఁబడిన తెలుఁ గుసేఁత.

(*b*) వేదాంతకీర్తనములు.

VĒDĀNTAKĪRTANAMULU.

Foll. 46*a*–55*b*.

Contains some verses on philosophic truths and some on the story of Rāma.

**Beginning:**

దీనిభావము తెలియండన్న దీనిమర్మముఁకనండి, అన్నవరవు పోరలింగని అతికి తెలుసుకోండి ॥దీ॥

నెత్తిని నోరుండునన్న, నోసట కండ్లునన్న, మూతిన తో కుం డునన్న, మూఁడు మొకములు గలవు అన్న ॥దీ॥

**End:**

చేరి యతనితోను చెలిమి చేసి రామరామ
నారసమున వాలిఁగూల నేసి రామరామ

మాల్యవంతపర్వతమున నిలిచి రామరామ
మహితశౌర్యు లయిన కపులఁ బిలిచి రామరామ.

(వి-వి.)—

అసమగ్రము. వ్రాఁత యొకమాదిరిగా నున్నది. నిర్దుష్టము కాదు. శైథిల్యము లేదు. గ్రంథపాతములు లేవు.

ఇందుభిన్నవిధములయిన కొన్ని వేదాంత కీర్తనములును జీవర రామచరిత్రమును దెలుపు నొకకీర్తనమును గలవు.

---

## R. No. 32.

Palm-leaf 19⅜ × 1¼ inches. Foll. 34. Lines, 6 in a page. Telugu. Injured.

Presented by P. Sītārāma Śāstri of Guntūr in 1910-11.

శ్రీరామస్తవరాజము.

ŚRĪRĀMASTAVARĀJAMU

Same work as the one described under No. 5 (a) *ante*.
Complete.

(పి-వి.)—

సమగ్రము. వ్రాఁత బాగున్నది. నిర్దుష్టము కాదు. శైథిల్యము కలదు. గ్రంథపాతములు కలవు.

ఇది నెం 5 రున వర్ణింపఁబడిన గ్రంథమే కాని వేఱు కాదు.

## R. No. 33.

Paper. 8¼ × 6½ inches. Foll. 38 Lines, 21-38 in a page. Telugu Good.

Presented by P. Laksmayyagaru of Guntūr in 1910-11.

వల్లవీపల్లవోల్లాసము.

VALLAVĪPALLAVŌLLĀSAMU.

This is a Prabandha in three Āśvāsas on the story of the marriage of Śrī Kṛṣṇa with Satyabhāmā; by Māḍabhūṣi Nṛsimhācārya,

son of Vēdāntācārya. The work was composed at the instigation of Śōbhanādri Appārāya of Nuzvid and dedicated to Śōbhanādrīśvara.

Complete.

**Beginning:**

ఉ. శ్రీలక్ష్మీకరకర్ణభూషణము లై చెన్నొందు పద్మోత్పలీ
ద్వేలోలానని దాననేత్రయుగళీదివ్యారుచంద్రద్యుతుల్
దైత్యాలోకభ్యాఘత మోసివారణము చిత్రంబొప్పఁ గావించునా
శ్రీలక్ష్మీనరసింహనామకశుభాద్రిస్వామినిం గొల్చెదన్.

* * * *

గీ. జగతి శ్రీశైలవంశసంజాతు లగుచు
సకలవేదపురాణ శాస్త్రజ్ఞగమ్య
బ్రహ్మవిద్యాంద్యవరలౌను రంగనాథ
దేశికులఁ గొల్తు మత్కృతి తేజమునకు.

* * * *

సీ. గీ. చటులవిక్రమపటురటద్భటచయంబు
నటవిటశ్రేణిరంజితనరచయంబు
మత్తవేదండతండంబు మహితచక్రి
తురగనికరంబు నూజవీడ్పురవరంబు.

గీ. ఆపురంబున విలసిల్లు భూపమౌళి
రత్ననిచయ ప్రభాపుంజరంజితాంఘ్రి
రమ్యుఁడై శోభనాద్ర్యప్పరాయరాజ
శేఖరుఁడు తేజమున నిందుశేఖరుండు.

*

మ. ననుఁ గోపాలదయాసముల్లసితనానాశాస్త్రవిజ్ఞానసై
పుణశీలాంచితశేముషీవిలసితున్ భూరిప్రభావోన్నతున్

విశ్వతానూనకటాక్షలబ్ధకవితా విఖ్యాతచాతుర్యుఁ డ
య్యన రా రమ్మని చేరఁబిల్చి రమణీయాహ్లాదచేతస్కుఁడై.

* * * *

చ. మృదుపదవాక్యగుంభనల మేదురమై శ్రవణాతిశాయిస
స్మృద మొదవంగఁ జేయరసమంజులమై సదలంకృతిన్ మహో
దయదమగు నవ్యకావ్యము శుభాంధ్రనృకేసరి కర్పితంబుగా
నుదిఁ దిలకింప సత్కవిసమాజ మొసర్పుము నేర్పు మీఱఁగన్

* * * *

సీ. మహనీయగుణరత్నమాదభూమ్యన్వయ
 కలశాంబురాశిశీతలకరుండు
కమనీయనైధ్రువకాశ్యపగోత్రుఁ డా
 పస్తంబసూత్రుండు వరమయశుఁడు
వేదశాస్త్రపురాణవిద్యానవద్యుండు
 సకలధర్మాధర్మసారవిదుఁడు
సంస్కృతప్రాకృతశౌరసేన్యాది స
 ద్భాషావిశేషప్రబంధకరుఁడు

గీ. నతఁడు మద్వంశకూటస్థుఁ డఖిలరాజ
పూజనీయాంఘ్రిరాజీవరాజితుండు
వాదివేదండపంచాస్యవైఖరీ స
మంచితుఁడు వేంకటాచార్యుఁ డార్యవిభుఁడు.

క. ఆవేంకటగురుచంద్రుఁడు
పావనగుణశేషమాఖ్యభామామణితో
శ్రీ వెలయఁగ గార్హస్థ్యము
భావించుచు నుండె విబుధపరివృతుఁ డగుచున్.

క. నవశేవధిసమ్మితసుత
నవకం బాదఁ పశాలకు నయ మొందఁగ ను

ద్భవమై గుణగణమణిసం
భవమై విలసిల్లె సర్వవైభవహితమై.

ఉ. ఆనవకంబునం దనరె నాగమశాస్త్రవిశారదుండు శ్రీ
సూనుసమానసుందరుఁడు శోభితభూరియశోంచితుండు సం
తానమహీరుహోపమితదానమహీసురకోటిమోదసం
ధానుఁడు శ్రీనివాసుఁడు బుధస్తవనీయకళావిలాసుఁడై.

గీ. శ్రీనివాసార్యుఁ డిలయందు శ్రీనివాసుఁ
డనఁగఁ జెలువొంది వేంకటమ్మాఖ్యసాధ్వి
తోడ గృహమేధియై కడుఁ బ్రోడయగుటఁ
బండితాఖండలుండనఁ బరఁగె నతఁడు.

క. ఆపండితజనశేఖరుఁ
డాపన్నగశాయిఘనదయాన్ వంశసము
ద్దీపకతనూజరత్నముఁ
బ్రాపించెను వేంకటార్యభాస్వదభిఖ్యన్.

క. . . . . . . . . . . .

కృష్ణాంబతోడ రమతోఁ
విష్ణువువలె వేంకటార్యవిబుధుం డలరెన్.

గీ. పంచరత్నంబులో లేక పంచబాణు
పంచశరములో యన సుతపంచకంబు
వారి సుకృతంబు లెల్లను వన్నెకెక్క
నుదయమయ్యెఁ దదన్వయాభ్యుదయమునకు.

గీ. అయిదుగురలోనఁ దండ్రికి దయితుఁడగుచు
సకలవేదపురాణశాస్త్రములు చదివి
యమితభాషావిశేషము లభ్యసించి
తేజరిల్లెను వేదాంతదేశికుండు.

క. అనసూయారుంధతులను
ఘనపాతివ్రత్యమునను గదుముచుఁ గృష్ణ
మ్మన వెలయు సతీమణితోఁ
దనరెం వేదా తగురుఁడు తద్దయు వేడ్కన్.

*　　*　　*　　*

క. ఆవేదాంతాచార్యుఁడు
భూవలయమునందు సకలబుధసన్నుతుఁడై
శ్రీ వెలయఁ గనియె మమ్ముల
నేవురుతనయులను ఖండితేంద్రచరితులన్.

క. వారిజలోచనుకరుణ న
వారితసురవాహినీప్రవాహసుకవితా
ధోరణి కల్గి చెలంగితి
ధీరుల్ శ్రీనారసింహదేశికుఁ డనఁగన్.

వ. మఱియు వైనతేయకలాశలబ్ధవిద్వత్కవిరాజసమాజ మనోరంజక సంగీతసాహిత్యపాండిత్యవిచిత్రకవిత్వనిర్మాణ నిపుణుండనైన నారచియింపం బూనిన ప్రబంధంబున కధీశ్వరుండైన శ్రీ శుభాద్రీశ్వరస్వామి నభివర్ణించెద.

**End:**

గీ. వల్లవీపల్లవోల్లాస ముల్లసమున
వినినఁ జదివిన వ్రాసిన జనుల కెపుడు
మదనగోపాలకృపాళి సమ్మదముతోడ
సకలసంపద లొసఁగును సంతతంబు.

*　　*　　*

స్రగ్విణి. ఇందిరాద్వృక్చకోరేందుబింబన్ముఖా
వందనీతామితావార్యసంపత్సుఖా
నిందితప్రోదినీనీతిభాస్వన్నఖా
నందితాగేంద్రకన్యావచస్త్రీసఖా.

**Colophon:**

ఇది శ్రీమాడభూషికులపయోరాశిరాకాసుధాకర వేదాంతాచార్యతనూభవ వైనతేయకటాక్షలబ్ధవిద్వత్కవిరాజమనోరంజకసంగీతసాహిత్యకవిత్వచతురనరసింహాచార్యప్రణీతంబైన వల్లీపల్లవోల్లాసంబను సత్యాపరిణయాఖ్యానప్రబంధంబునందు సర్వంబును ద్వితీయాశ్వాసము.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత ముద్దుగ నున్నది. తప్పులంతగా లేవు. శైథిల్యము లేదు. గ్రంథపాతములు లేవు.

శ్రీకృష్ణుఁడు సత్యభామను బెండ్లియాడు కథతో మూఁడాశ్వాసముల ప్రబంధముగా మాడభూషి నృసింహాచార్యకవి వల్లీపల్లవోల్లాసమను నీశృంగారగ్రంథమును రచించెను. నూజివీటి ప్రభువగు శోభనాద్ర్యప్పారాయని ప్రేరణమున నిది రచింపఁబడినట్లు గ్రంథకర్త చెప్పికొనెను. కృతిస్వామి శోభనాద్రీశ్వరస్వామి. గ్రంథకర్త కుల గోత్రాదులు పైనుదహరింపఁబడిన పద్యములఁ బట్టి తెలిసికొనునది.

## R. No. 34.

Palm-leaf. 16 × 1¼ inches. Foll. 44. Lines, 5 in a page. Telugu. Injured.

Presented by P Sītārāma Śāstri of Guntūr in 1910–11.

వసుచరిత్రము.

VASUCARITRAMU.

This is a love-poem in six Āśvāsas by Rāmarājabhūṣanakavi. It treats of the story of the marriage of Uparicaravasu and Girikā. As the MS. is incomplete and injured, extracts and a fuller account are not given here. Contains only two Āśvāsas.

(వి-వి.)—

అసమగ్రము. రెండాశ్వాసములు మాత్రమే కలవు. శైథిల్యము కలదు. గ్రంథపాతములు గలవు. వ్రాఁత యొకమాదిరిగా నున్నది. నిర్దుష్టము కాదు.

ఇది రామరాజభూషణకవిచే రచింపఁబడిన వసుచరిత్రమను శృంగార ప్రబంధము. పుస్తక మసమగ్రముగను శిథిలముగను నుండుటచే విషయవివరణ మిందుఁ జేయఁబడదయ్యె.

---

R. No. 35.

Palm-leaf. 12¾ × 1⅝ inches Foll 41 Lines, 7 in a page. Telugu. Injured.

Presented by P. Sītārāma Śāstri of Guntūr in 1910-11.

వాసిష్ఠరామాయణము.

VĀSISṬHARĀMĀYANAMU.

This is a Telugu version of the Sanskrit work of this name by Maḍiki Singanakavi. Breaks off in the third Āśvāsa.

**Beginning:**

ఉ. శ్రీ కరలీలఁ బ్రాణుల సృజింపఁ దలంచి విధాత తానయై

. . . . . . . . . . . . . .

. . . . . . . . . . యై వెలుంగును

శ్లోకుఁ బురాణపుణ్యపురుషుం బరమాత్ముని భక్తిఁ గొల్చెదన్.

**End:**

క. తుద మొదలు లేదు కాలం
బిదమిత్థమనంగరాదు (ద ?) యిందుల నూతెం
ఢ్లిదియెంత యానిశ్చ్రష్టపుఁ
బ్రదుకులయం దేమియాస్థ పరమవివేకా.

(వి-వి.)—

అసమగ్రము. మూఁడవ యాశ్వాసమునఁ గొంతభాగమువఱకే కలదు. వ్రాఁత బాగున్నది. తప్పులు లేకపోలేదు. శైథిల్యము మిక్కిలి కలదు. గ్రంథపాతములును హెచ్చుగాఁ గలవు.

ఇది సంస్కృతమునఁగల వాసిష్ఠరామాయణమునకు మడికి సింగనకవిచేఁ జేయఁబడిన తెలుఁగుసేఁత. ఈ గ్రంథ సంపుటమతి శిథిలముగానుండుటచే నిందు విషయవివరణము కావింపఁబడదయ్యె.

R No. 36.

Palm-leaf. 12¾ × 1½ inches. Foll. 25 Lines, 6 in a page. Telugu. Injured.

Presented by Addēpalli Rāmasēśayya of Rēpalle in 1910-11.

వాస్తుశాస్త్రము.

VĀSTUŚĀSTRAMU.

There is neither beginning nor end in this MS.; and the work treats of construction of houses, etc It is dedicated to Krsna.

**Beginning**:

సీ. తనరుపూర్వప్రదక్షిణంబుగ దూరములుగూర్చవలయు
నపుడు ఆగ్నేయమునను మూలాగ్రసంయోగంబు ?

* * * *

అర్థము. దూలములు చౌకముగా కూర్చేటప్పుడు తూర్పు దూలం మొదలున్నూ దక్షిణదూలం కొనాను న్నూ ఆగ్నేయానకు రావలెను. దక్షిణదూలం మొదలున్నూ పడమటి దూలం మొదలున్నూ నైఋతిమూలను కూడవలెను.

* * * *

**End**:

* * * *

గురుతులుంచిన దక్షిణోత్తరముల య్య
అయుపత్యంటిను త్రిమల్ వేధనపుడు
మూలమేర్పడు నీరీతి మొదల దికుగ.

(వి-వి.)—

అసమగ్రము. మొదలు లేదు చివర లేదు. వ్రాఁత మొకమాదిరిగా నున్నది. తప్పులు తండోపతండములు. శైథిల్యము కలదు. గ్రంథపాతములు లేవు.

ఈ వాస్తుశాస్త్రము శ్రీకృష్ణాంకితము. ఇండ్లు మొదలగు వాని నిర్మాణవిషయమునవిధులిందుఁ దెలుపఁబడినవి. గ్రంథ మిందు భ్రష్టమై చూపట్టుచున్నది. ఈ ప్రతినిబట్టి యింతకంటె నీ గ్రంథ విషయము గుఱుతింపఁదగినది లేదు.

## R. No. 37.

Palm-leaf. 16¾ × 1¼ inches. Foll. 69. Lines, 6 in a page. Telugu. Injured.

Presented by Gollapūdi Lakṣmaṇa Śāstri of Bezwada in 1910–11.

వేంకటేశ్వరవిలాసము.

VĒṄKAṬĒŚVARAVILĀSAMU.

This is a Prabandha describing the marriage of God Vēṅkaṭēśvara of Tirupati with a Chenchudamsel, by Cellapiḷḷa Narasakavi. Incomplete. For further particulars about the author, see extracts below.

శా. శ్రీమద్గోపకుమారముఖ్యసమయోత్సేకప్రణామక్రియా
సామర్థ్యోదితరావణభ్రమసుదృక్సంశ్లేషభావజ్ఞుఁడై
ప్రేమన్ భూమిజనాదరించి
త్యామోదంబు లొసంగుశౌరి రఘునాథస్వామి మమ్మేలుతన్.

* * * *

ఉ. ... ........మధురీకృతతత్త్వ బోధపాఠన
ప్రాపితభక్తిసారనిరపాయసుఖోదయకారకారవ
శ్రీపురసారయోగబహులీకృత వేదులవేంకటార్యవా
గ్రూపణభాష్యకారయనిరూఢినుతించెద మద్గురూత్తమున్.

క. భాస్వద్భ్రింహాంనందర
సాస్వాదసుఖప్రపూరితాత్మాంధ్రవచ

శ్రీస్వోపదేశకోత్తమ
సుస్వాంతులఁ గోనయాఖ్య సూరులఁ దలంతున్.

* * * *

మ. ప్రవరుల్ కొందఱు మేలుకోటఁ గలచెల్వప్పిళ్లరాయందు భ
క్తివిశేషంబున గాత్మ మెచ్చి కరుణోక్తిన్ స్వేగ సాక్షాత్కరిం
చి వరంబిచ్చి మదీయభక్తులని వాసిం బ్రో(వఁగా?)వారు స
ర్వవిశేషంబుల వృద్ధిఁ బొందిరిలఁ జెల్వప్పిళ్ల . . .

గీ. అది మొదలుగాఁగ సకలజనానులావ
వినుతిఁ దగఁ జెల్లపిళ్లవా రనుసమాఖ్య
ఘనతమీఱఁ దదన్వయక్రమమునందు
వంశపావనుఁ డన్నయాహ్వయుఁడు కలిగె.

* * * *

చ. అఖిలజగత్ప్రసిద్ధమతి యన్నయ యన్నతిశాలికిన్ మన
స్సుఖఫలదాయియై సకలశోభల శ్రీహరిమూర్తికిన్ జతు
ర్ముఖుఁ డుదయించినట్లు కులముఖ్యుఁడు వేంకటనామధేయుఁడు
న్సుఖమఖవాహ్యధుర్యమతి పుత్త్రకుఁడై జనియించెఁ బెంపుగన్.

చ. మతిహిత కార్యధుర్య మనపాయసుఖోదయ మైన ప్రేయసీ
ద్వితయమునందు వేంకటసుధీమణి సంతతిఁ గాంచి మించె నం
దతివగివర్ధితాన్వయమహిష్ఠుఁడు రామయ నామధన్యుఁ డ
ప్రతిసతికృష్ణమాంబకుఁ జిరప్రియపుత్త్రకుఁడై ప్రవర్ధిలెన్.

క. ఆభాగవమాంబయందు మ
హాభాగుఁడు రామయార్యుఁ డాత్మజులుగఁ గా
మాభిధుని వేంకటాఖ్యుని
శోభితమతి యన్నయార్యసూరుఁ గనియెన్.

* *

క. ఆ వేంకమకులసతియం
దాదిద్వయస్మార్తి కామయార్యుఁడు పుత్త్రి

స్త్రీవరసంతతి గనె నం
దావరపుత్త్రికులు మువ్వు రందగ్రజుఁడై.

* * * *

క. వా రిరువుర కే ననుజుఁడ
శ్రీరామపదారవిందసేవారత హృ
త్సారసుఁడ నృసింహసమా
ఖ్యారంజితసకలవిబుధహార్దోదయుఁడన్.

సీ. ఘనతరశ్రీరామకరుణాకటాక్షవీ
క్షణసమారబ్ధశృంగారసరస
బంధురబంధప్రబంధకల్పనకళా
చాతుర్యయుక్తభాషాకవిత్వ
కౌశలమతిని సత్కవిహృద్యగద్య ప
ద్యానవద్యప్రయోగార్హలక్ష
ణాలంకరణమహోన్నత యామినీపూర్ణ
తిలకావిలాసంబు లలితముగ నొ

గీ. నర్చి రామాంకితంబుగాఁ గూర్చినాఁడ
గౌతమీతీరకంకణ గ్రామధామ
సౌఖ్యసంసిద్ధి గాంచిత క్ష్మాపతీంద్ర
కృతబహూకృతిఁ జెందిన వితతయశుఁడ.

చ. అదియునుగాక విద్య లరయ న్నవభోజుఁడు సర్వమంగళా
భ్యుదయుఁడు పద్మనాయకవిభూత్తమరత్నము ధారుణీజగ
ద్విదితుఁడు చింతపల్లికులవేంకటరాయనృపాలమౌళి వా
గ్విదుఁడని గౌరవించిన కవిప్రభుచంద్రుఁడ నన్నెఱుంగుఁడీ.

* * * *

క. శ్రీమద్రఘువంశసుధా
ధామక్షేమాభిరామధామునకు మహో

ద్దామమదద్విపదుత్పల
ధామనిధిస్ఫురితతీక్ష్ణశరధామునకున్.

* * * *

**End** :

సీ. కలిమిచే సగమైనఁ గాకున్న జగడంబు
వలవదు నీతోడ వద్దరాకు
నెలఁతరో పలుచనినీటఁ బుట్టినపోలికఁ
గనుపట్టె ననుచు బలుకఁగ నేల
యంత కన్నను బల్చ నగుచోటఁ బుట్టిన
జాడ నీయందున్న సన్నగనుము
డెందంబు రాపొందఁ జెందు నందువు మది
నిర్మలమణిలీల నివ్వటిల్లు

గీ. నెచ్చుతగ్గన సర్వార్థ్య లెచ్చుతగు
గలిగియుండెద రల్పులు గాన రెపుడు
రిక్కలట్లను నాకు హృత్ప్రియుల పెనుక
రంటి వటులైన విష్ణ్వంశలంటరటవె.

గీ. సామిఁ జేపట్టి నంత నేసకియ నేను
నీవలెనె రొమ్ముపై కెక్కి నిల్చితటవె
కానిశేషునులను . . . . .

(వి-వి.)—

అసమగ్రము. ఆశ్వాసాద్యంతపద్యములు వ్రాయఁబడియుండ లేదు. వ్రాఁత జిలుగుగా నున్నది. తప్పులంతగా లేవు. నడుమఁ గొన్ని పత్రములందుఁ గొంత గొంతభాగము భిన్నమై పోయినది. ఆ భాగములందు గ్రంథపాతములు గలవు.

వేంకటేశ్వరస్వామి చెంచుగన్నియను బెండ్లియాడు కథ యిందు వర్ణింపఁబడినది. ఎన్ని యాశ్వాసములుగా నీ గ్రంథము రచింపఁబడెనో యీ ప్రతినిబట్టి గుఱుతింపరాదు. గ్రంథకర్త చెళ్లపిళ్ల నరసకవి. కవినిగూర్చి విశేషములు, పై నుదాహరింప బడిన పద్యములందుఁ దెలియఁగలవు.

R No. **38**.

Paper. 11½ × 7⅜ inches. Foll 8. Lines, 35 in a page. Telugu. Good.
Presented by P. Laksmayya of Guntur in 1910-11.

సరసహృదయానురంజనము.

SARASAHRDAYĀNURAÑJANAMU.

This Prabandha seems to have been written in imitation of Vasucaritra and Manucaritra, and treats of a story which cannot be fully ascertained on account of the imperfect nature of the work. The author is Pāpayārādhya, a descendant of Vēmanārādhya. The work seems to be dedicated to Kuśa and Lava, the sons of Rāma. Begins in the course of the second Āśvāsa and breaks off in the third.

**Beginning:**

శా. కైదండంగొని యల్లనల్లన విరుల్ గాటంబుగా రాజన
ప్ప్రాఁదోటఁ గడిచల్వగొజ్జఁగులగుంపుల్ పేసరంబైనయ
కేరీదారంబులఁగొందిత్రోవనడుచక్రీఁగప్పగాఁ(ల్గి?)ప్పచుఁ
త్రోదుల్గట్టఁగ నందడుంగు (దునొక్కు?) లిడుచు బూఁబోఁడి
[మెల్మెల్లనఁ.

**Colophon:**

. . . . . . చంద్రాత్మజా

క. రంభోరూమదన జయా
రంభావహరాజనయవిరాజిత వాణీ
పుంభావ కీర్తిగుంభిత
కుంభీనసరాజధామ! కుశలవరామా!

* * * *

ఇది శ్రీమదుభయభాషారసజ్ఞ రసజ్ఞాగ్రగణ్యత్వాన్నాటకాలంకార గ్రంథాంధ్రప్రబంధబంధురకవితానిబంధన శ్రీమద్వేమనారాధ్యవంశ పయఃపారావారరాకాసుధాకర శ్రీ పాపయారాధ్యవిరచితంబగు సరసహృదయానురంజనంబను మహాప్రబంధంబునందు ద్వితీయాశ్వాసము.

**End:**

సీ. అంతఁ దహతహాశో బోటు లలమికొనుచు
నూరడించుచుఁ గేల్దమ్మియూ . . . ని
నిద్దపుం జెక్కుటద్దముల్ నిమిరి చాల
బుజ్జగించియుఁ దమిమించి . , . . క.

చ. తమతమనేర్పు తేర్పుటచి తామరరేకున రక్తిగూర్చి ఘుం
ఘుమఘుమవాసనల్ గురియు గొజ్జఁగినీటఁ గురంగనాభిచా
కర్ణముగ ఘటించి రంగుల నిగారములోఁ గొనగోట. .

(వి-వి.)—

అసమగ్రము. ద్వితీయాశ్వాసముకొంతనుండి తృతీయాశ్వాసమునఁ గొంతవఱకుఁ గలదు వ్రాఁత ముద్దుగూర్చుచున్నది. శైథిల్యము లేదు. గ్రంథపాతములు లేవు.

మనువసుచరిత్రములను బోలిన కల్పనముగల యీ ప్రబంధము వేమనారాధ్యవంశ్యుఁడగు పావయారాధ్యునిచే రచింపఁబడినట్లు గద్యమువలనఁ దెలియుచున్నది. రామచంద్రాత్మజుఁడగు కుశలవరామయ్య యేతత్కృతిభర్తయని యాశ్వాసాంతపద్యములఁబట్టి యెఱుఁగనయ్యెడిని.

---

## R. No. 39.

Palm-leaf $13\frac{3}{4} \times 1\frac{1}{2}$ inches. Foll. 75. Lines, 7 in a page. Telugu. Injured.

Presented by P. Lakṣmayyagāru of Guntur in 1910-11.

శ్రీపర్వతపురాణము.
ŚRĪPARVATAPURĀṆAMU.

This is a Telugu rendering in six Āśvāsas of the Sanskrit Śriśailakhaṇḍa which forms part of the Skāndapurāṇa: by Śēṣanārādhya. This work describes the sanctity of the Śrīśaila hill in the Kurnool district and of God Mallikārjuna in the shrine on the hill.

Complete.

**Beginning :**

మ. శ్రీమత్పర్వతరాజ్య(జ ?)రాజ్యపదవీసింహాసనస్థుం జగ
ద్గ్రామగ్రామణి మల్లికార్జున నపాంగవ్యాప్తలోకక్రియా
సామాన్యం దుహినాద్రిజాకుచతటీసంలిప్తపాటీర చం
ద్రామోదాంచితవామభాగు శివు నారాధింతు డెందమునన్.

*　　*　　*　　*

క. . . . . . . . . . . . .
. . శ్రీ తోంటవీరభద్రుం దలంతున్
శా. . . . . నాగులూరిపురవీరస్వామిం గీర్తించెదన్.

*　　*　　*　　*　　[మతో

శా. నావారుంగడుం జిన్నప్రాయమున "నోనామః"కులుం [ద్రే
"శివాయకరులు" జెప్పనంటగాలె? నే సేవింతునీయాన నా
భావంబందును నిన్నెయెన్నుదును విభ్రాజద్భవద్భక్తిస
ద్భావజ్ఞానసుధానుభావరతుఁగా భావింపు మల్లీశ్వరా!

*　　*　　*　　*

క. శివజన్ముఁడ శివగోత్రుఁడ
శివలింగధ్యానరతుఁడ శీలవ్రతుఁడన్
శివపూజాపరతంత్రుఁడ
శివయోగసుధానుభవుఁడ శేషాహ్వయుఁడన్.

మ. ప్రణుతశ్రీగిరినాథలబ్ధకవితాప్రజ్ఞాకళాఖిన్నుఁడన్
గణభృగ్గ్రంథమతప్రయోగవిలుఠద్గాథార్థసంవేత్తఁ ద
త్ఫణిభాష్యాయతఫక్కికాద్యర్థపదప్రౌఢి సమాధాకిత
ప్రణిపత్యస్ఫుటశబ్దశాస్త్రనివహప్రామాణ్యపారీణుఁడన్.

*　　*　　*　　*

క. భూమణిలీలల దేశవి
భాషలు తత్తత్ప్రదేశభాసురము లగున్
భూషించు వస్త్రమ ట్లను (సు ?)
భాషితమై సంస్కృతంబు బహుదేశములన్.

చ. జనని సమస్తభాషలకు సంస్కృతభాష ధరాతలంబునన్
ఘనలలితార్థగౌరవవిశాసి తెనుం గభిరామ మంతకున్
గనుఁగొనఁ జాతబీజమునకం తెను గోమలపత్త్రపుష్ప శో
భనమృదుపల్లవాభినవశాలరసాలము సొంపునింపదే.

ఉ. జల్లియు నక్రమ బు నపశబ్దము వైరిపదంబు సంధులున్
బొల్లును ద్రాభ కంటకము పూరకమున్ విరసంబు జోలి గా
నల్లిక లల్లుకబ్బములు నాదరణీయమె వాక్యచాతురీ
సల్లలితార్థదృష్టిగల సత్కృతి సేన్యత పొందుకైవడిన్.

శా. చేతశ్శుక్తికయందునిల్చి కళలం జేకూఱి శాస్త్రోదక
వ్రాతం బటుమూర్తి మౌక్తికములై వర్ధిల్లుచున్ సత్ప్రభ
ఖ్యాతోపేతగుణ పయుక్తిసదలంకారాంగహారాళిగా
రీతిన్ సత్కవికూర్పనేర్పును బుధశ్రేణీగళాగ్రంబునన్.

వ. అని యాంధ్రభాషానుబంధంబుగా నా యొనర్పంబూనిన పర్వతపురాణకథాధీశుండగు శ్రీమల్లేశు నభివర్ణించెద.

**End:**

స్ర. జంభద్వట్కుంభజాంభోజజముఖదివిజస్వాంతనాళీకసద్మా
శుంభత్కుంభీనసేంద్రస్ఫుటకటకరటచ్ఛోభమానాంఘ్రిపద్మా
గంభీరాంభోధికన్యాఘనకుచయుగళీకాంతిమద్బాణదేశా
స్తంభావష్టంభమోహోత్తరవిబుధమనస్తారకశ్రీగిరీశా ॥

**Colophon:**

ఇది శ్రీమల్లికార్జునకృపాలబ్ధమేదురాష్ట్రభాషావిశిష్టశివయోగవర్య శేషనాథార్యప్రణీతంబైన శ్రీపర్వతపురాణంబాద్యంతమునుసమాశ్వాసము.

ప్రతివిలేఖకుఁడు గ్రంథాంతమం దిట్లు వ్రాసికొనెను:—

"పార్థివనామ సంవత్సర అధికశ్రావణ శు ౭ ఆదివారము వఱకు యేలూరి పెదఅమరప్ప కుమారుఁడు వీరేశలింగముకు చదువుకునేటందుకు తాడేపల్లి బుచ్చన్న కుమారుడు పర్వతాలు ప్రతిలో ఉన్నక్రమాన వ్రాసియిచ్చిన శ్రీశైలఖండము సంపూర్ణము.

(వి-వి.) —

సమగ్రము. వ్రాంత చక్కగా నున్నది. తప్పులు లేకపో లేదు. శైథిల్యము కలదు. గ్రంథపాతములు కొన్ని మొదటి పత్రములఁ గలవు.

సంస్కృతము స్కాందపురాణమందలి శ్రీశైలఖండమునకు నిది తెలిఁగింపు. ఇందు కర్నూలు మండలమునఁగల శ్రీగిరియొక్కయు నందు వెలసిన మల్లికార్జున దేవునియొక్కయు మాహాత్మ్యము వర్ణింపఁబడినది. గ్రంథకర్త శేషనారాధ్యుఁడు. ఇయ్యది యాశ్వాసముల ప్రబంధముగా రచింపఁబడెను.

---

## R. No. 40.

**Palm-leaf.** 16⅜ × 1⅜ inches. Foll. 52. Lines, 6 in a page. **Telugu.** **Very** much injured.

Presented by B. Lakṣmīkāntamgāru of Guntur in 1910–11.

శ్రీరంగమాహాత్మ్యము.

ŚRĪRAṄGAMĀHĀTMYAMU.

This is the Telugu version of the Sanskrit work of this name forming part of the Brahmāṇḍapurāṇa. It describes the religious importance of the shrine of Śrīrangam in the Trichinopoly district. This MS. contains two Āśvāsas, it is not known how many more there are in it. The author is Bhāgavatula Rāmaya, son of Buccanārya of Śāṇḍilyagōtra. The work is dedicated to Nallapāti Ramanapradhāna.

**Beginning:**

చ. జనలోకాధిప! మమ్ముఁగాంచి యట యుష్మద్వంశకూటస్థుఁడై
న నళినాప్తుఁడు మానులార! వినుఁడీ నాళీకగర్భాలయం
బున కేనాకఁ దినంబునం దజిగి సంపూర్ణేందుబింబోపమా
నను శ్రీరంగనిఁ బూజచేసి పరమానందంబు సంధిల్లఁగన్.

*　　　*　　　*　　　*

. . . . . శాశ్వతైశ్వర్య సంపూర్ణగేహుండును, గౌతమగోత్రపవిత్రుండును నత్యంతపుణ్యచారిత్రుండును, శ్రీ నల్ల

పాటి వంశవయఃపారావారరాకాచంద్రుండును, నగు రమణప్ర
భాను . . . . . . . మంతమంత్రి ప్రధాన హితపు
రోహితవిద్వత్కవిబ్రాతబంధుభృత్యపరివారపరివృతుండై సభాభవ
నంబునందు సముచితాసనంబునం గూర్చుండి సాహిత్యగోష్ఠీగరిష్ఠుం
డగుచు . . . . . . . కటాక్షవీక్షణంబుననన్ను ని
రీక్షించి యిట్లనియె.

చ. అవనిఁదనర్చుసంతతులయందు బుధుల్ కృతి నెక్కుడంద్రు రం
గవిభుచరిత్ర మీవు కృతిగా నిడి నన్నలరింపుమయ్య భా
గవత . . . . . . . బుచ్చనాహ్వయా
ర్యవరతనూభవాగ్రభవ రామకవీ పరిభూతకాకవీ!

**End :**

క. అన విని కలహాశనముని
మనమున రాగిల్లి చంద్రమఃఖండధరుఁ
గని తదనంతరచరితము
వినిపింపవె వీను లలర వినియెద . . .

క. శిష్టజనప్రతిపాలన
దుష్టవిరోధిప్రభాగ్నితోయద కవిరా
డిష్టద కీర్తిస్థగితది
గష్టక సంస్పష్టవాగ్విహార సుధీరా!

తూణకము. నిత్యసత్యభావసన్మనీషిశేఖరాన్నయా
మాత్య . . . . ర్తిమౌక్తిక ప్రభాకరా
పత్యకల్పదాతృతాఢ్యభవ్యరూపధిక్కృతా
దిత్యరాట్సుతాంగజాత ధీరతాజితాచలా!

**Colophon :**

ఇది శ్రీమద్రామచంద్ర వరప్రసాదలబ్ధకవితావిచిత్ర శాండిల్య
గోత్రపవిత్ర శ్రీమద్భాగవతుల సుధాసాగర కుముదమిత్ర బుచ్చన్నా

ర్యపుత్ర గురుజనవిధేయ రామయనామధేయ విరచితంబైన శ్రీరంగమాహాత్మ్యంబను మహాప్రబంధంబు ద్వితీయాశ్వాసము.

(వి-వి.)—

అసమగ్రము. ఆద్యంతములు లేవు. పత్రములపై సంఖ్య లేదు. అన్నియు మిక్కిలి తారుమారయినవి. రెం డాశ్వాసములగద్యములు కాన్పట్టుచున్నవి.

బ్రహ్మాండపురాణమందలి శ్రీరంగమాహాత్మ్యమను సంస్కృత గ్రంథమున కిది తెలుఁగుసేఁత. నల్లపాటి రమణప్రధానునకుఁ గృతిగా భాగవతుల రామకవిచే రచింపఁబడినది. గ్రంథ మెన్ని యాశ్వాసములుగలదో యీ ప్రతినిబట్టి గుర్తింపరాదు.

R. No. **41**.

**Paper.** 13¾ × 8½ inches. Foll. 202. Lines, 20 in a page. Telugu. Good.

Restored from a MS. of the Library in 1910—11.

(*a*) అచలాత్మజాపరిణయము.

ACALĀTMAJĀPARINAYAMU

Foll. 1*a*—31*a*.

This is a Prabandha describing the marriage of Sītā with Rāma; and by means of a pun on the words carried throughout the poem, it describes also the marriage of Pārvatī with Śiva. This MS contains only three Āśvāsas. By Vēnkaṭācārya, son of Aṇṇayācārya, grandson of Tirumala Bukkapatnam Śrīnivāsa Tātācārya, and nephew and disciple of Śrīnivāsācārya.

**Beginning:**

చ. అట చని కాంచె నంబరసదంబుధిశ్రీఁ బరజాలబింబదు
త్కటనవరత్నగోపురముఖప్రతిలంభకచర్మకుంభికా
పటలవిలోకనాకలితభర్గ సరోజకులభ్రమభ్రమ
త్కుటిలసవిభ్రమభ్రమరకూటము నిందిరదివ్యవాటమున్.

**End :**

శా. శంభు త్ర్యక్రియఁ బద్మబాంధవమహాచూడామణీ మోహనో
త్తంభ ద్రోషయుత ప్రదోషమిషనక్తంచారిసంచూర్ణనా
రంభ భక్త్యదహార్న్యపాలతనునిర్యద్రక్తశైవాలినీ
సంభారంబన సంజకెంజిగిరిభాసం బొప్పఁ బ్రత్యగ్గిరిన్.

క. శరణాగతజనభరణా
భరణాయితలసదపాంగపలితంకరణా
కరణాతిగ (సంచరణా?)
చరణాంభఃకలితగర్భజడిమవిశరణా.

**Colophon :**

ఇది సర్వతంత్రస్వతంత్ర సకలభాషావిశేషకవితాధురంధర ప్రతిదినప్రబంధపరమేశ్వర, శ్లేషయమకచక్రవర్తిబిరుదాంక, తిరుమల బుక్కపట్టణ శ్రీనివాస తాతాచార్య తనయ శ్రీమదణ్ణయాచార్య దీక్షితసుత పితృవ్య శ్రీనివాసాచార్య కృపాకటాక్షలబ్ధ సకల పాండిత్య, తర్కాలంకార వాగీశ్వర బిరుదాంక వేంకటాచార్య ప్రణీతంబైన యచలాత్మజాపరిణయంబను శ్లేషప్రబంధంబునందుఁ దృతీయాశ్వాసము.

(బి-బి.) —

అసమగ్రము. మూఁడాశ్వాసములు మాత్రమే కలవు. వ్రాఁత బాగున్నది. తప్పులు మెండు. ఈ పుస్తకశాలలోనిదే యగు లిఖితతాళపత్త్రప్రతినిబట్టి వ్రాయఁబడినది. అందలి గ్రంథపాతము దీనియందును గలదు.

ఇది ద్వ్యర్థికావ్యము. సీతా పార్వతుల పరిణయవృత్తాంతము లిందు శ్లేషతో నేకముఖమున వర్ణింపఁబడినవి. గ్రంథకర్త యగు వేంకటాచార్యుఁడు, తర్కాలంకారవాగీశ్వరబిరుదాంకుఁడు. ఇతఁడు శ్లేషయమకచక్రవర్తితిరుమలబుక్కపట్టణ శ్రీనివాసతాతాచార్యపౌత్త్రుఁడును, అణ్ణయాచార్యదీక్షితపుత్త్రుఁడును

త్తు గిఁడును, శ్రీనివాసాచార్యుఁ డనుపితృవ్యునియొద్ద సకలపాండిత్యము నలవఱచుకొన్నవాఁడును.

---

(b) సేతుఖండము.

SĒTUKHAṆDAMU.

Foll. 33a—62a.

This is a Telugu version of the Sanskrit Sētukhaṇḍa of the Skāndapurāṇa. It treats of the sacredness of the temples and waters of Rāmēśvaram. The work here breaks off in the first Āśvāsa. The author of the work is Pāpanāmātya. He is said to have composed this work at the instigation of God Gōpālasvāmi of Śākanagara (Kōrapādu ?), whose shrine was repaired and then consecrated by means of a purificatory ceremony at the instance of the author.

**Beginning:**

క. శ్రీవాగార్యారమణుల
శ్రీవాగార్యారమణులఁ జేతఃప్రీతిన్
శ్రీవాగార్యత్వఁబులు
మావసతుల నిల్పుకొఱకు మఱి వినుతింతున్.

సీ. మూర్తియై చెలు వందె ముఖ్యపేశలకబ్బ
శాసనుండగు నన్నసత్కవీంద్రు-
డనువుగా విలసిల్లె నఃసోమయాజియుఁ
బటుతరావయవాళి భాస్కరుండు
వాసఁగఁ గట్టినయట్టి పుట్టంబు పోతన
పింగళిసూరన గంగుఫ్రాఁత
అలసాని పెద్దన విలసదాత్మస్థితి
శృంగారములఁ బ్రోవు వెంగళప్ప
గీ. జగతిఁ గవితామతల్లికిఁ (జాగ్రవద ?)
కనుచు గొనియాడు నట్టియాయాంధ్రకవుల
నభినుతించెదఁ దత్ప్రసాదాతిశయము
తోడుగాపుత మత్కవితోక్తి కనుచు.

వ. మద్వంశావతారం బభివర్ణించెద.

* * * *

చ. హారితసగోత్రజాతుఁడయి యంచితదానవినోదశీలియై
కరిమను వర్తులోపలనగర్యధినాథుఁడనంగ శాయి మం
త్రి రసికుఁడం చనం జెలఁగె దీపితరాజసభాంప్రసిద్ధుఁడై
చిరతరకీర్తిశాలియయి చింతితయాచకకామితార్థియై.

* * * *

వ. ఆమంత్రివరుండు,

సీ. లక్ష్మమాంబయందు లక్షణయుక్తునిఁ
బుత్త్రిఁ గాంచెఁ జారుపుణ్యఘనుని
శాయిమంత్రివరుఁడు శాశ్వతవృద్ధిగా
వంశవల్లభుండు వాగ్వరుండు.

గీ. రామచంద్రుఁ డనెడి రాజితనామము
గల్గి తనయుఁ డొప్ప గౌరవమున
సకలసూరివర్గసంరక్షకుండయి
భాగ్యమహిమఁ గాంచెఁ బ్రభుత నెలమి.

శా. దమ్మాయమ్మను బెండ్లియాడె నెలమిన్ ధర్మాత్ముఁడై రాజరా
రమ్మాయంచన రామచంద్రుఁడు భువిన్ రాజిల్లి విఖ్యాతిచే
దమ్మాయమ్మయెడం గుమారుఁగనె సద్ధర్మున్ దయాశీలునిన్
నెమ్మిన్ యాచకకోటికిచ్చుఘనునిన్ నిర్వైరతామానసున్.

క. వేంకటకృష్ణుం డనియెడు
పంకజశరజనకపాద భక్తుఁడు పుట్టెన్
సంకటము లెల్లమాన్పుచు
నంకుశమై వైరిమంత్రు లనుగజములకున్.

* * * *

వ. అప్పురుషుండు,

సీ. సాధ్విలక్ష్మమయందున సమ్మదమునఁ
బుత్త్రినుఁగాంచె మంత్రిరాట్పూజితుఁడన
పేరుపాపయయని పిల్వఁ బ్రీతినన్ను
విదితమై సర్వజను లట్ల పిలుతు రవని.

వ. మజ్జనని సద్గుణం బభివర్ణించెద,

క. ఆసతిపుట్టినయింటను
వాసోధనధాన్య ధేనువర్గము లెల్లన్
భూసురుల కొసఁగి దానా
భ్యాసకుశలయ(మ?)య్యె హస్త పద్మము మెఱయన్.

వ. వెండియు నుతించెద,

శా. ఆసాధ్వీమణిలచ్చమాంబవసుపేట్యావాసగౌరీప్రసా
దాసంపాదితభోగభాగ్యయగుచున్ దానంబు లుర్వీసుర
స్త్రీసంఘంబులకిచ్చు నెచ్చపడ నాశ్రీలక్ష్మినా విశ్రుతిన్
వాసఃకాంచనధేనుధాన్యసమితిన్ వంచింప కెల్లప్పుడున్

వ. నేను మజ్జననీజనకలాలన ప్రవర్ధమానుండనై కాంతావా
గిందిరావామకన్యను పాణిగ్రహణంబు చేసి సంతతివడసి వ్యవహార
దశను శాకనగరంబునకు నధికారంబు సేయుచుండితి. . . .

. . . . . . . . . . . . . . . . .

ఇట్టి ప్రీతిగల శాకనగరంబు నధికారంబు సేయుచుండి, తన్న
గరంబున గోపాలస్థలంబుండి శిథిలంబైయున్నఁ బునరాలయంబుఁ
గల్పించి సాధారణనామ సంవత్సర జ్యేష్ఠశుద్ధపూర్ణిమా పర్వం
బున శ్రీగోపాలస్వామి సంప్రోక్షణంబు గావించి, ద్విజ సంతర్పణం
బాచరించి (తీర్థవారి నాటిరాత్రియం?) ద త్సవంబు చేసినఁ దద్రాత్రి
సుఖసుప్తుండనగు నాస్వప్నంబున శ్రీగోపాలస్వామి సాక్షాత్కా
రంబుగా దర్శనంబుఁ బ్రసాదించె.

**End:**

శౌనకాదిమునులార! సర్వతీర్థంబున (కు?) భేతాళవరదాభిధం
బు వచ్చినచొప్పు నెఱింగించితి నీయధ్యాయం బెవ్వ రేని పఠించిన వినిన
సర్వపాపవిముక్త లగుదురు.

ఓమిత్యాది మహాపురాణే స్కాందే సేతుఖండే భేతాళ వరద తీర్థప్రశంసాయాం సుదర్శన సుకర్ణ శాపమోక్షణం నామ నవమో ధ్యాయః.

(బి-బి.) —

ఆసమగ్రము మొదటి యాశ్వాసమే తుదముట్ట లేదు. ఇది యీపుస్తకశాలలోనే యున్న ప్రాంత తాళపత్ర పుస్తకమునందలి కొన్ని మొదటి పత్రములకుఁ బ్రతిక, అది సమగ్రముగనే కలదు. ఇందలి వ్రాఁత బాగుండలేదు. తప్పులు మెండుగాఁ బడినవి. గ్రంథపాతములు లేవు.

ఇది స్కాందపురాణమందలి సేతుఖండమునకుఁ బాపనామాత్యునిచేఁ జేయఁబడిన తెలుఁగు సేఁత. ఈపాపనామాత్యుఁడు శాకనగరమున నుద్యోగియఁట! మఱియు నా శాకనగరమున శిథిలమగు గోపాలస్వామి యాలయము నీతఁడు పునరుద్ధరణముచేసి సాధారణనామ సంవత్సర జ్యేష్ఠశుద్ధ పూర్ణిమనాఁడు సంప్రోక్షణము చేసెనఁట! నాఁటిరాత్రి స్వప్నమున నాదేవునిచే నాజ్ఞాపింపఁబడి యీ గ్రంథమును రచించెనఁట! ఆశాకనగరమేదో విచారింపవలసియున్నది. ఈగ్రంథ మాగోపాలస్వామికే సమర్పింపఁబడెను. గ్రంథకర్తనుగూర్చి విశేషములు పై నుదాహరింపఁబడిన పద్యములఁ బట్టి తెలిసికొననగును.

---

(c) చంద్రికాపరిణయవ్యాఖ్య.

CANDRIKĀPARIṆAYAVYĀKHYA.

Foll. 64a-174a.

Restored in 1908-09 from a MS. of the Library.

---

(d) మధురవాణీవిలాసము.

MADHURAVĀṆĪVILĀSAMU.

Foll. 175a-202b.

This is a poem on the story of the marriage of Madhuravāni, daughter of Vikrama Śāli of Vardhamānapura and king of Pāñcāla

with **Kārtavīryārjuna**, one of the six great emperors of olden times. The au-thor of the work is Cintalapalli Vīrarāghava, son of **Vēṅkatārya** and **grandson** of Vīrarāghava of Vāsisthagōtra and **Āśvalāyana Sūtra**. The author belongs to a family of pandits. The extracts and the Telugu description given below contain further information about the author and his family. This MS. contains only the first Āśvāsa

**Beginning**:

ఉ. శ్రీకళ్యాణిసురత్నభూమలుతనుం జేర్పం దదాకారితా
నేకశ్రీలవరించు భ్రాంతికయిలన్నిగోరుభావంబు? దా
నాకాంక్షించినిరంతరాయముగఁదత్ప్రాణేశవక్షస్స్థలిన్
జేకోనానలమేల్మంగన్ గొలిచెదన్ శ్రీవేంకటాద్రిప్రభున్.

* * * *

శా. సాహిత్యంబుఁగవిత్వమున్ వివిధశాస్త్రప్రజ్ఞసత్కర్తృతా
సా (సౌ?) హిత్యంబును, దత్త్వబోధమును బ్రిసబంధాత్మక
[జ్యోతిషం
బూహాచాతురి దేవభక్తియును, నీకొప్పున్ స్వభావంబులై
యాహా! చింతలపల్లిరాఘవకవీ! యాధ్యుండవీ వన్నిటన్.

మ. అవధానంబు లనేకముల్ నెఱపి రాజాస్థానముల్ చేరి వా
దవిధిన్ ధీరుఁడవై చతుర్విధకవిత్వప్రౌఢిమల్ చూపి భూ
ధవదత్తద్విప ఘోటకాదిబహుసత్కారంబులైకొన్న మి
న్నవునీకబ్రమె వేంకటేశ్వరుఁడుస్వప్నంబుంబ్రసాదించుటల్.

వ. . . . అని . . . . . మదీయవంశానుచరితంబు వర్ణింపఁ దలంచి యిట్లనిరి.

గీ. ఆవసిష్ఠుకులము నభివృద్ధిశక్తి ప
రాశరాదిమునిపరంపరాప్తిఁ
జెంది (జేసి?) విస్తరిల్లెఁ జింతలపల్లివా
రనఁ బ్రసిద్ధమై తదన్వయంబు.

వ. అందు సత్పవిత్రచరిత్రప్రభావభాసమానుండు,

గీ. ఎల్లకవి యనంగ నుల్లసిల్లుఁ బ్రపంచ
మెల్లఁ దెలియఁ దనకె యెల్లయాఖ్య
కలితమహిమ సురాజుఁగని మెప్పుగనె నగ్ర
హారనిత్యవర్తనాదిధనము.

సీ. పధన్యవాగితత్త్వబోధాప్తి కలపుష్ప
గిరిదుర్గతోడైన వరము సాక్షి
పవాగ్మిసుకుమారతావృత్తికిని బినా
కినిచెంత సేవింపుచునికి సాక్షి
పమాన్యనైశ్వర్యసామాన్యతకు రాజ
కృతిశిరోభూషణ కృతి(యు?) సాక్షి
పగ్రంథకారువంశాగ్రియతకు ఘన
ప్రభుమానితంబైన బ్రతుకు సాక్షి

గీ. అట్టిఘనుఁ డేకులంబునఁ బుట్టి (ట్టు?) వారి
కలిమి కవితయకా నగ మడిగికొనియె
నట్టిచింతలపల్లివంశాగ్రయాయి
పల్లకిపదస్థుఁడై మించు నెల్లసుకవి.

క. ఆయెల్లకృతికి వాగ్వని
తాయత్నవిభూషణాయితాతిమధురిమ
స్వాయల్లాలితకవితా
స్వాయత్తులుగల్గి రిరువు రాత్మజు లెలమిన్.

క. ఆయగ్రజుండు జోగయ
వైయాకరణులకు నవ్యవరరుచియనఁబోల్
నైయాయికులకు గౌతముఁ
డైయలరున్ వేంకటార్యుఁడతని యనుజుఁడై.

క. ఆజోగగ్రామణికిఁ ద
నూజాగ్రణి కొండయజ్వ నుతి కెక్కెను వి
భ్రాజిసకలాగమపారీణతుఁ
డీజగతిన్ బరవసంబు లితనివె యనఁగన్.

గీ. అతనివలననుదయమై యొప్పు వేంకట
జోగినాఁగఁ దత్త్వయోగనిష్ఠుఁ
డాతఁ డాగమముల నావ్యాసుఁ డనఁ బొల్చి
యువిద నెల్లమాంబ నుద్వహించె.

క. అతఁడల్లమాంబవల్లను

. . . . మూర్తిఁగనియె సురుచిరకరుణన్.

* * * *

క. ఆమూర్తిజ్యోతిషికుఁడు
రామాంబికయందు వీరరాఘవు గోపా
లామితమతిఁ గనెనర్ణవుఁ
డోమికశశికౌస్తుభముల నొదవించుగతిన్.

వ. అందగ్రజుండగు మహానుభావచరిత్రుండు,

సీ. ఎవఁడు వేదపరీక్ష లిచ్చి మట్లయనంత
రాజు చేఁ గొనియెఁ జక్రములువేయు
? నెవనికవిత్వంబు వివరించి పూలరం
గపతిరా(జని ?) చ్చెఁ గ్రామపతిగాఁగ
నెవ్వఁడు రాణువనేలి సైకొనె రాజు
వారి చెంగట దళవాయితనము
నెవ్వఁడు బహుకాల మేలె నెన్నని గ్రా
మంబులు రాణువసంబడముగ

గీ. నట్టిసకలగుణోదీర్ణుఁ డభినుతింపఁ
దగఁడె వీర్యాటవీనాథతతకటాక్ష
లబ్ధనైజప్రభావైకలాఘవుండు
రాఘవవిధేయుఁడగు వీరరాఘవుండు.

క. అతఁడు పరిణయమయ్యెన్
నాతిన్ మొదలచ్చమాంబ, నరసాంబ నటన్

శ్రీతరుణీ - భూతరుణీ
జేతో జగురుండు శౌరి చేకొనుమాడ్కిన్

* * * *

క. అన్నగసమాంబయందుఁ బ్ర
సన్నత సుతు లార్వు రొకరు సత్పుత్రి నతం
డున్నతిఁ గనె . . .

సీ. సకలేతిహాసవిశాలుఁడు గోపాలుఁ
డధ్యాత్మధీరంహుఁ డచ్యుతాహ్వుఁ
డతులితనైగమస్థితి మిన్నరామన్న
వృతసాహితీభద్రి వేఁకటాద్రి
అవధానధూర్వహుం డయ్యపకొండయ్య
యతిసుశీలవిడంబ యకరమాంబ
ఆగమానుష్ఠాన మందు యోగానందు
లందఱు సంప్రదాయముగఁ గవులు

* * * *

వ. అందగ్రజుండు సమస్తగుణాలంకారుఁ డతండు,

మ. విలసత్పాండితిఁ గల్పనాగతి జగద్విఖ్యాతుఁడై జాములో
పల నార్యాశతకంబు వజ్రగిరి గోపాలాంకితంబూహచే
నెలమిం (సిలలిఁ?)దివ్యసుమాంబరాభరణముల్ శ్రీమించఁ
[జేకొన్న యో
గ్యులమేటిన్ గవిరాజు నెన్నఁదరమే గోపాలవిద్వన్మణిన్.

మ. రహినాధీరుఁడు వేంగళాంబికను నారాయణ్యుపాఖ్యను
ద్వహమై రెండవపత్నియందుఁ గనియెం దా శేషశాయిన్
[మహా
మహుభాయాపతిముఖ్యానందు నిజనామప్రీత శేషాంబ ను
ద్వహమై యగ్రజుఁ డొప్పెనయ్యనుజుఁడుద్యద్వ (ద్వై?)
[ద్యవిద్యాఢ్యుఁడై.

చ. మృదుసంగీతకవిత్వ తత్త్వముల కల్మి న్మేటియై రాఘవా
భ్యుదయంబన్ కృతి శౌరి కర్పితముగా నూహించి (?) రా
భ్య(ఖ్య?)దయాలబ్ధదుకూలహేమమణిభూషావస్తువాహాది సం
పదలక్ష్మీపతియయ్యె నెన్నఁ డరమే ప్రౌఢోక్తి ఛాయాపతిన్.

వ. అందు ద్వితీయగర్భనిర్భవుండైన యచ్యుతాహ్వయుండు,

క. ఆగోపాలుని యనుజుఁడు
ధీ గోపాలుఁడు వినీతి ధిజ్ఞుఁడు మిగులన్
రాగ మనుకూలమైతగ
రాగమను వివాహమయ్యె రసికులు మెచ్చన్.

శా. బ్రాహ్మణోక్తసమస్తవైదికవిధిప్రావీణ్యుఁడై నిత్యమున్
బ్రహ్మజ్ఞానముఁ జెంది యాగమగి(శి?)రఃపద్యోక్తసాత్త్వాదహం
బ్రహ్మాత్మాదికవాక్యబోధనకళాపారీణుఁడై యంతటన్
బ్రహ్మాత్మాశ్రమనిష్ఠ నచ్యుతుఁడు సద్బ్రహ్మైక్యతన్ వర్తిలెన్.

వ. తత్తృతీయగర్భసంభవుండు,

క. రామన్న సత్య కీర్తులు
రామన్న వివేకశాలి రాజిల్లును మే
ల్రా మన్నన గనితనసరి
రా మన్న బుధాళిఁ బ్రోచి రసికోత్తముఁడై.

వ. తచ్చతుర్థపంచమసంభూతులగు నయ్యప్ప, కొండయ్య ప్రవీ
ణులు ప్రతాప విద్యానిధులై విలసిల్లిరి.

మ. చతురుండై యవధానముల్ సలిపి దేశాయీలు మెచ్చన్ మహో
న్నతుఁ డయ్యప్ప కవీశ్వరుండు గిరియన్నారీవతంసంబునన్
దతివిద్యానిధి సాహితీనిపుణు రాజాస్థానసంపూజ్యు నం
చితవాగ్ధాటిఁ బ్రబంధకర్తఁ గవిసంజీవాఖ్యుఁ బుత్త్రుం గనెన్.

శా. శ్రీఖ్యాతుల్ కన బోలు మేలుకవిసంజీవుండు చంద్రాంగదో
పాఖ్యాన ప్రముఖ ప్రబంధములు భూపాలాంకితంబుల్ జగ

ద్వ్యాఖ్యాతంబుగఁ జేసి చెంద శిబికాదిత్య (వ్యాం?)గ్రైకావళీ
ముఖ్యాలంకరణాదు లెన్నఁ దరమే ! భూమిన్ దదీయప్రభల్.

వ. అందఱ కవరజనునుండయ్యు వరజనునుండగు యోగానంద
ఘనుండు.

సీ.

నిశ్చయార్థదమంత్ర పునశ్చరణలు
చేసి నిగమాగమప్రౌఢి వాసికెక్కి
స్మృతిపురాణేతిహాసవిజ్ఞత బ్రసిద్ధిఁ
బొంది వెలసె యోగానందబుధవరుండు.

శా. యోగానందుఁడు వెంగళాంబ మితసాధూక్తి న్వివాహించి త
ద్యోగాప్తింగనెఁ జెన్నయార్యునరసింహున్ రాఘవాఖ్యున్ మహా
భాగు న్విశ్వపతిం దనూజులఁ గళాభావజ్ఞులన్సంహితా
యాగప్రాజ్ఞుల నౌచితీజ్ఞులఁ గవిత్వాభిజ్ఞుల న్సల్వురన్.

వ ఇట్లుత్తరోత్తరాభివర్ధితంబైన తదర్భ(క)షట్కంబునకుమధ్య
క(గ?)తంబై ఋషిసప్తకంబునందుఁ గౌశికులీల ........ తురీయ
గర్భప్రాదుర్భవుండై భద్రవిద్వన్ముద్రనిర్నిద్రసురాద్రియగు వేంకటా
ద్రి మహాభాగధేయుండు.

సీ.

డగుననఁగ సర్వతంత్ర స్వతంత్రుఁ డగుచు
వెలసె సత్యప్రవర్తనుల్ వినుతిసేయ
సకల భూపాల సంస్థాన శంసనీయుఁ
డమితరుచిరవి శ్రీవేంకటాద్రిసుకవి.

. . . . కాశ్యపగోత్రోద్భవులై . . . .

క. చిరివెల్లివంశ్యులనఁ బొ
ల్చిరివేల్లితదోమ(?) వెల్లసింహాప్రముఖుల్

మఱి వెల్లివిరిసి శేషా
ధ్వరియెల్లయసంగమకును దనయుండగుచున్.

ఉ. ఆచిరివెల్లి శేషవిబుధా(గ్ర)ణికిం దగుశాయమాంబకున్
ధీచణులైన వేంకటపతి ప్రభుఁడెల్లయ దూరయాఖ్యులై
తోఁచిరి నల్వురాత్మజులు తోఁచిరి మువ్వురు కూఁతులందు స్వ
ర్ణైచికి చర్య లక్ష్మమ ఘనంబుగలక్ష్మినె పోలె నెన్నికన్.

*　*　*　*

క. ఆ లక్ష్మమాంబయందు ద
యాలక్ష్మిప్రియుఁడు వేంకటార్యుఁడు గనియెన్
బాలామణి నరసమను గు
ణాలంబను వీరరాఘవాఖ్యుని నిన్నుణ్.

సీ. జాములో శతకంబు సంధించి కంకణా
దులుగొంటి వలరాయదుర్గమునను
బహుళావధానముల్ పఱపి నాలుగునగల్
తేజి నందితి మల్ల ధీరువల్ల
వాగ్ధాటి సంప్రీతదిగ్ధరాధిపదత్త
వస్తువాహనముల వార్తగంటి
(కూపవాపీతటాకో?) పవను ల్సేసి
స్థిరకీర్తిఁజెందితి పురుతరముగ

గీ. సకలభూపాల సంస్థాన శంసనీయ
నిజచతుర్విధకవితాభి నేయపాండి
తీసమాశ్లోకనాపూర్ణ దిక్ప్రదేశ
వీరరాఘవ ! నీసరివిప్రు లేరి.

*　*　*　*

శా. శాండిల్యోజ్జ్వలగోత్రజుండు మిగులన్ శాంతుండు సంగాపురీ
కొండుశ్రౌతులు పుత్రికావ్హకమునాకొంర్చినప్పు మం(తు?)గాం

[చిమే

ల్నిండన్ రామపయందువారియెడనెం తేఁదల్లికిం బ్రేమయం
దుండుద్దానిసరస్వతీసతినినిందు ద్వావాహామై కూర్మిమై (?)

చ. పటుతరభక్తి శేషగిరిభర్తవరంబు ప్రతిజ్ఞఁ జెంది వేం
కటరమణాదిపుత్రులను గాంచితి వేంకటశౌరివట్టివై
స్ఫుటమతి వేంకటప్రభునిఁ బుత్రునిగాఁ గయికొన్ననీయశః
పటిమ శివుండెఱుంగఁదగు బ్రహ్మవుగావె సరస్వతీపతీ.

చ. మునుపోకదర్శనంబునసమ చి(మూర్జి?)త సంతతినిచ్చెనట్టివా
చనువున నీసుదర్శనము సంతతినియ్యనె కాదయమ్మహా
ఘనుఁడు ప్రసన్నుఁడయ్యె నటుగావున సంశయమేల నీమనం
బనువుగఁ జేసి చేయు మొకయత్రితిమ ప్రతిభ ప్రబంధమున్.

* * * *

ఆ. తన సుదర్శనమునఁ దత్కథానాయకుం
డొనరుననుచు శౌరియనుట నిక్క
మాసుదర్శనాంశుఁడగు నర్జునాహ్వుఁ బ్ర
శంసచేయు మదియె సముచితంబు.

సీ.

పఘునుని సంస్మరణమయ్యామోఘచర్య
కార్తవీర్యార్జునుని చక్రవర్తివర్య
చరితకృతిసేయు మది నీవుచదువువారి
కెల్లనభిమతసిద్ధిదమై యెసఁగఁ గలదు.

* *

వ. అనియిట్లు తెలిపిన నేనును
మానసుండనై.

క. శ్రీమదలమేలుమంగా
భామాకుచకలశలిఖితభాస్వత్కస్తూ
రీమకరీరేఖామిళి
తామలవక్షునకు వేంకటాధ్యక్షునకున్

**End:**

సింధురనాయక! జీవనదాయక! శ్రీకరసాయక! శేషకుభృ
తకంధరచారణ! కంధివిహారణ! కంసవిదారణ! కమనిశా
బంధువిరోచన బంధురలోచన! బాధవిమోచన! భవ్యదయా
గంధిలవీక్షణ! గర్వితశిక్షణ! కల్మషమోక్షణకారి హరీ.

**Colophon:**

ఇది శ్రీమద్వేంకటేశ్వర వరప్రసాదపాత్రచరిత్రాశ్వలాయన సూత్రపవిత్రవీరరాఘవ పౌత్త్రి, వేంకటార్యపుత్త్రి చిత్రవిచిత్ర కవితాభినీతనానావి(ధావ)ధానలాఘవ శ్రీచింతలపల్లి వీరరాఘవ కవిప్రణీతంబైన మధురవాణీ విలాసంబను మహాప్రబంధంబునందుఁ బ్రథమాశ్వాసము.

(వి. వి.)—

అసమగ్రము ప్రథమాశ్వాసము మాత్రమే కలదు. ఏతత్పు స్తకశాలలోనే యయిదాశ్వాసము (అసమగ్రము)ల గ్రంథభాగము గల శిథిలతాళపత్త్రసంపుటము కలదు. దానిని జూచియే యిది వ్రాయఁబడినది. దీని వ్రాఁత బాగున్నదికాని తప్పులెక్కువ; అం దలి గ్రంథపాఠాలు దీందును జేరినవి.

పాంచాలదేశాధీశ్వరుఁడును, వర్ధమానపురవాస్తవ్యుఁడును, నగు విక్ర(మ?)శాలికిఁ గూఁతురయిన మధురవాణిని ఆఱవచక్రవర్తియగు కార్తవీర్యార్జునుఁడు వివాహమాడు కథను బ్రబంధముగా వసిష్ఠగో త్రుఁడగు చింతలపల్లి వీరరాఘవ కవి రచించెను. వేంకటేశ్వరాం కితము. ఆశ్వాసము లెన్నో తెలియదు. గ్రంథకర్తవంశము పండిత వంశము. ఈతనివంశమునపూర్వులనేకులు గ్రంథకర్తలై మట్లయ నంతభూపాలాదులచే సత్కరింపఁబడినట్లు పేర్కొనఁబడిరి. కాని యిందుఁగొందఱి గ్రంథములు మాత్రమే పేర్కొన బడినవి.

| | కవినామము. | కావ్యనామము. |
|---|---|---|
| 1 | గోపాలకవి .. | ...ఆర్యాశతకము. |
| 2. | ఛాయాపతి ... | ...రాఘవాభ్యుదయము. |
| 3. | సంజీవికవి ... | చంద్రాంగదోపాఖ్యానము. |

ఈ వీరరాఘవకవి, రాయమర్గమున జాములో శతకముఁ గూర్చి కంకణాదులఁగొనెనఁట ! అనేకావధానములుచేసి మల్లధీరునివలన నాల్గునగలను నశ్వమును నందెనఁట ! ఈతనిఁగూర్చియు నీత నిపూర్వులనుగూర్చియు విశేషములు పైనుదాహరింపఁబడిన పద్యములవలన నెఱుఁగునది.

R. No. 42.

Paper. 8½ × 6¾ inches. Foll. 69. Lines, 12 in a page. Telugu. Good.

Restored from a MS. of the Library in 1910–11.

ధర్మఖండము.

DHARMAKHANDAMU.

This is a Telugu version of the Sanskrit Dharmakhaṇḍa of Skāndapurāṇa. It treats of the religious importance of repeating the name of Rāma. The author is Īdulapalli Bhavānīśaṅkara, son of Śaṅkarāmātya and grandson of Narasāmātya of Bhāradvāja-gōtra and Āpastambasūtra. The author is said to be the disciple of Diṭṭakavi Vēṅkaṭarāya and a friend of Vakkalaṅka Vīrabhadra, and to have composed Śṛṅgāramañjari (?).

This MS. contains only the first Āśvāsa.

**Beginning:**

ఉ. శ్రీనగకన్య ముత్యములచేఁ దలఁబ్రా లిడువేళ శీఘ్రగం
గానదిఁ జింమబిందువులక్రందున సర్వసుపర్వకోటి ను
ర్వీనుతవైభవ బునఁ బవిత్రితగాత్రులఁజేయుశంభుఁ డా
శ్రీనగరాజమందిరుఁ డశేషశుభంబుల మాకు నీవుతన్.

* * * *

ఉ. శ్రీమయవాగ్విలాసుఁడు నశేషలిపిప్రవణుండు భూరిశో
భామహనీయమూర్తియుఁ బ్రబంధనిబంధనబంధురక్రియా
భామహతుల్యసూత్రుఁడు నృపాలకపూజ్యుఁడునంచుఁదగన్ బుధుల్
వేమఱు నెంచ దిట్టకవి వేంకటరాయకవీంద్రుఁ డొప్పగున్.

చ. అతని కృపాకటాక్ష విభవాతిశయంబ నిశంబు గల్గ నే
నతుల కవిత్వతత్త్వ మహితాద్భుతప్రౌఢిమగంటి గావునన్
గృతపతిచేఁ బ్రబంధమొనరించుతలంపుదు(న?) స్వప్తినేసమం
చితగతి నమ్మహాత్మునకుఁ జేతులు మోడ్చుచు విన్నవించితిన్.

వ. మద్గురుండైన యకలంకవివరుండు నత్యంతకృపాతరంగి
తాంతరంగుఁడై,

సీ. ధాత్రి భారద్వాజగోత్రపవిత్రుఁడై
సురుచిరాపస్తంబసూత్రుఁడగుచు
నిరతాన్నదానాభినిరతుఁడౌ నీమల
పలినరసామాత్యపౌత్త్రివరుని
సతతసంపూజితశంకరుండగుశంక
రామాత్యమౌళికి నాత్మభవుని
బ్రాజ్ఞుని నచ్చమాంబాగర్భశుక్తిము
క్తామణి నీశ్వరధ్యాననిరతు

గీ. భవ్యశృంగార మంజరీ కావ్యరత్న
మాంధ్రభాషనొనర్చి నయనఘచరితు
శంభునిభుఁ డగునివటూరిశంభుశిష్యు
నను భవానీశనామునఁ గన్గొనుచు బలికె.

క. శ్రీకరమతాకరుణ్యార
సాకలనఁ బ్రబంధకర్తవై యలరితి నీ

వీక్ష్మతిన్యేఁ మాన్యేఁ ·
శ్రీకంఠున కర్పణంబు సేయుము వేడ్కన్.

[వ్యచా

మ. హరిశౌర్యుండగు కో(రా ?)వుమాధవనృపాలాగ్రేసరుం గా
తురి మెచ్చించి తదీయసత్కృప సిరుల్ తోరంబుగా నంది బం
ధుర తేజుండయి వకు లంకకుల పాథోరాశి రాకాసుధా
కిరణుండైతగు వీరభద్రసుకవిన్ గీర్తింతు నానెచ్చెలిన్.

**End:**

స్రగ్విణి భూరికారుణ్యసంపూర్ణపూర్ణే . .
పారికాంక్షీశహృత్పంకజేందిందిరా
దారితాఘౌఘపాతాళగంగానదీ
వారికేళీకళావైభవాభ్యున్నతా!

**Colophon:**

ఇది శ్రీమద్గురువరకరుణాతిశయలబ్ధకవితావైభవ యీదుల పల్లి శంకరమంత్రితనూభవ, సుధీజనవిధేయ భవానీశనామధేయ ప్రణీతంబైన ధర్మఖండంబను ప్రబంధంబునందు ప్రథమాశ్వాసము.

(వి. వి.)—

అసమగ్రము. ప్రథమాశ్వాసము మాత్రమే కలదు. వ్రాంత యొకమాదిరిగా నున్నది. నిర్దుష్టము కాదు. శైథిల్యము లేదు. గ్రంథపాతములు లేవు.

ఇది స్కాందపురాణపు టేఁబదిఖండములలో నొకటియగు ధర్మఖండమునకు నీదులపల్లి భవానీశంకరకవిచేఁ జేయఁబడిన తెలుఁగుసేఁత. ఇకవి దిట్టకవి వేంకటరాయకవీంద్రునకు శిష్యుఁడును వకులంక వీరభద్రకవికి మిత్రుఁడును. ఈ కవి శృంగారమంజరి కావ్యముఁలుగూడఁ దెల్గించినట్లు చెప్పుకొన్నాఁడు. ఇది శ్రీశైల మల్లికార్జున కర్పింపఁబడెను. ఈ గ్రంథభాగమున రామనామ మాహాత్మ్యము వర్ణింపఁబడెను.

## R. No. 43.

Paper. 11 × 8¾ inches. Foll. 107. Lines, 18 in a page. Telugu. Good.

Restored from a MS. of the Library in 1910-11.

వికచోత్పలమాల.

VIKACŌTPALAMĀLA.

This gives the story of the Rāmāyana (Uttarakāṇḍa excepted) in Utpalamāla metre. The author of the work is Goḍlavarti Veṅkanamantri, son of Vēṅkaṭanṛsiṁha and grandson of Dharmamantri-ḥaṁvīra. He was the disciple of Abhinavatīrtha (?). The work is here complete.

**Beginning:**

ఉ. శ్రీరమణీమణీకుచకుశేశయకోశలసత్పటీరకా
శ్మీరనికాకురంగమదమిశ్రితకుంకుమసాంద్రచంద్రనీ
హారపయోఘుమంఘుమఘుమాయితవక్షుసుధాబ్ధికుందమం
దారతుషారపారదసుధాకరహారశతారతారడిం
డీరశరద్బలాహకపటీరసితాంబుజతారహారగో
క్షీరసురాపగావిమలకీర్తివశక్షుఁ విదూరకంసచా
ణూర . . . . . . . . . . .

**End:**

చేరుదు రంచుముందు మునిశేఖరుఁడైనప్రచేతసాత్మజుం
డారసి కూర్చినట్టియితిహాసము సంకుచితంబుగాఁగఁ దా
నేరిచినట్లు శ్రీహరిని నెమ్మనమందుఁదలంచి మ్రొక్కి మం
దారమరందగుంభితసుధామయశబ్దవిచిత్రచాటువా
గ్ధోరణిమీఱ వత్సమునిగోత్రలలాముఁడు గొడ్లవర్తివి
స్తారకులాబ్ధిపూర్ణహిమధాముఁ డభిన్నవతీర్థమానికం
ఠీరవశిష్యవర్యుఁ డవనీధరధైర్యుఁడు ధర్మమంత్రిహం
వీరవరేణ్యపౌత్త్రుఁడు నవీనచరిత్రుఁడు సద్వివేకమం

జీరుఁ డుదారవేంకటనృసింహకిశోరుఁడు రామమాదర
స్మేరముఖీతనూజుఁడు విచిత్రగుణౌజుఁడు కార్యఖడ్గవి
ద్యారుచిరప్రవీణుఁ డతితంత్రధురీణుఁడు కృష్ణపాదప
ద్మోరుకళన్మరందసరిదూర్మిచరద్భ్రమరాయమాణగం
భీరమనోవిశాలుఁ డతివిస్మయశీలుఁడు సంస్కృతాంధ్రభా
షారమణీయవాక్స్ఫురభిచంద్రుఁడు వేంకనమంత్రిచంద్రుఁ డిం
పూరరచించినట్టి వికచోత్పలమాల్య మనంగనొప్పుసీ
తారఘురామచంద్రులకథాసుమదామము భూతలంబునం
దారవిచంద్రతారకమునై నుతి కెక్కుఁ జెలంగుఁ గావుత౯.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత బాగుండ లేదు. తప్పులు మెండు. మాతృకలోని గ్రంథపాతము లిందును గలవు. ఇది యీ పుస్తకశాలలోని శిథిలతాళపత్రప్రతినిబట్టి వ్రాయఁబడినదే.

రామకథయెల్ల రేఫప్రాసముతోఁ దెకతెంపులేని యొక్క యుత్పలమాలికగా, నభిన్నవతీర్థవరానిశిష్యుఁడును, ధర్మమంత్రి హంవీరపౌత్త్రుఁడును, వేంకటనృసింహ పుత్త్రుఁడును గార్యఖడ్గ నిపుణుఁడును, నగు గొడ్లవర్తి వేంకనమంత్రిచే రచింపఁబడినది. ఇందుత్తరకాండ కథచేర లేదు. గ్రంథకర్తనుగూర్చి విశేషము లుదాహరింపఁబడిన గ్రంథభాగమునుబట్టి తెలిసికొనునది

---

## R. No. 44.

Palm-leaf. $15\frac{7}{8}$ to $14\frac{1}{4}$ × $1\frac{1}{4}$ inches. Foll. 58. Lines, 6 in a page. Telugu. Injured.

Presented by Brahmānanda Rao of Cocanada in 1911-12.

గోవ్యాఘ్రచరిత్రము.

GŌVYĀGHRACARITRAMU.

This is a Prabandha in three Āśvāsas illustrating the importance of truthfulness. In this story a cow seized by a tiger keeps her

promise to return to it after feeding her calf. The author of the work is Kāmarāju, son of Kanakayāmātya. The work is dedicated to Harihara. He states that he composed other poems which were dedicated to Lakṣmīnārāyaṇa and Viśvanātha.

Complete.

**Beginning:**

సీ. శ్రీరత్నమును సతీసీమంతినీమణి
యును వక్షమున నర్ధతనువు నమర
నీలజీమూతంబు నెఱి శారదాభ్రంబు
కరణి దేహద్యుతుల్ కానిపింపఁ
గలువలచెలికాఁడు కంజాతమిత్రుఁడు
నేత్రద్వయంబునై నిల్వటిల్లఁ
జక్రత్రిశూలముల్ శార్ఙ్గపినాకముల్
కరముల విక్రమక్రమము దెలుప
గీ. కంఠసీమలఁ గౌస్తుభగరములొప్పఁ
గస్తురియుబొట్టు మికిలికన్నుఁదనరఁ
దలఁప నొకతేజ మిటు దెఱంగులవహించి
నట్టి హరిహరులను గొల్తు ననుదినంబు.

* * * *

సీ. . . . . . . . . .
. . . . . . . . . .
అదివేయుశాఖలై యవనిపైవిలసిల్లె
నందుభరద్వాజుఁడను మునీంద్రు
గీ. గోత్రమునఁబుట్టి సద్బుద్ధికోవిదుండ
నంగ నెప్పారె మాచిరాజనెడు ఘనుఁడు
వైదికంబున ధాతంతవాఁ డితండ
నంగఁ బెం పగ్గలించి యయ్యనఘుఁడొప్పె.
ఉ. ఆతనివంశమందుహనుమయ్యయనంబ్రభవించియింపునన్
శ్రీతిగఁబార్వతీసతిని బెండిలియయ్యెను వారలందు సం

జాతము (త ?) నెందిఁ కల్పతరుసన్నిభుఁడచ్చయమంత్రినెమ్మ [దిఁ
గౌతుకమొప్పసాధ్వియగుకామమనంతవివాహమైతగన్.

క. ఆదంపతు లత్యంతా
మోదంబున బంధుజాతములు హర్షింపన్
శ్రీదయితుని సత్కరుణా
సాదరమున (?) గనిరి వార లార్వురు సుతులన్.

ఉ. ఆసుతు లార్వురున్ విమలు లంచితమూర్తులు పుణ్యశీలురున్
భాసురకీర్తిసాంద్రు లన భాసిలుచుండెడి వారిలో సదా
భూసురపాదసేవకుఁడుభూతదయాళుఁడుకక్కయార్యుఁ [డా
శ్రీసతికెత్తువచ్చునరిచేకొనె వేంకటలక్ష్మి నింపుతోన్.

సీ. ఆకక్కయార్యుఁ డయ్యంగనామణియందుఁ
గనెఁ గుమారుల మువ్వురను బ్రియమున
నం దగ్రజుఁడు వేంకయార్యుఁడు భూసుర
కల్పద్రుమంబన ఘనతనొప్పె
నాతనికనుజన్ముఁడగు సూరయాహ్వయుఁ
డాదినారాయణు పాదయుగళ
మతిభక్తి సతతంబు నంతరంగంబున
నిడుకొని భూదేవ నివహమునకుఁ

గీ. గొంగుబంగారమనఁదగి కోర్కులొసఁగు
నామహాత్మునితమ్ముఁడ నగుచుఁ బుడమిఁ
గామరాజను పేరిట గణుతికెక్కి
నాఁడ హరిహరదాసుఁడ నగుచు నెలమి.

వ. ఏను శ్రీహరిహరచరణారవిందమకరందపానానందసం
పూరితస్వాంతుండనగుచు నాదగు జన్మం బియ్యిలాతలమున
కృతార్థత్వంబు నొందునని నిశ్చయించి యొకప్రబంధంబు లక్ష్మీ

నారాయణుల కంకితంబుగా రచియించి మఱియు నొకప్రబంధం బాశ్వాసనాథుండగు విశ్వనాథున కంకితంబుగా నొనరించి మఱియు నొకచరిత్రంబు భక్తిపూర్వకంబుగా హరిహరుల కంకితం బొసంగం దలంచి పద్యాంతంబుల రచియించెద నెట్లనిన—

**End:**

మా. సకలదివిజపోషా సంయమీంద్రప్రణోషా
ప్రకటితమణిభూషా పాపవారాశిశోషా
అకలుషబహువేషా యార్యసంస్తూయ(స్తుత్య ?)భాషా
త్రికరణహతరోషా దేవతారాతిదూషా.

**Colophon:**

ఇది శ్రీహరిహరకరుణాకటాక్షవీక్షణలబ్ధకవితావిశేష కనకయామాత్యపుత్త్ర సజ్జనవిధేయ కామరాజప్రణీతంబైన గోవ్యాఘ్ర చరిత్రంబను పురాణంబునందు సర్వంబును ద్వితీయాశ్వాసము.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత బాగున్నది. తప్పులు లేవు. శైథిల్యము కలదు. గ్రంథపాతములు లేవు.

వనమున నొకగోవు నొకవ్యాఘ్రముపట్టి హింసింపనుండు వేళ నాధేను వు తనబిడ్డకుఁ బాలిచ్చి బుద్ధులు గరపి పెద్దలచాటునఁ జేర్చి తిరిగివచ్చెదనని చెప్పి యెట్టకేల కొప్పించి, పోయి, తుదకుఁ జెప్పినట్లు వచ్చి సత్యపరిపాలనముచేసి తన్మూలమున నావ్యాఘ్రమునుగూడ సద్వృత్తికిఁద్రిప్పి యుత్తమగతులు నొందినట్లు గల యుత్తమనీతికథ మూఁడాశ్వాసముల ప్రబంధముగా కనకయామాత్యనందనుఁడగు కామరాజు హరిహరాంకితముగా రచించెను. ఈకామరాజు లక్ష్మీనారాయణాంకితంబుగా నొకకబ్బమును, విశ్వనాథాంకితముగా నొకకబ్బమును, నింతకుఁబూర్వము రచించినట్లు చెప్పుకొనెను. ఈతనిఁ గూర్చి విశేషములు పై నుదాహరింపఁబడిన పద్యములమూలమున గుర్తించునది.

## R. No. 45.

Paper. 8 × 6¼ inches. Foll. 230. Lines, 20 in a page. Telugu. Good.

Presented by K. R. V. Kṛṣṇa Rao Bahadūr in 1911-12.

(*a*) నిరంకుశోపాఖ్యానము.

### NIRAṄKUŚŌPĀKHYĀNAMU.

Foll. 1*a*—61*b*.

A Prabandha in four Āśvāsas illustrating the greatness of Śiva's mercy by relating the story of a Brahmin who was saved although completely addicted to sensual pleasures. The author of the work is Rudraya of Kandukur, a place in the Nellore district. He was a goldsmith by caste and was the son of Pedaliṅganna He was also the author of Sugrīvavijaya, a Yakṣagāna.

Complete.

**Beginning:**

శా. శ్రీభాషారమణావిమృష్టపదరాజీవోత్తమాంగాగ్రుఁడా
ర్యాభామాపరిణేతసర్వజగదారాధ్యుండు మూర్తిత్రయీ
శోభాకందము కందుకూరినగరీసోమేశ్వరస్వామి లో
కాభీష్టంబులొసంగుఁగాతఁగరుణాయత్తైకచిత్తంబునన్.

* * * *

ఉ. కోమలవర్ణదామయును గోవిదసంస్తవనీయలక్షణ
స్తోమఫలాభిరామయును శుంభదలంకరణప్రసాధన
స్ఫీమయు నప్రతర్క్యగుణసీమయు నైనమదీయకావ్యక
న్యామణి నిచ్చి మంచుమలయల్లుని నల్లునిఁగా నొనర్చెదన్.

* * * *

క. కాశీపట్టణముఖ్యని
వేశున కవనీశసౌధవేశునకు వియ
త్తేశునకుఁ గందపురసో
మేశునకు విభానిరస్తహిమకాశునకున్.

**End :**

శా. భస్మోద్ధూళితదేహ పోషణకళా పారీణ వారాకరా
కస్మాదుత్థితకాలకూటవిషదిగ్ధగ్రీవ పాదాంబుజా
తస్మర్త్యవ్రజకల్పభూజ కరుణాధన్యేక్షణా సేవమా
నాస్మత్పౌత్రకమత్తనూభవకనాగాఖ్యాంకలింగాహ్వయా.

క. అతులతరసోమవార
వ్రతనియమధురీణహృదయవారిజపార్శ్వ
శతవినుతచన్నమాంబా
ప్రతిదినసంసేవ్యమానపదవంకేజా.

**Colophon :**

ఇది శ్రీమత్కాళీవరప్రసాదలబ్ధలబ్ధవర్ణవర్ణనీయకవిత్వతత్త్వ ధౌరేయ పెదలింగనార్యగర్భార్ణవపౌర్ణిమాత్రేయ గురువరాచార్యపదారవిందమిళిందాయమానమానసాశ్రయ పండితమ్మన్యటరాజేయ సకలవిద్వజ్జనవిధేయ రుద్రయనామధేయ ప్రణీతంబైన నిరంకుశోపాఖ్యానంబను మహాప్రబంధంబునందుఁ జతుర్థాశ్వాసము.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత యొకమాదిరిగా నున్నది. తప్పులు దిద్దఁబడెను. శైథిల్యము లేదు. గ్రంథపాతములు లేవు.

వేశ్యాలోలుఁడై చెడునడవడిఁ జిక్కిన యొక యెలప్రాయపు బ్రాహ్మణుఁడు శివునియనుగ్రహమున మహనీయుఁడగు కథ నాల్గాశ్వాసముల ప్రబంధముగా రచింపఁబడినది. గ్రంథకర్త కందుకూరి రుద్రయ్య. తండ్రిపేరు పెదలింగన్న. అగసాలి కులపువాఁడు. నివాసము నెల్లూరు మండలములోని కందుకూరు. ఈ రుద్రయ్య సుగ్రీవవిజయమను యక్షగానమును గూడ రచించెను.

(*b*) కేయూరబాహుచరిత్రము.

KĒYŪRABĀHUCARITRAMU.

Foll. 62*a*—142*b*.

This MS. seems to be a copy of the MS. in the Library made many years ago and containing suggestions from other copies as well.

This describes the story of the marriage of Kēyūrabāhu and introduces incidentally many stories taken from Viddhasālabhañjikā of Rājaśēkhara. The author of the work is Mācana who dedicates the work to Nandūri Gandamantri, a minister of king Pṛthvīśa, son of Rājēndracūla. For further particulars about the patron, see Telugu remarks below.

Complete.

**Beginning:**

ఉ. శ్రీవసియించుఁ గాత సుఖసిద్ధివహించియనేకబంధుహం
సావళియుం బ్రహృష్టిరతిశాలిసముత్కరషట్పదంబునై
జీవనమెప్పుడుం సుకవిసేవ్యమనంబొనఁగొందు సర్వపు
ణ్యావహమై నకుండసచివాగ్రణిగేహసరోవరంబునన్.

మ. శ్రవణానందన భారతీచతురునిన్ బ్రాచేతసుం దివ్యస
త్కృతిసంధానుఁ గాళిదాసుఁ గృతికర్తన్ గొల్చెదన్ వాక్సుమే
షుఫులన్ నన్నయభట్టు తిక్కయపిం(దుంభక్తితోఁ గొల్చియు
ద్ధవబాణక్యయుగంధరాదినయవిద్యాకోవిదధ్యానినై.

వ. ఇట్లు (కృతి ?) కృతి ప్రారంభముఖ్య కర్తవ్యుండనైయు
న్నవాని.

సీ. . . . . . .

నెగడు బ్రహ్మవంశ నీరధి సంపూర్ణ
చంద్రముఁడు కళావిశారదుండు

నైజధార్మికుండు నందూరిగుండన
మంత్రి నిఖిలమంత్రిమండనంబు.

వ. నిరంతర సరసకవివరగోష్ఠీనిష్ఠుండు గావున నొకనాఁడు చిత్రకథాశ్రవణప్రసంగంబున,

క. తన యిష్టసఖుని విద్వ
జ్జనమాన్యుని నుభయకావ్యసరణిజ్ఞుని మం
చననామధేయు నన్నుం
గనుఁగొని యిట్లనియె వినయగౌరవ మెసఁగన్.

గీ. నందనుండు వనము నల్లిల్లు నిధి సుర
గృహము చెఱువు మేలికృతి యనంగ
జగతి వెలయు సప్తసంతానములు వినఁ
బుణ్యములు యశంబుఁ బొందవచ్చు.

క. సొమ్ములలో ము ప్పొర్చు జ
గమ్మెల్లను జోడుముట్టఁగాఁ జేయును శ్లా
ఘ్యమ్మగు వస్తువు నగుటను
గమ్మనికనకంబు గాదె కవిత దలంపన్.

ఉ. కావున నాకు నొకఁడు కృతికై కొనసిష్టము నీవుఁ బ్రాజ్ఞసం
భావిత కావ్యదక్షుఁడవు భవ్యమతిం ద్విజదేవనిర్మితం
బై విలసిల్లుతంత్రము ప్రియంబునఁ జూచిన నందుఁ గర్ణసౌ
ఖ్యావహమై ప్రబంధరచనాశ్రయ మయ్యెడుమార్గ మూఁతగన్.

క. స్థాయిరసము శృంగార
మై యలవడ గథలు నియతులై యెడ నెడరాఁ
గేయూరబాహుచరితము
సేయుము నీ వష్టికావ్యశిల్పము మెఱయన్.

వ. అనిపలికి . . . . . . . . . .

* * * *

ఉ. బాలరసాలపుష్ప నవపల్లవకోమలకావ్యకన్యకన్
గూళలకిచ్చి యప్పడుపుఁ గూడు భుజించుటకంటె సత్కవుల్
హాలికులైననేమి మఱియంతకు నాయతిలేనినాఁడు గౌ
ద్దాలికులైననేమి నిజదారసుతోదర పోషణార్థమై.

* * * *

వ. . . . . . . గుండనామాత్యువంశంబు జగత్ప్రసిద్ధంబైనను కృతిలక్ష్మికిముఖతిలకంబుగా రచియింతునది యెట్లన్నను.

గీ. . . . . . . . . . . .

నాఁగ ధనదుపురీనామనగర మొప్పు.

. . . . . . . . . .

గీ. మంటికడవ నులుకమంచంబు పూరిల్లు
నూలిచీర రత్నకీలితంబు
కాసితోడవుఁ బుడమిఁగలుగు టెఱుంగఱు
ధనదపురములోని జనములెల్ల.

శా. ప్రాగ్దేశాపరదక్షిణోత్తరదిశాభాగప్రసిద్ధక్షమా
భృద్దర్పాంతకుఁ డేలె గుండవిభుఁ డీభూచక్ర మక్రూరతన్
వాగ్దేవీస్తనహారనిర్మలయశోవాల్లభ్యసంసిద్ధితో
దిగ్దంతిశ్రవణానిలజ్వలదటత్తీవ్రప్రతాపాఢ్యుఁడై.

క. ఆవిభునకుఁ బ్రెగ్గడయై
భూవలయంబున యశోవిభూషణుఁ డయ్యెన్
గోవిందన ప్రధానుం
డావాసము కౌశికాన్వయంబన సిరికిన్.

క. ధీరుఁడు గోవిందనకును
గూరిమినందనుఁడు వెలసెఁ గొమ్మన గొంక
క్ష్మారమణున కుడియించెన్ (చిన ?)
వీరుఁడు రాజేంద్రచోడవిభు ప్రెగ్గడనై.

సీ. నవకోటి పరిమిత ద్రవిణ మేభూపతి
భాండారమున నెప్డుఁ బాయకుండు
నేకోనశతదంతు లేరాజునగరిలో
నీలమేఘంబుల లీలఁ గ్రాలు
బలవేగరేఖలు పదివేల తురంగంబు
లేనరేంద్రుని వాగె నెపుడు దిరుగుఁ
బ్రతి వాసరంబు డెబ్బది యేనపుట్ల నే
యేవిప్రమండల నెపుడుఁగలుగు

గీ. నట్టి యధికవిభవుఁ డగుకులోత్తుంగరా
జేంద్రచోడనృపతి కిష్టసచివ
తంత్రముఖ్యుఁ డనుఁగుమంత్రి గోవిందనం
దనుఁడు కొమ్మనప్రధానుఁ డొప్పు.

ఉ. ఇల వెలనాటిచోడమనుజేంద్రుసమాత్యత యానవాలుగాఁ
గులతిలకంబుగా మసన కొమ్మన ప్రెగ్గడకీర్తి మాటలన్
దెలుపఁగ నేల తత్ప్రియఁ బ్రతిష్ఠితమైన తటాకదేవతా
నిలయమహాగ్రహారములు నేఁడును నెల్లెడఁ దార చెప్పగాన్.

సీ. రమణీయమైన కూర్ప(ర్మ ?) గ్రామమునయందు
గుడధాత్రిపురమునఁ గొత్త చర్ల
త్రిపురాంతకమునఁ బేర్చిన కొట్టియదోనపొగ్గి (పు ?
రమునఁ గళింగ రాష్ట్రంబులోని
యెలమంచిలి(ల్లి ?) నాదిగా నెలమి ముప్పదిరెండు
విష్ణుప్రతిష్ఠలు వెలయఁజేసి
నిచ్చ వేవురు మేదినీసురులకు భక్తి
తోడఁ బాయసము . . . !

గీ. పంచదారతోడఁ బాటించి యిడుట జ
న్మవ్రతంబుగాఁగ నడపినను సు
గుణగరిష్ఠుఁడైన కొమ్మన ప్రెగ్గడఁ
బోలఁ గలరె ధర్మపురుషు లెందు.

ఉ. అగు పండఁగ వెలనాటిచోడమనుజేంద్రాజ్ఞావనంబొందిదు
స్తరశక్తిఁ జని యేకవింశతి సహస్ర గ్రామసంఖ్యాకమై
ధరణిం బేర్చినపాకనాడు నిజదోర్దర్పైకలగ్నంబుగాఁ
బరిపాలించె నమాత్యకొమ్మన జగత్ప్రఖ్యాతచారిత్రుఁడై.

క. చలము మెయిఁ గటకసామం
తులు గరిహయబహుళసేనతో నేతేరఁ
దలపడియెఁ గొమ్మసచివుఁడు
బలియుఁడై క్రొత్తచర్ల పరిసరభూమిన్.

క. ఆకొమ్మన ప్రెగ్గడసుతుఁ
డై కేతన చోడభూవరాత్మజుఁడన్నధై
ర్యాకరుఁడగు పృథ్వీశమ
హీకాంతుని మంత్రియయ్యె నెంతయుఁ బేర్మిన్.

* +

ఉ. కేతనమంత్రినందనులు కీర్తివహించిరి బంధుజాతవి
జ్ఞాతవినీతభావుఁడనఁ జాలిన కొమ్మన దండనాథుఁడున్
బ్రాతరహార్పతిప్రతిమభాసురతేజుఁడు మల్లశౌరియున్
బ్రీతసమస్తసజ్జనుఁడు భీమనప్రెగ్గడయుం గులాగ్రణుల్.

ఉ. అందఱిలోనఁ బ్రాయమున నారసిచూడఁగ జిన్నయయ్యుఁ బెం
పొందిగుణంబులం బొగడ నొందె ధరిత్రిన మాత్యభీముఁ డా
నందము తల్లిదండ్రులు మనంబున నందఁగ నిశ్చలంబులై
గుందవరాచ్ఛకచ్ఛపముకుందము లొందఁగ మందిరంబునన్.

సీ. క్షితిఁ గశ్యపప్రజాపతిమనుమండయి
పుట్టుట నతనిన పోలుననుచు

? జనులెల్లవారును దను౯ బొగడ నెగడిన
గుండదండాధీశుమూర్తిపుత్త్రి)
పుణ్యలక్షణమూర్తి ప్రోలనమారన
పేరన లాదిగా౯ బేరుకలుగు
సచివసప్తకముతో జనియించి మునగల
భూధరంబులతోడ బుట్టినట్టి
గీ. వసుమతీదేవి కెత్తొరవచ్చు ప్రోల
మాంబ జెండిలియై యన్వయంబు పావ
నంబులోకము గీర్తిపూర్ణంబుగాంగ
భీమనామాత్యు౯ డెల్లెడ౯ బేర్మిమిగిలె.

*

చ. అతిశయశౌరుషైకపరులై జనియించిరి పుత్త్రులట్టిజం
పతులకు మువ్వు రుత్కటకృపాంధ కేతనదండనాథుండు౯
క్షితిధరతుల్యధైర్యుడగు కేతనమంత్రియు సర్వసద్గుణా
యతనసుబుద్ధి గుండసచివాగ్రణియు౯ ద్విజవంశభూషణుల్.

* + + +

చ. నలువుగ౯ గాకు లేశురు నాథుల లోపల గుండమంత్రి ని
ర్మలమతి౯బెట్ట వేగమయి మాడలు గత్నచయంబు౯జల్లగా
నలవడు హేమవృష్టిక్రియ౯ నర్థులు చాతకకోటిగాంగ లో౯
గలగొనరాలు ముత్యములు గాన౯బడు౯ వడగండ్లకైవడి౯.
సీ. వాచకత్వము లేఖనీచితత్వము నాంధ్ర
లిపియట్ల మహింసర్వలిపులయందు
ఫణితిజాతియు౯ దీవ్రభంగియును దెనుంగు
భాషలట్లు(యట్టుల?) సర్వ భాషలందు
మర్మజ్ఞతయు౯ బ్రౌఢమతియును[దెలివియు?]
గణకత్వ (విద్యయట్లె సర్వ ?) విద్యలందు
వదనవికాసంబు మృదువాక్యతయు బంధు
జనుయట్ల(నియట్టుల?) సర్వజనులయందు

గీ. మన్ననయు (ను ?) నిర్వంచనమతియు మిత్ర
గణములట్ల (ట్టుల ?) సర్వార్థి గణములందు
ననుట సహజంబు లివియు వర్ణనలుగావు
గుండనామాత్యునకు మంత్రికుంజరునకు.

క. ఈగుండయప్రెగ్గడకును
ధీగుణచింతామణికి నతిస్థిరధర్మో
ద్యోగమతికి శ్రీపురా
ణాగమదుగ్ధాబ్ధి మందరాచలమతికిన్.

వ. ఇష్టార్థసిద్ధియు నైశ్వర్యసమృద్ధియుఁ బుత్త్రపౌత్త్రాభివృద్ధి యుఁగా నారచియింపంబూనిన కథాక్రమం బెట్టిదనిన.

**End:**

మా. గణకశిఖరగత్నా కావ్యవిద్యా ప్రయత్నా
ప్రణుతజనశరణ్యా ప్రాజ్యలోకాగ్రగణ్యా
ఫణిశయదృఢభక్తా బంధువర్గానురక్తా
గుణిజనకృతసఖ్యా గుండనామాత్యముఖ్యా.

**Colophon:**

(వి-వి.)—

ఇది సకల సుకవిజనవిధేయ మంచననామధేయప్రణీతంబైన కేయూరబాహుచరిత్రంబునందుఁ జతుర్థాశ్వాసము.

సమగ్రము. వ్రాఁత యొకమాదిరిగా నున్నది. నిర్దుష్టము కాదు. ఇది యీపుస్తకశాలలో ని తాళపత్రప్రతికే పుత్త్రికయయి యుండును. ఆ తాళపత్రప్రతిపాఠము లే యిందును గలవు. ఇందుఁ బెక్కుచోట్లపాఠములకు సవరణలు చేర్పఁబడియున్నవి. శైథిల్యము లేదు. మాతృకలోని చిన్ని చిన్ని గ్రంథపాతము లిందును జేరినవి.

మహాకవిరాజశేఖరుని విద్ధసాలభంజికలోని యితివృత్తము ను గొని నడుమనడుమ నీతి కథలఁ బెక్కింటి జేర్చి మంచనయను కవీశ్వరుఁడు నండూరి గుండమంత్రి కంకితముగా నాల్గాశ్వాసముల

యీప్రబంధమును రచియించెను. గ్రంథకర్త కులగోత్రాదు లెఱుఁగవచ్చుట లేదు.

కృతిపతి

ధనదుపురము రాజధానిగా రాజ్యమేలిన గొంకరాజునకు గౌతమాన్వయుఁడు గోవిందన, ప్రెగ్గడగానుండెను. ఈ గోవింద ప్రధానుని కుమారుఁడు కొమ్మన. ఈతఁడు గొంకరాజు కుమారుఁడగు రాజేంద్రచోడవిభునకుఁ బ్రెగ్గడగా నుండెను. రాజేంద్రచోడుని ధనాగారమున నెల్లప్పుడును దొబ్బదికోట్ల ధనముండెడిది. నగరిలోఁ దొంబదితొమ్మిది యేన్గులుండెడివి సాహిణముసఁ బదివేల గుఱ్ఱములుండెడివి. ఆలమందలనుండి డెబ్బదియేనుపుట్లనేయి ప్రతిదినమును జేకుఱుచుండెడిది. కొమ్మనమంత్రి, కూర్చ(ర్మ ?) గ్రామమున, గుడధాత్రి(?) పురమున, క్రొత్తచర్లపురమున, త్రిపురాంతకమునందు, కొట్టియదొనపురమున, కళింగరాష్ట్రములోని యెలమంచిలి, మొదలగు స్థలములందు ముప్పదిరెండు విష్ణుప్రతిష్ఠలు చేసెను. రాజేంద్రచోడు ననుమతిచొప్పున నేకవింశతిసహస్రగ్రామ సంఖ్యాకమగు పాకనాటి నీకొమ్మన పరిపాలించెను. క్రొత్తచర్లచెంత నీతఁడు కటకసామంతులతోఁ దలపడి పోరొనర్చెను. కొమ్మనప్రెగ్గడకుమారుఁడు కేతనప్రెగ్గడ. ఈతఁడు రాజేంద్రచోడుని కుమారుఁడగు పృథ్వీశరాజునకు మంత్రి. ఈ కేతనప్రెగ్గడకుఁ గొమ్మనదండనాథుఁడు, మల్లశౌరి, భీమనప్రెగ్గడయనువారు పుత్త్రులు; భీమనప్రెగ్గడభార్య పోలమాంబ. వీరికి కేతన, చినకేతన, గుండన, యనువారు ముప్పురు పుత్త్రులు. వీరిలో గుండయప్రెగ్గడ యేతత్కృతినాథుండు. ఇయ్యెడ విశేషము లుదాహరింపఁబడిన పద్యములఁ బట్టి గుర్తించునది.

---

(*c*) మార్కండేయపురాణము.

MĀRKAṆḌĒYAPURĀṆAMU.

Foll. 144*a*—152*b*.

This is a Telugu version of the Sanskrit Purāṇa of this name; by Mārana. Even the first Āśvāsa is incomplete. Hence further details about the work are not given here.

(వి-పి.)—

అసమగ్రము. ప్రథమాశ్వాసమేని తుదముట్ట లేదు. శైథిల్యము లేదు. గ్రంథపాతములు లేవు.

ఇది మారనకవిచే వ్యాసవిరచితమగు మార్కండేయపురాణమునకుఁ జేయఁబడిన తెలుఁగుసేఁత. ఈ సంపుటమందు గ్రంథమత్యల్పభాగమే యుండుటచే విషయవివరణము చేయఁబడదయ్యె.

Foll. 154—156 contain a Telugu translation, by Tirupati Vēnkatēśvarakavi, of a small portion of Rājaśēkhara's Karpūramañjari.

ఆవల మూఁడు (154, 155, 156) పత్రములలో, రాజశేఖరకవి ప్రాకృతభాషలో రచించిన కర్పూరమంజరీసట్టకమునకు కొంత భాగమునకుఁ దిరుపతివేంకటేశ్వరకవులు చేసిన తెలుఁగుసేఁత కలదు.

R. No. **46.**

Paper. 8 × 6¼ inches. Foll 186. Lines, 22 in a page. Telugu. Good.

Presented by the same owner as the last in 1911-12.

(*a*) ముకుందవిలాసము.

MUKUNDAVILĀSAMU.

Foll. 1*a*—95*b*.

This is a Prabandha in three Āśvāsas relating the story of the marriage of Kṛṣṇa with Bhadrā. The author of the work is Peddana Sōmayāji, son of Nandavara Timmanārya of Ātrēyagōtra. He was a follower of Āśvalāyana and younger brother of Lakṣmīpatipaṇḍita. He is said to have been well versed in Bāhaṭa, a work on, medicine, and the author of a Sanskrit commentary on

Bhōjacampu, of a Citrakāvya called Śēsaśailēśalīla and of a Telugu translation of Adhyātmarāmāyana. The work is dedicated to Muștipalle Sōmabhūpāla, a nobleman of Gadvāla State. It is complete.

**Beginning :**

శా. శ్రీమేల్గూర్ప భరింపుమీ సకలధాత్రీరాజ్యమున్ నీవయ
న్యామోదాప్తినొసంగులీలవలనా (నా?)హస్తంబునం దెల్పు [నా
శ్రీమత్తేర్చికవశౌరిసాంద్రకరుణాశ్రీరంజిలన్ సద్గుణ
స్తోముం దిర్మలరాయసోమన్నపతిన్ సుశ్రీయుతుం జేయుతన్.

* * *

ఉ. నన్నయభట్టు భీమన ననంతునథర్వణుం దిక్కసోమయాజి నె
ఱ్ఱన్నను సోముభాస్కరుని నయ్యలు నైషధకావ్యకర్తం బో
తన్నను బిన్నవీరునిఁ జిన్నను సూరప రామభద్రుఁ బె
ద్దన్నను దిమ్మనార్యు గరుడాంకుని మూర్తిసుకీర్తి నెంచెదన్.

క. ఎల్లప్పుడు సేవించెద
నుల్లంబున వేదశాస్త్రయోగాన్వితులన్
బిల్లేవంశాంచితులన్
మల్లేశ్వర దీక్షితులను మద్గురువరులన్

క. ఉర్వర వీరనృసింహో
ఖర్వకృపాలబ్ధ సరసకవితాలహరీ
ధూర్వహు మద్భగినీధవు
దూర్వసినాగార్యు సుగుణధుర్యు నుతింతున్.

* * * *

వ. అని . . . . . ప నొకర్చి ప్రబంధంబు రమారమణపరి
ణయప్రసంగసంగతశృంగారచమత్కారరసానుబంధంబుగా నొన
రింపబూని యున్న సమయంబున

వ. . . . . . హరిచరణసంజాతసురవాహినీసహోదరీభూతమహాన్వయవిశిష్టముష్టిపల్లివంశాలంకారుండును, నిజసంప్రదాయపారంపరీకల్పితాగ్రహారసమూహమహితమహీసురమహావిభవరక్షణవిచక్షణుండును, స్వకీయసోమపాత్రతాసార్థీకృతచక్రవర్తిలక్షణుండును. శ్రీమత్కేశవస్వామిచరణకమలయుగళభక్తినిష్ఠాగరిష్ఠుండును, షోడశమహాదానచతుష్షష్టివిద్యాపటిష్ఠుండును, కేళాదిరాయరాయవేశ్యాభుజంగసంగ్రామధనంజయాదిగర్వేశ్వరాదిబిరుదసార్థకమర్థనధూర్వహసాహసాంకుండును, తిరుమలరాయమహీశ్వరార్ధాంగలక్ష్మీబిడంబమంగాంబాగర్భసుధార్ణవపూర్ణిమాశశాంకుండును, శ్రీమద్విజయలక్ష్మీసహాయుండును, నగు సోమభూపాలరాయండొకట శుభవాసరంబున . . . . . పరివారంబు పరివేష్టింప సకలవైభవసాంద్రుండగు దేవేంద్రుని సొంపున సంపదనింపొందుచు.

సీ. నను నంకవరపురాన్వయపయోనిధిచంద్రుఁ
గాణాదవంశవిఖ్యాతిసాంద్రు
నాశ్వలాయనసూత్రు నాత్రేయమునిగోత్రు
సకలవిద్వత్కవిప్రకరమిత్రుఁ
బ్రౌఢలక్ష్మీపతిపండితసోదర్యు
బాహటగ్రంథానుభావధుర్యు
వేదశాస్త్రపురాణవివిధమర్మధురీణు
వరచతుర్విధకవిత్వప్రవీణు

గీ. భోజచంపూప్రబంధార్థబోధనాను
బంధగీర్వాణటీకానిబంధనాది
పేశలవచోరచనచర్యుఁ బెద్దనార్యుఁ
గాంచి దయమించి పలికె సగౌరవముగ.

తే. కాదివర్ణంబు లిరువదియైదువిడిచి
చేసితిరపంచవర్గీయ చిత్రకృతిని

శేషశైలేశలీలాఖ్యచే నెసంగ
యాదిమితవర్ణనియతశక్యంబె జగతి.

క. మీ తాతయు మీ తండ్రియు
మీ తమ్ముఁడు మీరు మఱియు మీ కులజులువి
ఖ్యాత ప్రబంధరచనా
ప్రీతచరిత్రులు కణాద పెద్దనసుక

క. పురుషోత్తమాష్టమహిషీ
పరిణయములలోన మున్ను భద్రాదేవీ
పరిణయ మెవ్వరుఁ దెనుఁగున
విరచించుట వినము పూర్వవిబుధులలోనన్.

క. కావున మీ రది తెనుఁగునఁ
గోవిదులౌననఁగ శ్రీముకుందవిలాసా
ఖ్యావిధిఁ జేయుము కేశవ
దేవున కంకితముగాఁగ ధీరవతంసా

క. అనిబహుమతి నొనరించిన
విని బహుమతి నేను సోమవిభు ననుమన్నిచే
నను మతిమంతులు మే లన
ఘనకృతి రచియింతుఁ జతురకవితావిహృతిన్.

ఆ. ఇందు సకలహితము నిచ్చుమున్విష్ణుచి
త్తీయతుల్యమా మదీయకవిత
యుదుటుచేవదొలువ నులిఁ బోలు నళిమోము
మృదువుగాదె విరులమీఁద వ్రాలి.

వ. అని నిశ్చయానుసంధానంబున మదీయ ప్రబంధ సంధాయకుండగు సోమభూపాలరాయవతంసుని వంశాభ్యుదయంబభివర్ణించెద.

క. శ్రీ ముష్టిపల్లినామ
గ్రామప్రాముఖ్యనాడ గౌడుకులమునన్
ప్రేమను మాధవసేవా
శ్రీగుంతుఁడు వెలసెఁ బెద్దన్నపవరుఁడవనిన్.

ఆ. అట్టిముష్టిపల్లియా పెద్దన్నపుఁడు శ్రృం
గారనాడగౌడు వీరఘనుని
తనయఁజిక్కమాంబికను బెండ్లియాఁడె న
స్వీరవిభుని నెన్న నేరవశము.

ఉ. కందనవోలుముఖ్యముగఁ గల్గినసీమల నాడగౌడు కీ
ర్తిం దగి తుంగభద్రకును గృష్ణకుమధ్యమసీమరాజ్యల
క్ష్మిం దగి ముష్టిపల్లికుల సింహుఁడు పెద్దన భూవరుండు పే
రందెనిరూఢి సిరఘునుగల్లుడు వైరిమృగాళిభిల్లుఁడై.

ఆ. పాకనాటిమేటి పరిపాటికులకోటి
నేటికందుఁ బెద్ద నృపకిరీటి
గనియెఁ బెద్దసోమఘును సిరిగాహ్వయు
నాత్మజులను జిక్కమాంబయందు.

సీ. అనురక్తి నుదయించినపుడ ప్రభావాప్తిఁ
గువలయపాలన ప్రవణమించి
మదినిజకృష్ణాంగ మండలంబు వెలుంగ
నుదయాద్రి మొదలుగా నొగిగ్రహించి

తుంగభద్రోన్నతి దొడరి గాంగంబన
వోలుమున్నగు దేశ మేలుబడిగఁ
గరకాండవిస్ఫూర్తిగలయవనారుల
బలములఁగడుభీతిఁ బారనణఁచి

గీ. దనరి విష్ణుపదాసక్తిఁ దనకు నదియ
సత్పథముగాఁగఁ బ్రహ్లాదసరణి వెలసి
దిక్కులం దెల్లఁగీర్తి చంద్రికలునించి
సోముఁ డలరారె శుభకళాస్తోముఁడగుచు.

మ. గురుభూమీసురమాళికిం దనమహాగోత్రైక సామ్రాజ్యమిం
పరయన్ భార్గవుఁడిచ్చినట్లు పెదసోమక్ష్మాధీశుఁ డౌరాయనన్
గురుభూమీసురమాళికిం దనమహాగోత్రైకసామ్రాజ్య మిం
పరయన్ దానమొసఁగెనిట్టి నృపుఁడౌరా కల్గఁగా నేర్చునే

వ. వెండియుఁ దత్సోమ భూపాలుండు . . . . . హరిగృహాస
మ్మార్జన కరదీపికారోపణవ్యజనాతపత్రపల్యంకికావహనాదికైంకర్యా
లంకృత హర్షపులకాంకుర సకలాంగుండును నిరంతర క్రియమాణ
మహాధ్వర దీక్షాదక్షకమలాక్షకరుణాకటాక్షవీక్షణాకల్పితదక్షిణాది
ఫలోత్కృష్ట మృష్టాన్న సత్ర సంతుష్ట విశిష్టజన బహుసహస్రాశీ
ర్వాదాపాదిత మహాభ్యుదయుండును శరచ్ఛిశిరపూర్ణిమా మహో
త్సవ సముత్సాహదిగంత విశ్రాంత విశ్రాణనప్రీతా సేతుకాశీతలప
ర్యంతభూతలాగతవిద్వత్కవిగాయకాద్యర్థిసంతానుండును, జండ
తరదండయాత్రాసముద్దండమండలాగ్రఖండితానేకభండనాగతయవ
నమహీనాథసేనాంఢులుండును నగు చుంబేరయ్యెనయ్యేడ.

తే. అట్టిపెదసోమభూజానివార్ష మూని
ప్రబలుగద్వాలయనుమహారాజధాని

నతిశయించి ప్రతిష్ఠించి యందుమించి
పేరువ్రాడూరి కేశవస్వామి నిలిపె.

*　　*　　*　　*

క. సిరిగానాథపుఁడిలవెలసెన్
సిరిగా పెదసోమనృపతి సింపయునను జూఁడై
సరిగా రేన్నృపు లతనికి
నరిగాపులఁ జేసెఁ దనకు యవనాధిపులన్.

తే. అందుఁ బెదసోమభూమీశుఁ డమ్మమాంబఁ
బేర్చి, లింగాంబ రామాంబఁ బెండ్లియాడె
నందు లింగాంబ సకలగుణావలంబ
కలిమి జగదంబయనఁ బేరుకలిమి నలరె.

సీ.

తనదుకోనేట నమృతఖేలన మొనర్చు
హరికిఁ గలశాబ్ధిసుఖకేళి నెఱుఁగఁ జేసె
లీలఁ బెదసోమవిభుభార్య లింగమాంబ
తనకు లింగాంబ పేరు సార్థంబుగాఁగ.

తే. అట్టి పెదసోమనృపతి లింగాంబవలనఁ
బ్రేమఁ దిరుమలరాయలు రామరాయ
లనుసుతులఁగాంచె భూమిజయందురాముఁ
డలరఁ గుశలవులను గాంచునను వుమీఱ

*　　*　　*　　*

తే అట్టి తిరుమలరాయేంద్రు ననుజుఁడైన
రామరాయఁ డుపేంద్రుని రహి నెసంగి
విక్రమస్ఫూర్తి స్వాధీన చక్రుఁడగుచు
నతనిసామ్రాజ్యరక్షణం బాచరించె.

*　　*　　*　　*

క. శ్రీ తిరుమలరాయనికిన్
ఖ్యాతిగలత్తిమ్మాంబమంగమాంబయు ననఁగా
జేతఃప్రియసతు లొలసిరి
శ్రీతరుణియు భూతరుణియు శ్రీహరికివలెన్.

* * * *

క. తిరుమలరాయమహీవరుఁ
డరయన్ మంగాంబయందు ననురూపముగా
సరసీరుహాంబకాంచితు
స్మరసదృశుఁ జిన్నసోమజనవరుఁ గనియెన్.

* * * *

సీ. సుకవుల కొకరొకరికి కొసంగె నేఘనుం
డలరి వేనూట పదార్లుగాఁగ
బహుభక్ష్య సత్రముల్ పరఁగించె నేదాత
ద్విజుల కర్థము పదివేలుగాఁగ
మాఘకార్తిక పూర్ణిమల నిచ్చె నేరాజు
విప్రకోటికి బహువేలుగాఁగ
నొగిఁ గేశవస్వామి కొనగించె నేమేటి
లలితభూషాదులు లక్షగాఁగ
గీ. నతఁడు సామాన్యుఁడే యనేకాగ్రహార
భూసురాశీర్వచస్ఫురభూరిపూరి
తాయురారోగ్యభోగభాగ్యాత్మజాది
బహువిభవశాలి సోమభూపాలమౌళి.

* * * *

సీ. . . . . . . .
పూర్ణభాగ్యశుభాశీల భోగరూప
ధనవిభాగణరత్నసంతతులఁ దనరి
సోమవిభునకు భామినుల్ ప్రేమవెలసి
రీమహిని వెంకమాంబయు రామమాంబ.

క. ఈముష్టిపల్లి సోమ
క్ష్మామండలనాథవిభవ సంరక్షణచే
శ్రీమంతు డగుచులక్ష్మీ
వామాద్యృతికామి కేశవస్వామి దగున్.

* * * *

వ. అభ్యుదయపరంపరాభివృద్ధిగా నాసమర్పింపంబూనిన భద్రాపరిణయోల్లాసంబగు ముకుందవిలాసంబను మహాప్రబంధంబునకుఁ గథాక్రమం బెట్టిదనిన.

**End:**

క. అని శుకముని పలికిన విని
వనజాక్షుని భక్తిపారవశ్యమువలనన్
జనకనృపాలకుఁ డలరెన్
మనమున నానందవిభవ మగ్నత మెఱయన్.

* * * *

మఁ. శ్రీధవసాదావిబుధసేవధిసుధాధవళశీలవిధిశోభితయశశ్శ్రీ
సాధువనమాధవ సుసాధనగదాగిదరసాధితనిరంతరజయశ్రీ
భూధవసుధీనికరబోధకరసాధుతర భూషితవినిర్మలగుణశ్రీ
మాధవదయావనఘమందరగిరీంద్రధరమంజుతరమంగళమహా
[శ్రీ.

**Colophon :**

గద్య. ఇది శ్రీమదభయికవితానిస్సహాయసాహితీవిహారకాణాదాన్వయతిమ్మనార్యకుమారవినయగుణధుర్యపెద్దనార్య ప్రణీతంబైన భద్రాపరిణయోల్లాసంబగు ముకుందవిలాసంబను మహాప్రబంధంబునందు సర్వంబును తృతీయాశ్వాసము.

(వి-గ.)—

సమగ్రము. వ్రాఁత చక్కఁగా నున్నది. తప్పు లంతగా లేవు. శైథిల్యము లేదు గ్రంథపాతములు లేవు.

మూఁడాశ్వాసములుగల యీ ప్రబంధము కాణాద పెద్దన సోమయాజిచే రచింపఁబడినది. ఇందుఁ గృష్ణుఁడు భద్రను వివాహమాడుకథ వర్ణింపఁబడినది. గ్రంథకర్త నందవరవంశ్యుఁడు, నాశ్వలాయనసూత్రుఁడు, నాత్రేయగోత్రుఁడును. లక్ష్మీపతి పండితున నుజన్ముఁడు. బాహటగ్రంథానుభవముగలవాఁడు. భోజచంపువునకు సంస్కృతటీక రచించినవాఁడు. స్పర్శవర్ణరహితముగా "శేషశైలేశలీల" యను చిత్రకృతిని రచించినవాఁడు. మఱియు నధ్యాత్మరామాయణ మీతనిచే దెలిఁగింపఁబడెను. ఈతనివంశమున పూర్వులును ప్రబంధకర్తలు. ఈ తత్కృతి గద్వాలసంస్థాన ప్రభువగు ముష్టిపల్లి సోమభూపాలునకు నంకితముగా రచింపఁబడినది. ఆ సోమభూపాలు వంశవృత్తాంతమునుగూర్చియు, మఱియు గ్రంథకర్తవిషయమును గూర్చియు విశేషములు పైనుదాహరింపఁబడిన పద్యములఁ బట్టి గ్రహించునది.

(*b*) దశరథరాజనందనచరిత్రము.

DAŚARATHARĀJANANDANACARITRAMU.

Foll 99*a*—186*a*.

This is a Prabandha in five Āśvāsas relating the story contained in the first six Kāndas of the Rāmāyana without once using in the whole work the words with the vowel *u* or the consonants *p, ph, b, bh, m*. *c* The author of the work is Mariganṭi Singarācārya who claims to have come of a well known Vaisnava family. He was the son of Vengalācārya and grandson of Tirumaladēśika of Maudgalyagōtra, and states that he was the author of 20 works. For particulars, see extracts below.

The work is complete.

**Beginning:**

శా. శ్రీరామామణియాననాంబుజమ్ముపై సింగారము ల్గులుకఁ క
స్తూరీబిందుమరందవాసనలకుం సొంపొందుభృంగంబులో

నా రంజిల్లెడుచూడుగ్రల౯ దనిపి యానందాబ్ధి నోలాడునా
వీరశ్రీనరసింహుఁ డెల్లపుడు దీవి న్మమ్ము రక్షించుత౯.

*　　　*　　　*　　　*

గీ. రాజపూజితు వేదశాస్త్రప్రవీణు
సరససాహిత్యలక్షణ చక్రవర్తి
నుభయభాషాకవిత్వధుర్యుని మదగ్ర
జన్ము మ గంటియప్పలాచార్యునెంతు.

సీ. జలజాక్షపరికరాంశప్రభూతాత్ములఁ
బదుగు రాళ్వారులఁ బ్రణుతిచేసి
పంచసంఖుల శాస్త్రపారీణుల భజించి
యామునాచార్యుల నభినుతించి
రామమిశ్రుల నతిప్రేమచేఁ గీర్తించి
ఘనుల శ్రీమన్నాథమునుల బొగడి
నె (పె?) రియజియ్యరు శిష్యసురకల్పకము నెన్ని
సూరి తూపురిపిళ్లగారిఁ దలచి

గీ. వాసి డెబ్బదినాల్గు సింహాసనముల
గురువుల ననుగ్రహవైభవాకరులఁ గొలిచి
సిరులనాతల్లిదండ్రుల వరదమాంబ
వెంగళాచార్యు హృద్వీథి వేడ్కనిలిపి.

*　　　*　　　*　　　*

క. కంటి౯ లక్ష్మణముని నట
కంటి౯ గూరేశదేశికస్వామి మఱి
గంటినద్రివ్వరన౯ (?) మరి
గంటిమహాన్వయముదనరె గణ్యం బగుచు౯.

ఆ. సలలితాసూరికులచేఁ (?) బ్రశస్తిగన్న
సాధుభట్టారకుఁడు రంగశాఖువలన

నిల మరింగంటి వారన్న యింటిపేర
గురుశిఖామణు లెన్నంగఁ బరిఢవిల్లె.

సీ. ఆసాధుభట్టారకాత్మజుండై దయా
కలితతేజుఁడు పిళ్లగారు పుట్టె
నతనికిఁ బెరియపిళ్లాఖ్యుఁ డాఘునునకు
శ్రీరంగనాథదేశికుఁడు పొడమె
నతనికిఁ దీర్ఘపాదయ్యయాసూరికి
జియ్యగారలు జనించిరి ప్రసిద్ధ
నతనికి యామునుండాభవ్యమూర్తికి
మాధవగురుఁడు సమ్మతిగఁ గలిగె

గీ. నతనికి జనించె సకల రాజాధిరాజ
రాజమకుటాగ్ర ఘటితచిరత్నరత్న
బహుళనీరాజనాలివిభ్రాజితాంఘ్రి
సరసిజుఁడు చిన్నయాచార్యచక్రవర్తి.

క. తనజననీ గర్భంబున
జనియించెడివేళ నొకభుజంగము కవయై
కనుపట్టియనంతాళ్వా
రను పేరఁ బరఁగె జెన్నయార్యుం డెలమిన్.

సీ

శ్రీమతంబుప్రతిష్ఠచేసియామణవాళ
యతికి సహాయుఁడై యతిశయిల్లె
సూరినల్లందిఘుళ్ నారాయణస్వామి
భాగినేయతఁ గీర్తిఁ బరిఢవిల్లెఁ

గీ. బంచి (చెఁ ?) పైకంబు మఁడుచులుబ్ధకుల కెల్ల
నంటిబోజుఁగుల (గయి ?) విలసిల్లె (ల్లు ?) నిట్టి చెన్న
దేశికునకుఁ దనూజులై తిరుమలయ్య
భట్టరుఁడు సింగరప్పఁడు ప్రబలిరందు.

చ. విరవిర (విరివిగ ?) భట్టరార్యునకు వెంగళనాథుఁడు పుట్టి (పు [ట్టె?]) వారికిఁ
బరమత భేది తిర్మలయ భట్టరుఁడుం బ్రభవించిగందులోఁ
దిరుమల శౌరికిం గలిగి తేజమునుంచిరి వెంగళప్పఁడుఁ
సరసగురుం డనంతుఁడు ఘనప్రతిభానిధి సింగరప్పఁడుఁ.

క. సరసుఁడు వెంగళగురుమణి
వరదాంబను బెండ్లియాడె వనజాక్షుం డా
శరనిధికన్యారత్నము
వరియించినపోలిఁ నధిక వైభవ మెసఁగఁ.

* * * *

గీ. అట్టిమఁగంటి తిరువేంగళార్యువలన
వరదయాగుణనికురుంబ వరదమాంబ
సిరులసౌందర్య విద్యావిశేషకళల
బలియులైనట్టి యష్టపుత్త్రిలను గనియె.

సీ. ముగురురాజులచేత మ్రొక్కులుగొన్నట్టి
భగవత్సమానుఁ డప్పలగురుండు
వేదవేదాంగాది వివిధార్థసంపత్తి
నతిశయిల్లిన వేంకటార్యమౌళి
కలితసౌందర్యరేఖా విలాసంబులఁ
జెంగలించెడి శ్రీనృసింహవిభుఁడు
కుపితమాయావాది గురుశాస్త్రహరణపా
రగుఁడైన కోనేటి రాయశౌరి.

సీ. సరసశతపద్యలో కావిరచనోక్తి
గలజగన్నాథసూరు లగ్రజులు గాఁగ
నలరి రంగప్ప నరసింగరప్ప దమ్ము
లై మెఱయువాఁడ భువి సింగరాహ్వయుండ.

మ. సముదీర్ణస్థితి వేంకటేశ్వరుఁడు నాస్వప్నం బునన్ షోడశా
బ్దములన్ మాణవకాకృతి న్నిలిచి వత్సా! యంధ్రభాషానిరో
ష్ఠ్యమహాకావ్య మొనర్పుమీ యనిన సత్యాజ్ఞే మేలార్పంచి మో
దమునన్ జెప్పితి భూమిపైఁ గవిజనాధ్యక్షుల్ ప్రశంసింపఁగాన్.

మ మును రామాయణమున్ నిరోష్ఠ్యముగ నింపుల్ మీఱ శాకల్యమ
ల్లన తా సంస్కృతభాషఁ జేసె నన నాలాగున్ జెవుల్ నిండఁగా
వినుటే కాని ధరిత్రిపై నిజముగా వీక్షింపలే దట్టి దేఁ
దెనుఁగుం జేసెద నెల్లెడం గవులకున్ దృష్టాంతమై యేర్పడన్.

మ. వరవం డారుజనావళీహృదయ సద్వాంఛాగ్రకృద్వేంకటే
శ్వరసంపూర్ణకృపాసుధామిళితదీ (ప్రా ?) ప్రామాధురీమార్గవి
స్ఫురితైకైక దినప్రబంధరచనా స్ఫూర్జద్వచశ్శ్రీకుఁడన్
ననానాశ్వనృపాలసభ్యగణితుండన్ (?) సింగరాచార్యుఁడన్.

**End:**

ఉత్సాహ. శౌరిహారిసూరివంద్యశాపతాపకోపనే
ష్ఠా (?) రిభూరివైరిహారిహాంసహోషలోచనా
నారిదుర్విచారకర్ణనాసికారిదారిని
ర్వారితోగ్రదైత్యగర్వవనకృశానుపావనా.

**Colophon:**

ఇది శ్రీమల్లక్ష్మీనృసింహావతారవేంకటేశ్వరవరప్రసాదలబ్ధసక
లైశ్వర్యధురీణ యంధ్రభాషానిరోష్ఠ్యాది వింశతి ప్రబంధనిర్మాణ
మార్గల్యగోత్రపవిత్ర తిరుమలదేశికపౌత్ర వేంగళాచార్యపుత్త్ర
మరిగంటి సింగరాచార్య ప్రణీతంబైన దశరథరాజనందనచరిత్రంబు
నందు సర్వంబును షష్ఠాంతంబైన పంచమాశ్వాసము.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత చక్కఁగా నున్నది. తప్పులు లేవు. శైథిల్యము లేదు. గ్రంథపాతములు లేవు.

అచ్చులలో "ఉ" వర్ణమును, హల్లులలో "ప" వర్గమును "వ"కారమును రాకుండెడు (నిరోష్ఠ్య) పదములతో రామాయణకథ యారుకాండములు నైదాశ్వాసముల ప్రబంధముగా మరిగంటి సింగరాచార్యునిచే రచింపఁబడినది. గ్రంథకర్త వైష్ణవుఁడు. ఆతని వంశవృత్తాంతాదికము పైనుదాహరింపఁబడిన పద్యములఁబట్టి గుర్తించునది. ఆంధ్రభాషయందు నిరోష్ఠ్య ప్రబంధములు రచించినవారిలో నీతఁడే యాద్యుఁడుగాఁ గన్పట్టుచున్నాఁడు. శాకల్య మల్లనయను నాతఁడు రామాయణకథను సంస్కృతమున నిరోష్ఠ్యముగా రచించెనను నానుడిమాత్రము కలదు గాని యయ్యది చేకుఱుటలేదని యీతఁడు చెప్పికొనెను. ఈతఁడు వింశతిప్రబంధముల రచించెనఁట. విశేషములకుఁ బై పద్యములఁ జూచునది.

R. No. **47**

Palm-leaf. $17\frac{1}{8} \times 1\frac{1}{8}$ inches. Foll. 222. Lines, 6 in a page. Telugu

Very much injured.

Presented by Brahmānanda Rao of Cocananda in 1911-12.

కాశీఖండము.

KĀŚĪKHAṆḌAMU.

This is the Telugu version of the Sanskrit work of this name which is a portion of Skāndapurāṇa by Śrīnātha As the MS., though complete, is much injured, extracts are not given.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత యొకమాదిరిగా నున్నది. తప్పులంతగా లేవు. శైథిల్యము మిక్కిలి కలదు. గ్రంథపాతములును గలవు. పత్రములు కొన్ని తబ్బిబ్బులై యున్నవి.

ఇయ్యది స్కాందపురాణాంతర్గతమగు కాశీఖండమునకు శ్రీనాథ కవిసార్వభౌమునిచేఁ జేయఁబడిన తెలుఁగుసేఁత. ఈసంపుట మతిశిథిలముగా నుండుటచే విషయ వివరణము చేయఁబడదయ్యె.

## R No. 48.

Palm-leaf $14\frac{1}{2} \times 1\frac{1}{8}$ inches Foll 77. Lines, 6 in a page. Telugu. Good.

Presented by Brahmānanda Rao of Cocanada in 1911-12.

కర్మవిపాకము.

KARMAVIPĀKAMU.

This is a work in three Āśvasas treating of the sins committed by a person in his previous births, the diseases to which he is liable as a consequence of the sinful acts, the remedial measures to counteract the effects of those acts, etc These Dharmas are said to have been taught by Śuka to Pariksit The author of the work is Narasayya, son of Dhēnuvukoṇda Jōganna of Puspālagōtra.

Complete.

**Beginning:**

క. శ్రీసీతాహృద్వల్లభ
వాసవభోగీశవినుత వారిజనేత్రా
వాసవపుత్త్రవిమర్దన
దాసాఘవిరామభీమ ! దశరథరామా !

వ. మహనీయగుణ గరిష్ఠుండగు శంకరుండు శాంకరికిం జెప్పినట్లుగాఁ గర్మవిపాకంబు సవిస్తరంబుగా నెఱింగించువాఁడై యగస్త్యుఁ డాత్రేయున కిట్లనియె.

**End:**

ఓసూతా ! నీ వెఱుంగనియర్థంబు గోరంతయు లేదు. కావున మున్నగస్త్యునిచేతఁ గర్మవిపాకం బత్రినందనుండు వినెనని

వింరుము. తత్కథాక్రమం బెట్టిది చెప్పవే యనిన వినుమని పూర్వకృత సంచయంబైన దోషంబు నందుటవలన మర్త్యులు రోగంబు ననుభవించుటయు దిపిరి తద్దోషానుభవంబైన నరకంబునం బొందుటయు ఖదంపడి క్షుద్రాది జంతువులందు సంభవించుటయుఁ దద్దోషపరిహారార్థంబై గో భూ హిరణ్య తిలా న్న జల తటాక వాపీకూపారామ దేవతాస్థా (ప?) నంబు లెఱిఁగించుటయు మఱియు విశ్వరూపునివలన ననుభవంబైన బ్రహ్మహంత (హత్య ?) యు భూజలాగ్ని వృక్ష స్త్రీలకుఁ బంచియిచ్చిన విధంబును, వత్సమానంబైన కృత్యంబులును, వ్రత నియమంబును, పుణ్యతీర్థ ఫలవిశేషంబులును, బ్రాహ్మణ ప్రభావంబును, పితృయజ్ఞ ప్రకారంబును శౌచాదివిధియును, వర్ణాశ్రమధర్మంబులును, ఆయుఃక్షేమైశ్వర్యాభివృద్ధియును, తీర్థాకరమహత్త్వంబును, పిండోత్పత్తియు, ప్రకృతి నిర్ణయంబును, సాంఖ్యయోగ నిర్ణయంబును, అష్టాంగ నిర్ణయంబును, జెప్పినట్లు సాత్యవతేయుండును, ద్వాపరాంతంబునఁ దత్కథ శుకునకు నెఱింగించెను. ఆ శుకుండు పారియోపవిష్టుండైన యభిమన్యునందనున కెఱిగించె మఱియును,

క. ఈయితిహాసము వినినను
బాయనుగలుషములు మఱియు బహుభాగ్యములన్
? రోయక యనుభవుఁడైతుది
సాయుజ్యముఁబొందఁగలఁడు జగతీస్థలిపై.

క. ధరణీసురవరపోషా
శరణాగత (సుజన ?) పోష సత్యవిభాషా
వరకౌస్తుభమణిభూషా
సురతోషా ! వంక్తికంఠశోషిత (షక ?) వేషా !

**Colophon :**

ఇది శ్రీరామచంద్ర వరప్రసాదలబ్ధ కవితా విలాస పుష్పాల గోత్ర పవిత్ర ధేనువుకొండ జోగనాఖ్య పుత్త్ర నరసనామ

ధేయ ప్రణీతంబైన కర్మవిపాకంబను ధర్మశాస్త్రంబునందు సర్వం బును ద్వితీయాశ్వాసము.

గ్రంథాంతమునఁ బ్రతి లేఖకుఁ డిట్లు వ్రాసియున్నాఁడు:—

"భావనామ సంవత్సర శ్రావణ బ 2 స్థిరవారము నకు కామరాజు భోగరాజు సంపూర్ణముగా వ్రాసెను."

(వి-వి.)—

సమగ్రము. కృత్యవతరణము లేదు. ఈ ప్రతియందు విడు వఁబడి యుండును. వ్రాఁత బాగున్నది. నిరుష్టము కాదు. శైథి ల్యము లేదు. గ్రంథపాతములు లేవు.

ముఖ్యముగా నిందు మానవు లేపుణ్యకార్యముల మూలమున దుష్కర్మములఁ బోఁగొట్టుకొనఁ గల్గుదురో తెలుపఁబడినది. పై నుదాహరింపఁబడిన గ్రంథాంత భాగమువలన గ్రంథమందలి యావ ద్విషయమును గుర్తింపనగును. కొన కీ ధర్మశాస్త్రము శుకుఁడు పరీక్షిత్తున కుపదేశించినట్లు తేలుచున్నది. తెలుఁగున దీనిని బుష్పాల గోత్రోద్భవుఁడును ధేనువుకొండ జోగన్న కుమారుఁడునగు నర సయ్య రచించెను. మూఁడాశ్వాసములు గలవు.

## R. No. 49.

Palm-leaf. 15 × 1¾ inches. Foll. 64 Lines, in a page. Telugu. Very much Injured

Presented by Brahmananda Rao of Cocanada in 1911-12.

కృష్ణకర్ణామృతము.

KṚṢṆAKARṆĀMṚTAMU.

This is the Telugu rendering of Līlāśuka's Sanskrit work of this name: by Velgapūḍi Venganakavi.

Complete, but the MS. is so injured that no useful extracts can be given from it.

(ఐ-ఐ.)—

సమగ్రము. వ్రాత చక్కగానున్నది. తప్పులుగలవు. శైథిల్యము మిక్కిలి యెక్కువ. గ్రంథపాతములును మెండు.

ఇది సంస్కృతమున లీలాశుకునిచే రచింపబడిన కృష్ణకర్ణామృతమను స్తోత్రగ్రంథమునకు వెల్లపూఁడి వెంగనకవిచేఁ జేయఁబడిన తెలుగుసేఁత. ఇందు సంస్కృతశ్లోకములుగూడ వ్రాయఁబడినవి గ్రంథ మతిశిథిలమగుటచే విషయవివరణ మిచ్చుట విరమింపఁబడెను.

R. No. **50**

Palm-leaf. $16\frac{7}{8} \times 1\frac{1}{2}$ inches. Foll 225. Lines, 7 in a page Telugu Good.

Presented by K. R. V Krsna Rao Bahadūr, Zamindar of Pōlavaram, in 1911-12.

(*a*) మూర్తిత్రయోపాఖ్యానము.

MŪRTITRAYŌPĀKHYĀNAMU.

Foll. 1*a*-111*b*

A Prabandha in six Āśvasas on the deeds of Brahma, Visnu and Rudra ; by Dantulūri Bāparāju, son of Vēnkaṭarāju of Dhanañjayagōtra The author belongs to Ksatriya caste and traceshis descent from the moon. The genealogy given in the work is summarized in the Telugu remarks below. The work is dedicated to God Gōpāla

Complete.

**Beginning** :

శా. శ్రీలక్ష్మీజలజాక్షియంశములచేఁ జెల్వొందువారిం బదా
ర్వేలన్ స్త్రీల ననేకరూపములతో శ్రీమీఱ నుద్వాహమై
యాలోలాక్షుల నేకరూపమగుసౌహార్దంబుతో నేలుగో
పాలస్వామివసించు మామకమనః పద్మాంతరాళంబునన్.

క. సేనాపతికులవర్యుల
నానతలక్షకుల ? వేంకటాచార్యుల స
న్మానవహృదయజ్ఞాన త
మోనీరజహితులఁ దలఁచి మ్రొక్కుచు మఱియున్.

గీ. ఆమహాత్ముని సుతులఁ బాదాశ్రయులకుఁ
గరుణధర్మార్థకామ మోక్షము లొసంగ
నాల్గువిధములఁ గనుపట్టునలిననాభు
మూర్తులనుమీఱుఘనుల సత్కీర్తిధనుల.

ఉ. ఆకృసికాయసవర్ణితగుణాశ్రయపావనచర్యు వేంకటా
చార్యుని సింగరయ్య నతిశాంతవిలాసుని శ్రీనివాసు నా
దార్యవివేకలోకవినుతప్రతిభానయధుర్యు రంగనా
థార్యునిఁ బ్రస్తుతింతు వినయాన్వితభక్తిరసోదయంబునన్.

గీ. వారిలోపల నాయందు వార్యమైన
కృప ప్రసాదించి మనుప నంగీకరించి
యలరెడుమహానుభావుఁ బ్రత్యక్షవాసు
దేవు శేషాహిసమవాక్ప్రతిప్రభావు.

సీ.

సేనాపతికులాఖ్యజలధిపారి
జాతమైనట్టి రంగపార్యవర్యు
నాత్మఁ దలఁచి యొనర్తు సాష్టాంగనతి.

ఉ. నన్నయభట్టు దిక్కవి నాచనసోమన నెఱ్ఱప్రెగ్గడన్
సన్నుతభారతార్థఘటనాచణు దిక్కనసోమయాజి వి
ద్వన్నుతనీయభాగవతవాక్పటు బమ్మెరపోతధీమణిన్
సన్నుతి చేసి యాధునికసత్కవిరాజిఁ బ్రశంస చేసెదన్.

ఉ. మిత్రసమానతేజుఁ డయి మీఱినయచ్యుతరాజమౌళికిఁ
బౌత్త్రుఁడు వేంకటేంద్రునకు భవ్యగుణోన్నత కోనమాంబకుఁ
బుత్త్రుఁడు రుక్మిణీరమణభూరికృపాపరిపూర్ణదృష్టికిం
బాత్రమునై నదంతులురిబావన్న పాలకనామధేయుఁడున్.

* * + +

క. సంతసమందుచునుండఁగ
నంతట నొకనాఁడు మేటి రౌదార్యశ్రీ
మంతులు మదగ్రజులు శ్రీ
కాంతాస్పదమేశభక్తికలితస్వాంతుల్.

ఉ. కీర్తిపరాయణుండు పెదకృష్ణనృపాలుఁడు రాజమాన్యస
ద్వర్తనుఁడైన సింగజనవల్లభుఁడు న్నయశాలిజగ్గభూ
భర్తయు నంబ్రసిద్ధులగు పావనచర్యులు ముప్పురుఁ దయా
మూర్తులు ధీరచిత్తులు ప్రమోదము మీఱ సభాంతరంబునన్.

* + + +

క. అని బ్రహ్మవిష్ణుశంకర
వినుతకథాప్రథితకావ్యవిరచనకై నే
ననుమతి చేసి తదాదిని
వినిపింతు మదీయవంశవిస్తారంబున్.

* + + +

**End:**

వం. సనందగోపగోపికాత్మసమ్మదప్రదాయకా
సనందనాదియోగిరాజసంస్తుతప్రభావకా
సనందకాబ్జచక్రపాణి సత్పదారవిందదా
సనందకోదయతకృపానిశాంతలోచనాంచలా.

**Colophon:**

ఇది శ్రీమదనగోపాలకృపాప్రసాదసంలబ్ధకవిత్వచాతుర్య
దంతులూరి వంశవర్య ధనంజయ గోత్రపవిత్ర వేంకటరాజపుత్త్ర

సకలసుకవిగణగేయ బాcపక్షమానాథనామధేయ ప్రణీతంబైన మూర్తిత్రయోపాఖ్యానంబను మహాప్రబంధంబునందు సర్వంబును షష్ఠాశ్వాసము.

(వి-షి.)—

సమగ్రము. వ్రాత ముద్దులుగూర్చుచున్నది. తప్పులు లేవు. శైథిల్యము లేదు. గ్రంథపాతములు లేవు.

పరబ్రహ్మమునకు సత్త్వరజస్తమోగుణ సంసర్గముచేఁ గల్గిన మూర్తిభేదములగు బ్రహ్మ, విష్ణు, శివుల చరిత్రము చింతలూరి బాcపక్షమానాథునిచే గోపాలాంకితముగా నాఱాశ్వాసముల ప్రబంధరూపమున రచియింపcబడినది. గ్రంథకర్త చింతలూరి వంశ్యుcడును, ధనంజయ గోత్రుcడునగు చంద్రవంశపు క్షత్రియుcడు. వంశవృత్తాంత మిదె తెలుపcబడుచున్నది :—

చంద్రుడు.—చంద్రునకు బుధుcడు. బుధునకుc బురూరవుండు. ఆతనికి నహుషుcడు. నహుషునకు యయాతి. యయాతికిc బూరుcడు. ఆతనివంశమున భరతుcడు జనించె. ఆవంశమున ధర్మరాజాదులు జనించిరి. వారి యన్వయమున విష్ణువర్ధనుcడు జననమందెను. తత్సంతతియందు హరిసీమ కృష్ణజనపతి కల్గెను. ఆతనికి భీమరాజు. భీమరాజునకు గన్నరాజు, వెన్నరాజు, సింగరాజు, నను వారు జనించిరి. గన్నరాజు వంశమునc గొండధరణీశుcడుజన్మించె. ఆతనికి రామభూపతి, బుస్సమరాజు, నాగన్నృపుడు జనించిరి. అగ్రజుcడు రామభూపతికి లకరూపదేవి భార్య. వారికి గొండరాజు, చిట్టివిభుcడు, అచ్యుతరాజు, నను వారు పుత్త్రులు కొండరాజునకు భార్య లక్ష్మి. వారికి లింగరాజను కుమారుcడు జనించె. ఆతనిభార్య కొండమాంబ. వారికి దిమ్మవిభుcడను కుమారుcడు జనియించె ఆతనికి జగ్గమ్మ భార్య. వారికిc బేరరాజు, వేంకటప్రభుcడు, లింగరాఘవుcడు, శ్రీరామ క్షమానాథుcడు కుమారులు. అందుc బేరరాజునకు యెఱ్ఱమాంబ భార్య. వారికి లచ్చభూజాని కుమారుcడు. ఆతనిభా

ర్య సింగాంబ. వీరికి నారాయణరాజు, పేరరాజు కుమారులు. తిమ్మ భూవిభు పేరరాజు తమ్ముఁడగు వేంకటప్రభునకు భార్య కొండమాంబ. వీరికిఁ బెదరామరాజు కృష్ణరాజు పుత్త్రులు-పెదరామరాజు లక్ష్మమాంబయందు వేంకటరాజును గాంచెను-తిమ్మభూవిభు వేంకటప్రభుని తమ్ముడు శ్రీరామరమానాథునకుఁ దిరుమలాంబ భార్య. వీరికిఁ జినరామభూవరుఁడు, పెద్దనృపాల శేఖరుఁడుఁ గుమారులు-చినరామనృపతి సూరమాంబయను భార్యయందు రామభద్రరాజను కుమారుఁ గాంచెను.

గీ. రామనృపతికొండభూమీశుపుత్త్రపౌ
త్త్రనృపతిసుతుల యన్వయంబు
వసుధయందు విపుల వర్ధిల్లు నీరీతి
దానశౌర్యగుణనిధానమగుచు.

చిట్టనరపతి.—ఆతనిభార్య. అక్కమాంబ వారికి వేంకటరాజు, అప్పరాజు, పుత్త్రులు, అప్పరాజు, పెదగోపమాంబ, పినగోపమాంబ యను భార్యలసర్వ్వరఁ జేకొనెను. చినగోపమాంబకు బాపనృపాలుఁడు పుత్త్రుఁడు. ఆతనికి నప్పలాంబ భార్య వారికి అప్పరాజు, రామభద్రరాజు, నరసరాజు, సూరరాజు.

గీ. కొండభూజాని రామరాట్కుంజరంబు
రెండవకుమారు చిట్టధాత్రీతలేశు
పుత్త్రపౌత్రాదులైనట్టి భూపసుతుల
యన్వయంబిట్లు వర్తిల్లునవనిలోన.

చిట్టరాజుతమ్ముఁడు అచ్యుతరాజు. ఆతనిభార్య రామాంబ వారికి సింగరాజు, బాపరాజు, చిట్టరాజు, వేంకటరాజుననువారు పుత్త్రులు. సింగరాజు భార్య వేంకటాంబ. వారికి అచ్యుతరాజు, చిన్నకృష్ణరాజు కుమారులు. అచ్యుతరాజు భార్య పెద్దాంబ. వీరికిరామరాజు, సింగరాజు, జగ్గరాజు, వేంకటాద్రి అనువారు

నల్వురు కొడుకులు. అచ్యుతరాజు తమ్ముఁడు చిన్నకృష్ణరాజు భార్య లక్ష్మమాంబ. వీరికి నరసన్నపాలుఁడు కొడుకు. సింగరాజు తమ్ముఁడు బాఁపరాజు. ఆతనిభార్య సింగమాంబ. సింగరాజు తమ్ముఁడుచిట్టరాజు భార్య గంగమాంబ. వీరికి సింగరాజు కొడుకు. చిట్టరాజు తమ్ముఁడు వేంకటరాజు. పిన్నమరాజు పర్వతరాజు కూఁతురగు కోమాంబను పెండ్లియాడెను. వీరికిఁ పెద్దకృష్ణరాజు, సింగరాజు, జగ్గరాజు. బాఁపరాజు, (ఈతఁడే యేతద్గ్రంథకర్త) అను నల్వురు కొమాళ్లు పెదకృష్ణరాజు భార్య నరసమాంబ. వీరికి రంగరాజు, వెంకటాద్రి, నారాయణుఁడు, పద్మనాభుఁడు, ననువారు నల్వురు కొడుకులు. సింగరాజు భార్య పేరమాంబ. వీరికి గోపరాజు, దేవరాజు, వేంకటపతి, యనువారు పుత్త్రులు. జగ్గరాజు భార్య మాడపదేవి. వీరికి శ్రీకృష్ణరాజు కొడుకు. బాఁపరాజు(గ్రంథకర్త)కుఁ బద్మనాభుఁడు, దేవన్న, ఆదినారాయణుఁడు, కోనరాజు కొడుకులు.

"ఏవం విధ . . . . . . రామరాజకి మారక ప్రసవసమగ్ర దంతులూరి వంశపారిజాత మహీజాంతరంబునకు ప్రకాండం బనవెలయుకొండమహీజాని కుమారత్రయంబునందు నగ్రజుండైన రామరాజచూడామణివంశం బివ్విధంబునఁ బామర్తంపరై వర్ధిల్లుందదనుజుండు:—" అతని తమ్ముఁడు బుస్సరాజు. ఆతనిభార్య సింగమ. వారికి రామరాజు, నరసింహరాజు, కొడుకులు. నరసింహరాజునకు నెల్లమాంబ,నరసమాంబ యను వార్వురు భార్యలు. ఎల్లపదేవికిఁ బేరన్నపతిజనించె ఆతఁడు లక్కపదేవియందు నరసరాజును బుస్సరాజును, పెద్దపయను భార్యయందుఁ జిన నరసరాజును గాంచెను. పెద్ద నరసరాజు లక్ష్మియను భార్యయందుఁ బేరరాజును గాంచెను. అతని తమ్ముఁడుబుస్సరాజు సూరమాంబయందుఁ బేరరాజుఁ గాంచెను. మొదటిబుస్సరాజుకొడుకు నరసరాజు, రెండవ భార్యయైన నరసమాంబయందుఁ దిమ్మరాజు, సింగరాజు, నను కొమారులఁ గాంచెను. తిమ్మరాజు

సర్వపదేవియందు, నరసన్నృపుఁడు పెద్దవిభుఁడు ననుకొమరులఁ గాంచెను. ఆ యిద్దఱిలో నరసరాజు లచ్చమను బెండ్లియాడి వెల సెను. పెద్దరాజు రంగపయను సతియందుఁ దిమ్మరాజు, కృష్ణ రాజు, పేరరాజు, నరసరాజు, జగన్నాథరాజు, వేంకటాద్రి, నాగా యఘుఁడు, నను కొమారులఁగాంచెను. తిమ్మరాజుతమ్ముఁడు సింగ రాజు సర్వమయను భార్యయందు నరసరాజు, చినన్నసింహుండు, కృష్ణరాజు, నను కొమరులఁ గాంచెను. "ఇవ్విధంబునఁ గొండ నృపాలుని రెండవకుమారుఁడైన బుస్సకరనాథునన్వయం బభివృద్ధి నొందఁదనుజుండు" నాగనృపాలుఁడు లింగరాజుఁ గాంచెను. లింగరాజు కొడుకులు సూరరాజు, నాగరాజు.

(b) ధరాత్మజాపరిణయము.

DHARĀTMAJĀPARIṆAYAMU

Foll. 112a—170a

This is a poem in four Āśvāsas, each stanza of which is so composed as to give two meanings. The poem therefore describes the marriage of Lakṣmī and Pārvatī with Viṣṇu and Śiva, respectively. The author of the work is Kottalanka Mṛtyuñjaya, son of Viśvanātha, according to the colophons at the end of each Āśvāsa. But according to the introduction the author is Allūri Apparāju. Perhaps Mṛtyuñjaya fathered this work on Apparāju for the sake of money. The genealogy of Apparāju given in the work is summarized below in the Telugu remarks. The work is dedicated to Hari. This MS. contains commentary for difficult passages.

Complete.

**Beginning:**

శా. శ్రీకాంతామణిసర్వలోకనికరక్షేమంకరాత్యున్నత
శ్రీకారుణ్యకటాక్షు నిత్యముఁ దనుఀ సేవింపఁగాఁ గోరి య

స్తోకప్రేమముచే భుజాంతరమునందు న్నిల్పఁ జెల్వొందులో
కైకారాధ్యుని శ్రీహరిం దలఁతు నిత్యానందరూపాన్వితున్.

* * * *

ఉ. ఎల్లజగంబులం గరుణ నేలుమహాత్ముని నిందిరామనో
వల్లభు నాశ్రయించి నిరవద్యతదీయకృపావిభూతి భూ
వల్లభసత్సభాబుధవర్ణ్యకవిత్వనిరూఢిఁ గన్నశ్రీ
యల్లురివంశసంభవుఁడ నప్పనృపాలకనామధేయుఁడన్.

* * * *

వ. అని సంతసించి సర్వదేవతా సార్వభౌముండైన శ్రీహరి పేర నిక్కావ్యం బంకితము సేయువాఁడనై తదాదియందు మదీయ వంశ విస్తారం బభివర్ణించెద.

**End:**

స్రగ్విణి. భోగిపర్యంకసాభోగభోగాన్వితా
యోగిహృత్కంజసంయోగిపాదాంబుజా
వాగమేయప్రభావాగమాంతస్తుతా
యాగభుక్సేవ్యమాయాగరిష్ఠక్రియా !

**Colophon:**

ఇది శ్రీమద్భవానీశ్వర శాశ్వత కృపాపాత్ర క్రొత్తలంక విశ్వనాథపుత్త్ర సహజపాండిత్య మృత్యుంజయ నామధేయప్రణీతంబైన ధర్మాత్మజాపరిణయంబను ప్రబంధంబున సర్వంబును జతుర్థాశ్వాసము.

ప్రతిలేఖకుఁడు గ్రంథాంతమం దిట్లు వ్రాసికొన్నాఁడు:—

"విళంబిసంవత్సర కార్తిక శు ౹3 శుక్రవారముః ఆకు వడ్డాది సుబ్బన్నకుమారుడు వెంకట్రాయుడు సంపూర్ణముగా వ్రాసెను".

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత ముద్దలు గూర్చుచున్నది. తప్పులు లేవు. శైథిల్యము లేదు. గ్రంథపాతములు లేవు.

ఇది నాల్గాశ్వాసముల ద్వ్యర్థికావ్యము. లక్ష్మీ పార్వతుల వివాహకథ లిం దేకముఖమున వర్ణింపఁబడినవి. కృత్యవతరణమున గ్రంథకర్త యల్లూరియప్పన్నృపాలుఁ డయినట్లు కలదు. ఆశ్వాసాంతగద్యములు క్రొత్తలంకమృత్యుంజయకవిపేర నున్నవి. మృత్యుంజయకవియే గ్రంథమును రచించి ధనలాభముచే నా యప్పన్నృపాలునిపేరఁ బ్రకటించినట్లు తలఁపవలసియున్నది. నతఁ డింకొన్ని గ్రంథములనుగూడ దానురచించి యీతఁ డన్యులపేళ్లతో బ్రకటించెను. ఈ ప్రతియందుఁ గ్లిష్టములగు పెక్కుపద్యములకు వ్యాఖ్యసయితము వ్రాయఁబడియున్నది. ఈ గ్రంథము శ్రీహరి కర్పింపఁబడెను. అల్లూరి యప్పన్నృపాలుని యన్వయక్రమమిదె తెలుపఁబడుచున్నది.

సూర్యవంశమున మాధవవర్మ యనురాజు జనించెను. ఆ రాజువంశమున నల్లూరి మల్లనృపాలుఁడు పుట్టెను. ఆతఁడు వేమాంబ యనెడు వనితయందు బసవనృపాలుని గనెను. ఆతఁడు సూరమయను భార్యయందు వేమభూపతి, తిమ్మరాజు, వల్లరాజు, పినతిమ్మశౌరి, యను కొమరులఁ గాంచెను. అందు వల్లరాజు, అబ్బమదేవియందుఁ బెదబాపిరాజు, వేమనృపాలుఁడు, కన్నరాజు, పినబాపిరాజు, బసవరాజు, విస్సరాజు, రాయరాజు, నను నేడ్వురు పుత్త్రులంబడసె. వారలలో బసవరాజు, అక్కపదేవియను పత్నియందు, అప్పరాజు, వల్లరాజు, వేంకటరాజు, కృష్ణరాజు, అబ్బరాజు, బాపరాజు, నరసరాజు, లింగరాజు, నను కొడుకులఁ బడసెను. పెద్దవాఁడగు నప్పరాజు మాదమాంబయను భార్యయందు బసవరాజు, అక్కరాజు, బాపరాజు, పేరరాజు, నను కొమరులఁ గాంచెను. బసవరాజు, అబ్బమదేవి రామాంబయను వెలఁదులఁ బెండ్లియాడి రామాంబయందు వేంకటరాముఁ డనుకుమారుఁ గాంచెను. బసవరాజు తమ్ముడు అక్కరాజు రామాంబయను భార్యయందుఁ బెద్దరాజు, అప్పరాజు (ఏతత్కృతి కర్తయైనవాఁడు) అను సుతుల నిద్దరఁగాంచెను. పెద్దరాజు లక్ష్మమాంబను బెండ్లి

ంయూడె. వారికి బాచరాజు, వేంకటపతిరాజు, నను నిద్దరు కొడుకులు కల్గిరి. అక్కరాజు తమ్ముఁడు బాచరాజు, గుర్వమాంబ నుద్వాహమయ్యెను. బాచరాజు తమ్ముఁడు పేరిరాజు వేంకటాంబను బెండ్లియాడె. ఈ యిర్వురకు వేంకటాద్రి, అప్పరాజు, మాధవరాజు, బసవరాజు, నను కొమరులు జనించిరి.

(c) ప్రబోధచంద్రోదయము.

PRABŌDHACANDRŌDAYAMU.

Foll. 171*a*—214*b*.

This is a Prabandha in five Āśvāsas giving a Telugu version of Krsnamiśra's Prabōdhacandrōdaya which is an allegorical drama expounding the principles of the Advaita Vēdānta. The work was composed by Mallaya, son of Nandi Singaya and Singaya, the Malayamāruta, son of Ghanṭa Nāgaya; and it was dedicated to Pesalavāya Gangayāmātya. The portion in the introduction narrating the genealogy of the poet's patron is omitted in this MS. and hence not given. Otherwise the work is complete. Vārāhapurāna is another work composed by the author and it was dedicated to Narasarāju, father of Krsnadēvarāya.

**Beginning:**

శా. శ్రీ నిత్యంబుగ నిచ్చు నాహరివిరించి స్తంబపర్యంత మీ
నానాజీవులలోన రత్నములలోన న్సూత్రముంబోలెం దా
లీనుం డయ్యు జగత్కరండక నిచోలీభావముం దాల్చుబో
ధానందైకమయుండు శంకరుఁ డనంతామాత్యుగంగయ్యకున్.

(కృతిపతి వంశవర్ణనముగల గ్రంథభాగ మొకకొంత యీ ప్రతియందు విడనాడఁబడెను.)

సీ. సరిలేనినీతిచాతురిచేత రాజ్యతం
త్రంబులు నడిపిననమువుఁ గాని

యనిశంబుఁ బుష్పచందనవనితాది సౌ
ఖ్యంబుల నందిన నందుఁ గాని
సంగీతసాహిత్య సరసవిద్యావినో
దంబులఁ దగిలినఁ దగులుఁ గాని
స్వామిహితాసక్తి సదవనాసదనుశా
సనలీల జరిపిన జరుపుఁ గాని

గీ. నీళ్లలోపల సరసిజినీదళంబు
సరణి నిర్లేపుఁడైన సంసారయోగి
సందియము లేదు ప్రత్యక్షశంభుమూర్తి
యీయనంతయ గంగమంత్రీశ్వరుండు.

క. అని శివపూజావసర
మ్మున దీవనలిచ్చి పొగడి బుధులుఁ గవులు ని
ట్లని పలికిరి కౌతుకమున
గనబల(?)శృంగావతీర్ణగంగారభటిన్.

ఉ. ఈదృశవర్తనంబునకు నెక్కుడువన్నె యగుం బ్రబోధచం
ద్రోదయ మంధ్రభాష నతియోగ్యకవీంద్రునిచే నిజాంకితం
బైదిశలన్ బ్రసిద్ధముగ నందినఁ గస్తురితావి హైఁజికిన్
మేదురహేమకాంతిధరణిన్ మృగనాభికిఁ గల్గులాగునన్.

* * * *

క. అనవుడు ననంతవిభుగం
గనవారలఁ జూచి యీమహానాటకమున్
దెనుఁగునఁ బ్రబంధశయ్యకు
నొనగూర్పఁగ నేర్చు సుకవు లుర్విం గలరే.

వ. అని పలికిన,

సీ. కలరు కౌశికగోత్ర కలశాంబురాశిమం
దారంబు సంగీతనంది నంది

సింగమంత్రికిఁ బుణ్యశీల పోచమ్మకు
నాత్మసంభవుఁడు మల్లయమనీషి
యతనిమేనల్లుఁ డంచిత భరద్వాజగో
త్రాగ్రామచైత్రోదయంబు ఘంట
నాగధీమణికిఁ బుణ్యచరిత్ర యెల్లమాం
బకుఁ గూర్మితనయుండు మలయమారు

గీ. తాహ్వాయుఁడు సింగనార్యుండు నమృతవాక్కు
లీశ్వరారాధకులు గాంతు లిలఁ బ్రసిద్ధు
లుభయభాషల నేర్పరు లుపమరులు స
మర్థు లీకృతిరాజనిర్మాణమునకు.

వ. అని పలికిన వారలం గను గొని వికసితవదనారవిందుండై మీతలంపు నాతలంపు నేకంబయ్యె నిదియ సరిలేని శుభనిమిత్తంబని నూతనకనకరత్నమయమహాస్థానమంటపంబునకు వచ్చి మమ్ముఁ బిలిపించిన మేమును . . . . కొలువున్న తన్మంత్రిశేఖరుం గనుంగొని పరమహర్షంబుతో నాశీర్వదించిన నతండు,

* * * *

క. నేరుపరి పోహణించిన
హారము వెలయెక్కు-లీల నతిశయముగ నా
పేరఁ దెలిఁగింపవలయును
సారపుఫణుతులఁ బ్రబోధచంద్రోదయమున్.

తే. అనిన సౌందర్యలక్ష్మికి యౌవనోద
యంబు దొరకినగతి నిమ్మహాప్రబంధ
మునకుఁ బతివైతి మాకు నపూర్వమైన
కీర్తి గలిగె నటంచు నంగీకరించి.

సీ. . . . . . . . .

గీ. అట్టిసర్వేశుతోడి తాదాత్మ్యమహిమఁ
గలిగి పరిపూర్ణభావ విఖ్యాతులైన
దక్షిణామూర్తి దేశికోత్తము నఘోర
శివుఁ భజియించి యేకాగ్రచిత్తములను

క. బాధ్యప్రబోధబోధక
తాధ్యాసీనాత్మ తన్మయస్ఫురదెరనా
రాధ్యానుగ్రహసంతత
శుద్ధ్యంతఃకరణునకును సుగుణాంబుధికిన్.

* * * *

వ. అభ్యుదయపరంపరావాప్తిగా మారచియింపఁ బూనిన ప్రబోధచంద్రోదయంబను మహాకావ్యంబునకుఁ గథాసూత్రం బెట్టి దనిన.

* * * *

Canto 4 ends –

క. ప్రఖ్యాతనాచికేతూ
పాఖ్యాన మహాప్రబంధ పరిమళితసుధీ
వ్యాఖ్యాన శ్రవణోదిత
సౌఖ్యా సంఘటితచిత్త శంకరసఖ్యా.

**End:**

మంగ. శ్రీకరుణ శీతకర శేఖరసరోజభవ సేవితధనేశ్వరరమాస్యో
దారవివిధోపనిషదర్థనిహామైక నిలయ ప్రతిభనిర్మలచరిత్రో
దారశిబికర్ణవిబుధక్షితిజ ఖేచరవదాన్యగుణ జైత్రఘనదాన
స్ఫారశిబికాధవళచామరతురంగకరిసంఘయుతమంగళ
[మహాశ్రీ.

**Colophon:**

ఇది శ్రీమదుమామహేశ్వర వరప్రసాదలబ్ధసారసారస్వతాభినంది నందసింగయామాత్యపుత్త్ర మల్లయమనీషితల్లయ(జ ?) మలయ

మారుతాభిధాన ఘంట నాగయప్రధానతనయ సింగయకవిపుంగవ ప్రణీతంబైన ప్రబోధచంద్రోదయంబను మహాప్రబంధంబునందు సర్వంబును బంచమాశ్వాసము.

ప్రతివిలేఖకుఁడు గ్రంథాంతమం దిట్లు వ్రాసికొన్నాఁడు :—

“ విళంబి సంవత్సర కార్తిక బ ౨ ఆదివారమువఱకు వడ్డాది సుబ్బన్న కొమారుడు వేంకట్రాయడు ప్రబోధచంద్రోదయమును సంపూర్ణముగా వ్రాసెను.”

(వి-వి.)—

సమగ్రము కాని, కృత్యవతరణమున కృతిపతివంశవర్ణనపుఁ బద్యములు పెక్కు విడనాడఁబడెను. వ్రాఁత చక్కనైయున్నది. తప్పులు లేవు. శైథిల్యము లేదు. గ్రంథపాతము లింతకంటె లేవు.

ఇది సంస్కృత భాషయందుఁ కృష్ణమిశ్రునిచే రచింపఁబడిన ప్రబోధచంద్రోదయమను నద్వైతవేదాంత ప్రతిపాదకమగు నాటకమునుబట్టి, నందిసింగయ కుమారుఁడగు మల్లయచేతను, నాతనికి మేనల్లుఁడును ఘంట నాగయ కుమారుఁడును మలయమారుత బిరుదాఖ్యుఁడును నగు సింగయచేతను రచింపఁబడిన యైదాశ్వాసముల ప్రబంధము. పెసలవాయాన్వయుఁడగు గంగయామాత్యున కిది యంకితము సేయఁబడినది. కృతిభర్త వంశాదివృత్తాంత మీ ప్రతియందు విడువఁబడియుండుటచే నీ విషయ మింతకంటె నిందు విశేషించి తెలుపఁ గుదురదయ్యె. ఈ కవులచేతనే వారాహపురాణమును కృష్ణదేవరాయల తండ్రియగు నరసరాజునకుఁ గృతిగా రచింపఁబడెను. గ్రంథకర్తలను గూర్చి విశేషములు పై నుదాహరింపఁబడిన పద్యములఁబట్టి కనుఁగొనునది.

---

(*d*) భోజరాజీయము.

BHŌJARĀJĪYAMU.

Foll. 215*a*—225*b*

This contains a number of moral stories connected with king Bhōja. The author of the work is Anantāmātya. This MS.

begins in the course of the sixth Āśvāsa and breaks off in the seventh. Hence extracts relating to the author are not given here (వి-పి.)—

అసమగ్రము. ఆఱవ యాశ్వాసమున సగమునుండి యేడవ యాశ్వాసమున సగమువఱకే కలదు. వ్రాఁత బాగున్నది. తప్పులు లేవు. శైథిల్యము లేదు. గ్రంథపాతములు లేవు.

ఈ ప్రబంధ మనంతామాత్యునిచే రచింపఁబడినది. గ్రంథమున నత్యల్పభాగమే యుండుండుటచే విషయవివరణము కావింప రాదయ్యె.

R No. **51.**

Palm-leaf. 16×1⅛ inches Foll. 122 Lines, 6 in a page. Telugu. Injured.

Presented by the same owner as the last in 1911–12.

షట్చక్రవర్తిచరిత్రము.

SAṬCAKRAVARTICARITRAMU.

This is a Prabandha in eight Āśvāsas narrating the story of six emperors of olden times, viz., Hariścandra, Nala, Purukutsa, Purūravas, Sagara and Kārtavīryārjuna. The author of the work is Mallāreḍḍi, son of Kacabhūpāla of Rācuḷḷagōtra. The work is dedicated to God Siddharāmēśvara worshipped in the shrine at Bikkanavōl in the Gōdāvari district.

The work in this MS. is complete, but a portion in the introduction is wanting.

**Beginning :**

క. శ్రీమద్భూమీధరపు
త్త్రీమణి కుచకుంభికు భమృగమదవిదిత
శ్యామలకోమలవక్షో
దామున కభిరామభూమిధరధామునకున్.

**End :**

తో. శక్రసుతక్రమ శౌర్యసకాశా
చక్రధరస్తుత శక్రసకాశా

శుక్రద్య గాహాత శుక్రదృగాశా
విక్రమసిద్ధనివేశ మహేశా।

**Colophon:**

ఇది శ్రీమద్బికరానవోలిపట్టణ ప్రసిద్ధ సిద్ధసరస్తటావలంబ సాంబ సిద్ధరామేశ్వర వరప్రసాదసమాసాదితసంస్కృతాంధ్రభాషా కవితా రసపోషణవిశేషతాచమత్కార గురుభక్తివిహార రాచుళ్ల గోత్రపవిత్ర కాచభూపాలపుత్త్రి బుధజనవిధేయ మల్లారెడ్డి నామధేయ ప్రణీతంబైన షట్చక్రవర్తిచరిత్రంబను మహాప్రబంధం బునందు సర్వంబు నష్టమాశ్వాసము.

ప్రతి విలేఖకుఁడు గ్రంథాంతమం దిట్లు వ్రాసికొనెను :—

"భావనామ సంవత్సర పుష్యశు ౧౦ శుక్రవారము రోజున మూఁడు యామాలవఱకు మడపా లక్ష్మీనారాయణుఁడు షట్చక్ర వర్తి చరిత్ర అనే ప్రబంధము అనుమంచి జగన్నాథము వ్రాసిన ప్రతిచూచి తన ఖాసాకు శ్రీరామార్పణంగా వ్రాసుకొనెను."

(వి-వి.)—

మొదలు లేదు, షష్ఠ్యంతములనుండి తుదదనుక సమగ్రముగఁ గలదు. వ్రాఁత చకరాఁగ నున్నది. శైథిల్యము కలక. గ్రంథపాత ములు గలవు. తప్పు లంతగా లేవు.

ఈ యెనిమిదియాశ్వాసములప్రబంధమందు హరిశ్చంద్రుఁడు, నలుఁడు, పురుకుత్సుఁడు, పురూరవుఁడు, సగరుఁడు, కార్త వీర్యార్జునుఁడు నను నాఱుగురు చక్రవర్తుల చరిత్రములును వర్ణింపఁబడినవి. రాచుళ్లగోత్రజుఁడును, గాచభూపాల పుత్త్రుఁ డును నగు మల్లారెడ్డి గ్రంథకర్త. గోదావరీ మండలమందలి బికరా నవోల్పట్టణమందు వెలసిన సిద్ధరామేశ్వరస్వామి కీకృతి సమ ర్పింపఁబడెను.

R. No. **52**

Palm-leaf. 16½ × 1¼ inches. Foll 67. Lines, 6 in a page. Telugu. Injured.

Presented by Brahmānanda Rao of Cocanada in 1911-12.

షట్చక్రవర్తిచరిత్రము.

ṢAṬCAKRAVARTICARITRAMU.

Same work as the above.

Āśvāsas six to eight.

(వి-వి.)—

అసమగ్రము. ఆఱవ యాశ్వాసమునుండియే కలదు. శైథిల్యము కలదు. గ్రంథపాతములు అల్పముగాఁ గలవు. వ్రాఁత బాగున్నది. తప్పు లంతగా లేవు.

ఇది నెం 51 రున వర్ణితమగు గ్రంథమే.

గ్రంథాంతమున నాలుగురు చక్రవర్తులను గీర్తించెడు సీసపద్యము లేడు గలవు.

---

R. No. **53**.

Palm-leaf. 11 × 1¼ inches Foll 189 Lines, 5 in a page Telugu. Good.

Presented by K. R. V. Kṛṣṇa Rao Bahadūr of Pōlavaram in 1911-12.

పంచతంత్రి.

PAÑCATANTRI.

This is the Telugu rendering of the Sanskrit Pañcatantra. by Dūbagunta Nārāyana. The introduction is wanting in this MS. and the work breaks off in the fourth Tantra.

**Beginning:**

వ. అభ్యుదయపరంపరాభివృద్ధిగా నా యొనర్పంబూనిన పంచతంత్రియను మహాప్రబంధంబునం గల కథలకు నలంకారంబుగా వర్ణింపం దగిన పాటలీపురం బెట్టి దనిన.

**End:**

ఉ. గుండియఁ బుచ్చి చెవు కొనకొన్నపయింబదిలంబు చేసినే
నుండుము నట్టిభారమున కోర్వక యప్పుడు నేఁడు నే సభా
గ్యుండను నీకు నకటంకుఁగూర్చిన సొమ్మునిము న్నెఱింగి లే
కుండుటఁ జేసియేమని . . . . .

(వి-వి.)—

అసమగ్రము. గ్రంథావతరణము లేదు. లబ్ధనాశమను నా ల్గవ తంత్రము కొంతభాగమువఱకే కలదు. వ్రాఁత యొకమాది రిగా నున్నది. తప్పులంతగా లేవు. శైథిల్యము లేదు. గ్రంథ పాతములు లేవు.

ఇది సంస్కృతమునఁ గల పంచతంత్రియను నీతిశాస్త్రమునకు దూబగుంట నారాయణ కవిచేఁ జేయఁబడిన తెల్గుసేఁత. అసమగ్ర ముగ నుండుటచే నిందు విషయవివృతి చేయఁబడదయ్యెను.

## R No. 54.

Palm-leaf. 13¾ × 1¼ inches Foll. 86 Lines, 7 in a page Telugu. Good.

Purchased by P. D. Śrīnivāsa Śāstri of Tonjore in 1910–11.

(*a*) పరమానందశతకము.

PARAMĀNANDAŚATAKAMU.

Foll. 1*a*—8*a*

This consist of 111 Kandapadyas in praise of Visnu and Śiva, and treating of Advaitic oneness of the universe: by Paramānandayatīndra. He is also the author of Dattātrēyaśataka and Sampangimannaśataka. Wants Padyas 31 to 39.

**Beginning:**

క. శ్రీవర గిరిజానాయక
గోవింద లలాటనేత్ర గోకులతిలకా
భావజసంహార హరిహర
భావాత్మక శివ ముకుంద పరమానందా!

క. దైవము లిద్దఱు లేకో
దేవాదిస్మృతులవలనఁ దెలియఁగ నొకటే
భావించెద మిము లేకీ
భావంబున శివముకుంద ! పరమానందా !

**End:**

క. పరమానందయతీంద్రుని
విరచిత మీశతక మిలను విఖ్యాతముగా
గురుతింపఁ జగదధీశ్వర
పరమాత్మా ! శివముకుంద ! పరమానందా !

పరతత్త్వం బిది శతకము
పరమరహస్యంబు ముక్తిభాజన మిలలోఁ
బరయోగివిలాసం బిది
పరమాత్మా ! శివముకుంద ! పరమానందా !

క. హరి హర గిరిధర పురహర
గరుడధ్వజ నీలకంఠ కనకాంబర శం
కర మాధవ గౌరీధవ
పరమాత్మా ! శివముకుంద ! పరమానందా !

(వి-వి.)—

అసమగ్రము. 1 మొదలు 30 వఱకును, 40 మొదలు 111 వఱకును, సరిగా నున్నవి. ముప్పదవ పద్యమునుండి నలుబదవ పద్యమువఱకు వ్రాయఁబడి యుండలేదు. వ్రాఁత తిన్నగనే యున్నది. తప్పులు లేవు. శైథిల్యము లేదు.

పరమానంద యతీంద్రునిచే " శివముకుంద ! పరమానందా " యను మకుటముతో నీ కందపద్య శతకము రచింపఁబడినది. దీని యందద్వైత వేదాంతవిషయమును నీతియును బ్రతిపాదింపఁబడినవి. ఈ పరమానంద యతీంద్రుఁడు దత్తాత్రేయ శతకమును, సంపఁగి మన్న శతకమును గూడ రచియించె.

(b) దత్తాత్రేయశతకము.

DATTĀTRĒYAŚATAKAMU.

Foll. 9a—15b.

This consists of 112 Kandapadyas addressed to Dattātrēya-yōgi and treating of Advaita Vēdānta and Yōga: by the same author as the last.

Complete.

**Beginning:**

క. శ్రీవిలసిత వరసంయమి
సేవిత పాదారవింద చింతితఫలదా
కావుము మము నెల్లప్పుడు
తావరముగ గుణవిధేయ! దత్తాత్రేయా!

క పరమానందయతీంద్రుఁడఁ
బరమవివేకానుబంధభాగ్యోన్నతిచే
విరచించెదఁ గృతిఁ గైకొను
తరమిడి కరుణావిధేయ! దత్తాత్రేయా!

**End:**

క. తనగురు వెవ్వఁ డెఱుంగును
తన కందఱుగుట్టు లెల్లఁ దగఁ గనిపించున్
దనగుట్టు తెలియు నతఁడున్
దనవలెనే ముక్తుఁడాయ దత్తాత్రేయా!

శా. శ్రీవిఖ్యాతిగ నాత్మతత్త్వరచనాసిద్ధాంతవాక్యార్థముల్
ఠీవి న్మీఱఁగ గద్యపద్యములఁ బ్రౌఢిం జెప్పి యర్పించితిన్
దేవా! కైకొను భక్తవత్సలతఁ బ్రీతిన్ నన్ను రక్షింపు ప్ర
జ్ఞావిర్భూతప్రమోదచిత్తమున దత్తాత్రేయయోగీశ్వరా!

(వి-వి.)—

సమగ్రము. 112 పద్యములు గలవు. వ్రాఁత తిన్నగనే యున్నది. తప్పు లెడనెడఁ గలవు శైథిల్యము లేదు. గ్రంథపాతములు లేవు.

"దత్తాత్రేయా" యను మకుటముతో మఱియు నీ కంద పద్యశతకము పరమానంద యతీంద్రునిచే రచింపఁ బడినది. ఇం దద్వైతవేదాంతవిషయమును యోగవిషయములును బ్రతిపాదింపఁ బడినవి. ఈ పరమానందయోగీంద్రుఁడు, సంపఁగిమన్నశతకమును, బరమానంద శతకమును గూడ రచియించెను.

---

(c) సంపఁగిమన్నశతకము.

SAMPAÑGIMANNAŚATAKAMU.

Foll. 40a—47a. Foll. 16a—23a.

This consists of 116 Kandapadyas addressed to Sampangimanna and treating of Vēdānta as in the last: by the same author.

Complete.

**Beginning:**

క. శ్రీమానినీమనోహర
సోమార్కవిశాలనేత్ర సురనుతచరణా
దామోదర నీలమణి
శ్యామా నను బ్రోవవన్న సంపఁగిమన్నా!

క. పరమానందయతీంద్రుఁడఁ
బరిపూర్ణుఁడనైన నీదుభక్తుఁడ నెలమిన్
విరచించెద నొకశతకము
శరణాగతసుప్రసన్న! సంపఁగిమన్నా!

క. విను చెప్పనేరనైనను
ఘనమే నతిగనుకఁ గూరగాయకవిత్వం
బనక కృపామతిఁ గైకొను
సనకాదిమునిప్రసన్న! సంపఁగిమన్నా!

**End**

క. వినుము మృదువచనరచనలఁ
దనరంగ గృతి లోకసమ్మతంబుగ వెలయన్
ఘనయోగివరులు మెచ్చగ
నను బరమానందతీర్థయతి రచియించెన్.

(బి-బి.)—

సమగ్రము 116 పద్యములు గలవు. వ్రాఁత తిన్నగ నున్నది. శైథిల్యము లేదు. గ్రంథపాతములు లేవు.

“సంపఁగిమన్నా” యను మకుటముగల యీ కందపద్య శతకము పరమానంద యతీంద్రునిచే రచింపఁబడినది. నీతి, అద్వైత వేదాంతము, నిందుఁ బ్రతిపాదింపఁబడినవి. ఈ పరమానందయతీంద్రుఁడు పరమానందశతకము, దత్తాత్రేయశతకము నను గ్రంథములఁగూడ రచియించెను.

Foll. 23*b*, 24 and 25 contain some Padyas from four different works as detailed below:—

గ్రంథాంతమున నాల్గు పుటలలో 4 చెన్నమల్లు సీసములును నే గ్రంథములలోనివో 3 యోగశాస్త్ర విషయ ప్రతిపాదకములగు సీసపద్యములును, “తారక బ్రహ్మనామ! సీతాభిరామ” అను మకుటపు సీసపద్యమొకటియు, యోగీంద్రవర్య శతకపుఁ బద్యమొకటియుఁ గలవు.

## R. No. 55.

Palm-leaf. 16½ × 1½ inches. Foll 116. Lines, 6 in a page. Telugu. Good.

Presented by K. R. V. Kṛṣna Rao Bahadūr, the Zamindar of Pōlavaram, in 1911–12.

పార్వతీపరిణయము.

PĀRVATĪPARIṆAYAMU.

This is a Prabandha in six Āśvāsas describing the birth and marriage of Pārvatī: by Rāyaraghunātha Tondamān, son of Vijayaraghunatha of Pudukōta and pupil of Mahōddanḍakavi. His son, Nudurupāṭi Veṅgana, who is a Velanāṭi Brahmin and author of Āndhrabhāsārṇava, lived in the court of this royal author. The work is dedicated to God Gōkarṇēśvara worshipped at Pudukōṭa.

Complete.

**Beginning :**

శా. శ్రీమత్పర్వతరాజకన్యను వరించేవేళఁ దన్మాత సొ
మ్మేమైనానిడుమన్న నెట్లనుచు మున్నే యోజనంజేసె నా
హేమాద్రిన్ మణులం జెలంగుటను జూపేచ్ఛన్ వలెన్ బట్టితా
గీ మెల్లన్ రజతంబుచేయునసితగ్రీవుండు నన్ బ్రోవుతన్.

క. సరసీరుహాభవవనితా
కరయుగఘుణఘుణితరత్నకంకణనినద
స్ఫురితరసభరితమృదుపద
విరచితకావ్యశతకార్య వెంకన్నార్యన్.

వ. కాంచి స్వప్నఁబొకటి కంటి వినుమన నతండు పెద్దలకుఁ
దెలుపుమన నీ కన్న నెవరని యతనిఁజూచి.

* * * *

గీ. ముందు వెలనాడు దివ్యమా నంములోన
నుదురుపాటికులంబున నెదురుగాన
నచట నుద్దండకవి సుతుండైనవెనుక
శంకరునిమించుఁ ద్వచ్చర్య వెంకనార్య!

వ. . . . . . . . . . . . . . . .
. . నీవు తెలుపకమున్నె తెలిసె శంకరుండు గౌరినిజూపి
కళ్యాణంబుసేయించుమనుట యేమని యడుగవచ్చితివి. అది ప్ర
బంధరూపంబుగా నొనరింపుము. స్వీయుండు గాననిన్నడిగె.
ఇంద్రుండు శివార్చనానిస్తంద్రుఁడు తత్కులప్రసూతుండవీవు నది
యెట్లంటేని,

సీ. గీ. అల్లదేవేంద్రుఁ డలవియేయతనిఁబొగడ.

క. అతఁ డొక నాఁడొకమానవ
సతిని వరించెను దదీయసౌందర్యం బ

ద్భుత మగుఁగద యాయింతిక (కి?)
సుతు లంతటఁ గలిగి రలఘుసుగుణాన్వితులై.

క. ఆయన్వవాయమండలి
రాయక్షితిపాలమౌళి రాజిల్లె యశ
శ్శ్రీయుక్తిని బ్రహ్మాండం
బాయెడఁగాఁ (?) బాలకడవ యట్లు చెలంగెన్.

క. ఆరాయనృపతి గాంచెఁ గు
మారుల రఘునాథరాయమహిపతి నమన
త్స్మారమణుఁడు పచ్చనహం
వీరుఁడు పేరమవిభుఁ డన విరలలోనన్.

క. ఆరఘునాథనృపాలుఁడు
ధారుణి నేలంగఁ దొడఁగె దైవతయువతీ
హారపటీరతుషారశ
తారసుధారసవిధాముధాకృతికీర్తిన్.

* * * *

గీ. అతఁడు గాంచెను బెద్దరాయక్షితీంద్రు
భుజబలవిహారు శ్రీముద్దువిజయధీరు
ధర్మగుణశీలుఁ దిర్మలధరణిపాలు
రవితులితదేహవిభుఁ జిన్నరాయవిభుని.

సీ. గీ.

అట్టితిర్మలవిభు నెన్న నలవియగునె.

గీ. అతఁడు గాంచెను శ్రీవిజయరఘునాథ
నరపతిశిఖామణిని ముద్దునమనవిభుని
రాజగోపాలధీరుఁ దిర్మలనృపాలు
నవల రణభాషిఖాఖ్యు మహాద్భుతమున.

వ. అకుమారులందు,

గీ. హరిని దలఁచనియట్టి దికరిరుల రోసి
గండములఁ గల్గు కరులను గడకుఁ దోసి
ధారుణీ కాంత వరియించెఁ దానె యంత
విజయరఘునాథు జయభార్గవీసనాథు.

* * * *

క. తెలిసెఁ గద నీకుఁ దావక
కులరీతులు నుతకవీంద్ర కోటినిజాఖ్యా
కలితజపా ఫలితతపా
లలితకృపా ! కోటిరాయరఘునాథనృపా !

* * * *

వ. అనినఁ గులరీతిఁ దెలిసియుండియు మహాకవి ప్రశంసించిన నతిశ్లాఘ్యతమం బనియెంచి విని కృతిభర్త యెవ్వండని యూహింప నిష్టదేవతారమణుండగు గోకర్ణేశ్వరుండు స్ఫురించిన.

* * * *

**End** :

గీ. అల్ల గౌరియె బృహదంబ యల్ల హరుడు
నీవు నీపెండ్లి నేను వర్ణించినాఁడ
వ్యాసమతకృతులను వాసి యరసి నన్నుఁ
గరుణ మనుచుట వాసి గోకర్ణవాసి.

క. గిరివర్యదుహితృవిభ్రమ
పరిమర్దితధైర్య స్వీయపదభక్తివిభా
సురసురగణసురుచిరఘృణ
గురుతరగుణరత్నకోశ ! గోకర్ణేశా !

**Colophon :**

ఇది శ్రీమద్బృహన్నాయికా కృపాకటాక్ష సంప్రాప్త నిత్యమహాసామ్రాజ్యధుర్య సర్వమహీపాల సంస్తూయమాన శౌర్యౌదార్యగాంభీర్య శోణాయమానదృక్కోణ విలోకనమాత్రహస్తగత సామంతదుర్గ నిరంతరపూజాసంతోషితభర్గ కోటిసమాఖ్యా

సమాఖ్యాతసతుగలకలశపయోధిరాకాశశాంక, ఘంటికాతురగ కరవాలదామశార్దూలకృత్తిపల్ల్యయనహయసింహాస్యకటక నీలాతపత్రహనుమద్ధ్వజమకరకేతనదివాదీపికాదినిఖిలబిరుదాంక, వాత్స్యాయనాదివేదాంతపర్యంతనిఖిలతంత్రనిర్మితగ్రంథ, స్వకృతప్రబంధ విదితమహాకవిప్రబంధ, నూతనతంత్రకరణసామర్థ్య నిరంకుశప్రతిభావిభాసుర, బహుళాగ్రహార ప్రతిష్ఠాసంతోషితభూసుర, కులక్రమాయాతసాహిత్యవిద్యానవద్య సకలసమ్మతనిజబిరుదపద్య, దక్షిణాస్య సంసేవనా జీవన్ముక్తాయమాన శ్రీ విజయరఘునాథమహీనాథ గర్భశుక్తిముక్తాయమాన, మహోద్దండకవిశిష్యధేయ శ్రీరాయరఘునాథ తొండమాన్ మహీపాలనామధేయ ప్రణీతంబైన పార్వతీపరిణయంబను మహాప్రబంధంబునందు సర్వంబును షష్ఠాశ్వాసము.

(బి-బి.)—

సమగ్రము. వ్రాత చక్కగా నున్నది. వ్రాత తప్పులు లేవు. శైథిల్యము లేదు గ్రంథపాతములు లేవు.

ఆరాశ్వాసముల యీహృద్యప్రబంధమందుఁ బార్వతీజననము, కాముఁడు దేవేంద్రప్రేరణమున శివతపోభంజనము కావింపనరుగుదెంచి శివుని కంటిమంట నీఱగుట, పార్వతీతపశ్చర్య, పార్వతీపరమేశ్వర పరిణయము, వర్ణింపఁబడినవి. గ్రంథకర్త పుదుకోట ప్రభువగు రాయరఘునాథతొండమాన్ మహీపాలుఁడు. ఈతఁడు విజయరఘునాథమహీనాథుని పుత్త్రుఁడు. మహోద్దండకవి శిష్యుఁడు. ఈతనియాస్థానమున వెలనాటిబ్రాహ్మణుఁడును, మహోద్దండకవి పుత్త్రుఁడును, ఆంధ్రభాషార్ణవాది గ్రంథకర్తయునగు నుదురుపాటి వేంకనార్యకవి కలఁడు. ఈ వేంకనార్యుఁడు కావ్యశతమును రచియించెనఁట. ఈ ప్రబంధము, పుదుకోటలో వెలసిన గోకర్ణేశ్వరస్వామికి సమర్పింపఁబడినది. గ్రంథకర్తనుగూర్చి విశేషములు పైనుదాహరింపఁబడిన పద్యములఁ బట్టి తెలిసికొననగు.

R. No. 56.

Palm-leaf. 16¼ × 1¼ inches. Foll. 76. Lines, 6 in a page. Telugu Slightly injured.

Presented by Brahmānanda Rao of Cocanada in 1911–12.

నలరాజచరిత్రము.

NALARĀJACARITRAMU

This is a Prabandha in five Āśvāsas narrating the exploits of Nala and his marriage with Damayanti: by Tirumalarāja, son of Kūnanṛpāla of Dhanañjayagōtra and Rudrarāja family. The work is (Nirōṣṭhya) composed without using labial letters; and it is dedicated to God Antarvēdilakṣmīnṛsimha.

Incomplete.

**Beginning:**

క. శ్రీకాంతాలలితానన
రాకాశశిసాహచర్యగసికకటాక్షా
లీకలనాశ్రితజనరా
జీకల్యాణార్థజనక శ్రీనరసింహా!

గీ. సదయహృదయుఁడు జిత్తగించఁగఁ దగియె
నంత నాక్రీడదర్శనాత్యంత కేళి
యందు చనిచని జగతీతలాధినేత
సరసజనహార్దకరమైన సరసి గాంచె.

**End:**

ఉ. అంతర్యామితగన్న దేవరడె యీ యారంభ మూహించి య
త్యంతప్రేరణ యాచరింపఁగని రోష్ఠ్యంబైన యీకావ్య మా
ద్యంతంబుఁ సమకూడె దీనిఁ గరుణార్ద్రా రేయుతం జూడుమో
యంతర్వేదిపురినివాస! నరసింహా! దేవచూడామణీ!

పంచ. రమావధూకపోలపాళిగమ్యపత్రవల్లి కా
సమాజకల్పనైకశిల్పచాతురీధురావహా
సమానతానవద్యదీనజాతపంకజాతభూ
సమానతానివారిరాజ్యసౌఖ్యదాన పండితా!

**Colophon:**

ఇది శ్రీమదంతర్వేదిలక్ష్మీనృసింహస్వామి చరణారవిందైక శరణ రుద్రరాజాన్వయాభరణ ధనంజయగోత్రపవిత్ర కూనన్నపాల పుత్త్ర నిరర్గళకవితావిలాససంతోషితానేకవిద్వత్కవిరాజ తిరుమలరాజ ప్రణీతంబైన నలరాజచరిత్రంబను నిరోష్ఠ్య ప్రబంధంబునందుఁ బంచమాశ్వాసము.

ప్రతి విలేఖకుఁడు గ్రంథాంతమం దిట్లు వ్రాసికొనెను: —

"పరీధావినామ సం॥ జ్యేష్ఠశు ౭ ఆ. మూఁడు జాముల సరికి చాగంటి చిన వెంకయ్య వ్రాసెను."

(వి-వి.)—

అసమగ్రము. ప్రథమాశ్వాసము తక్కఁ దక్కిన గ్రంథమెల్లఁ గలదు. వ్రాఁత బాగున్నది. తప్పు లంతగా లేవు. శైథిల్య మం దందుఁ గలదు. గ్రంథపాతములు లేవు.

ఐదాశ్వాసముల యీ ప్రబంధమందు, హంససందేశముఁ దొట్టి దమయంతీపరిణయాంతమునకుఁగల నలచరిత్రము వర్ణింపఁబడినది. ఈ ప్రబంధమున "ఉ, ప, ఫ, బ, భ, మ, వ" యను నోష్ఠ్య వర్ణములు విడనాడఁబడినవి. గ్రంథకర్త క్షత్రియుఁడు, ధనంజయగోత్రుఁడు, కూనరాజుకుమారుఁడు, రుద్రరాజాన్వయుఁడు, నగు తిరుమలరాజకవి. ఈ కృతి యంతర్వేది లక్ష్మీనృసింహస్వామి కర్పింపఁబడినది ప్రథమాశ్వాస మిందు లేదుగాన గ్రంథకర్తనుగూర్చి విశేషము లిందుఁ దెలుపఁగుదురదయ్యె.

R. No 57.

Palm-leaf. $10\frac{3}{8} \times 1\frac{1}{8}$ inches. Foll. 164. Lines, 5 in a page. Telugu. Slightly injured.

Presented by Brahmānanda Rao of Cocanada in 1911–12.

సుభద్రాపరిణయము.

SUBHADRĀPARINAYAMU.

A Prabandha in five Āśvāsas describing the story of the marriage of Subhadrā with Arjuna: by Jagannātha or Jagga, son of Kūcimañci Gaṅganāmātya of Kauṇḍinyagōtra and brother of Kūcimañci Timmakavi, the well-known author of Rasikajanamanōbhirāma and other works. Jaggakavi also wrote Candrarēkhāvilāpa. The work now described is dedicated to God Jagannātha worshipped at Purusōttamaksētra (Puri).

The work is complete This MS. is said to have been copied from one belonging to Kūcimañci Vēnkatrāju, a descendant of the author. The MS. is dated Śaka 1783, *i.e.*, 1861 A.D.

**Beginning:**

ఉ. శ్రీయలరన్ సుభద్రయును సిరియుఁ బార్శ్వములన్ మెలంగ న
త్యాయతలీల నీలకుధరాగ్రమునందు వసించి నిచ్చలున్
బాయక భక్తకోటి కనపాయశుభంబు లొసంగు శ్రీజగ
న్నాయక దేవదేవుఁ డభినంద్యకృపామతి మమ్ముఁ బ్రోవుతన్.

* * * *

గీ. నన్నపార్యుని దిక్కయ నాచిరాజు
సోము నమరేశు శ్రీనాథు భీమకవిని
రంగనాథుని బోతయఁ బ్రాజ్ఞవరుని
శంభుదాసుని భాస్కరు సంస్మరింతు.

సీ. కౌండిన్యగోత్రవిఖ్యాతుని గూచిమం
చ్యన్వయాంభోధినీహారకరుని
గంగనమంత్రిశేఖరునకు నంగనా
మణియగు లచ్చమాంబకును సుతుని

బహుకావ్యనిర్మాణబంధుర ప్రతిభునిఁ
గుక్కుటేశ్వరకృపాంకూరలబ్ధ
సత్కవితామహా స్సామ్రాజ్య భారధౌ
రేయుని బుధజనప్రియచరితుని

గీ. దెందులురి లింగనారాధ్య దేశికేంద్ర
దత్తమాహేశ్వరాచారవృత్తిరతుని
గందరాడ మహాగ్రామమందిరుని మ
దగ్రజునిఁ దిమ్మకవిరాజు నభినుతింతు.

*　*　*　*

క. వెరవొప్పార సుభద్రా
పరిణయ మొనరించి మాకు భక్తిదలిర్పన్
చిరముగఁ గృతి గావింపుము
సరసయశస్సాంద్ర! జగ్గసత్కవిచంద్రా!

వ. అని యానతిచ్చి యప్పరమేశ్వరుం డంతర్హింతుండైన నేను నత్యంత సంతుష్టాంతరంగుండనై.

*　*　*　*

క. శతధృతినుతచరణునకున్
దితిసుతకులహరణునకు సుధీరక్షణ వి
శ్రుతకరుణాభరణునకున్
నతజనశరణునకు నీలనగశరణునకున్.

వ. సమర్పణంబుగా నారచియింపఁ బూనిన సుభద్రాపరిణయం బునకుఁ గథావిధానం బెట్టిదనిన—

**End:**

మా. సరసగుణకలాపా సర్వలోకప్రదీపా
పరిచితమునిజాలా భవ్యకారుణ్యశీలా
హరిమణినిభగాత్రా యామినీశార్కనేత్రా
నిరుపమఖగవాహా నీలశైలేంద్రగేహా!

**Colophon:**

ఇది శ్రీమజ్జగన్నాయక దేవదివ్యకృపానిరీక్షణసంలబ్ధసారకవితా విచిత్ర కౌండిన్యసగోత్రపవిత్ర కూచిమంచిగంగనామాత్య పుత్త్రి సకల విద్వజ్జనవిధేయ జగన్నాథనామధేయ ప్రణీతంబైన సుభద్రా పరిణయంబను శృంగారరసప్రబంధంబునందు సర్వంబును షష్ఠాశ్వాసము సంపూర్ణము.

ప్రతి విలేఖకుఁడు గ్రంథాంతమం దిట్లు వ్రాసికొనెను :—

"దుర్మతి సం॥ శ్రావణ బ ౫ సోమవారము వఱకు ఓలేటి వేంకట కృష్ణారావు కూచిమంచి వేంకట్రాజు ప్రతిక్రమంగా లోకోపకారార్థం శ్రీ రుక్మిణీసత్యభామాసమేతశ్రీ కృష్ణార్పణంగా వ్రాసెను."

సీ. జననుతశాలివాహనశకాబ్దంబులు
రామదిక్పర్వత రాజసంఖ్య
సరణి దుర్మతినామ సంవత్సరశ్రావ
ణబహుళపంచమి నలినవైరి
వారంబువఱకు శ్రీ వైకుంఠు కృప సుభ
ద్రాపరిణయము సర్వంబు కూచి
మంచివేంకటరాజుమాతృక విధమున
వ్రాసెను వోలేటి వంశజలధి

గీ. చంద్రుఁ డననొప్పువియ్యన్న సత్కుమారుఁ
డైన వేంకటకృష్ణరాయాహ్వయుండు
ధరణి లోకోపకారమై పరఁగ బుధులు
తప్పు లున్నను దిద్దుఁడు దయదలిర్ప!

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత సకరమై యున్నది. తప్పులు లేవు. అల్పముగా శైథిల్యము గలదు. గ్రంథపాతములు లేవు.

సుభద్రాపరిణయమను పేరుగల యీ యాఱాశ్వాసముల ప్రబంధమున నర్జునుఁడు చాంద్రాయణవ్రతము సల్పు కాలమున సుభద్రను బెండ్లియాడు కథ వర్ణింపఁబడినది. గ్రంథకర్త కూచిమంచిజగ్గకవి. రసికజనమనోభిరామాదిగ్రంథప్రణేతయగు కూచిమంచి తిమ్మకవిసార్వభౌమునకుఁ దమ్ముఁడు ఈ జగ్గకవిచే చంద్రరేఖావిలాపమను వేఱొక క్షుద్ర కావ్యముకూడ రచియింపఁబడినది. ఈ సుభద్రాపరిణయమును జగ్గకవి పురుషోత్తమ క్షేత్రమున వెలసిన జగన్నాథస్వామి కర్పించెను. ఈ ప్రతి గ్రంథకర్త వంశపరంపరలోనివాఁడగు కూచిమంచి వేంకట్రాజుగారి ప్రతినిబట్టి వ్రాయఁబడినట్లు ప్రతివిలేఖకుఁడు వ్రాసికొనెను.

## R No. 58.

Paper. $8\frac{1}{8} \times 6\frac{5}{8}$ inches. Foll. 85. Lines, 23 in a page. Telugu. Good.

Presented by K. R. V. Krsna Rao Bahadūr of Cocanada in 1911-12.

యామినీపూర్ణతిలకావిలాసము.

YĀMINĪPŪRNATILAKĀVILĀSAMU.

This is a Prabandha in six Áśvāsas describing in Telugu the amorous story of Bilhana's marriage with his royal pupil. The Sanskrit Cōrapañcāśat of Bilhana is the basis of this work. By Cellapilla Narasakavi, son of Kāmaya and grandson of Rāmaya of Āpastambasūtra and Bhāradvājagōtra. The author lived in Kaḍiyam situated on the bank of the Gautamī, a branch of the Gōdāvari, and he is said to have been honored by Vēnkaṭanīlādribhūpāla of Piṭhāpura. He also composed another work called Vēnkaṭēśvaravilāsa The work under description is dedicated to Śrī Rāma.

Complete.

**Beginning :**

శా. శ్రీమద్దర్పణకల్పితాత్మసురతక్రీడాగృహాభ్యంతర
క్షేమారంభనవప్రదీపకళికాశ్రీరమ్యచిత్రావళీ

సామర్థ్యోదితదీపికాజనమతిన్ సద్వ్యస్త్రిపాలాపయా
భూమిప్రోద్భవఁ గౌగిలించి నగుతద్భూభర్త మమ్మేలుతన్.

గీ. సరససుజ్ఞానవరమంత్రచక్రవర్తి
సమదపరవాదిగజగజాసనకరాగ్ర
జాగ్రదుగ్రప్రతాపసమగ్రమూర్తిఁ
గోనయాఖ్యాంధ్రగురుకీర్తిఁ గూర్తు మదిని.

మ. తనరార స్మృతియుతు దాంతులను మేధావంతులన్ సాహితీ
ధనపిశాప్రింతుల భాష్యకాగమతసిద్ధస్వాంతులన్ మానసా
ర్చనగౌరీమణికాంతులన్ గుణవిభాస్వన్ముఖ్యనామాత్మబో
ధనహృద్వైదులవేంకటార్యజనభృత్సామంతులన్ శాంతులన్.

సీ. కుశలభారద్వాజగోత్రవిఖ్యాతుండు
వేంకయధీరుఁ డేవిభునితాత
రామనామార్యుఁ డేరామభక్తునితండ్రి
వినుతభాగాంబ యేఘనునిజనని
వేంకయ యన్నయ విఖ్యాతచర్యు లే
ధన్యమూర్ధన్యు సద్భ్రాతృవరులు
అఖిలసంస్తుతవేంకమాంబాఖ్యవిఖ్యాత
పరమసుసాధ్వి యేవరునిరాణి

గీ. యస్మహాత్ముని సకలజనానుమతుని
సరసకామయయన్నయనరసయాఖ్యు
లగుసుతత్రయజనకుఁడై యలరునట్టి
మద్గురునిఁ గామయాఖ్యుని మదిఁ దలంతు.

సీ. త్రిభువనపూతకృతిక్రియగల్గు గౌతమీ
తీరవితీర్ణధాత్రీప్రసిద్ధ

తరమైన కంకణపురవరస్థానసం
భూతిఁ జెందినవాఁడ భూసురుండ
శ్రీరామనామమంత్రారాధనపరుండ

. . . . . . . .

పూజ్యతరపాత్రిజ్యరాజ్యసత్ప్రతిష్ఠా
పురవరసామ్రాజ్యపరివృద్ధుండు

గీ. విమలరేచర్లగోత్రపవిత్రమూర్తి
రావు వేంకటనీలాద్రిరాయనృపతి
చేత సత్కృతిఁ బొందిన విఖ్యాతివడసి
నట్టినరసాహ్వయుఁడ జనానందకరుఁడ!

* * * *

End:

సీ. అని యిట్లు పూర్వోక్తరాంకితచోరపం
చాశత్సమాహ్వయోజ్జ్వలరసప్ర
ధానకావ్యకథాభిధానకల్పనచమ
త్కారగౌరవసూక్తిగలుగ నాదు
నేర్పుకొలఁది యామినీపూర్ణతిలకావి
లాసం బనఁగ నాంధ్రరచనఁ గూర్చి
భవదంకిత మొనర్చి భక్తితాత్పర్యస
మర్పణ చేసితి మనవి చిత్త

గీ. గింపు దీని సమస్తదిగ్దేశరాజ
సభలయందు వసించి యాచంద్రతార
కముగ వర్థిలఁజేయ రక్షకుఁడ వీవె
భూమిజానందసాంద్ర! శ్రీరామచంద్ర!

* * * *

మ. హనుమల్లక్ష్మణతత్కనిష్ఠభరతారాత్పత్యకైకేయినం
దనతారాసుతజాంబద్ఘదనులు ప్రాప్తపార్శ్వస్థైన్యర్థపా
వనిదిఙ్మారుతముఖ్యకోణములఁ గొల్వన్ సీత వామాంకమం
దెనయన్ మధ్యనెసంగురామునిసుఖాప్తిన్ గొల్చెదన్ శ్యాము
[నిన్.

**Colophon:**

ఇది శ్రీరామచంద్రగురుకరుణాకటాక్షవీక్షణసంలబ్ధసకలసంపూర్ణసగసశృం॰ రరసధారాధారమాధురీధురీణాలంకారితాంధ్రగీర్వాణకవితావిలాసవిచిత్ర విలసితాపస్తంబసూత్ర భారద్వాజగోత్రపవిత్ర చెళ్లపిళ్లకులసుధార్ణవరాకానిశాకర యశోధురంధర ధరామరప్రవర్య రామయనామార్య పౌత్త్ర కామకవిసుపుత్త్ర సకలజన విధేయ నరసయనామధేయప్రణీతంబైన యామినీపూర్ణతిలకావిలాసంబను శృంగారరసమహాప్రబంధంబునందు సర్వంబును షష్ఠాశ్వాసము సంపూర్ణము.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత సకర్నై యున్నది. తప్పు లంతగా లేవు. శైథిల్యము లేదు. గ్రంథపాతములు లేవు.

ఇది సంస్కృతభాషయందు బిల్హణకవిచే రచింపఁబడిన పూర్వోత్తరచోరపంచాశత్తులఁ బట్టి తెల్గునఁ బెంపొందించి రచింపఁబడిన యాఱాశ్వాసముల శృంగార ప్రబంధము. మదనాభిరామనృపతి కుమార్తెయగు యామినీపూర్ణతిలకకు బిల్హణకవీశ్వరుఁడు తొలుత విద్యాగురువుగనుండి యావల భర్తయగుకథ యిందు వర్ణింపఁబడినది. గ్రంథకర్త చెళ్లపిళ్ల నరసకవి. ఈతఁడు పిఠాపుర ప్రభువగు రావు వేంకటనీలాద్రిభూపాలునిచే సమ్మానింపఁబడినవాఁడఁట! గౌతమీతీరమందలి కడియమనుగ్రామ మీకవివాసస్థలము. ఈతఁడు, భారద్వాజగోత్రుఁడు; కామయకుమారుఁడు; ఈతనిచే

వేంకటేశ్వరవిలాసమను వేఱొక ప్రబంధముకూడ రచియింపఁ బడి
నది. ఈ గ్రంథము శ్రీరామునకు సమర్పింపఁ బడెను.

## R. No. 59.

Palm-leaf. 15⅝ × 1⅝ inches. Foll. 75 Lines, 6 in a page. Telugu. Slightly injured.

Presented by Brahmānanda Rao of Cocanada in 1910-11.

(*a*) రాజశేఖరవిలాసము.

RĀJAŚĒKHARAVILĀSAMU.

Foll. 1*a*—71*a*.

This is a Prabandha in three Āśvāsas dealing with the life of Bhallānarāya as given in Pālkuriki Sōmanāthakavi's Basavapurāṇa: by Kūcimañci Timmaya, son of Gangayāmātya of Kaundinyagōtra. He also composed Accatelugu Rāmāyaṇa.

Complete.

**Beginning:**

ఉ. శ్రీనగజాతనుద్యుతుల చెంగ్వ మెఱుంగులుగా వియన్నదీ
ధ్వానము లెల్ల గర్జితకదంబముగా రజతాచలాంబర
. . . . . . . . . . మీఱ మ
న్మానసబర్హి నెంతయు ఘనంబుగ సంతస మందఁ జేయుతన్.

మ. రమణన్నన్నయభట్టుఁ దిక్కమఖి నెఱ్ఱాప్రెగ్గడన్ భాస్కరున్
క్రమమింపొందఁగఁ బోతనాహ్వయుని లోకఖ్యాతుఁ డౌ జిష్ణుపూ
డమరేశున్ ఘను భీమసత్కవిని దథ్యం బొప్ప శ్రీనాథము
ఖ్యమహాంధ్రాంచితకావ్యకల్పకుల నేఁ బ్రార్థింతు నెల్లప్పుడున్.

సీ. గురుతరకౌండిన్యగోత్రవిఖ్యాతుండు
బయ్యనామాత్యుఁ డేభవ్యుతాత

ఖరతాన్న దానవర్ణితయశస్సాంద్రుండు
తిప్పన . . . వుఁ డేధీరుతండ్రి
ఘనులు జగ్గనయు సింగనయుఁ గూచన్నయు

* * * *

గీ. . . . . . . .
లతిపతివ్రత లక్ష్మి యేచతురరాణి
యట్టిశ్రీకూచిమంచివంశాబ్ధివిధుని
మజ్జనకుఁడైన గంగనామాత్యు దలఁతు.

**End:**

సీ. అనుచు సూతుండు నైమిశారణ్యవాసులై
యలరుచుండెడు శౌనకాదికులకు
రమణీయబసవపురాణోక్తమైన యీ
కల్లాణరాయభూపాలుచరిత
వినిపించుక్రమమునఁ బనిమీఱ నానేర్చు
విధమున రచియించి విమలభక్తి
దనర మీ కొసఁగితిఁ దగ మీఱ లిందుల
తప్పులు క్షమచేసి దయఁగలిర్ప

గీ. నిష్మహాకావ్య మెప్పుడు నిద్ధరిత్రి
నేర్పుతో విస్తరిల్లి బుధేంద్రులెల్లఁ
బొగనాడ చంద్రతారార్క మగుచు నుండు
నటుల నొనరించి మముబ్రోవుమయ్య శర్వ !

క. నరవరులకుఁ గృతులొసఁగి(లిడియు ?)
ద్ధరణిం గవివరులు సంపదలఁ బొందుదురో
కైతి నిహపరసుఖములకై
యురుబుద్ధి నీకుఁ గావ్య మొసఁగితి నభవా !

* * * *

మా. సదమలతరరూపా ! సర్వలోకప్రదీపా !
ముదితబుధకలాపా ! ముఖ్యసత్యానులాపా !

విదళితఘనతాపా! విశ్రుతోద్యత్ప్రతాపా!
కదనతలసకోపా! కాంచనాహార్యచాపా!

**Colophon:**

ఇది శ్రీమత్కుక్కుటేశ్వరవరప్రసాదలబ్ధ కవితాసామ్రాజ్యధురంధర కౌండిన్యసగోత్రపవిత్ర కూచిమంచిగంగనామాత్యపుత్త్ర బుధజనవిధేయ, తిమ్మాయనామధేయ ప్రణీతంబైన రాజశేఖరవిలాసం బను మహాప్రబంధంబునందు సర్వంబును దృతీయాశ్వాసము.

గ్రంథాంతమున వ్రాయసకాఁ డిట్లు వ్రాసికొనెను :—

" చ. పటుతరమైన శంభుకథ భాసిల వ్రాయఁ దరంబె యేరికిన్
అటుగను కందమొప్ప ననయంబును నెంతయు నేర్చినట్లుగా
జెటు . . ఘాఘసంగములు చేరవటంచు మదిందలంచి
నేదటకునబీంతిఁ కత రవితారకచంద్రులు నిన్ననాళ్లునుం
నిటులను వ్రాసినాఁడను ధరిత్రిపయింగడు నుండఁగావలెన్.

శార్వరినామసంవత్సర ఫాల్గున శు ౧౨ గురువారము రోజువఱకు మారుజోళ్లమల్లయ్యప్రతిచూచి టాగంటి మల్లేశలింగం అయ్యవార్లగారి కొమారుఁడయిన మల్లయ్య రాజశేఖరవిలాసము మూఁడు ఆశ్వాసములూ సంపూర్ణంగా ప్రదోషకాలముకు ప్రెగళ్ళపాటి సుబ్బారాయుఁడుగారి అరుగుమీఁద కూర్చుండి పశ్చిమదిక్కుగా వుండి వ్రాసుకొనెను."

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత యొకరకమాదిరిగా నున్నది. నిర్దుష్టము కాదు. శైథిల్యము కలదు. గ్రంథపాతము లంగండుఁ గలవు.

రాజశేఖరవిలాస మను పేరుగల యీమూఁడాశ్వాసములప్రబంధమును, బాలుకూరికి సోమనాథకవీశ్వరునిచే రచింపఁబడిన బసవపురాణమందలి భల్లాణరాజ చరిత్రపుఁ గథను గైకొని కూచిమం

చితిమ్మకవి రచియించెను. అచ్చ తెలుఁగు రామాయణాదు లీకూచి మంచితిమ్మకవి కృత్యంతరములు.

---

(b) గోవ్యాఘ్రచరిత్రము.

GŌVYĀGHRACARITRAMU.

Foll 71a—75a.

This gives in conversational prose the story of the work described under R. No. 44 *ante*.

Complete

**Beginning:**

బ్రహ్మ భూలోకమందు నిర్మించిన జనులు బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు, శూద్రులు వర్ణాశ్రమధర్మముగలవారున్నూ, పశువులు, పక్షులు, మృగాదులున్నూ మొదలయినవారికి . . .

**End:**

ఈగోవ్యాఘ్రచరిత్రం యెవరు వ్రాసినా చదివినా విన్నావారలకు ఇహపరసాధనంబులు కలుగును. శివలోకసాయుజ్యము నుబొందుదురు. అని నారదాదిదేవఋషులకున్నూ వసిష్ఠాదిబ్రహ్మఋషులకున్నూ సనకసనందనసనత్కుమారయోగీశ్వరులకున్నూ యీపుణ్యకథ లోకోపకారార్థం . ... పూర్వకంగా నిర్ణయించిరి.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత యొకమాదిరిగా నున్నది. నిర్దుష్టము కాదు. శైథిల్యము కలదు. గ్రంథపాతములు కలవు.

ఇది, నెం. 44 న వర్ణింపఁబడిన గ్రంథవిషయమే కాని అది వేఱు; ఇది వేఱు. ఇది వ్యావహారికవచనరచనతో నున్నది. రచించిన దెవరో తెలియదు.

తుద నొకపత్రమున ధాన్యవ్రతవిధానము వ్యావహారికవచనమునందే వ్రాయఁబడియున్నది.

## R. No. 60.

Palm-leaf. 16¼ × 1⅜ inches. Foll 138. Lines, 8 in a page. Telugu. Good.

Presented in 1911-12 by Viśvanātha Śāstri of Vijayanagaram.

(*a*) శ్రీరామస్తవరాజము.

ŚRĪRĀMASTAVARĀJAMU.

**Foll.** 1*a*—49*a*.

Same work as the one described under No. 5 (*a*) *ante*

Complete.

గ్రంథాంతమందుఁ బ్రతిని లేఖకుఁ డిట్లు వ్రాసికొనెను :—

" సాధారణనామసంవత్సర ఫాల్గున 30 జయవారమువఱకు సంపూర్ణంగా వ్రాయడమయినది. "

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత చక్కఁగ నున్నది. తప్పులు లేవు. శైథిల్యము లేదు. గ్రంథపాతములు లేవు.

ఇది నెం 5 న వర్ణితమగు గ్రంథమే కాని వేఱు కాదు

---

(*b*) జ్ఞానవాసిష్ఠరామాయణము.

JNĀNAVĀSISTHARAMĀYAṆAMU.

Foll. 51*a*—138*b*. Foll 49*b* and 50 are left blank

This is a Telugu rendering in five Āśvāsas of the Sanskr work of the same name by Madiki Singanārya, son of Ayyalāmātya of Bhāradvājagōtra. The work is dedicated to Nṛsiṁhasvāmi worshipped at Ahōbala. For further particulars, see extracts and Telugu remarks given below.

Complete.

**Beginning :**

శ్లో. శ్రీమద్దివ్యమునీంద్రచిత్తనిలయం సీతామనోనాయకం
వల్మీకోద్భవవాక్పయోధిశశినం స్మేరాననం చిన్మయమ్

నిత్యం నీరదనీలకాయ మమలం నిర్వాణసంధాయినం
శాంతం నిత్య మనామయం శివకరం శ్రీరామచంద్రం భజే॥

ఉ. శ్రీకరలీలఁ బ్రాణుల సృజింపఁ దలంచి విరించి తానయై
చేకొని వానిఁ బ్రోచునెడ శ్రీవిభుఁడై యవి సంహరింప నీ
మాకృతిఁ దాల్చి ముప్పురకు నవ్వల నొకరూఢియై వెలుంగు సు
శ్లోకుఁ బురాణుఁ బుణ్యపురుషుఁ బరమాత్ముని భక్తిఁ గొల్చెదన్.

*   *   *   *

గీ. వ్యాసవాల్మీకిశుక కాళిదాసబాణ
హర్షణాదుల నాద్యుల నాత్మ నిలిపి
సకలభాషారసజ్ఞుల సముల నన్న
పార్యతిక్కనకవీంద్రుల నభినుతింతు.

*   *   *   *

క. తిరువేంకటనాయకపద
సరసిజమధుకరుల నఖిలసమయజ్ఞుల మం
త్రరహస్యవిదుల నఘసం
హరులను మద్గురుల ఘనుల నార్యులఁ గొలుతున్.

*   *   *   *

వ. . . . . . కృతకృత్యుండనై తొల్లి హరిభక్తి
రసావేశంబున . . . . పద్మపురాణోత్తరఖండంబును భాగ
వతదశమస్కంధంబును దెనుఁగున రచియించి యస్మత్పురాణం
బులకుం గృతిపతిఁ గా నేపుణ్యుని బ్రార్థింతునో యని విచారించి
గజగంధవారణ గండగోపాల చలమర్తిగంధ (డ?) రాయగజకేసరి
దొంతిమన్నెవిభాళాది నానాబిరుదవిఖ్యాతులం బ్రసిద్ధుండును, రా
మగిరిపట్టణాధీశ్వరుండును, ముప్పభూపాలుమాన్యమంత్రిపదధురంధ
రుండును . . . . వాణవంశాబ్ధిసుధాకర కాశ్యపగోత్ర

పవిత్రాంబనార్యతనూభవ కందనామాత్యుండును, నతిస్నేహాబాం ధవుండును . . . . . నపూర్వవచనరచనానుబంధబంధుర కావ్యరసాభిజ్ఞుండును . . . . . గావున నమ్మంత్రియుగం ధరుం గృతిపతిం గావించి యెండియుం గవిత్వతత్త్వరచనకౌతుకం బునం జిత్తంబు జొత్తిల్ల నొకరాకృతిం జెప్పం బూనితి . . . . . . . . . చిత్తశాంతి జీవన్ముక్తియుక్తియునుం బెక్కువిధముల నుపన్యసించునట్టి వాసిష్ఠసంగ్రహం బాంధ్రభాష నఖిలలోకోప కారార్థంబుగా రచియించెద.

* * * *

క. మృదుమధురరచనం గబ్బము
గదియించిన యట్ల తత్త్వగాథార్థముం జె
ప్పుదుం బూవుందేనె గొనుతు
మ్మెద మాడ్కిసులు దొలిచి నేర్పు మెఱసినభంగిన్.

* * * *

వ. అని . . . యేతత్కృతిశాలతాలవాలంబగు మదీయ వంశంబు వర్ణించెద.

ఉ. ఆజలజాక్షు నాభిజలజాత్మజమానసపుత్త్రుండై భర
ద్వాజుండు ధాత్రిం బెంపెసంగం దన్మునిగోత్రజులందుసత్త్వవి
భ్రాజితపుణ్యమూర్తి యగుబ్రహ్మనమంత్రికిం బుట్టెం దిక్కరు
త్తేజుండు గుండనార్యుండు సుధీజనభూజనకీర్తనీయుండై.

క. అంబుజభవనిభుం డాప
స్తంబాగణియైన గుండసచివునకుం ది
మ్మాంబకుం బుట్టిరి పుత్రులు
గం బొరి నల్లాడ విభుండు గంగన యనంగన్.

వ. అందు నల్లాడమంత్రి,

సీ. అతఁడు తిక్కనసోమయాజుల పౌత్త్రుఁడై
కొమరారు గుంటూరికొమ్మవిభుని
పుత్త్రికఁ జిట్టాంబ బుధలోకకల్పక
వల్లి వివాహమై వైభవమున
భూసార మగుకోటభూమిఁ గృష్ణానదీ
దక్షిణతటమున ధన్యశీల
నలరు రావెలయనునగ్రహారము దన
కేకభోగంబుగా నేలుచుండి

గీ. యతఁడు నొక్క దేవాలయంబమర్చి? గోవిందుఁజిన్న
గోపికానాథునిఁ బ్రతిష్ఠ కోరిచేసి
యఖిలవిభవంబులందును నతిశయిల్లె
మనుజమందార మల్లాడమంత్రి విభుఁడు.

క. అయ్యవతీరగణులకును
నయ్యవతీలు (య్యలు?) మంత్రీంద్రుఁ డుదితుఁడై
[ధారుణిలో
నెయ్యెడ నర్థార్థులు మా
యయ్యర యని పొగడ నెగడె నౌదార్యమునన్.

+

సీ. ఆత్రేయగోత్రపవిత్రపారయమంత్రి
పుత్త్రి సింగాంబికఁ బుణ్యసాధ్వి
వెలయ వివాహమై వేంగిదేశంబులో
నేపారు రాజమహేంద్రపురికి
నధిపతి తొయ్యేటి యనపోతభూపతి
మంత్రియై రాజ్యసంపదలఁ బొదలి
యొప్పారు గౌతమి యుత్తరతటమున
మహనీయమగు పెదమడికియందుఁ

గీ. జిరతరారామములను సుక్షేత్రములను
చెరువు లార్జించి సితకీర్తిఁ జెంపుమిగిలి
యఖిలజగదన్నదాత నా నవనిఁ బరఁగె
మధురగుణధుర్యుఁ డయ్యలుమంత్రి వరుఁడు.

చ. ఒనరఁగ నద్విధూవరులు కొండలదేవునిఁ గొల్చి తద్వరం
బున నొగి సింగనార్యుని నమోఘగుణాఢ్యు ననంతుని న్మహీ
జననుతు నయ్యయాఖ్యు బుధసన్నుతిపాత్రుని నారయాహ్వ
[యుఁగ
గని నరసింహనామకము గరవ మారఁగఁ బెట్టి రందఱున్.

క. వారలలో నగ్రజుఁడను
వారిజదళనయనచరణవారిజసేవా
సారమతి నతులవాక్య
శ్రీరచనాచతురమతిని సింగాహ్వయుఁడన్.

క. కూనయముప్ప నృపాలుని
సూనుండగు తెలుగువిభుని సుందరి మల్లాం
బానఁ డనుఁ డగుముప్పిడి
భూనాథుఁ డిసుకవివరుఁడ బుధసన్నుతుఁడన్.

* * * *

గీ. ఆమహీవిభు రామాద్రిసీమఁ జెరువు
వృత్తులును నగ్రహారముల్ వెలయఁ గాంచి
యతని యాశ్రితులఁ దెల్ల నధికుఁ డనఁగ
జతురుఁడన ధన్యుఁడన నడిసన్నవాఁడ!

వ. అట్లు గావున.

శా. ఆయుశ్శ్రీశుభనోత్సదున్ హరిఁ బ్రబంధాధీశుఁ గావించి దు
ర్వ్యాయాధారము నిర్వికారము సదామాంగళ్యయుక్తంబు నా

మ్నాయాంతార్థవివేకసారము మనోమత్తేభసింహంబు సు
శ్రేయోమార్గము నైన బోధమయవాసిష్ఠంబు నేఁ జెప్పెదన్

**End:**

వ . . . . వాసిష్ఠరామాయణంబు పదార్థప్రమేయంబులు సర
ణిదప్పక తెనుంగుబాసను గద్యపద్యంబుల రచించితి నవధరింపుము.

* * * *

**మాలిని.** సుకవినుతకలాపా, శుద్ధబుద్ధస్వరూపా,
వికసితజలజాక్షా, విశ్వరక్షైకదక్షా,
సకలరిపునిరస్తా, శంఖచక్రాహస్తా,
ప్రకటితశుభగాత్రా, పద్మసద్మాకళత్రా.

**Colophon:**

ఇది శ్రీనగసింహవరప్రసాదలబ్ధకవితావిలాస భారద్వాజస
గోత్రపవిత్ర యయ్యలామాత్యపుత్త్ర సరసగుణధుర్య సింగనార్య
ప్రణీతంబైన జ్ఞానవాసిష్ఠరామాయణంబునందు నిర్వాణప్రకరణం
బన్నది సర్వంబును బంచమాశ్వాసము.

గ్రంథాంతమునఁ బ్రతివిలేఖకుఁ డీట్లువ్రాసికొనెను,

"తిమ్మరాజు మంగళాద్రిగారి ప్రతినున్నక్రమానను చెరుకుపల్లి
లక్ష్మీనృసింహునిచేత సంపూర్ణముగా వ్రాయబడినది"

(వి-వి.)—

సంగ్రము. వ్రాఁత ముద్దులుగార్చుచున్నది. తప్పు లంతగా
లేవు. శైథిల్యము లేదు. గ్రంథపాతములు లేవు.

ఇది వసిష్ఠునిచే సంస్కృతమున రచియింపఁబడిన జ్ఞానవాసిష్ఠ
రామాయణమును బట్టి మడికి సింగనయను కవిచేఁ దెలుఁగున రచిం
పఁబడిన యైదాశ్వాసముల ప్రబంధము.

గ్రంథకర్తవంశము.

భరద్వాజగోత్రమందు బ్రహ్మమంత్రి జనించె. అతనికి గుండ
నార్యుఁడు కుమారుఁడు; అతనికిఁ దిమ్మాంబయను భార్యయందు,

అల్లాడవిభుఁడు, గంగన, యను నిర్వురు సుతు లుద్భవిల్లిరి. అల్లాడమంత్రి (ఆంధ్రభాగవతకర్త) తిక్కన సోమయాజి పౌత్త్రిఁడగు గుంటూరు కొమ్మవిభుని కొమార్తెయగు చిట్టాంబను వివాహమై కృష్ణానదీ దక్షిణతీరమందలి గావెలయను నగ్రహారము నేకభోగముగా నేలుచు నాయూర గోపీనాథ దేవాలయమును నిర్మించి వెలసెను. అతనికుమారు డయ్యలుమంత్రి అయ్యయ్యలుమంత్రి. ఆత్రేయగోత్రుఁ డగు పారయమంత్రి కుమార్తయగు సింగాంబను వివాహమై వేంగీదేశమందలి రాజమహేంద్రపురమున కధిపతియగు తొయ్యేటి అనపోతవిభుని మంత్రియై గౌతమీ తీరమందలి పెదపుడికియందు వసించి పేర్వెలసెను. అయ్యలుమంత్రికి అహోబలదేవులివరమున సింగన, అనంతన, అబ్బయ, నారయయను పుత్త్రులుజనించిరి. వారిలో నగ్రజుడగు సింగనయే గ్రంథకర్త. కూనయమప్పరాజు కొడుకగు తెలగవిభుని కుమారుఁడు ముప్పిడి భూపతి యాస్థానకవి.

కృతిస్వామి శ్రీ అహోబలనృసింహస్వామి. గ్రంథకర్తను గూర్చి విశేషములకుఁ బైను దాహరింపబడిన పద్యములఁ జదువునది. నెం 35 రున వర్ణితమగు గ్రంథము, నిదియు నొక్కటే కాని వేఱు కాదు.

## R. No. 61

Paper. 8 × 5¼ inches. Foll. 91. Lines, 24 in a page. Telugu. Good.

Presented by K. R. V. Krsna Rao Bahadūr of Cocanada in 1911–12

**వల్లవీపల్లవోల్లాసము.**

VALLAVĪPALLAVOLLĀSAMU.

Same work as the one described under No. 33 *ante*.

Complete.

**ప్రతిలేఖకుఁడు గ్రంథాంతమం దిట్లు వ్రాసికొనెను :—**

" అక్షయ నామ సంవత్సర పుష్య బహుళ ? ఆదివారము పల్లవీ పల్లవోల్లాసమను సత్యాపరిణయము కేతరాజు రంగయ్యపంతులు స పూర్ణముగా వ్రాసెను "

(వి-వి.)—

సమగ్రము.—వ్రాంత ముద్దులుగూర్చుచున్నది. తప్పులు లేవు. శైథిల్యము లేదు. గ్రంథపాతములు లేవు.

ఇది నెం 33 రున వర్ణిత మగు గ్రంథమే కాని వేఱు కాదు.

---

R. No. **62.**

Palm-leaf. 14×1½ inches Foll. 239. Lines, 5 in a page. Telugu. Slightly injured.

Presented by Puligadda Gangarāju in 1911-12.

(*a*) అచ్చతెలుఁగురామాయణము.

ACCATELUGURĀMĀYAṆAMU.

Foll. 1*a*-174 *b*.

This is a Prabandha in six Āśvāsas by Kūcimañci Timmakavi. It is composed in pure Telugu, and treats of the story of the Rāmāyaṇa (to the end of Yuddhakānda). The author dedicates the work to śiva and states that he already composed Rājśēkharavilāsa, Rukmiṇīpariṇaya, Simhaśailamāhātmya and Nīlāsundarīpariṇaya.

Complete.

**Beginning :**

చ. సిరులకు మట్టయై పొలయలు చెన్నలగారెరెడి వెండికొండపై
నరుదుగ నేల్చుచు మరునయ్యయు నల్వయుఁ గొల్వ జల్వడా
ల్గొరరత నంపుటుప్పరిగెలో వలిగుబ్బలి రాచకూఁతుతో
నిరవుగఁ గూడి ముజ్జగము లేలెడు వెన్నెలతాల్పుఁ గొల్చెదన్.

* * * *

సీ. నీలాద్రి గంగన నిచ్చ నిచ్చలు మమ్ముఁ
బూజించె నపరంజిపూలచేత

నీతల్లి లక్ష్మమ నే సంతసిల నోర
ములు వెట్టెఁ బుడమి వేల్పులకు నెల్ల
నీపినతండ్రు లెన్నికలు గాంచిరి జగ
నయు సింగరాజును నరసనయును
నీతమ్ము లెలమి నొందించిరి మమ్ము సిం
గనయు జగ్గనయు సూరనయుఁ జెలఁగి

గీ. నీయనుఁగురాణి బుచ్చమ నెలఁత లెల్ల
మే లనఁ దనర్చి గట్టురామూర్తిఁ గొల్చి
మాణిక్యంబవు గద కూచిమంచికోలము
నకు నాయకుఁ డిమ్మకవి గాయ యలర నీవు.

గీ. మునుపు మా కీవె బల్లాణు డనెడు తెలి
కతయు రుక్మిణి పెండ్లికతయు బొబ్బ
మెకము గుబ్బలికతయు మేల్మిఁ నీల
పెండ్లికతయును గబ్బముల్ పేర్మిఁ గూర్చి

* * * *

క. కావున మా కప్పనమునఁ
గావింపుము చాల్పుకుత్తుకల తొలుజేజేఁ
జేవ దలిర్ప నడంచిన
యావెరవరికతయుఁ బూని యచ్చతెనుఁగునన్.

గీ. ఒనరఁ బేరులు బిరుదులుఁ దెనుఁగుసేయఁ
బోల దని మున్ను పెద్దలు పూని త్రోవ
యిడిరి గావునఁ గూరుపు మిదియు నట్ల
తెనుఁగుతెఱఁ గెల్ల నేర్పడఁ దిమ్మ పెగడ.

**End**:

పణవము. జేజేగాయఁడు సిరిగేస్తు డుఁ
దేజు త్రీఁజ గ దిటమా బ్త్రిఁ
వే జోహారులు నెఱిఁ గావి పఁ
బూజం జెందుచుఁ బొనరా శ్రేటిఁ.

**Colophon**:

ఇది శ్రీమ దుమారమణకరుణాకటాక్షనిరీక్షణసంలబ్ధసక సకవితాసామ్రాజ్యధురంధర ఘనయశోబంధుర కౌండిన్యసగోత్ర పవిత్ర కూచిమంచి గంగనామాత్యపుత్త్ర బుధజనవిధేయ తిమ్మయనామధేయప్రణీతంబైన రామాయణమహాకావ్యంబునందు యుద్ధకాండము సర్వంబు నేకాశ్వాసము.

ప్రతివిలేఖకుఁడు గ్రంథాంతమం దిట్లు వ్రాసికొనెను :—

క. వ్రాలా సెబ్రలు తప్పులు
చాలం గల, వేను శబ్దసంగతు లెఱుఁగఁ
గేలిం బెట్టక నవ్వక
పోలంగా దిద్దరయ్య బుధజనులారా!

జన్నాడ నరసింహాచార్యులుగారు పంతెన శేషాచార్యులు గార్ల పుస్తకములు చూచి దుర్మతి సం॥ ఆశ్వయుజశు 8 శుక్ర వారము రెండుజాములవఱకు అడ్డంకి పెదజగన్నాథాచార్యులు ఆత్మార్థం నిమిత్తం వ్రాసుకొన్న పుస్తకము.

(బి-బి.)—

సమగ్రము. వ్రాఁత చక్కనైన యున్నది. తప్పులు లేవు. తుదిపత్రములఁ గొన్నింట నించుక శైథిల్యమును గ్రంథపాతములును గలవు.

ఇది కూచిమంచి తిమ్మకవిచేఁ దత్సమపదములు కలియని (అచ్చ తెలుఁగు) భాషతో రచియింపఁబడిన రామాయణము. ఆఱుకాం

డములును నాల్గాశ్వాసములుగా రచియింపఁబడినవి. తిమ్మకవి, యీగ్రంథరచనమునకుఁ బూర్వమే రాజశేఖరవిలాసము, రుక్మిణీపరిణయము, సింహాశైలమాహాత్మ్యము, నీలాసుందరీపరిణయము, ననుకబ్బముల రచించినట్లిందుఁ జెప్పుకొనెను.

## (b) నీలాసుందరీపరిణయము.

## NĪLĀSUNDARĪPARIṆAYAMU

Foll. 175a—231b. The remaining eight foll. contain a tract on Telugu prosody

This is a Prabandha in three Āśvāsas dealing with the story of the marraige of Kṛṣṇa with Nīlā· by Kūcimañci Timmakavi. The work is written in pure Telugu (i.e., unmixed with Tatsama words) and is dedicated to Śiva.

Complete.

**Beginning**·

ఉ. శ్రీలకుఁ దానకం బగుచుఁ జెన్నలరారెడు వెండికొండపై
మేలిక డాసి డాల్ హెయలు మీఱెడు జాబిలిరాలమేడలో
వేలుపుఱేఁడు నల్వయును వెన్నుఁడుఁ గొల్వఁగ మంచుఁ గొండరా
చూలిని గూడి వేడుకలఁ జొక్కెడు లేనెలతాల్పుఁ గొల్చెదన్.

* * * *

క. ఎదఁ గుదురుగ (రగుల్) బత్తిసి గొ
ల్చెదఁ బలుపుట్టువులఁ గూరిచినదోసంబుల్
వదలెడుకొల కెంతయు బ
లిదుఁడగు మా డెందులూరిలింగన కరుణన్.

**End :**

తరలము.

చిలువ పేరులు ఔ మ్మనన్ దలఁ జిబ్రొ క్రొన్నెలపూవునన్
మొలను బెబ్బులితోలు కేలను ముద్దుగుల్కెఁ డుచిల్కయున్
నలువగూడలపున్క వల్లెము నల్పుఁ గుత్తుక యి (నె?) మ్మెయిన్
వలచున వ్వెలిబూదిపూఁతయు వావిరిం గల వేల్పా !

**Colophon** .

ఇది శ్రీయదుకుమారరమణకరుణానిరీక్షణసంలబ్ధసరసకవితా సామ్రాజ్యధురంధర ఘనయశోబంధుర కౌండిన్యసగోత్రపవిత్ర కూచిమంచిగంగనామాత్యపుత్త్ర బుధజనవిధేయ తిమ్మయనామధేయ ప్రణీతంబైన నీలాసుందరీపరిణయం బనునచ్చతెలుగుప్రబంధంబునందు సర్వంబును దృతీయాశ్వాసము.

ప్రతివిలేఖకుఁడు గ్రంథాంతమం దిట్లు వ్రాసికొనెను :—

"జన్నాడ నరసింహాచార్యులు పంతెన శేషాచార్యులు గార్లపుస్తకములు చూచి దుర్మతిసంవత్సర కార్తికశు 5 లక్ష్మీవారము రెండుజాములకు శ్రీశ్రీఅద్దంకి పెదజగన్నాథాచార్యులు వ్రాయడమయినది.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత చక్కనై యున్నది. తప్పులు లేవు. శైథిల్యమును గ్రంథపాతములును నొకరూపుగాఁ గొంచెముగాఁ గలవు.

శ్రీ కృష్ణుఁడు నీలను బెండ్లియాడుకథను గూచిమంచి తిమ్మకవి యచ్చతెలుఁగున మూఁడాశ్వాసములప్రబంధముగా రచియించెను. ఈగ్రంథము శివున కర్పింపఁబడినది.

ఈ గ్రంథము ముగిసిన తరువాత నెన్మిది పత్రములలో గణయతిప్రాసలక్షణములఁ దెలుపు పద్యములు వ్రాయఁబడియున్నవి.

## R. No. 63.

Palm-leaf. $15\frac{7}{8} \times 1\frac{1}{8}$ inches Foll. 208. Lines, 6—7 in a page.
Telugu Good

Presented by K. R. V. Kṛṣna Rao Bahadūr of Cocanada in 1911-12.

రామచంద్రోపాఖ్యానము.

RĀMACANDRŌPĀKHYĀNAMU

This is a Nirvacana Prabandha (i. e, without any prose passage) in seven Āśvāsas narrating the story of the Rāmāyana (including the Uttarakanda) Mikkili Mallikārjuna, son of Vēṅkatanāyaka and grandson of Mallikārjuna composed this work and dedicated it to Śrī Rāma worsshipped at Lingamaparti, at the instance of Udutala Pāpayārya who is said to have built and consecrated a temple to Him in Śaka 1778, Rākṣasa year, which corresponds to 1855. A D.

Complete.

**Beginning**:

శా. శ్రీమత్కోమలపాణిపల్లవరుచిం జేనొప్పంది భక్తానుకం
పామాధ్వర్యకభాసురస్మితసుమాభాక్తిన్నగై జానకీ
రామామంజులతోత్కృతంబయిన శ్రీరామానుజోర్వీజ ము
ఖ్యామంబు ఉద్దలపాపయార్యహృదయస్థం బేలు లోకంబులన్.

* * * *

గీ. ఘనులు మెచ్చంగ లోకోపకారలీల
భారతపురాణ మాంధ్రభాషారచన గ
వించినట్టిమహాకవిశ్రేష్ఠు నన్న
పార్యుఁ బ్రకటన నెట్టన నభినుతింతు.

* * * *

సీ. ఏమహామహులతోఁత యింపుచందనకుంద
శరకీర్తి పాపయ సచివమౌళి
యేమహాత్మునితండ్రి రామపదధ్యాన
పరమానసుఁడు రఘుపత్యమాత్యుఁ

డేధన్యనముతల్లి యెల్లసద్గుణముల
రాణించురమణాంబ రాజితముగ
నేమంత్రివరుభార్య కామాంబ నిడసన
మెట్లశేషయపుత్త్రి వ్యాకలగాత్రి

గీ. యేమహోన్నతచరితుఁడా కామమాంబ
యందుఁగాంచెను సుతుల సూరా(ర్యా?)ర్యమతుల
పరుల రఘుపతిరాజగోపాలరామ
నామధేయాంచితుల గుణస్తోమయుతుల.

గీ. అట్టియుడుతలవంశమహాంబురాశి
చంద్రుఁ డాయతసద్గుణసంఘసాంద్రుఁ
డైనపాపయమంత్రీంద్రుఁ డాత్మబంధు
గురుబుధకవీంద్రులను గూర్చి కొలువుదీర్చి.

గీ. కవికులవరేణ్యు సమణగణ్యు విపుల
శారదానుగ్రహకటాక్షసాంగలబ్ధ
సరసకవితాఘురీధురంధరుని రామ
పాదసరసీరుహధ్యానపరుని నన్ను.

క. పిలిపించి . . .

+ * + *

ఉ. ఏనొకవేళ మున్ను మది నెంతయు భక్తి దలిర్ప రామపూ
జానిరతిన్ వసింపఁగ నిశావరభద్రగిరీంద్రవాసుఁడౌ
జానకినాయకుం డఖిలసజ్జనసత్ఫలదాయకుండు లోఁ
బూని దయ న్మదీయఘనపుణ్య మగణ్యతఁ దేజరిల్లగన్.

* * * *

క. అని వినుతిసేయునన్నున్
గనుఁగొని కరుణార్ద్రహృదయకమలుండై య

మ్మనువంశరత్న మి ట్లను
ననుపమసు గాణాధివాస హరిహరదాసా!

క. శ్రీలింగమప త్రిపురిఁ
వాలాయముగా వసింప వాంఛగలిగె మా
కాలయము వేగ నొనరిచి
లాలితముగ మత్ప్రతిష్ఠ రచియించి తమిన్.

ఉ. ఇంతకుమున్న మత్కథను హృద్యముగాఁగ ముదంకితంబుగాఁ
బంతముమీఱఁ జేసెను ప్రబంధము మిక్కిలిమల్లికార్జునుం
డెంతయు నాదునెమ్మదికి నీప్సితమయ్యెను దత్కృతిం గొనన్
సంతసమొప్పఁ దత్కథ విని సయ్యనఁ బిల్వఁగఁ బంపిపిమ్మటన్.

క. ఆకృతి సదలంకృతిగా
మాకర్పింపఁగ ఘటింపుమా డెందమునం
దాకవియు ననుమతించున్
బ్రాకటముగ నస్మదీయభక్తుం డగుటన్.

* * * *

గీ. అనుచుఁ జెల్పి రాముఁ డంతర్హితుండుగా
నంత నిద్రదెలిసి సంతసమున
నేను జేయుపుణ్య మెట్టిదో రామద
ర్శనము గల్గె నేఁడు స్వప్నమునను.

సీ. అని యీవిధంబున నాత్మీయకృతకృత్య
తకు సంతసిల్లుచు ధరను శాలి
వాహనశకవర్షపరిమితినస్సుశైల
గిరిసుధాంశులసంఖ్యఁ బరఁగియుండఁ
దనరెడురాక్షసాబ్దమ్మున మధుమాస
సితపక్షనవమీసహితపునర్వ

సుప్రశస్తభమున సుందరంబై తగు
కోవెల గట్టించి కోర్కు లలర

గీ. సకలజనహృదయంబులు సంతసిల్లఁ
బూర్వజన్మార్జితమదీయపుణ్యనిచయ
మసమమై తేజరిల్లఁగ ననుపమాన
వైభవంబొప్పఁ దద్దివాభాగమునను

సీ. గీ. . . . . . . .
. . . . . . . .
మాలికాధూపదీపసంభాసమాన
మైన తద్దేవగృహమున జానకీస
మేతు నిల్పితి వితతవిఖ్యాతిమీఱ.

శా. పాపారణ్యదవంబు భద్రగిరిసంవాసస్ఫురన్నాయకం
బాపద్వ్యాధిహృద్యముం బుధజనాహ్లాదంబు నౌరామచం
ద్రోపాఖ్యానము తన్మయత్వమున మాయూరన్ మహాభ[క్తర
త్నాపారీణత నున్నరామునకు వేడ్కన్ ల్మీఱ నర్పింపుఁడీ!

చ. అని యొఱఁగించి లక్ష్మిపురమందలిధారుణి మూఁడుపందుము
లున్ నకరుచిం దనర్చుకరకంకణయుగ్మము భాసమానమౌ
తనమృదువస్త్రజాలమును ద్రవ్యముఁగొంత యొసంగి నెమ్మ[దిన్
దనుప మహోత్సవం బలరఁ దత్తదుపాయన మంది వేమ[యున్.

గీ. ఐహికాముష్మికములకు నాకరంబు
శ్రీకరం బగుఁ గద భద్రశిఖరివలన
వెడలి లింగమవర్తిని వెలసియున్న
ధరణిజాపతి కిడుట ఈ తాఁద్రవ్యఫలము.

**End :**

మాలిని. వినుతగుణసమాజా విశ్వభూభృద్బిడౌజా
దినకరసమతేజా ధీరరాట్కల్పభూజా
ఘనవిమలశిరోజా కామసౌందర్యభాజా
యనఘముఖసరోజా యర్కవంశాబ్ధిరాజా !

**Colophon :**

ఇది శ్రీరఘు ..మచరణారవిందమకరందరసపానమధుపాయమానమానస శారదానుగ్రహకటాక్షప్రసాదలబ్ధసరసకవితాఝురీ ధురంధర మల్లికార్జునపౌత్త్ర వేంకటనాయకతనూభవ మల్లికార్జున యశోధౌరేయ మికిలిమల్లికార్జుననామధేయ ప్రణీతంబైన రామచంద్రోపాఖ్యానంబను నిర్వచనమహాప్రబంధంబునందు సర్వంబును సప్తమాశ్వాసము.

(వి-వి.)—

సమగ్రము వ్రాఁత తిన్నగనే యున్నది. తప్పు లంతగా లేవు. శైథిల్యము లేదు. గ్రంథపాతములు లేవు.

ఇది యేడాశ్వాసముల నిర్వచనప్రబంధము. ఇందు రామాయణపు టేడుకాండముల కథయు వర్ణింపఁబడినది. గ్రంథకర్త మికిలి మల్లికార్జునుఁడు. ఈ గ్రంథ ముడుతల పాపయార్యుని ప్రేరణమున లింగమర్తిపురమున నెలకొల్పఁబడిన రామచంద్రునకు సమర్పింపఁబడినది. ఆ యుడుతల పాపయార్యుఁడు శాలివాహన శక 1778 రాక్షస సం॥ చైత్రశుద్ధనవమినాఁడు లింగమర్తిపురిని గోవెలగట్టించి శ్రీరాముని బ్రతిష్ఠించెనఁట ! ఉదాహరింపఁబడిన పద్యములఁబట్టి విశేషములఁ గుర్తించునది.

## R No. **64.**

Palm-leaf. 14 × 1¼ inches Foll 34 Lines, 4 in a page Telugu. Injured

Presented by V. Jagannātham of Vijayanagaram in 1911–12.

రామలింగేశశతకము.

RĀMALIṄGĒŚAŚATAKAMU.

This consists of a hundred stanzas in Sīsa metre containing moral precepts and praise addressed to God Rāmaliṅgēśa worshipped at Rāmachandrapuram in the Gōdāvari district. By Adidamu Sūrakavi.

Incomplete; contains 95 stanzas only

(వి-వి.)—

అసమగ్రము. 95 పద్యములు గలవు. శైథిల్యము కలదు. గ్రంథపాతములు కలవు. వ్రాఁత యొకమాదిరిగ నున్నది. నిర్దుష్టము కాదు.

ఇది "రామలింగేశ రామచంద్రపురవాస" యను మకుటముఁగూర్చి యడిదము సూరకవి రచియించిన సీసపద్యశతకము. ఇందలి పద్యములు లోకనీతిస్తుత్యాత్మకములై యున్నవి. అసమగ్రము శిథిలము నగుటచే నుదాహరింపఁబడదయ్యె.

R. No. 65.

Palm-leaf. 16¼ × 1⅜ inches. Foll. 31. Lines, 7 in a page. Telugu. Slightly injured.

Presented by K. R. V. Kṛṣṇa Rao Bahadūr of Cocanada in 1911-12.

విఘ్నేశ్వరచరిత్రము.

VIGHNĒŚVARACARITRAMU.

This gives an account of the birth of Vighnēśvara or Gaṇapati and the legends connected with Him. It consists of two Āśvāsas composed by Naṇḍūri Bāpirāju a Niyōgi Brahmin, who dedicates the work to God Sōmēśvara worshipped at Vēṭūri. The author states that he composed the work in Śaka 1739, Īśvara year, which corresponds to 1816 A.D.

Complete.

**Beginning:**

ఉ. శ్రీనగజాకుచస్తబకచిత్రితకుంకుమపంకసమ్మిళ
త్పీనవిశాలవక్షుని సుధీజనరక్షుని సేవకానుకం
పానిధి నారదాదిసురమౌనిమనోంబుజమత్తబంభరున్
మానసవీథిఁ గొల్తు మసమానుని వేటురి సోమనాథునిన్.

మ. పరమామ్నాయవిశారదున్ మదనహాప్రత్యర్థిదోషజ్ఞసిం
ధురపంచాననుఁ బంచవక్త్రవదపాథోజాతసేవాధురం
ధరు శాస్త్రవ్రజపారగున్ బదపదార్థజ్ఞున్ గుణాంభోనిధిన్
గురునిన్ శ్రీయడవల్లిలక్ష్మణసమాఖ్యున్ గొల్తు వాక్సిద్ధికిన్.

మ. అసమానోజ్జ్వలధీయుతున్ గణితవిద్యాతత్త్వవేద్యున్ లస
త్ప్రసవాస్త్రప్రతిసుందరాంగుని జగత్ప్రఖ్యాతచారిత్రునిన్
రసికాగ్రేసరు దామరాజుకులపారావారశుభ్రాంశుఁ బ్రా
ణసమానాప్తు సగోత్రు వేంకటప్రధానగ్రామణిన్ గొల్చెదన్.

సీ. నీతాతతండ్రి లోకాతీతవిశదవి
ఖ్యాతయశస్కుండు కామరాజు
నీతాత భూసురనివహబంధువ్రాత
పరిపోషణుండు బాపప్రధాని
నీతండ్రి సేతుకాశీతలమధ్యభూ
విభుసభాపూజ్యుండు వేంకమంత్రి
నీతల్లి భువనవర్ణితదానధర్మప్ర
భూతగుణాలంబ బుచ్చమాంబ

గీ. నీ వనేకభవార్జితనిర్మలాస్మ
దీయపరభక్తిసంజాతదివ్యసుకృత

వాసనావాసితుఁడవు శ్రీవత్సగోత్ర
పావనుఁడ వెన్న న డూరి బాపమంత్రి.

గీ. ఇపుడు నీ వొనరించువిఘ్నేశ్వరునిచ
రిత్ర మాకంకితముగ నర్పించు మెలఁకు
దీన నీ కీప్సితార్థసిద్ధియును భువన
విదితవిఖ్యాతి గల్గు భావించిచూడ!

**End:**

కందమిళితమణిగణనికరము
కరిదనుజహరణ ఘనతరకరుణా
. . . త గరదరభుజగా
భరణకలుషహర భవ సితధరణీ
ధరనిలయ భవవిదళన శుభకరా!

**Colophon:**

ఇది శ్రీమద్దక్షిణామూర్తివరప్రసాదలబ్ధకవితామాధురీధురీణ నండూరిబాపయనామధేయప్రణీతంబైన సకలజనమనోరంజకం బగు విఘ్నేశ్వరచరిత్రం బను ప్రబంధంబునందు సర్వంబును ద్వితీయాశ్వాసము.

సీ. . . . . . ఘ్న్యోత్తరసంబంధభా
గవతపురాణస్థ గాథ లరసి
సకలజనానురంజనముగా విఘ్నేశ్వ
రచరిత్రయనియెడు గ్రంథ మొకటి
నా నేర్చినట్లు (పొనర్చితి?) శాలివా
హనశకాబ్దములు నందాగ్నిశైల
హిమకరసంజ్ఞల నెసఁగునీశ్వరవత్స
రంబున నింక దోషంబు లున్న

గీ. గణనసేయక గుణము లే కైకొనుండు
. . . తద్గ్విజసమితి విడిచి

సారము గ్రహించువైఖరి సంతసమున
రసికులైనట్టికవిబుధప్రవరులార !

ప్రతిలేఖకుఁడు గ్రంథాంతమం దిట్లు వ్రాసికొనెను :—

"సాధారణనామసంవత్సర ఫాల్గున బ౧౦ జయవారమువఱకు ప్రతినున్న క్రమానను మందలపర్తి వేంకటరాఘవులు వ్రాసెను".

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత చకచకఁగ నున్నది. తప్పు లంతగా లేవు. తుదిపత్రములందు శైథిల్యము కలదు. గ్రంథపాతము లల్పముగాఁ గలవు.

విఘ్నేశ్వరచరిత్రమను పేరి యీ రెండాశ్వాసముల ప్రబంధమున విఘ్నేశ్వరుని జననాదికము వర్ణింపఁబడినది. గ్రంథకర్త నం డూరిబాపిరాజు. ఈతఁడు నియోగి బ్రాహ్మణుఁడు. కృతిస్వామి వేటూరిసోమేశ్వరస్వామి. ఈగ్రంథము శాలివాహన శక 1739 సం వత్సరమున రచియింపఁబడినట్లు గ్రంథకర్త తెలిపికొనెను. గ్రంథ కర్తనుగూర్చి విశేషము లుదాహరింపఁబడిన పద్యములఁబట్టి తెలిసి కొనునది.

## R. No. 66.

Palm-leaf. 17½ × 1½ inches. Foll. 88. Lines, 6 in a page. Telugu Injured.

Presented by Brahmānanda Rao of Cocanada in 1911-12. This MS. is said to have been transcribed from the copy of the author's patron

రామేశ్వరమాహాత్మ్యము.
RĀMEŚVARAMĀHĀTMYAMU.

This is a Telugu rendering in five Āśvāsas of the Sanskrit Sētukhaṇḍa which forms part of Skānda Purāṇa It describes

the sanctity of the Rāmasētu or Rāmēśvaram. The author of the work is Ēnugu Laksmaṇakavi, son of Timmanāmātya and grandson of Laccayāmātya. He wrote this work at the instance of Bhadrirāju Mallana Mantri and dedicated it to Mallīśvarasvāmi of Gurujānapalle who is the patron god of Mallana Mantri. The author is also said to have composed other works like Rāmavilāsa, etc.

Complete.

**Beginning:**

శా. శ్రీతుల్యాతటినీమహాజలధిసంశ్లేషస్థలోపాంతవి
ఖ్యాత శ్రీగురుజానపల్లి పురనిత్యావాసుఁ డబ్జాతకం
జాతప్రోద్భవసేవ్యుఁ డైందవకళాంచన్మౌళి మల్లీశ్వరుం
డాతారార్కముఁ బ్రోచుఁగావుతఁ గృపాయత్తాత్మతన్ భక్తు
[లన్.

* * * *

క. భారతముఁ దెల్గుసేసిన
ధీరాత్ముల నన్నయార్యుఁ దిక్కనముఖ్యు నం
భోరుహభవనిభు నెఱ్ఱన
ధీరత్నము నాత్మలో నుతింతున్ భక్తిన్.

గీ. మహితచింతామణీదివ్యమంత్రసిద్ధు
నైషధాది ప్రబంధసందర్భనిపుణు
సకల విద్యావిశారదు సత్కవిత్వ
పట్టభద్రుని శ్రీనాథుఁ బ్రస్తుతింతు.

క. భీమకవిరా[illegible]
సోముని భాస్కరకవీంద్రు సూరనసుకవిన్
భూమీస్థలి నెన్నికగల
శ్రీమంతుల నాంధ్రకవిశ్రేణ్యుల దలఁతున్.

మ. సరసప్రౌఢవచోవిశాలవిబుధాచార్యున్ సువర్ణక్షమా
ధరధీరున్ వివిధప్రబంధరచనాదక్షున్ శివధ్యానత

త్పరచిత్తుఁ బ్రణమత్సమస్తధగణీపాలుఁ సుభద్రామనో
హారునిం గొల్చెద మత్పితామహుని లచ్చామాత్యచూడామణిఁ.

గీ మద్గురుస్వామి నఖిలాగమస్వభూమి
సద్వినుతకీర్తిఁ ఖాండిత్యచక్రవర్తి
భక్తి భజియింతు నాకగపల్లికులసు
ధాపయోనిధిసోముఁ గోదండరాము.

వ . . . . . ఒకఁ మహాప్రబంధంబు సేయం దలంచి
యున్న సమయంబున.

సీ. ఏవదాన్యునికులదైవంబు గురుజాన
పల్లిమల్లీశుండు భవ్యమూర్తి
ఏమంత్రితాత భూమీశసంసద్గణ్య
మహిమోన్నతుఁడు చెన్నమల్లమంత్రి
ఏమహాత్మునితండ్రి యిందుచందనకుంద
బృందనిర్మలకీర్తి భీమమంత్రి
ఏధన్యుతల్లి ధాత్రీధరాధిపసుతా
కలితసౌభాగ్యవిఖ్యాత సీత

గీ. ఏ మహాత్మునిసోదరుం డీశ్వరాంఘ్రి
పూజనాసక్తమతి సింగరాజ ?
అతఁడు శ్రీభద్రిరాజువంశాధికుండు
మహితగుణశాలి మల్లనమంత్రిమౌళి !

వ ఒకఁనాఁడు . . . కూర్చుండి . . . . .

* * * *

సీ. శోభితాపస్తంబసూత్రు వాధూలస
గోత్రు సమస్తసద్గుణసమేతు
నేనుఁగులచ్చకోంత్రమనిపౌత్రుని
శ్రీమాచిరాజునృసింహామంత్రి
దౌహిత్రు భూవరాస్థానపూజితుఁడు తి
మ్మనమంత్రికినిఁ బేరమకుఁ దనూజు
ధన్యు ననంతప్రధానుసోదరు వీర
మంత్రి కగ్రజు రాజమాన్యచరితు

గీ. నన్ను మతిమంతు లక్ష్మణనామధేయు
నమరఁ బిలిపించి యుచితాసనమున నుంచి
కలితసత్కార మొప్పఁగ గారవించి
పలికె గంభీరభాషణప్రౌఢి మెఱయ.

వ. మదీయవిజ్ఞాపనం బవధరింపుము సపాద . . . .
స్కాందంబను నాదిమపురాణంబునందు సేతుఖండంబు శ్రీరఘుపతి
ప్రతిష్ఠితరామేశ్వరస్వామి మాహాత్మ్య సంయుక్తం బగుటం జేసి
రామేశ్వరపురాణం బనంబరఁగు; నది యంధ్రదేశభాషచేతం
బ్రబంధంబు గావించి మదీయకులదైవతంబగు శ్రీగురుజానపల్లి చెన్న
మల్లీశ్వరస్వామిపేర నంకితంబు సేయుము. . . . . అని
ప్రార్థించె నయ్యవసరంబున.

ఉ. రాజమహేంద్రపుర్గరుచిరంబగు దేశమునం బ్రసిద్ధిచే
భ్రాజిలు కాకినాడశలపాకమహాళ్లకు రెంటికిన్ మహో
తేజ మెలర్పఁగా స్థలపతిత్వము గాంచినదిట్ట శాశ్వత
శ్రీజయశాలి వైరిగజసింహము నండురికామమంత్రియున్.

వ. నన్నుంజూచిలక్ష్మణకవీంద్రా మల్లనమంత్రి విన్నవించినవచనంబు లాదరించి ప్రబంధంబు రచియింపు మని వినయపూర్వకంబుగ భాషించిన. . . .

* * * *

**End:**

మత్త. భద్రిరాజుకులాబ్ధికైరవబంధుమల్లనమంత్రిరా
డ్భద్రదాయకపాదపంకజ పంకజాసనసారధీ
కాద్రవేయసుభూషణోజ్జ్వలగాత్ర గోత్రశరాసనా
సద్రయోత్థతురంగదైవతసార్వభౌమ మహేశ్వరా!

**Colophon:**

ఇది శ్రీమదుమామహేశ్వరకరుణాకటాక్షవీక్షాపాత్ర, యేనుఁగులచ్చయామాత్యపౌత్త్ర తిమ్మనామాత్యపుత్త్ర వివిధవిద్వజ్జనవిధేయ లక్ష్మణకవినామధేయప్రణీతంబైన రామేశ్వరమాహాత్త్మ్యంబను మహాప్రబంధంబునందు సర్వంబును బంచమాశ్వాసము.

ప్రతివిలేఖకుఁడు గ్రంథాంతమం దిట్లు వ్రాసికొనెను:—

"సర్వజిన్నామ సంవత్సర భాద్రపదశు ౧౨ శనివారము సరికి భద్రిరాజు మల్లపరాజుగారి ప్రతినున్న క్రమానను బాలాంత్రపు కృష్ణరాజుకొమారుఁడు వీరాజు రామేశ్వరమాహాత్మ్యము సంపూర్ణముగా వ్రాసెను"

(వి-1.) —

సమగ్రము. వ్రాత సకరమై యున్నది. తప్పులు లేవు. శైథిల్యము కలదు. అల్పముగా గ్రంథపాతములును గలవు. ఈ ప్రతి, కృతిభర్తవారికుని యొద్దనున్నప్రతినిబట్టి వ్రాయఁబడినది.

స్కాందపురాణమందలి సేతుఖండమునకుఁ దెనుఁగుగా, రామేశ్వరమాహాత్మ్య మను పేర నీయైదాశ్వాసములప్రబంధము, ఏనుఁగులక్ష్మణకవిచే రచింపఁబడినది. రామేశ్వరపురాణమనిదీనికి నామాంతరము. భద్రిరాజు మల్లనమంత్రిప్రేరణమునరచించి

లక్ష్మణకవి యీప్రబంధము నామల్లనమంత్రియిలువేల్పగు గురుజానపల్లి మల్లీశ్వరస్వామికి సమర్పించెను. ఈలక్ష్మణకవి రామవిలాసము మొదలగు బహుగ్రంథములను రచియించినవాఁడు. విశేషాంశములు పై నుదాహృతములగు పద్యములఁబట్టి తెలిసికొనునది.

R. No. 67.

Paper. 8 × 6½ inches. Foll. 186. Lines, 22 in a page. Telugu. Good.

Presented by K. R. V. Krsna Rao Bahadūr of Cocanada in 1911-12.

శకుంతలాపరిణయము.

ŚAKUNTALĀPARINAYAMU.

This gives in three Āśvāsas the story of the marriage of Sakuntalā as described in the Mahābhārata. Peddāḍa Nāgarājāmātya, son of Sūrayāmātya of Gautamagōtra and a resident of Vīrāsana (probably the modern Vīravāsara in the Gōdāvari district), composed this work and dedicated it to Viśvēśvarasvāmi worshipped at Benares.

Complete.

**Beginning:**

శా. శ్రీవాణీవరవాసవాదిసురరాజిప్రార్చితాంఘ్రిద్వయీ
సేవాచారసుధీమనోభినుతసంసిద్ధిక్రియాశాలియై
భావింపం దగు లోకరక్షణకళాప్రావీణ్యగణ్యుండు కా
శీవిశ్వేశుఁడు ప్రేమతో నను శుభశ్రీయుక్తునిం జేయుతన్.

*　　　*　　　*　　　*

క. అనఘులు కొందఱు గౌతమ
మునిపతిగోత్రమున మంత్రిముఖ్యులు కరుణా
వనధులు పెద్దాడకులాం
బునిధిసుధాకరు లనంగఁ బొడమిరి పుడమిన్.

క. మానితసుకీర్తిఁ దత్సం
తానక్రమమున జనించె ధైర్యకళాజాం
బూనదశిఖరి సుధీర
జ్ఞానయతత్పరుఁడు పట్టసప్రభుఁడు మహిన్.

ఉ. పండితసార్వభౌముఁడగు పట్టసమంత్రికిఁగల్గె

పాండురకీర్తి విశ్వపతి భావభవప్రతిమానరూపుఁడై.

క. శ్రీమత్పెద్దాడకుల
గ్రామణియగువిశ్వపతికి గాదిలికొమరుం
డై మహనీయశ్రీను
గ్వీమండలి వీరరాజు వెలసె సుకీర్తిన్.

క. నిరతాన్నదానదీక్షా
పరతంత్రుఁడు భోగభాగ్యపరిహాసితపురం
దరుఁడగు వీరన చేకొనె
గురుమతి లింగాంబఁ దనకుఁ గులసతిగాఁగన్.

క. ఆజంపతులకు విద్యా
భోజమహీజాని సుజనపోషణకరుణా
రాజీవాత్ముఁడు సూరిస
మాజస్తుతకీర్తి సూరమంత్రి జనించెన్.

మ అల పెద్దాడకులాబ్ధిసోముఁడగు సూరామాత్యశార్దూల మ
త్యలఘుశ్రీనిధి నర్సమం బరిణయంబై భోగభాగ్యోన్నతిన్
బలవైరిప్రతిమానుఁడై ప్రబలె దిక్పాలీసమాలీఢని
ర్మలకీర్తిన్ దనుసంభవాష్టకఫలప్రాప్తిన్ మహీమండలిన్.

సీ. అం దగ్రజుండు సీతాంభోజలోచనా
రమణుండు శ్రీవీరరాజమంత్రి
దృఢకీర్తిశాలి ద్వితీయుఁ డనఘు
వీరాంబికాపతి యచ్చయప్రభుండు
శ్రీయుతమూర్తి తార్తీయుఁ డమల
సీతాంబికాపతి రామయాహ్వయుండు
సుగుణాబ్ధి తదవరజుండు వేంకాంబికా
హృదయేశ్వరుండు శ్రీకృష్ణమంత్రి

గీ. తదనుజన్ములు రాజ భిధాననాగ
రాజశరభాఖ్యబుచ్చనప్రభులు వెలసి
రవనిఁ బాపమ లక్ష్మిపద్మాక్షి వియ్యా
మలనఁ దగుకులకాంత లర్మిలి భజింప !

చం. అనుపమకీర్తి వీరసచివాగ్రణి సీతమయందుఁ గాంచె (?)
చినశరభాభిధానుని . . . .

గీ. ఆశరభమంత్రి భువనవిఖ్యాతనయులఁ
దనయులను గాంచి యయ్యన యనెడువాని
సూరయాఖ్యుని నిరువుర సూరిజనము
పొగడఁ జిరకీర్తిసంపదఁ బొలుపుమిగిలె.

ఉ. వీరమయందుఁ గాంచె గుణవిశ్రుతుఁ డచ్చన పుత్త్రిక న్మ
[హో
దారచరిత్రులన్ సరసయాఖ్యుని గంచన బాపయాహ్వయున్
వీరయమంత్రిశేఖరుని నీరజగర్భముఖంబులట్లు దు
ర్వారకుమంత్రిగర్వతిమిరప్రఃమిత్రుల భవ్యగాత్రులన్.

ఉ. అంబుజబాంధవోపమవిభాంగుడు కృష్ణయమంత్రి గాంచె వెం
కాంబికయందు నందనుల నయ్యప వేంకయఁ బేరయాఖ్యు న

బ్జాంబకరూపలక్షణసమన్వితు రామయమంత్రి బంధువ
ర్గంబు నుతింపఁగా నలువురర్ ఘనదానకళాధురీణులర్.

ఉ. భారవి రాజనాఖ్యునకుఁ బాపమ కిర్వురు పుత్త్రులంగజా
కారకళాభిరాముఁడగు గంగయ రామయ గల్గి రెన్నఁగా.

*          *          *          *

క. వీరలలో నాఅవవాఁ
డై రంజిలె నాగరాజ హారహంబు-

*          *          *          *

మ. ప్రియయౌ లక్ష్మికి నాగరాజునకు ధాత్రిర్ నందను ల్గల్గి రఁ
వ్యయసత్కీర్తులు సూరయాహ్వయుఁడు నర్సామాత్య
[డుర్ మల్లనా
హ్వాయుఁడుర్ సుబ్బయవీరమంత్రిమణిబాపామాత్యచంద్రుం
[డుధ
ర్మయుతాంతఃకరణైకమూర్తి శరభామాత్యేంద్రుఁడప్పన్న
[యుర్.

గీ. అనఘగుణశాలినియగుపద్మాక్షివలన
శరభనాఖ్యుఁడు సుతుల ముప్వురను గనియె
రామయాఖ్యుని వేంకటరాయమంత్రి
నూళ్ళి యజ్ఞనామాత్యు సంభ్రమముకలిమి.

గీ. మానితసుకీర్తి బుచ్చయామాత్యమౌళి
యనఘ వియ్యమవలన నందనులఁ గాంచె
భూరికరుణాపయోధుల సూరనాఖ్య
సుబ్బయామాత్యకులమణి సుజను లెన్న.

మ. ఘనపెద్దాడకులామృతాంబునిధిరాకాచంద్రుఁడౌ నాగరా
ట్తనయగ్రామణిసూరయాఖ్యసచివేంద్రస్వామియొప్పెర్
[ఘనా

*          *          *          *

మ. స్థిరసంపన్నిధి మంజులూరికులవర్ధిష్ణుండు త్రైలోక్యసం
భరితోదారసుకీర్తిశాలి యన శ్రీమత్పద్మరాజాఖ్యమం
త్రి రహిం బొల్చుతదీయపుత్త్రి సుగుణశ్రీరూపలక్ష్మీమనో
హర సావిత్రివరించె సూరఘనుఁ డార్యన్మాలిచందంబునన్

* * * *

మ. విమలస్వాంతుఁడు సూరయప్రభుఁడు సావిత్రీవధూటీవతం
సమునం దాత్మజులన్ జగన్నుతతనూసౌభాగ్యశోభారమా
రమణీయాంగుల నేవురం బడసె నార్యత్రాణదీక్షామ
[హో
ద్యములం గల్పకభూజపంచకము నయ్యంభోధిరాజుంబలెన్.

క. అం దగ్రజుండు వేంకప
చందనమందారకుందశరదిందుశరా
మందయశస్స్వీకృతది
కుండరుఁడై ప్రబలె నార్యగణము భజింపన్.

* * * *

గీ. సరసగుణశాలి వేంకపసచివమౌళి
భూరిసంతోషకలన నందూరిరామ
యాహ్వయునికూర్మిపుత్త్రి బేరము నరస్వ
రాజువేంకయసుత నిర్ద్వరను వరించె.

చ. అలసుగుణాబ్ధి వేంకపమహాసచివాగ్రణిసోదరుండ ని
ర్మలనిగమాగమాదికపురాణకళాచతురుండ సూరిమం
డలహితముఖ్యకార్యచనాకుశలాత్ముఁడ నాగరాజునా
వెలసినవాఁడ నిచ్చ లరవిందహితప్రతిమానతేజుఁడన్

గీ. రూపసుమసాయకుండు లక్ష్మీపతియును
నబ్బలారాతివిభవుండు సుబ్బరాయఁ
డాయతసుకీర్తి గంటలరాయఁ డనఁగఁ
బరఁగుమూఁగురు మత్సహోదరులు ఘనులు.

**End:**

మాలిని. అవిరళవిశదాంగా యార్యచేతోబ్జభృంగా
ధవళవృషతురంగా దర్పితానంగభంగా
భువననిధినిషంగా భూతధాత్రీశతాంగా
భవతిమిరపతంగా పార్వతీచిత్తసంగా.

**Colophon:**

ఇది శ్రీవిశాలాక్షీకాశీవిశ్వేశ్వరకరుణాకటాక్షవీక్షాలబ్ధసరస సాహితీధౌరేయ విద్వజ్జనవిధేయ గౌతమగోత్రపవిత్ర సూరయామాత్యపుత్త్రి సద్గుణసమాజ నాగరాజ ప్రణీతంబైన శకుంతలాపరిణయంబనుమహాప్రబంధంబునందు సర్వంబును తృతీయాశ్వాసము

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత చక్కఁగా నున్నది. తప్పులు లేవు. వ్రణము లేదు. గ్రంథపాతములు లేవు.

శకుంతలాపరిణయమను పేరుగల యీ మూఁడాశ్వాసముల ప్రబంధము పిఠాపురగ్రామవాస్తవ్యుఁడును గౌతమగోత్రుఁడును నగు పెద్దాడనాగరాజామాత్యునిచే రచియింపఁబడినది. వ్యాసభారతమున నున్నక్రమముననే యిందు శకుంతలాపరిణయకథ వర్ణింప బడినది. కాశీవిశ్వేశ్వరస్వామి యేతత్కృతినాథుఁడు. పిఠాపురగ్రామమిప్పుడు పిఠాపురమని పేరొందఁబడుచున్నది. అది గోదావరి మండలమునఁ గలదు. గ్రంథకర్తృవంశవృత్తాంతాదికము పై నుదాహరింపఁబడిన పద్యములఁబట్టి తెలిసికొనునది.

## R. No. 68.

Palm-leaf. 13¼ × 1⅛ inches. Foll. 182. Lines, 6 in a page. Telugu. Slightly injured.

Presented by K. R. V. Kṛṣṇa Rao Bahadur of Cocanada in 1911-12.

విజయవిలాసము.

VIJAYAVILĀSAMU.

A Prabandha in three Āśvāsas describing Arjuna's travels and his marriage with Subhadra· by Vēnkatarāja, son of Cēmakūra Laksmaṇāmātya. The work is dedicated to Raghunātharāya of Tanjore who was the grandson of a sister of Acyutarāya's wife. The author is known to have composed also Sārangadharacarita and dedicated it to the same patron. He is considered to be an illegitimate son of Laksmanāmātya.

Complete.

**Beginning:**

ఉ. శ్రీ తెల్లప్పు డొసంగునీకచ ధాత్రీచక్రమః బాహుశీ
శీలగ్నంబుగఁ జేయ దిగ్వియజ మీ శికొన్నయందాగ నే
వేళః . . ండు దను సేవింపంగ వి ల్యాని చె
ల్వొ లీలం దగురామమూర్తి రఘునాథాధీశ్వరుం బ్రోవుతః.

* * * *

క. ఆరాజశేఖరప్రియు
వారిజముఖితోడుగాఁగ వర్ధిలువిమల
శ్రీరుచిరవర్ణమున ధా
త్రీరంజనసుకృతి చెవ్వనృపతిజనించెః.

క. ఆచెవ్వనృపాలాగ్రణి
యాచంద్రార్కముగఁ గాంచె (చి ?) నరుణాచలవృ
ద్ధాచలములఁ గట్టించె మ
హాచతురత మీఱఁగాఁ బురావగణంబుల్.

గీ శీవి నచ్యుతరాయలదేవియైన
తిరుమలాంబకుఁ జెలియలై తేజరిల్లు
మూర్తిమాంబను బెండ్లియై కీర్తివెలసెఁ
జెవ్వవిభుఁడు మహోన్నతశ్రీ చెలంగ.

క. ఆమూర్త్యంబకు నఖిలమ
హీమండలవినుతుఁ డచ్యుతేంద్రుఁడు సుగుణో
ద్దాముఁడు జనియించెం ద
ద్భూమీపతి రంగధామపూజ న్మించెన్.

శా. శ్రీరంగేశుఁడు వచ్చి యచ్యుతధరిత్రీభర్తయై భాగ్యరే
ఖారూఢిన్ విలసిల్లుతాను తనకుం గైంకర్యముల్ సేసెఁ గా
కేరాజైనను జేయఁగా గలిగెనే యిట్లుర్వి (ర్వి?) మానం
బ్రబోధా
భూరిస్నిగ్ధముగా మహామణిమయంబు ల్గాఁ గిరీటాదులన్.

**End:**

భుజంగప్రయతము.

అరాతిక్షమాభృద్విదారోచతర్ప్రాపాణా
నరాధీశ్వరాకారనాళీకబాణా
స్థిరానందనా రామసేవాధురీణా
విరాజచ్చతుష్షష్టివిద్యాప్రవీణా.

**Colophon:**

ఇది శ్రీసూర్యనారాయణ వరప్రసాద సిద్ధసారస్వత సుధాసా రజనితయశోలతాంకూర చేమకూర లక్ష్మణామాత్యకుమార సమారాధిత బుధజనసమాజ వేంకటరాజ ప్రణీతంబైన విజయవిలాసం బను శృంగార ప్రబంధంబునందు సర్వంబును దృతీయాశ్వాసము.

ప్రతివిలేఖకుఁడు గ్రంథాంతమున నిట్లు వ్రాసికొనెను :—

"శుక్లనామసంవత్సర జ్యేష్ఠశు ౧౫ గు వటికు విజయవిలాసము 3 ఆశ్వాసములు సంపూర్ణముగాను చెళ్లపిళ్ల నరసన్న స్వహస్త లిఖితముగా వ్రాసెను."

(వి-వి.)—

సమగ్రము వ్రాఁత బాగున్నది. తప్పులు లేవు. శైథిల్యము మొదటి కొన్ని పత్రములందుఁ గలదు. గ్రంథపాతములును గొన్ని చోట్లఁ గలవు.

విజయవిలాసమను పేరుగల యీ మూఁడాశ్వాసముల శృం గారప్రబంధము వేంకటరాజకవిచే రచియింపఁబడినది. ఈ వేం కటరాజు చేమకూర లక్ష్మణామాత్యునకుఁ గుమారుఁడు. ఇంత కంటె నీగ్రంథమువలన గ్రంథకర్తవిషయ మెఱుఁగరాదు. కృతి స్వామి తంజాపురీపాలకుఁడగు రఘునాథరాయలు. అచ్యుతరా యల తోడియల్లుఁడగు చెవ్వరాజునకీ రఘునాథరాయలు మను మఁడు వేంకటరాజకవి సారంగధరచరిత్రమను వేఱొక ప్రబంధ మునుగూడ రచియించి రఘునాథరాయలకే కృతియిచ్చెను.

## R No. 69.

Palm-leaf. 14⅞ × 1¼ inches. Foll 176. Lines, 6 in a page. Telugu Good.

Presented by K R V Krsna Rao Bahadur of Cocanada in 1911-12.

(*a*) శృంగారనైషధము.

ŚRṄGĀRANAISADHAMU.

Foll. 1*a*—129*a*.

This is the Telugu rendering of Śrīharsa's Naiśadha in Sanskrit It consists of eight Āśvāsas and relates the story up to the marriage of Damayanti with Nala The author of the work is the well-known Śrīnātha, son of Mārayāmātya and grandson of Kamalanābha The work is dedicated to Māmidi Singanāmātya, a minister of Pedda Kōmati Vēmabhūpāla. For further particulars about the author see extracts below.

Complete.

**Beginning:**

శా. శ్రీరామాకుచమండలీమృగమదశ్రీగంధసంవాసిత
స్ఫారోదారభుజాంతరుండు ధరణీసంశ్లేషసంభావనా
పారీణుండు కృతార్థుఁ జేయుఁ గరుణాపాథోధి వక్షోజుఁ డిం
పార మామిడిపెద్దమంత్రిసుత సింగామాత్యచూడామణిన్.

సీ.

కాళిదాసు మనంబులోఁ గాంచి ప్రౌఢ
రాజశేఖరుఁ గవిరాజుఁ బ్రస్తుతించి
నీరమతి నన్నపార్యునిఁ దిక్కయజ్వ
శంభుదాసునిఁ గర మర్థి సంస్మరించి.

వ. నవరసభావానుభావబంధురంబుగా నొక్క ప్రబంధంబు ని
ర్మింపం దలంచి . . . . . ఉన్న సమయంబున.

గీ. పరఁగుశ్రీవేమమండలేశ్వరునిమంత్రి
యహితదుర్మంత్రివదనముద్రావతారం
శాసనుఁడు రాయవేశ్యాభుజంగబిరుద
మంత్రి పెద్దయసింగనామాత్యవిభుఁడు.

శా. పంచాంగస్థిరమంత్రరక్షణకళాప్రౌఢుండు బాలామనః
పాంచాలుండు విరించివంశజలధిప్రాలేయభానుండు దో
శ్చంచచ్ఛాతకృపాణలబ్ధవిజయైశ్వర్యుండు దిక్కామినీ
కాంచీమౌక్తికకీర్తి పెద్దవిభుసింగం డొక్కనాఁ డిమ్ములన్.

వ. . . . . . కొలువుండి సకలవిద్యాపారంగతుండు
సరససాహిత్యగోష్ఠీ వినోదప్రసంగంబున,

శా. భారద్వాజపవిత్రగోత్రుని శుభాపస్తంబసూత్రు వి
ద్యారాజీవభవుండు మాగయకుఁ బుణ్యాచార భీమాంబకున్
గారామైనతనూజు నన్ననఘు శ్రీనాథాఖ్యుఁ బిల్పించి స
త్కారం బొప్పఁగ గారవించి పలికె న్గంభీరవాక్ప్రౌఢిమన్.

*                *                *                *

క. జగము నుతింపఁగఁ జెప్పితి
ప్రెగడయ్యకు నాయనుంగుఁ బెద్దనకుఁ గృతుల్
నిగమార్థసారసంగ్రహ
మగునారాధ్యచరిత మాదగఁ బెకుగల్.

*                *                *                *

సీ. కవిరాజరాజశేఖరహీరముకురంబు
శ్రీహీరకులవార్ధిశశిరకరుండు
మామల్లదేవికుమారరత్నంబు చిం
తామణిమంత్రచింతనఫలంబు
కవికులాదృష్టాధ్వగమనాధ్వనీనుండు
కాశ్మీరనృపసభకమలహేళి
ఖండనగ్రంథసంగ్రథనకర్కశబుద్ధి
షట్తర్కఫక్కికాచక్రవర్తి

గీ. భట్టహర్షుండు ప్రౌఢవాక్పాటవమున
నెద్ది రచియించె బుధలోకహితముపొంటె
నట్టి నైషధసత్కావ్య మాంధ్రభాష
ననఘ యొనరింపు నాపేర నంకితముగ.

* * * *

వ. అని పలికి నన్ను సబహుమానంబుగాఁ గర్పూరతాంబూలంబు లొసంగి జాంబూనదాంబరాభరణంబులు గట్టనిచ్చి వీడ్కొలిపిన నేను నమ్మహాప్రధానునిం గృతినాయకుం జేసి నైషధకావ్యంబుఁ జెప్పం దొడంగి తత్ప్రారంభంబునకు మంగళాచారంబుగాఁ దదీయవంశావతారం బభివర్ణించెద.

శా. తోరంబైన తపోవిశేషమున సద్యోజాతవక్త్రంబునన్
గౌరీవల్లభుచేత దీక్షగొనియెన్ సప్తర్షులం దొక్కఁడై
తారావీథి నలంకరించెఁ గనియెం బ్రద్యుమ్నసంఘాతమున్
భారద్వాజమహామునీంద్రుఁ డగదే భక్తిం బ్రశంసింపఁగన్.

ఉ. ఆమునినాథునన్వయమునం దుదయించెఁ బయఃపయోనిధిన్
యామవతీకళత్రుఁ డుదయంబయినట్టులు కల్పవృక్షచిం
తామణికామధేనుసమదాననిరూఢుఁడు విద్వదుత్తమ
స్తోమదివాకరుండు పెదతూర్కనమంత్రి కులాగ్రగణ్యుఁడై.

వ. తత్సంతానక్రమంబున,

మ. కుటిలారాతివరూథినీధవశిరఃకుట్టాకఘాటీమహా
పటహధ్వానవిపాట్యమానదశదిగ్భాగుండు త్రైలోక్యసం
పుటపేటీపరిపూర్ణకీర్తిమయకర్పూరప్రకాండుండు శ్రీ
చిటిపెద్దప్రభుఁ డొప్పె విక్రమపురీసింహాసనాధ్యాసియై.

క. ఆచిటిపెద్దప్రభునకు
వాచస్పతిసదృశనీతివైభవలక్ష్మీ
వైచిత్ర్యనిధికి నమలశ
వాచారఘనుండు మామిడన్న జనించెన్.

* * * *

సీ. అనవద్యహృద్యవిద్యాబుద్ధిసంశుద్ధి
బిరుదహాసనునుద్ది పెద్దవిభుఁడు
భద్రనిర్ణిద్రవాఙ్ముద్రాసముద్వృత్తి
కద్రూభవుఁడు వీరభద్రమంత్రి
మేరుభూధరసారధీరతాగుణహారి
వైరిశైలబలారి మారశౌరి
స్వామిభక్తిహితైకభూమివైభవభూమి
భామినీరతిరాజు నామరాజు
గీ. మామిడీశ్వరసాగరామరకుజంబు
లక్రమాభీకశుక్తిముక్తాంకురములు
వంశపావను లర్థార్థివాంఛితార్థ
దానశౌండులు సౌభ్రాత్రధర్మపరులు.

మ. అనతారాతివసుంధరారమణసప్తాంగాపహారక్రియా
ఘనసంరంభవిజృంభమాణపటుదోఃఖడ్గాద్వితీయార్జునుం
డనవేమాధిపరాజ్యభారభరణవ్యాపారదక్షుండు పె
ద్దనమంత్రీశుఁడు మామిడన్నసుతుఁ డీతన్మాత్రుఁడే చూడఁగన్.

* * * *

శా. స్వామిద్రోహరగండలాంఛనునకున్ సంగ్రామగాండీవికిన్
వేమక్ష్మాపతికార్యభారకళనావిఖ్యాతధీశక్తికిన్

నామామాత్యున కన్యరాజనిటలాంతర్న్యస్తభాగ్యాక్షర
స్తోమాపాకరణప్రవీణునకు మంత్రుల్సాటియే యెవ్వరున్.

ఉ తమ్ములు దిన్న ముప్పరున్న దైవముఁగా గురుఁగా మహానిధా
నమ్ముగ దాతగా దమమనంబుల భావనచేసి కొల్వ భా
గ్యమ్ముల కెల్ల నెల్లయయి కాంచెఁ బ్రసిద్ధి నృపప్రధానర
త్నమ్ముగ మంత్రి పెద్దన యుదాత్తమతిన్ రఘురాముకైవడిన్.

సీ. గౌతమగోత్రవిఖ్యాతుఁ డాపస్తంబ
పరమసంయమిసూత్రపావనుండు
గారాపుఁబౌత్త్రుండు గంధవారణుఁ డగు
శ్రీతిక్కనామాత్య శేఖరునకు
ఘోషిణిహనుమంతబిరుదాంకు లగురాచ
వారికి నెయ్యంపువరసఖుండు
చౌహత్తమల్లుండు దోహత్తనారాయ
ణుండు ఖండియరాయచండబిరుదు

గీ. మంత్రి యల్లాడరాజును మహితపుణ్య
యన్నమాంబయుఁ దనకు నంతంతమహిమఁ
దండ్రి యును దల్లియును గాఁగఁ దనరునట్టి
తల్లమాంబికాదేవి నుద్వాహమయ్యె.

మ. వనితారత్నము తల్లమాంబకును శ్రీవత్సాంకతుల్యుండు పె
ద్దనకుం బుట్టిరి నందను ల్విమలవిద్యాభారతీవల్లభుల్
వినతాసూనుసమానవిక్రమనిధుల్ వీరుండు వేమాహ్వయుం
డును శ్రీపెద్దదండనాథతిలకుండు సింగనామాత్యుఁడున్.

వ. ఇందు . . . . . . . .

మ. అరుదార న్వివిధాగ్రహారములతో నాందోళికాచత్రచా
మరకల్యాణకళాచికాదిబహుసన్మానార్హచిహ్నంబు లా

దర మొప్పారఁగ వేమభూవరునిచేతం గాంచె సామ్రాజ్యసం
భరణప్రౌఢుఁడమాత్యసింగఁడు నయప్రాగల్భ్యగర్వోన్నతిన్.

వ. ఈ ద్విధగుణగణాలంకారుండైన యమ్మహాప్రధాన శే
ఖరునకు.

*  *  *  *

క. కురుగకురుచేదికేరళ
శకమరుకర్ణాటలాటసౌవీరనృప
ప్రకరసభాభరణమహా
సుకవిజనానీకవినుతశుభచరితునకున్.

క. చెంచుమలమూరకారున
కు . . . . . . . .

*  *  *  *

క. శ్రీమహిత పెద్దకోమటి
వేమక్షితిపాలరాజ్యవిభవకళార
త్నామణికి సింగసచివ
గ్రామణికిం బాండ్యరాయగజకేసరికిన్.

వ. అభ్యుదయపరంపరాభివృద్ధిగానా యొనర్పం బూనిన యిమ్మ
హాప్రబంధంబునకుఁ గథానాయకుండు.

*  *  *  *

I ends—

క. కేళాదిరాయ . . .

. . . .

II begins—

క. శ్రీరాజరెడ్డివేమ
క్ష్మారమణకృపాకటాక్షసంవర్ధితల
క్ష్మీరక్షితబుధలోక యు
దారగుణాధార సింగనామాత్యనిధీ.

II ends—

మ. నవరత్నోపలదివ్యలింగవరదానప్రీతదాక్షాయణీ
ధవ కర్పూరవసంతరాయ యనవద్యాద్వాదశీవాసరో
త్సవరుక్మాంగద వేమభూపతినుత సామ్రాజ్యగఝూమణీ
యవనాధీశసభానిరంకుశవచోవ్యాపారపారంగతా.

* * * *

III ends—

స్రగ్విణి. తల్లమాంబాసుతా ధైర్యహేమాచలా
పల్లవాదిత్య సౌభాగ్యభాగ్యోదయా

* * * *

IV ends—

మాలిని. . . . . . . .
విరహితమదశంకా వీరనారాయణాంకా.

* * * +

V ends—

క. వీరావతారరక్షణ
నారాయణరాయరూపనారాయణకం
ఠీరవవిక్రమవితరణ
పారాయణయుభయవంశపావనచరితా.

VI begins—

క. శ్రీగురుశంకరమానిద
యాగౌరవనిత్యవర్ధితాన్వయ .

VI ends—

క. అరివీరబసువశంకర

**End:**

మామల్లదేవీనందనుండును శ్రీవీరరోహణాచలరత్నప్రరోహం
బును, చింతామణిమంత్రచింతనఫలంబును, కాన్యకుబ్జరాజాస్థానరంగ
మంగళాభరణంబును గౌడవిజయకావ్యకర్తయుఁ గవిచక్రవర్తియు

ఖండనకారుండును వైతండికకమలషండవేదండుండును నగుభట్టహర్షకవీశ్వరుండు కవికులాదృష్టాధ్వపాంథుం డొనర్చిన నైషధశృంగారకావ్యప్రబంధం బాంధ్రభాషావిశేషంబున నశేషమనీషిహృదయంగమంబుగా శబ్దమ్మనుసరించియు నభిప్రాయంబు గుంఫితించియు భావంబు లక్షించియు రసంబు పోషించియు నలంకారంబు భూషించియు నౌచిత్యం బాదరించియు ననౌచిత్యంబు పరిహరించియు మాతృకానుసారంబునం జెప్పంబడిన యీ భాషానైషధకావ్యం బాచంద్రార్కంబుగా నెల్లూరి తూర్పు సరాజపౌత్త్రుండును భారద్వాజగోత్రుండును, నాపస్తంబసూత్రుండును, నుభయకులపవిత్రుండును, మామిడి పెద్దనామాత్యపుత్త్రుండును, పెద్దకోమటివేమభూపాలకరుణాపాత్రుండును నైన (—?)వినయ వివేక సాహిత్య పుణ్యశ్లోకుండు? నలుండు కథానాయకుండుగా నాచంద్రార్కంబు మంగళమహాశ్రీ చేయును?

సీ. నలచక్రవర్తి పుణ్యశ్లోకుఁ డగుటను
 దమయంతి పతిదేవతావతంస
మగుట నప్పరమపుణ్యపురంధ్రిపురుషుల
 చరితంబు సత్కావ్యసరణిఁ గూర్చి
చింతామణీమంత్రసిద్ధుఁ డుపాధ్యాయ
 భట్టహర్షుండు వాగ్బ్రహ్మకరుణఁ
జెప్పిననైషధశృంగారకావ్యంబుఁ
 దెలియఁ జెప్పితి నాంధ్రదేశభాష

గీ. విష్ణుహాకృతిఁ బఠియించు నెవ్వఁడేని
నాతఁ డపగతకలిదోషుఁ డగుచుఁ గాంచు
నాయురారోగ్యవినయవిద్యావివేక
భాగ్యసౌభాగ్యవైభవప్రాభవములు.

* *

మాలిని. జగదవనధురీణా సాధురక్షాప్రవీణా
నగపతిసమధైర్యా నందితాచార్యవర్యా

అగణితగుణభద్రా త్యాగముద్రాసముద్రా
విగతసకలదోషా విశ్వలోకైకభూషా ।

**Colophon :**

ఇది శ్రీమత్కమలనాభపౌత్త్ర మారయామాత్యపుత్త్ర సకలవిద్యాసనాథ శ్రీనాథ నామధేయ ప్రణీతంబైన శృంగారనైషధకావ్యంబునందు సర్వంబును నష్టమాశ్వాసము.

ప్రతివిలేఖకుఁడు గ్రంథాంతమం దిట్లు వ్రాసికొనెను :—

"స్వభాను సంవత్సర ఫాల్గున బహుళ ౩౦ ఆదివారమున గాలిభీమలింగం, కొమాళ్లపెల్లి వీరన్న చేత నైషధం వ్రాయించెను."

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత తిన్నగనున్నది. తప్పులు గలవు. శైథిల్యము లేదు. గ్రంథపాతములు లేవు.

శృంగారనైషధమను నెన్మిదియాశ్వాసముల యీకావ్యరాజము, శ్రీనాథభట్టకవిసార్వభౌమునిచే శ్రీహర్షకవి సంస్కృతమున రచియించిన నైషధమహాకావ్యమునకుఁ దెలిఁగింపుగా రచియింపఁబడినది. ఇందు దమయంతీ పరిణయాంతమగు నలచరిత్రము వర్ణింపఁబడినది పెద్దకోమటి వేమభూపాలునిమంత్రియగు మామిడిసింగనామాత్యున కిదియంకితము చేయఁబడినది. కృతికర్త భారద్వాజ గోత్రుఁడు, ఆపస్తంబ సూత్రుఁడు, కమలనాభామాత్యపౌత్త్రుఁడు, భీమాంబికా మారయామాత్యులకుఁ బుత్త్రుఁడు, మరుత్తరాట్చరిత్రాదికము లీతని యితర కృతులు.

కృతిపతి విషయము.

భారద్వాజగోత్రమునఁ బెదతూరయసమంత్రి జనించె. తత్సంతానక్రమమున విక్రమపురీసింహాసనాధ్యాసియై చిటిపెద్దప్రభుఁడొప్పె. అతనికి మామిడన్న జనించె. మామిడన్నకును, అక్కమాంబికకును, బెద్దవిభుఁడు, వీరభద్రమంత్రి, మారశౌరి, నామరాజు, నను వారు పుత్త్రులు. అందుఁ బెద్దవాఁడగు పెద్దవిభునకుఁ దల్లమాం

బి॥ భార్య. ఈమె గౌతమగోత్రుఁడును ఆపస్తంబసూత్రుఁడును గంధవారణబిరుదుఁడు నగు కేతనామాత్యునకుఁ బౌత్త్రుఁడును, చౌహత్త మల్ల దోవాత్తనారాయణ ఖండియరాయ బిరుదాంకుఁడు, నగు నల్లాడరాజునకును నన్నమాంబకును గూఁతురు. పెద్దవిభునకుఁ దల్లమాంబికకు వేమామాత్యుఁడు, ప్రెగ్గడయ్య, సింగనామాత్యుఁడు కుమారులు. అందుఁ బెదకోమటి వేమభూపాలు మంత్రియగు సింగనామాత్యుఁడు కృతిస్వామి. ఈతఁడు గురుశంకర స్వామి శిష్యుఁడు. ఈగ్రంథమునకుఁ బూర్వమే పండితారాధ్యచరితమును ప్రబంధము రచించి శ్రీనాథకవీశ్వరుడు సింగనామాత్యు నన్న ప్రెగ్గడదండనాథునకుఁ గృతిగా నొసఁగెను కృతికర్తను గూర్చియు కృతిభర్తను గూర్చియు విశేషములు పలు నుదాహరింపఁబడిన పద్యములఁ బట్టి తెలిసికొనునది

(*b*) నామలింగానుశాసనము.

NĀMALIṄGĀNUŚĀSANAMU

Foll. 130*a*—175*b*.

See Sanskrit part of the Catalogue

R. No. 70

Palm-leaf 15½ × 1¼ inches Foll 14 Lines, 5 in a page. Telugu. Injured

Presented by Brahmānanda Rao of Cocanada in 1910–11

సీతావిజయము.

SĪTĀVIJAYAMU

This Prabandha describes the conquest of Śatamukha-Rāvaṇa (*i.e.*, the hundred-headed Rāvana) by Sītā, wife of Rāma, the plot having been taken from the Sanskrit Vāsiṣtha Rāmāyaṇa The name of the author and the number of chapters of the work are not known. It is also different from another work of this name composed by Rangaya in four Āśvāsas.

**Incomplete.**

**Beginning :**

క. శ్రీపార్వతీమనోహర
యాంబుద్భవ వాదిదేవతార్చితపద వి
ద్రూప జగన్మయ భూతివి
లేపనధవళాంగ ... మలింగ మహేశా!

వ. దేవా! యవధరింపుము రోమశమహామునిం గని ధర్మరాజతివినయంబున మ్రొక్కి సీతావిజయకథాశ్రవణకుతూ . . . శతాననవధప్రకారంబు వినవలతుం జెప్పవే యని యడిగిన సంతోషించి వసిష్ఠరామాయణంబునందు జెప్పం . . . సీతావిజయంబు చెప్పం దొడంగె నది యెట్టి దనిన.

**End :**

గీ. అనుజ లందఱు భుజియించి రట్లు సీత
పార్వతియుం దాను నొకశక్తిబంతియందు
నిండువేడుకం గూర్చుండి నెమ్మిం గుడిచె
దివిజసతులకు నోరూర వి . . .

(వి-వి.)—

అసమగ్రము. వ్రాంత బాగున్నది. నిర్దుష్టము కాదు. శైథిల్యము కలదు. గ్రంథపాతములు కలవు.

సీతావిజయ మను పేరు గల యీ ప్రబంధమున శతముఖ రావణుని సీతాదేవి జయించెడు కథ వర్ణింపబడినది. ఈ కథ వాసిష్ఠరామాయణమునుండి కైకొనబడెను. ఈ ప్రబంధ మెన్ని యాశ్వాసములుగా నెవ్వరిచే రచింపబడెనో యీ ప్రతినిబట్టి గుర్తింపరాదు. రంగయ యను కవియు నీకథను సీతావిజయ మను పేరనే నాల్గాశ్వాసముల ప్రబంధముగా రచించెను. అదియు నీపుస్తకశాలయందుం గలదు. ఈరచనము వేఱు అది వేఱు.

## R. No. 71.

Palm-leaf. 16⅜ × 1¼ inches. Foll. 89. Lines, 5 in a page. Telugu. Injured.

Presented by Brahmānanda Rao of Cocanada in 1911–12.

షట్చక్రవర్తిచరిత్రము.

SAṬCAKRAVARTICARITRAMU.

Same work as the one described under R. No. 51 *ante*.

Incomplete; contains only the first five Āśvasas.

(వి-వి.)—

అసమగ్రము. ఐదాశ్వాసములు మాత్రమే కలవు. వ్రాంత బాగున్నది తప్పు లంతగా లేవు. శైథిల్యము కలదు. గ్రంథపాతములును కలవు.

ఇది నెం 51 రున వర్ణితమగు గ్రంథమే.

## R. No. 72.

Palm-leaf 16 × 1⅛ inches. Foll. 122 Lines, 5 in a page. Telugu. Injured.

Presented by K. R. V. Kṛsna Rao Bahadur of Cocanada in 1911–12.

షట్చక్రవర్తిచరిత్రము.

SAṬCAKRAVARTICARITRAMU.

Same as the above

Complete, but without the introduction

(వి-వి.)—

సమగ్రము. కాని; కృత్యవతరణము లేదు. వ్రాంత బాగున్నది నిర్దుష్టము కాదు. శైథిల్యము కలదు. గ్రంథపాతములును కలవు.

ఇది నెం 51 రున వర్ణితమగు గ్రంథమే.

R. No. **73.**

Palm-leaf. 16⅝ × 1⅜ inches. Foll. 63. Lines, 7 in a page. Telugu Injured

Presented by K. R. V. Krsna Rao Bahadur of Cocanada in 1911–12.

ధరాత్మజాపరిణయము.

DHARĀTMAJĀPARINAYAMU.

Same work as the one described under R No 50 *ante.*

Incomplete.

(ఐ-ఐ.)—

అసమగ్రము. వ్రాంత తిన్నగనే యున్నది తప్పులు గలవు. శైథిల్యము గలదు. గ్రంథపాతములు నల్పముగాఁ గలవు.

ఇది నె 50 రు వర్ణితమగు గ్రంథమే. కొం దర్థములుగలపద్య ముల క్రిందను వ్యాఖ్య గలదు.

R. No. **74.**

Palm-leaf 14½ × 1¼ inches Foll. 116 Lines, 5 in a page. Telugu. Much injured

Presented by Brahmānanda Rao of Cocanada in 1910–11.

ధరాత్మజాపరిణయము.

DHARATMAJĀPARINAYAMU.

Same work as the above.

Breaks off in the second Āśvāsa

(ఐ-ఐ.)—

అసమగ్రము. మొదటినుండి ద్వితీయాశ్వాసము కొంత భాగము వఱకే గలదు. వ్రాంత తిన్నగనే యున్నది. తప్పులు లేకపోలేదు. శైథిల్యము మెండుగాఁ గలదు. గ్రంథపాతములును గలవు.

ఇది నె 50 రున వర్ణితమగు గ్రంథమే; ద్వ్యర్థిపద్యముల కిం దు వ్యాఖ్యానము కలదు.

## R No. 75.

Palm-leaf. 16¾ × 1½ inches Foll. 111. Lines, 8 in a page. Telugu. Good

Presented by Puligadda Gangarājugāru of Vizianagaram in 1911-12.

భాగవతము (దశమ స్కంధము).

BHĀGAVATAMU—(X SKANDHA).

Same work as the one described under R No. 20 *ante*.

Incomplete

(ఆ-ఆ.)—

అసమగ్రము. మొదలు లేదు, తుద లేదు. వ్రాంత తిన్నగా నై యున్నది. తప్పు లంతగా లేవు. శైథిల్యము లేదు. గ్రంథపాతములు లేవు.

ఇది నె 20 రున వర్ణితమగు గ్రంథములోనిభాగమేయగు దశమస్కంధము.

## R. No. 76.

Palm-leaf 11¼ × 8½ inches. Foll 42. Lines, 29 in a page. Telugu. Injured

Presented by Sōmayājulu of Guntur in 1910-11.

(*a*) శకుంతలాపరిణయము.

ŚAKUNTALĀPARIṆAYAMU.

Foll. 1*a*—31*b*.

This Prabandha describes in three Āśvāsas the story of the marriage of Śakuntala : by Kṛṣṇakavi, son of Nṛsiṁhaguru of

Maitrēyagōtra. The author borrows for the plot from Śakuntalōpākhyāna of the Mahābhārata and from Kālidāsa's Śākuntala. He states that he composes the work at the instance of Cirumāmilla Pāpayaprabhu, an account of whose family is given in the following extracts. The work is dedicated to God Vēnkatēśvara worshipped at Tirupati. It is different from the one described under R. No. 67 *ante*. This author composed also Dhanurvidyāvilāsa as is evident from the colophon and the introduction given therein.

Complete, but the first three leaves are lost.

**Beginning:**

* * * *

శా. మాన్యుండై తగువాసిరెడ్డి పెదలక్ష్మమ్మకున్ శోభృత్యాళికిన్
కన్యారత్నము కోనమాంబ తనకుం గాంతాలలామంబుగాఁ
గోన్యోమత్స్యప్రగిత్యుదారభుజుఁడై కోదండరామార్యమూ
ర్ధన్యుం డాత్మభవుం జలన్నయనునుద్యన్మూర్తిఁ గాంచెన్
[రహిన్.

క. శ్రీపతిభాతిఁ జలన్నా
ర్యాపతి యలబోడిపూడి వేంకటరామ
క్ష్మాపతి గాదిలిపట్టిన్
రూపవతిఁ బకీరమ న్నిరూఢిన్ వరించెన్.

వ. అక్కాంపురిలోనం గోదండరామన్నపాలునకుం గడగొట్టుతమ్ముండు.

క. శ్రీవాసిరెడ్డినాగ
క్ష్మావరునకుఁ బాగ్యతమ్మగారికి సుతయై
శ్రీవం దగు వేంకటజను
శ్రీ విలసిల నాయుడమ్మ చేకొని తనరెన్.

క. ఆవేంకటరామప్రభు
దేవి సిరులతావి సిరులదీవి యమృతపుం

భావి నెఱతీవిఁ దనరుఁగ
వేవిధముల వెంగమాంబ విశ్రుతి మీఱన్.

*  *  *  *

క. శ్రీవెంగమాంబికామణి
కీవేంకటరామనృపతి కిరువురు తనయుల్
తీవిం గలిగిరి గుణగణ
భావితులై రామనృపతి పాపయ్యయనన్.

*

క. శ్రీమీఱం దల్లిదండ్రులు
నామ మిడిరి వేంకటాద్రినాయఁ డనుచు నా
రామక్షితిపతి(ఁడ?)తమ్మునిఁ
బ్రేమన్ బాపయ్య యనుచుఁ బిలిచిరి పిదపన్.

*  *  *  *

క. శ్రీమచ్చిరుమామిళ్లకుల
సోమునకున్ బాపయప్రచురనామునకున్
గామిని యిభగామిని శుభ
గామిని మీనాంబ దనరుఁ గలిమిన్ బలిమిన్.

*  *  *  *

సీ. విలస దగ్గంకితిర్మలతిర్మలార్యుల
యంఘ్రిపల్లవయుగం బాశ్రయించి

తీవిఁ దనరారుమీనాక్షిదేవితోడ
మహితతేజుఁడు పాపయత్మ్యావిభుఁడు.

వ. . . . . . పయిడికులగోత్రపవిత్రుండును, పాప
(!) త్రుండును నగు శ్రీచిరుమామిళ్లపాపయప్రభుం డొకనాఁడు

పుత్త్రమిత్త్రామాత్యబంధుసందోహపరివృతుండై నిండోలగంబున సు
ఖాసీనుండై సరససల్లాపంబులం బ్రొద్దు గడపుచు

మ. నను రామానుజపాదపద్మయుగళీనవ్యావ్యయధ్యానపా
వనహృద్భాగవతావతంసపదసేవాసక్తచిత్తు న్మరు
త్తనయారాధనలబ్ధచారుకవితాధారున్ సదారూఢభా
వను నాస్థానకవిన్ నిజాశ్రితుని బిల్వంబంచి పల్కెం గృపన్.

క. మిత్రుఁడవై మైత్రేయస
గోత్రుఁడవై నారసింహగురువర్యునకుం
బుత్త్రుఁడవై వెలయుదు వి
ధాత్రిన్ మాపనుపు సేయఁ దగుఁ గృష్ణకవీ!

క. అవ్యయభవ్యావహ మగు
కావ్యరచన మదియు మేలుగాదే బుధసం
భావ్యము "విశ్వశ్రేయః
కావ్య." మ్మనుసూత్ర మార్యకథితం బగుటన్

వ. అదియునుం గాక . . . . . . . . . .
శ్రీవేంకటేశ్వరార్పణంబుగా నివేదింపఁ దగు నిది మదీప్సితం బని
యాదేశించుటయు . . . జనన్యాజ్ఞావర్తనంబు సలుపం
బూనియున్న మాకు భవత్సన్నిధానంబు దొరకొనియెఁ గావున.

**End:**

భుజంగప్రయాతము.

కృపాధార బాసేర కృష్ణార్తిదూరా
విపశ్చిజ్జనారాధ్య వేదాంతబోధ్యా
కపాలిస్తుతక్షేమ కళ్యాణధామా
రిపుధ్వాంతఘస్రేశ శ్రీవేంకటేశా!

**Colophon:**

ఇది శ్రీమత్కౌసల్యానందనప్రసాదసమాసాదితకవితావిచిత్ర
మైత్రేయసగోత్ర నృసింహగురుపుత్త్ర కృష్ణకవిప్రణీతంబైన శకుం

తలాపరిణయంబనుమహాప్రబంధంబునందు శకుంతలాదుష్యంతపున స్సమాగమంబును దుష్యంతుండు సేనాసమేతుండై క్రమ్మఱఁ గరిన గరంబు ప్రవేశించుటయు, భరతసంభవంబును, శకుంతలావివాహం బును, గణ్వమహాముని మనుమనిఁ గూఁతుం గరినగరంబున కనుపు టయు, శకుంతలాదుష్యంతసంవాదంబును, శ్రీవిష్ణుసాక్షాత్కారం బును, శ్రీవిష్ణుసంకీర్తనంబును, భరతపట్టాభిషేకంబును, శకుంతలా దుష్యంతపునస్సంభోగోపాఖ్యానంబును, ననుకథలం గలిగి సర్వం బును దృతీయాశ్వాసము.

(వి-వి.)—

మొదటి మూఁడుపత్రములు పోయినవి. తక్కినగ్రంథ మెల్లఁ గలదు. వ్రాఁత లిన్నదై యున్నది. తప్పు లంతగా లేవు. శైథిల్యము కలదు. గ్రంథపాతములు లేవు.

వ్యాసభారతమందలి దుష్యంతోపాఖ్యానమును, గాళిదాసుని యభిజ్ఞానశాకుంతలనాటకమును, బట్టి శకుంతలాపరిణయమను నీప్ర బంధము రచియింపంబడినది. నె 67 రున వర్ణింపఁబడిన గ్రంథము వేఱు. ఇది వేఱు. పూర్వగ్రంథకర్త పేరు కృష్ణకవి. ఈతఁడు రామానుజమతాభిమాని. ఆంజనేయారాధకుఁడు. మైత్రేయ సగోత్రుఁడు. నరసింహగురునకుఁ బుత్త్రుఁడు. చిరుమామిళ్ల పాప యప్రభుని ప్రేరణమున నీగ్రంథమును రచియించి కృష్ణకవి వేంకటే శ్వరస్వామి కర్పించెను. చిరుమామిళ్లపాపయప్రభునివంశవృత్తాం తము గొంత పై నుదాహరింపఁబడిన పద్యములఁ బట్టి తెలిసికొన నగును. ధనుర్విద్యావిలాసమునుగూడ నీతఁడే రచియించిన ట్లం దలిగద్యాదులవలనఁ దెలుచున్నది.

---

(b) సునందాపరిణయము.

SUNANDĀPARINAYAMU.

Foll. 32a—42b.

This is a Prabandha in five Āśvāsas describing the marriage of Sunandā with Pradīpa, a king of the Kuru race: by Cintaguṇṭa

Kōdandarāmanāmātya, son of Akkanamantri, a Niyōgi Brahmin of Nandavara. For an account of his ancestors see extracts below.

Breaks off in the second Āśvāsa.

**Beginning:**

శా. శ్రీపై దేహసుధాపయోధరతటీసింధూరపంకారుణ
శ్రీవిభ్రాజదురస్స్థలాంతరపరిస్ఫీతాచ్ఛముక్తావళీహా
రావారాంచితదివ్యమంగళశరీరాభావిలాసుం డయో
ధ్యావాసుండగు రాఘవుం డొసఁగుఁ గాతన్ మాకు నిష్టార్థముల్

*    *    *    *

వ. ఇవ్విధంబున . . . గావించి యేతత్ప్రబంధంబునకు నాదియగు మదీయవంశం బభివర్ణించెద.

*

ఉ. నందన్నృపాలకోత్తములు నందవరంబున నుండు ట్టి యా
నందవరీకభూసురజనంబులలోపలఁ బెద్దటంచు నెం
చం దగుచింతగుంటకులసాగరచంద్రుఁడు పెద్దనార్యుఁ డిం
పొందె దిగంతరాళముఁ బూర్ణముగాఁ దనకీర్తి నిండఁగన్.

*    *    +    *

క. ఆపెద్దన్నకుమారుఁడు
శ్రీపతిపాదారవిందసేవకుఁ డంచ
ద్రూపవినిర్జితమన్మథుఁ
డేపొందెను వెంగళన్న యెన్నఁగ విబుధుల్.

క. వెంగళమంత్రికి భాస్కరుఁ
డంగజనిభమూర్తి తిరుమలామాత్యుండున్
రంగమరెడు వేటమరా
ట్పుంగవుఁడు జనించి రతులభోగాస్పదులై.

క. ఆభాస్కరమంత్రికి నుదు
శోభాయుతవిగ్రహుండు సుతుఁ డుదయించెన్
బ్రాభవ మొప్పఁగ భాగ్య
శ్రీభరితుఁడు తిమ్మనార్యశేఖరుఁ డెలమిన్.

చ. పొలుపుగ జింతకుంటకులముఖ్యుఁడు తిమ్మనమంత్రిచంద్రుఁ డిం
పలరఁగ ఘట్టనూరినయనారితనూజను మాదమాంబికా
లలనను బ్రేమమీఱ శుభలగ్నమునందు వివాహమై జగం
బులు దను సన్నుతింపఁ జెలువొందెఁ గనద్వైభవాభిరాముఁడై.

క. ఆరమణీరమణుల కరు
దారఁగ జన్మించె
. . . . . .
. . . సింగనార్యుఁ డరయన్.

సీ. ఏమంత్రి నిర్మించె నీశ్వరాలయములు
శ్రీనగాద్యుత్తమక్షేత్రములను
ఏమంత్రి కావించె నెల్లదేశములను
నానాతకూపతటాకవితతు
లేమంత్రివాకిట సామంతబృందంబు
గాంచి మ్రొక్కులు వేయఁ గాచియుండు
నేమంత్రియింటను భూమీసురశ్రేష్ఠు
లాగమోక్తిశివార్చనానురక్తి

గీ. లతఁడు దిగ్దేశభూపసభాంతరప్ర
శస్తకవిబృందమధురవాగ్జనితకావ్య
చయనుతౌదార్య విక్రమాంచద్యశుండు
గుంటుపలిముత్తనార్యదిక్కుంజరుండు.

క. నాలుగుదుర్గంబులు పదు
నాలుగుదేశములప్రజల నయమార్గమునన్

లాలించుచుఁ జిరకాలము
పాలించెను మత్తమంత్రి ప్రభుమాత్యుండే.

క. ఆముత్తనమంత్రీంద్రుఁడు
ప్రేమం దగుచింతగుంటవేటయతనయన్
భామామణిఁ దిమ్మాంబను
గామించి వివాహమయ్యెఁ గరుణ దలిర్పన్.

క. ఆజంపతులకు భాస్వ
త్తేజోజితభాస్కరుండు (ఁడును ?) ధీజననిచయాం
భోజవనీభాస్కరుఁడు
ద్భ్రాజితవిక్రముఁడు భాస్కరన్న జనించెన్

సీ. స్థిరతరప్రజ్ఞావిశేషాతినిష్ఠాతి
రస్కృతనిర్జరారాధ్యుఁడు
అసదృశమంత్రయోగాతివశీకృత
సన్మంత్రదేవతాసముదయుండు
నిరుపమశ్రుతిసూక్తనిర్ణీతసత్సార్గ
వర్గోచితాచారవర్తనుఁడు
ఘనతరపాణినిగ్రంథార్థశోధన
సంశర్ధసన్మనీషాన్వితుఁడు

గీ. సత్యభాషాహరిశ్చంద్రజనవిభుండు
సలలితౌదార్యనిర్జితజలధరుండు
యల్లమాంబాసతీ ప్రాణవల్లభుండు
గుంటుపలిభాస్కరుండు సత్కులవరుండు.

గీ. ఆవధూవల్లభులకు శుభాస్పదముగ
జనన మొందె . . . . . .
. . . . . . . .
మహితసద్గుణనికురుంబ మల్లమాంబ.

క. ఆమల్లమాంబ నతుల
శ్రీ మించగ సర్వమంత్రిశేఖరుఁడు శచీ
భామామణి నింద్రుం డువ
యామంబైనట్లు పరిణయంబై రిల గన్.

క. ఆసగ్వన కగ్రసుతుఁ
డై సరసులు మెచ్చ నెగడె నతులితభాగ్య
శ్రీసంపద్వైభవజిత
వాసవుఁ డనఁ బద్మనాభవర్యుం డుర్విన్.

* * * *

గీ. ప్రథితమైన గుంటుపల్లిముమ్మడిమంత్రి
మంత్రిసుతను రామమాంబ నెలమిఁ
బద్మనాభమంత్రి పరఁగ వివాహమై
పెంపు నొందె బంధువితతు లెన్న.

క. అజాయాపతులకు సుర
రాజోన్నతవైభవాభిరాముఁడు విద్యా
భోజుఁడు ధైర్యశ్రీవి
భ్రాజితుఁ డుత్తముఁడు సర్వమంత్రి జనించెన్.

* * * *

గీ. గుంటుపలిశంకరామాత్యుకూర్మితనయ
నంబమాంబావధూలలామను (!) వివాహ
మై ముదంబునఁ బుత్త్రపౌత్త్రాభివృద్ధి
దనరఁ జెన్నొందె సర్వప్రధానమౌళి.

ఊ.

పెం
పొందెను జింతకుంటకుల(?) సర్వయతిమ్మన మంత్రివేడుకన్.

గీ. పెంపు మిగుల సాగి పెరుమాళ్లతనయను
లింగమాంబ నతుల లీల లొందవ
తిమ్మనప్రధానధీమంతుఁ డుద్వాహ
మయ్యె నచలమైన నెయ్య మొనర.

క. కెలికున ఫల ముదయించిన
తెలుఁగునఁ బుత్తడికిఁ దావి దివిరినరీతిన్
సరసుఁడు తిమ్మయమంత్రికి
గురుతనయుఁడు జగ్గరాజు మూర్తి, జనించెన్.

చ.

. . . . . . . . . . . . . . ని
చ్చలముగఁ జె తకుంటకులసర్వయయకన్నని కీర్తి పూర్తిగన్.

* * + *

క ఎనయఁగ గుణములవె గన
తనయను మంగాభిధానతరుణీమణి నిం
పలరఁగఁ బరిణయ మయ్యెను
ఘనుఁ డకన్నసచివుఁ డతులకరుణ దలిర్పన్.

చ. సురుచిరగోపసంపదల సుందరరూపవిలాసరేఖలన్
స్థిరతరకీర్తిశాలియగు తిమ్మనమంత్రికి లి గమాంబకున్
వరతనయుండు వంశమునువన్నెయు వాసియుఁ గల్గువాఁడఁ బెం
పరయఁగ (గల్గుపు?)త్తుఁడను అకన్నమంత్రికి మంగమాం
[బకున్.

క. భూమీశ్వరసమ్మాన్యుఁడ
శ్రీమంతుఁడ సుకవిజనవశీకరుఁడ సదా
ర మార్చనాభిగతుఁడను
నామము కోదండరామనామాత్యుండన్.

సీ. ఘనతరౌదార్యదీక్షాకల్పితానల్ప
  కరనిబద్ధసువర్ణకంకణుండు
ఆసేతుశీతనగాంతరరాట్సభా
  మధ్యవిశ్రుతకీర్తిమండలుండు
కొండపల్లివినుకొండదుర్గద్వయీ
  దేశప్రజావనశ్రీయుతుండు
సకలవనీపకసంతానయాచిత
  వస్తుప్రదానప్రవర్తనుండు

గీ. అన్నవేమమహీశదత్తాగ్రహార
మదకలాందోళికాఛత్రసన్మణివిశేష
భూషణాద్యష్టభోగాఖిలభూషితుండు
భానుతేజుండు రాయనభాస్కరుండు.

ఉ. వన్నెకు నెక్కు భాస్కరునివంశమునం దుదయించెఁ గీర్తిసం
పన్నుఁడు బంధుబృందపరివారజనాశ్రితసత్కవీశ్వరా
పన్నశరణ్యుఁ డంచితకృపాఢ్యుఁడు వేంకటనారసింహుఁ డ
త్యున్నతిఁ జెంది దుశ్చ్యవనతుల్యలసద్విభవాభిరాముఁడై.

* * * *

గీ. అరయ వేంకటనారసింహార్యమౌళి
సరసవాక్స్ఫూర్తి రెంటాలచమడమంత్రి
తనయ నచ్చమసాధ్వి నుద్వాహమయ్యె
నింద్రుఁడు పులోమసుత వరియించినట్లు.

* * * *

గీ. ఆరమణీరమణులకు
. . . . . . .
మారిక జన్మించె రామమాంబ యనంగ.

గీ. అంత నాదంపతులు ప్రేమ లంకురింప
రామమాంబాఖ్యతనయాలలామ నెలమి
దనరఁగాఁ జింతకుంట కోదండరామ
వరున కుపయాంప మొనరించి రురుతరముగ.

గీ. అంతటను రామమాంబయుం దతులలీలఁ
బుత్త్రపౌత్త్రాభివృద్ధిఁ బెం పొందియుండె.
స్థిరముగా నేనొనర్చు ప్రదీపభూప
వరుచరిత్ర కధీశు నేర్పఱుపఁ దలఁచి.

**Colophon:**

ఇది శ్రీరామభద్రకటాక్షలబ్ధకవితావిచిత్ర, చింతగుంటవ శపవిత్ర, అకరునమంత్రిపుత్త్ర సహజసాహిత్య కోదండరామనామాత్య ప్రణీతంబైన సునందాపరిణయంబను మహాప్రబంధంబునందుఁ బ్రథమాశ్వాసము.

**End:**

గీ. మొదల నలువ మొల్లమొగ్గలభంగిఁ గ
ల్పించి వణఁకుదేరి పిడిపోవ
మెచ్చుమీఱ దాడిమీబీజములరీతి
మగువ కొనపంక్తి తగ నొనర్చె.

(వి-వి.)—

అసమగ్రము. ద్వితీయాశ్వాసమున సగమువఱకు మాత్రమే కలదు. వ్రాఁత తిన్నగ నున్నది తప్పు లంతగా లేవు. శైథిల్యము గలదు. గ్రంథపాతములును గలవు.

సునందాపరిణయమను పేరుగల యీ ప్రబంధము చింతగుంట కోదండరామకవిచే రచియింపఁబడినది ఇందుఁ బ్రదీపునిచరిత్రము వర్ణింపఁబడెను. కోదండరామకవి నందవరీక నియోగిబ్రాహ్మణుండు. ఈతని వంశవృత్తాంతాదికము మీఁద నుదాహరింపఁబడిన పద్యములఁ బట్టి తెలిసికోఁదగును.

## R. No. 77.

**Palm-leaf.** 8¼ × 6¼ inches. Foll. 79 Lines, 16 in a page. Telugu Injured.

Presented by K. R. V Krsna Rao Bahadur of Cocanada in 1911-12.

హైమవతీపరిణయము.

HAIMAVATĪPARINAYAMU.

This is a Prabandha in three Āśvāsas treating of the story of the marriage of Pārvatī with Śiva : by Cāganti Vēnkatakrsna, son of Rāmayāmātya, and grandson of Vēnkatakrsna, a Niyōgi Brahmin of Ātrēyagōtra The author was a disciple of Karrā Appa Śāstri and an admirer of Sistu Krsnamūrti Śāstri and Mikkili Mallikārjunakavi The work is dedicated to God Vēnugōpāla worshipped at Ōdūru.

Complete

**Beginning :**

శా. శ్రీలావణ్యతనూవిలాసమహిమశ్రీతుల్యగోపాలస
ల్లీలాటీసతతోపగూహనభవోల్లోలస్తనాకీర్ణగం
ధాలంకారవివర్ధమానవసనాలాలంకృతోరస్కుఁ గో
పాలస్వామిఁ గొల్తుఁ జిత్తమున సద్భావార్థసంసిద్ధికిన్.

*   *   *   *

మ. రసికాధీశుని నాటకాదివరశాస్త్రప్రోక్తనానార్థభా
వసదాశిష్యనికాయబోధకుని సర్వజ్ఞేశసంస్తుత్యు నా
యసమానోజ్జ్వలశేముషీఘనుఁ విద్యాపూర్ణు గఱ్ఱాన్వయా
బ్ధిసరోజారిని నప్పశాస్త్రిగురునిన్ బ్రీతిన్ నుతుల్ సేసెదన్.

ఉ. అష్టకకుమ్మహీశ్వరసభాంతరసన్నుతకీర్తిశాలి భూ
శిష్టజనోపకారకరసేవితపాదసరోజు సత్యస
ద్గోష్ఠిని వైభవేంద్రగ[illegible]కవికోటిశిఖామణిఁ గృష్ణమూర్తినిన్
శిష్టుని శిష్టువంశజలధీశకలానిధి నాశ్రయించెదన్.

ఉ. . . . . . . . . .

. . . . . . . . .

మిక్కిలి కీర్తిచే వెలయు మిక్కిలివంశపయోధిసోముని
మక్కువతోడ గొల్చెదను మల్లయసత్కవిసార్వభౌమునిన్

శా. శ్రీమత్సర్వనృపాలశేఖరసభాజేగీయమానాంచితో
ద్దామప్రాభవసంస్తుతాంధ్రకృతులన్ దైవాళి మెప్పించి త
త్సామర్థ్యంబున దేజరిల్లె భువి నాత్రాత్ప్రాంకజాత్యుండు నా
మా నాతామహుఁడైన జగ్గకవినిన్ మన్నించి కీర్తించెదన్.

శా. ఆత్రేయాఖ్యపవిత్రగోత్రభవు గోత్రానేకశ్వగస్తుత్యచా
రిత్రున్ రాఘవపాండవీయవసుచారిత్రాదికోశస్థవా
క్చిత్రార్థజ్ఞుని సత్కవీశ్వరుఁ లక్ష్మీనారసింహాఖ్యునిన్
మిత్రుం దత్త్వవిచారమంత్రగజుఁ నెమ్మిన్ గొలు నశ్రాం
[తమున్.

ఉ. ప్రాణసమాన . . గిపరిపంథిసమూహవలాహకాబ్జగ
ర్భాణుని సుందరాంగజితపంచకబాణుని నిత్యపూజిత
స్థాణుని మేదినీరమణసన్నుతసర్వకళాప్రవీణునిన్
జాణను పూర్ణవంశభవచంద్రుని మాంగయమంత్రి మెచ్చెదన్.

**End:**

మాలిని సరసిజదళనేత్రా శైలజాధీశమిత్రా
సరససుతచరిత్రా సత్యభామాకళత్రా
సురయువజనజీవా శుంభదాత్మస్వభావా
విరచితగుణభావా వేణుగోపాలదేవా.

**Colophon:**

ఇది శ్రీమత్సూర్యనారాయణకరుణాకటాక్షవీక్షణామృతధారా
సముద్భూతకవితాప్రసిద్ధాత్రేయగోత్రపవిత్ర వేంకటకృష్ణపౌత్త్ర
రామయామాత్యపుత్త్ర సకలసుకవినికరవిధేయ చాగంటివేంకట
కృష్ణనామధేయ ప్రణీతంబైన హైమవతీపరిణయంబను మహాప్రబం
ధంబునందుఁ దృతీయాశ్వాసము.

(బి-బి.)—

సమగ్రము. వ్రాఁత యొకమాదిరిగా నున్నది. తప్పులు గలవు. శైథిల్యము కలదు. గ్రంథపాతములు లేవు.

ఇది మూఁడాశ్వాసముల ప్రబంధము ఇందుఁ బార్వతీపరిణయకథ వర్ణింపఁబడినది. గ్రంథకర్త చాగంటి వేంకటకృష్ణకవి. ఈతఁడు కర్ణాటప్పశాస్త్రికి శిష్యుఁడు. శేషకృష్ణమూర్తి శాస్త్రికిని, మిక్కిలి మల్లికార్జునకవికిని విధేయుఁడు. వేంకటకృష్ణకవి నియోగిబ్రాహ్మణుఁడు. గ్రంథము వేణుగోపాలస్వామి కంకితము చేయఁబడినది.

R. No 78.

Palm-leaf $17\frac{3}{4} \times 1\frac{1}{4}$ inches Foll. 224 Lines, 6 in a page Telugu. Good.

Presented by K R V Kinsa Rao Bahadur of Cocanada in 1911-12.

శేషధర్మము.

ŚĒṢADHARMAMU

This is a Telugu rendering in five Āśvāsas of the Sanskrit work of this name which forms a part of Harivaṁśa and which treats of Dharmas (religious laws). The author of the work was Vēnutumupalli Viśvanātha, son of Dattakavi Vēnkatāmātya, a Niyōgi Brahmin of Āpastambasūtra and Kāśyapagōtra. The work was dedicated to Vatsavāya Timmarāja, about whom more can be learnt from the extracts below. The author had already composed Śrīrāmavijaya (a Yakṣagāna), Gaurīvivāha (Dvipada) and Hariscandracaritra (a Nirōsthya poem) in Telugu and Pārijātāpaharana in Sanskrit

Complete

**Beginning:**

శా. శ్రీలావణ్యరతిప్రయోధరయుగశ్రీగంధపుంజల్వనే
పొలెఁ జల్లి నల్లమల్లెసిలఁగాఁ బొల్పొందు జేజేదయా

భూలోకేంద్రుని వత్సవాయకులజు౯ బుణ్యాత్ముఁ బేరక్షమా
పాలగ్రామణితిమ్మభూవిభుని సౌభాగ్యాన్వితుం జేయుత౯.

వ. . . . . . . . . . . . . .

వత్సవాయవంశపవిత్రుండును బేరభూపాలపుత్త్రుండును, బుణ్యశీ
లుండును నైన తిమ్మభూపాలుండు బ్రాహ్మణాశీర్వచనప్రభావసంవర్ధిత
సామ్రాజ్యమహావైభవంబుఁ గాంచి . . . . యొకనాఁ
డు శ్రీభీమేశ్వరస్వామిమహామహిమాభిరామంబైనదాక్షారామం
బునకు విజయంచేసి యేను కృతిసేయంబూనుట తనయను గుమం
త్రియగు నేనుఁగుగురువప్రభుండు విన్నవించిన విని సంతోషించి
సకలశాస్త్రప్రశంసులగు విద్వాంసులును . . . కుతూ
హలాయత్తచిత్తంబున.

సీ. సురుచిరాపస్తంబసూత్రుఁ గాశ్యపగోత్రుఁ
బ్రాజ్ఞుఁడౌ వెనుతురుపల్లిరామ
మంత్రీశ్వరునిపౌత్త్రు మల్లవరప్రబా
లుకవిదోహిత్రు బట్టకవియనఁగ
విఖ్యాతిఁగాంచినవేంకటామాత్యున
కును సర్వమాంబకుఁ గూర్మిపుత్త్రు
విశ్వనాథాఖ్యుని విశ్వేశవరకృపా
లబ్ధసత్కవితావిలాసు నన్ను

గీ. నాదరంబునఁ బిలిపించి యర్ఘ్యపీఠ
కమునఁ గూర్చుండ నియమించి కరుణఁ జూచి
తనప్రసన్నముఖారవిందమున మంద
హాస మలరంగ నిట్లని యానతిచ్చె.

సీ. సృజియించినాఁడవు శ్రీరామవిజయంబు
యతిరాజవిజయంబు చిన్నవుడే రూఢిఁ

గల్పించినాఁడవు కవిజనశ్రవణసౌ
ఖ్యమన గౌరీవివాహంబు ద్విపద
రచియించినాఁడవు ప్రచురచాతురి నిరో
ష్ఠ్యప్రబంధము హరిశ్చంద్రచరిత
కావించినాఁడవు దేవభాషను బారి
జాతాపహరణంబు శాశ్వతముగ

గీ. అన్నిటను నీవ నేర్పరి వార్యవర్య!
వర్ణనీయకవిత్వతత్త్వంబునందు
నిందుకోటీరచరణారవిందవంద
నప్రభావనిధీ! విశ్వనాథసుకవి?

శా. ఏరీ! నీకు సమాను లిప్పటితటి న్విద్వత్కవిగ్రామణుల్
పారావారపరీతవిశ్వవసుధాభాగంబులం దున్నట
ద్గౌరీకాంతజటాచ్ఛటాంతరగలద్గంగాతరంగావళీ
భూరిశ్రవ్యఘుళంఘుళధ్వనులఁ దెల్పు న్నీవచోగుంభనల్.

గీ ఎలమిఁ గవిరాజు లెంచంగ నిపుడు నీవు
చెప్పఁ బూనిన కావ్యంబు శేషధర్మ
మంకితముసేయు మాపేర ననఘచరిత
ధారుణీస్థలి నాచంద్రతారకముగ.

వ. వత్సవాయతిమ్మభూపాలున
కభివృద్ధికరంబుగాఁ దదీయవంశావతారం బభివర్ణించెద

* * * *

గీ. అందు జనియించె జానకీప్రాణవిభుఁడు
సకలదేవమునిస్తోమసన్నుతుఁడు
ఘోరదైతేయగర్వాంధకారహేళి
రామచంద్రుండు జగదేకరక్షకుండు.

క. ఏతాదృశసంతతిఁ బ్ర
ఖ్యాతంబుగ నుద్భవించె గర్వితవిమత
వ్రాతలపతిహిమదినరా
జై తిరుమలరాజు రాజు లందఱుఁ బొగడన్.

* * * *

క. అతనికిఁ గలిగె సుపుత్త్రుఁడు
రతిరాజమనోజ్ఞమూర్తి రణరంగసము
ద్ధతరిపువిదళనవిద్యా
ప్రతిపన్నుఁడు నాగరాజు భాగ్యం బలరన్.

* * * *

క. ఆరాజునకును మాదమ
గారికిఁ బ్రభవించె సుతుఁడు ఘనరిపుబలసం
హారి సకలార్థిగణా
పారీణుఁడు తిప్పరాజు ప్రాభవ మొప్పన్.

క. ఆతిప్పరాజువలనను
బాతివ్రత్యయుగు (యుత య? ) నమ్మవకు సింగధరి
త్రీతలపతి పుట్టె గుణా
న్వీత కుమమ్మకు(ను ?)జగ్గనృపతి జనించెన్.

క. ఆసింగభూపతికిని మ
హాసౌభాగ్యవతి కృష్ణమాంబకు మదనో
ల్లాసుఁడు కోర్కొండ (నృ)పతి
భూసురసిధిజగ్గరాజు పుట్టిరి జగతిన్.

* * * *

క. ఆకోర్కొండనృపతికి ర
మాకాంతనుబోలు నరసమాంబకుఁ బుణ్యా

శ్లోకులు గలిగిరి సుతు లు
ర్శీకాంతులు సింగరాజు వేంకటరాజుల్.

*		*		*		*

ఉ. సింగనృపాలమౌళికిని (స్త్రీ)తిలకంబగు వేంకమాంబకున్
రంగదభంగసంగరపరాక్రమశక్రసుతుల్ . . కన
ద్గాంగతరంగకీర్తులు జగన్నుతమూర్తులు గల్గి రార్యనీ
తిం గుదురైన వేంకటపతిక్షితినాథుఁడు నారసింహుఁడున్.

గీ. కోరుకొండనృపతి కూర్మితమ్ముఁడు జగ్గ
రాజునకును బుణ్యరమణులందు
యశము గాంచు రంగమాంబకు జనియించె
నందనుండు గోపినాథరాజు.

గీ. గోపినాథరాజునకు సద్గుణకదంబ
నాగమాంబకుఁ గల్గిరి నల్గురు సుతు
లంగసంభవసౌందర్యు లద్రిధైర్యు
లనఘతరచర్యు లభిమానధనులు ఘనులు.

(జగన్నాథరాజు, చిన వేంకటపతి, వేంకటకృష్ణనృపతి, కస్తూ
రి రంగరాజు.)

వ. ఇది సింగభూపాలుని వంశక్రమము. ఇటమీఁద నతని యను
జుండైన జగ్గరాజేంద్రుని సంతతిక్రమం బభివర్ణించెద.

*		*		*		*

ఉ. జగ్గనృపాలవర్యునకు . . . . . . . . .
. . . . . . . . . . . . . . . . .
. . . . . . . . . . . యల్లమాంబకున్
దిగ్గజరాజతుల్యులు జనించిరి పుత్త్రులు లోకపూజితుల్.

రాయపరాజు పెదకొండశౌరి, పుట్ట కొండయ్య, పేరనృపతి, పెదవేంకటరాజు, చినవేంకటాద్రి, పెదయప్ప భూపతి, చినప్పలన్న.

గీ. పుట్టకొండరాజ పుంగవునకు గోస
మాంబకును దనూజుఁడై జనించెఁ
జకటాదనమునందు సరిపోల్ప రతిరాజు
ప్రజకు ధర్మరాజు బాపిరాజు.

క. పెదవేంకటభూపతికిని
సుదతీమణి యెల్లమకును సుతుఁ డుదయించెన్
గదనార్జునుండు వనితా
మదనుఁడు పినబాపిరాజు మహిమోన్నతుఁడై.

గీ. ఘనుఁడు చినవేంకటక్షమాకాంతునకును
ముమ్మమాంబకు సుతుఁడై జగమ్ములోన
వన్నె వాసిని మెచ్చె నావత్సవాయ
సంతతిసుధాంబునిధిరాజు జగ్గరాజు.

క. పినయప్పలభూపతిమణి
కిల లక్ష్మినిబోలు లక్ష్మికిఁ గల్గిరి నం
దనులు జగన్నాథుఁడు చ
కరనిరాయపరాజు ఘనులు కర్ణసమానుల్.

గట్టిగ వత్సవాయకులగణ్యుఁడు పుణ్యుఁడు రాజనీతిఁ జే
పట్టిన పేరభూపతికి భాగ్యవతీమణి నారమాంబకున్
బుట్టిరి రామలక్ష్మణులఁ బోలినపుత్త్రులు బంధుకోటిఁ జే
పట్టినతిమ్మభూపతియు భవ్యుఁడు జగ్గనృపాలచంద్రుఁడున్.

మ. మనుజస్తుత్యుఁడు జగ్గభూవిభుఁడు కామక్ష్మావిభుఁడు లక్ష్మణుం
డనువర్తించువిధంబునన్ దను మహోహర్షంబునన్ సర్వదా
యనువర్తింపఁగ ధర్మమార్గమున హెచ్చై పేరభూపాలనం
దనుఁడౌ తిమ్మనృపాలమౌళి సిరులన్ ధాత్రిస్థలిన్ వర్ధిల్లెన్.

గీ. గుణవిభూషణుఁ డేనుఁగుగర్వమంత్రి
ధీరుఁడగు పోలప్రెగ్గడ సూరమంత్రి
కడమ రెండు భుజంబులు గాఁగఁ బ్రబలె
మహిఁ జతుర్భుజ౦రహితు దిమ్మప్రభుఁడు.

* * * *

క. పేరనృపాలకవరునకు
మారునకున్ ధీరవినుతమహనీయగుణా
ధారునకు ననమశరశ్వం
గారునకును దిమ్మరాజ గంభీరునకున్.

**End:**

సరసిజవృత్తము
స్తుతగుణదరహాస సురుచిరవదనా
తతయశ విలసిత తనుజితమదనా
ప్రతిభటవిదళన పరచితకదనా
సతతసకలశుభసమధికసదనా

**Colophon:**

ఇది శ్రీవిశ్వేశ్వరచరణారవిందవందన వెణుతురుపల్లి వేంకటామాత్య నందన విద్వజ్జనగేయ విశ్వనాథ నామధేయ విరచితంబైన శేషధర్మంబను మహాప్రబంధంబునందు సప్తమంబును విచమాశ్వాసము.

(వి-వి.)—

సమగ్రము వ్రాఁత చక్కఁగా నున్నది. తప్పులు లేవు. శైథిల్యము లేదు. తుదమొదళ్లఁ బెక్కెడ గ్రంథపాతములు గలవు.

సంస్కృతమున శేషధర్మ మను పేరఁ గల్గు ధర్మశాస్త్ర గ్రంథమున కిది తెలిఁగింపు. గ్రంథకర్త వెణుతురుబల్లి విశ్వనాథకవి. ఆపస్తంబ సూత్రుఁడు. కాశ్యపగోత్రుఁడు. దిట్టకవియని పేరు గాంచిన వేంకటామాత్యునకుఁ గుమారుఁడు. విశ్వనాథకవి యేతద్గ్రంథరచనమునకుఁ బూర్వము తెల్గున శ్రీరామవిజయ మను యక్షగానము, గౌరీవివాహ మను ద్విపదకృతి, హరిశ్చంద్రచరిత్రమను నిరోష్ఠ్యకృతి, సంస్కృతమునఁ బాలిజాతాపహారణము నను గ్రంథముల రచియించెను. ఈగ్రంథము వత్సవాయ తిమ్మరాజుగారి కంకితము సేయఁబడినది. తిమ్మరాజుగారినిగూర్చి యెల్లవిషయములను బై నుదాహృతములగు పద్యముల బట్టి తెలిసికొన నగును.

R No. 79.

Palm-leaf 15½ × 1¼ inches Foll. 102. Lines, 6 in a page. Telugu Injured, especially the first ten leaves.

Presented by Puligadda Gangarāju of Vizianagaram in 1911-12.

(*a*) లంకావిజయము.

LAṄKĀVIJAYAMU.

Foll. 1*a*—55*a*. Foll. 55*b* and 56 are left blank.

This is a Prabandha in two Āśvāsas describing the story of the Rāmayana. The stanzas are so written that each of them is capable of another meaning, and in this way the poet finds opportunity to curse Dammaya who dispossessed him of his lands in the Lanka (islets in the river Gōdāvari). Dammaya is put in the place of Rāvana and Lakṣmaṇagraja plays the part of Rāma as this word may be made to mean the elder brother of Lakṣmaṇa and the Brahmin Lakṣmaṇa. The author of the work is Piṇḍiprōli Lakṣmana, son of Gōpālamātya of Āpastambasūtra and Bharadvājagōtra.

Complete.

**Beginning**:

శా॥ శ్రీలక్ష్మీస్తనకుంకుమాంక మొకొ నాఁ జెల్వై యెదఁ గౌస్తుభం
బోలిఁ గ్రాల దయారసా . . . . . .
. . . లక్ష్మీజాని కుయ్యేటిగో
పాల . . . సౌఖ్యముం బరము శుంభల్లీల మా కీవుతఁ.

**End**:

ఉభయ భాషాకందము.

కం. గామము దేవర కావవ
యామా జే జేయనయ మయామున్నల జే
జేమదినినార దేమయి
తేమ ద్దామోదరయద తేలం దాలిఁ.

**Colophon**:

ఇది శ్రీమత్కుయ్యేటిగోపాలలీలాకటాక్షవిశ్వాసంప్రాప్తదీప్త సాహిత్య సకలకవిజనస్తుత్య శుభాపస్తంబసూత్ర భారద్వాజగోత్రపవిత్ర పిండిప్రోలిగోపామాత్య పుత్ర సరసకవితాలక్షణ విచక్షణ లక్ష్మణకవి ప్రణీతంబైన లంకావిజయంబను ద్వ్యర్థిప్రబంధంబునందు సర్వంబును ద్వితీయాశ్వాసము.

గ్రంథాంతమునఁ బ్రతివిలేఖకుఁ డిట్లు వ్రాసికొనెను :—

"జల్లిడిమూడి బంగారు వ్రాసిన లంకావిజయము. పార్థివ సం॥ శ్రావణ శు ౧౫ సోమవారంనాడు లంకావిజయము సంపూర్ణముగా జల్లిడిమూడి బంగారు వ్రాసినాడు."

(వి-వి.)—

సమగ్రము. వ్రాత బాగుండలేదు. దుష్టము కాదు. కృత్యవతరణమందలి పత్రములు పది మిగుల శిథిలము లయినవి. గ్రంథపాతము లయ్యెడ మెండుగాఁ గలవు.

లంకావిజయమను పేరుగల యీద్వ్యర్థకావ్యము పిండిప్రోలి లక్ష్మణకవిచే రచియింపఁబడినది. దీనికి రావణదమ్మీయ మని నామాం

తరము కలదు. తన లంకపాలమును రావుధర్మారాయఁడను నాతఁడపహరింపఁగా నాక్షేత్రాపహరణవృత్తాంతమును రామాయణకథతో జతకూర్చి లక్ష్మణకవి యీశ్వరశతకావ్యము రచియించెను. ఇందు ధర్మారాయఁడు రావణునితోఁ బోల్పఁబడెను. ఈ పుస్తకమున గ్రంథావతరణము శిథిలముగా నుండుటచే గ్రంథవిషయమునుగూర్చియు గ్రంథకర్తనుగూర్చియు నింతకంటెఁ దెలుప వలనుపడదయ్యె.

(b) శేషధర్మము.

ŚĒṢADHARMAMU·

Foll. 57a—102b.

Same as the work described under R. No. 78 *ante*. The introduction given therein is not found in this MS

Breaks off in the second Āśvāsa

(బి-బి.)—

అసమగ్రము. కృత్యవతరణము లేదు. ప్రథమాశ్వాసమును ద్వితీయాశ్వాసమునఁ గొంతపట్టును గలవు.

ఇది న 78 రున వర్ణితంగు గ్రంథమేకాని వేఱుగాదు.

## R. No. 80.

Palm-leaf 16 × 1¼ inches Foll 70. Lines,17 in a page. Telugu. Good.

Presented by Brahmānanda Rao of Cocanada in 1911–12.

శివరహస్యఖండము.

ŚIVARAHASYAKHANDAMU.

This is a Telugu rendering of the Sanskrit work of this name, which forms part of the Śankarasaṁhitā of Skandapurāna: by Bālasarasvati Vēṅkatācalakavi, son of Śankarāmātya and Laskmī, and grandson of Kōdūri Yallanāmatya of Kaśyapagōtra. The work is dedicated to God Śiva

The work here is incomplete and wants beginning It breaks off in the fourth Āśvasa. Even the Sambhavakānda is not complete.

**Beginning:**

క. జననుత నాదేవాంబా
తనయునఁ దనుఁ జూచి కాసుధాకరబింబా
స్యను సద్గుటూరివంశా
గ్రణి ( ? ) రాయఘనుఁడు వరించెన్.

* * * *

**Colophon:**

ఇది శ్రీమత్సకలసుకవిజనానుగ్రహసాత్ర కాశ్యపసగోత్ర కోడూరియల్లనామాత్యపౌత్త్రి శంకరామాత్యపుత్త్రి లక్ష్మ్యంబాతనయ వినయవిధేయ బాలసరస్వతీనామాంక వేంకటాచలకవిప్రణీతంబైన శ్రీస్కాందంబను మహాపురాణంబునందు శంకరసంహితయను శివరహస్యఖండంబునందు సంభవకాండంబునఁ బ్రథమాశ్వాసము.

**End:**

క. యోగం బుపక్రమించుచు
భాగాలంబన మొనర్ప భాగెం బొందున్
వేగమ జనించి దైవని
యోగంబున జగము లెల్ల నుద్ధతిఁ గలఁచెన్.

(వి-వి.)—

అసమగ్రము. మొదలు లేదు. తుద లేదు. మొదటియాశ్వాసమున మధ్యంతమునుండి, నాల్గవయాశ్వాసమునఁ గొంతవఱకుఁ గలదు. వ్రాఁత బాగున్నది తప్పులు కలవు. శైథిల్యము లేదు. గ్రంథపాతములు లేవు.

స్కాందపురాణమ దిలి శంకరసంహితయను శివరహస్యఖండ మందలి సంభవకాండమున కిది తెలిగింపు. కాశ్యపగోత్రుఁడును కోడూరియల్లనార్యపౌత్త్రుఁడును, లక్ష్మ్యంబాశంకరామాత్యులపు

త్రుఁడును, నగు వేంకటాచలకవి యేతద్గ్రంథకర్త. ఈతనికి బాలసరస్వతియను బిరుదనామము కలదు. ఈ కృతి శివునకు సమర్పింపఁబడినది గ్రంథ మసమగ్రముగా నుండుటచే నింతకంటె హెచ్చు గుఱించి చెప్ప వలనుపడదు.

## R No. 81.

Palm-leaf 16½ × 1 inches. Foll. 83 Lines, 5 in a page. Telugu. Good

Presented by K. R V Krsna Rao Bahadur of Cocanada in 1911-12.

విజయవిలాసము.

VIJAYAVILĀSAMU

Same work as the one described under R. No. 68 *ante*.

Complete.

(వి-వి.)—

సమగ్రము కాని కృత్యాది పద్యములు కొన్ని విడనాడఁ బడినవి. వ్రాఁత యొకమాదిరిగా నున్నది. తప్పు లంతగా లేవు. శైథిల్యము లేదు. గ్రంథపాతములు లేవు.

ఇది నెం 68 రున వర్ణితమగు గ్రంథమే కాని వేఱు కాదు.

---

## R. No 82.

Palm-leaf. 14¼ × 1½ inches Foll. 88. Lines, 7 in a page Telugu. Good.

Presented by C Visvanatha Śastri of Vizianagaram in 1911-12.

వాసిష్ఠరామాయణము.

VĀSIṢṬHARĀMĀYANAMU.

Same work as the one described under R. No. 60(*b*) *ante*

Breaks off in the fourth Āśvāsa

(వి-వి.)—

అసమగ్రము. మొదటినుండి నాల్గవ యాశ్వాసములోని కొంతభాగమువఱకు సరిగా నలదు. ప్రాంత చక్కగానై యున్నది. తప్పు లంతగా లేవు. శైథిల్యము లేదు. గ్రంథపాతములు లేవు.

ఇది నెం 60 (b) రున వర్ణితమగు గ్రంథమే కాని వేఱుకాదు.

## R. No. 83.

Palm-leaf 16½ × 1¼ inches. Foll 55 Lines, 8 in a page Telugu. Good From the copyist's statement it is seen that this MS is a copy of the one written by the well-known Telugu poet Kūcimañci Timmakavi for himself

Presented by K R. V. Kisna Rao Bahadur of Cocanada in 1911-12.

బహుళాశ్వచరిత్రము.

BAHULĀŚVACARITRAMU

This Prabandha describes in five Āśvasas the story of the visit paid as a guest by Śrī-Kisna to king Bahulāśva, who is a devotee of Visnu It was composed by Dāmarala Vengalanāyaka, of Inigēlagōtra, and dedicated to his father Vēnkatādhīśa. This author states that he has also composed Krsnacarita. He had a brother by name Cennabhūpāla, and his mother was Gurvamāmba. The author's cousin (aunt's son) was Bangāru Yācamanāyaka, son of Velgōti Kastūriranganāyaka who seems to be an ancestor of the present Venkatagiri Zamindar

Complete.

**Beginning:**

శా. శ్రీమద్భ్రూః తనూభవాక బరభూపిమంతపీతాలలం
తీమ త్ర్యామకపేరబిత్తునకు జోత్స్నకాంత కాంతిచ్ఛటా [ముండే
భూమండలం బయిఁ జెలుగు తెలుగు ననుజాఘాల్ సూచుశ్రీరా
దా మెర్లాన్వయు వేంకటాద్రివిభుసి ధన్యాత్ముఁగాఁ జేయుతన.

ఉ. దామెర వేంకటప్రభువతంసుని వెంగళభూప మాపయిన్
శ్రీమెఱయంగఁ గృష్ణకథ చెప్పితి విప్పుడు నీదు తండ్రియున్
మాను కభర్తుఁ డాతనికి మాకును భేదము లేదు గాన నీ
వాముహిమాఢ్యు పేర బహుళాశ్వచరిత్రము చెప్పు మొప్పుగన్

* * * *

క. ఆచరణా బుజమున నా
చారణాచరణచలిత రాజన్యుఁడు వా
చావణయాచక ఖేచర
నైచికి శ్రీపాదమను జనాధుఁడు పుట్టెన్.

క. శ్రీపతిపదపద్మమున ఘృ
ణాపటిమ జనించి పద్మనాయక మణియై
ధీపాండితి నేపారిన
శ్రీపాదప్రభున కబ్బనృపతి జనించెన్.

* * * *

క. అబ్బనృపాలాగ్రణికిని
బిబ్బోక వతీవతంసబిసరుహవిశిఖుం
డబ్బలియుఁ డనఁగ నీవుల
న బ్బలి యన ధర్మనృపతి యతఁడు జనించెన్.

* * *

క. ఆధర్మనృపతి కుధరమ
హాధృతి వెలిగోటితిమ్మయప్రభుసత్పు
త్రీధన్య వేంగళాంబిక
గాథాసిధి ధర్మపత్ని గా నుతి కెక్కెన్.

వ. ఆ వెంగళాంబికయందు (వరదయ, వెంగళాధిపుఁడు, తిమ్మయ, కోనయ యని నల్గు రుదయించిరి).

ఉ. శర్మఘనుండు వేంగళరసాతలభర్తకు లక్ష్మమాంబకుఁ
ధర్మనృపాలమౌళి వరదప్రభుచంద్రుఁడు వేంకటేంద్రుఁడుఁ
దిర్మలశౌరి నల్గురు జనించిరి శ్రీహరిబాహులట్లు . . .

చం తదనుజయైన లోకహితధర్మవిశంకట వేంకటాంబికన్
గదనకిరీటి యేచనృపుకస్తురి రంగనృపాలవర్యుఁ డిం
పొదవ వరించి కాంచె విభవోజ్జ్వలు రంగయయాచభూవరున్
విదితగుణాఢ్యు సింగపృథివీవరచంద్రుని నకరమాంబికన్.

ఉ. ఏచతురుండు సాటి మనయేచనృపాలుని మేనమామ యు
ర్వీచిరకీర్తి చామరల వెంగళభూవిభు వేంకటాద్రి హే
మాచలధన్వి మామ ధృతి నంబుజమామ రుచిన్ వితీర్ణిఁ బ్ర
ద్మాచణవర్షుమామ యభిమన్యునిమామ ఘృణాగుణాదులన్.

* * * *

గీ. చామరల వేంకటప్రభుదారమణులు
గుణధరణి యయ్యమాంబిక గుర్వమాంబ
కేసమాంబిక యనుసతుల్ భూసమాన
లై సమాఖ్యానిధానంబులైరి జగతి.

* * * +

చ. స్థిరమతియైన యయ్యమకుఁ జెన్నమహీశుఁడుఁ గేసశౌరియున్
వారితరుణీసమానగురువాటకు వెంగళభూమిభర్తయున్
వరదనృపాలమౌళి మఘవప్రమదాసము కేసమాంబకున్
గిరిధృతి కృష్ణధీరుఁడు జనించిరి కల్పకపంచకంబునన్.

* * * *

క. ఈపుత్త్రులం గను వేంకట
భూపాలకుఁ డతఁడు వెలయుఁ బుడమిని నుద్య
చ్చాపలతారోపశరా
టోపహతారాతిభుజపటుప్రాభవుఁడై.

**End:**

ఉత్సా. వాసవాంబరాంఘ్రిభక్తవశమనోబ్జభాసురా
భాసురారివరతురంగవారికీర్తివాసనా
వాసనావిశోభితగుణావారసుమహిమాసమా
మాసమాజవిభవదీప్తమాననీయవాసవా

**Colophon:**

ఇది శ్రీమద్వేంకటేశ్వరసమగ్రకరుణానుగ్రహాశౌర్య తేజైశ్వర్య ధుర్యతామహేశ్వరరూపరేఖావిజితరతీశ్వర సరససంగీతసాహిత్య సకలకళావిచక్షణ సమాశ్రితపక్షరక్షణదక్షవీక్షణ ఇనిగేల గోత్రపావన పరిపంథిరాజకల్పితపాదసేవన దామరలవేంకటాధీశ పుత్త్రచెన్నభూపాలకలితసౌభ్రాత్రగురువమ్మాంబాగర్భశుక్తిముక్తాఫల గురువనజసంభవాభవశేషభాషామనీషాబల (?) ప్రతిదినాగతార్థిజనవరప్రదాయక శ్రీవేంగళనాయక ప్రణీతంబైన బహుళాశ్వచరిత్రం బను మహాప్రబంధంబునందు సర్వంబును పంచమాశ్వాసము.

గ్రంథాంతమునఁ బ్రతివిలేఖకుఁ డిట్లు వ్రాసికొనెను :—

"క్షయనామసంవత్సర శ్రావణ శు ౨ శ॥ వఱకు, నూచిమంచిగంటిరాజు కుమారుడు తిక్కవి సార్వభౌముఁడు వ్రాసిన ప్రతి చూచి భావసంవత్సరమాఘ బహుళ ౧౩ బు॥ వఱకు సుంకరణం రామరాజు కుమారుడు భీమరాజు శ్రీరామార్పణంగా బహుళాశ్వచరిత్ర వ్రాసెను."

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత యింపుగూర్చుచున్నది. తప్పులు లేకపోలేదు. శైథిల్యము లేదు. గ్రంథపాతములు లేవు

బహులాశ్వచరిత్ర మను పేరు గల యీ నైదాశ్వాసముల ప్రబంధము దామరల వేంగళనాయకునిచేఁ దనతండ్రియగు వేంకటాద్రిభూపాలున కంకితముగా రచియింపఁబడినది. హరిభక్తుఁడగు బహులాశ్వుఁడను రాజుచరిత్ర మిందు వర్ణింపఁబడినది. వెలిగోటి కస్తూరిరంగనాయకుని కుమారుఁడగు బంగారుయాచమనాయఁ డీ గ్రంథము రచించిన తిరువేంగళనాయకునకు మేనత్తకొడుకఁట. ఏతద్గ్రంథరచనమునకుఁ బూర్వ మీకవి కృష్ణుని చరిత్రము రచించెన ట్లీ గ్రంథకర్తృవంశవృత్తాంతము కొంత పై నుదాహృతములగు పద్యములం దెలుఁగనయ్యెడిని. ఈ ప్రతి సుప్రసిద్ధాంధ్ర కవీశ్వరుఁడగు కూచిమంచి తిమ్మకవిసార్వభౌముఁడు స్వహస్తముతో వ్రాసినప్రతికిఁ బుత్త్రికయని లేకరి వ్రాతవలనఁ దెలియుచున్నది.

---

## R. No. 84

Palm-leaf. 16 × 1¼ inches. Foll. 52. Lines, 5 in a page. Telugu. Good.

Presented by Brahmānanda Rao of Cocanada in 1911-12.

(*a*) పంచతంత్రి.

PAÑCATANTRI.

Foll. 1*a*—8*a*. Fol. 8*b* is blank.

Same work as the one described under R. No. 53 *ante*.

Contains the third Āśvāsa incomplete.

(ని-ని.)—

అసమగ్రము. తృతీయాశ్వాసమునఁ గొంతభాగమే కలదు. వ్రాఁత బాగుగ యున్నది. తప్పు లంతగా లేవు. శైథిల్యము లేదు. గ్రంథపాతములు లేవు.

ఇదియు నెం. 53 రున వర్ణింపఁబడిన గ్రంథమును నొకటి సంస్కృతగ్రంథమునకే తెలుఁగు సేఁతలు. ఆ గ్రంథము రచించిన యాతఁడు వేఱు, ఈతఁడు వేఱు.

(*b*) భాగవతము (11, 12 స్కంధములు).

BHĀGAVATAMU (SKANDHAS 11 AND 12.)

Foll. 9*a*--52*b*.

Another portion of the work described under R. No. 20 *ante*. by Bammera Pōtanāmātya.

Eleventh Skandha incomplete and the twelfth complete. The stanzas recording the name of the scribe and the date of transcription are given below :--

గ్రంథాంతమునఁ బ్రతివిలేఖకుఁడిట్లు వ్రాసికొనెను :—

సీ. గుండపాకాన్వయ మండనుండగు వేంక
టార్యకోవిదునకు నాత్మజుండు
విశ్వనాథాఖ్యుండు విప్రుండు వరరుధి
రోద్గారివత్సరం బిరమైన
చైత్రమాసంబునఁ బాత్రిత బహుకృష్ణ
యేకాదశిఁ బ్రాంత సేఁపునాఁడి
చేసె శ్రీవైశాఖ మాసశుద్ధైకాద
శీసౌమ్యవాసర సిద్ధిసరికి

గీ. వ్రాసె ముదమున శ్రీభాగవతమునందు
డంబు గేకాదశ ద్వాదశంబులైన
స్కంధములు దేవపూజితచరణుఁడైన
సర్వక్రియజనకు సమర్పణంగ।

(వి-వి.)—

అసమగ్రము. ద్వాదశస్కంధము మాత్రము పూర్ణముగాఁ గలదు. వ్రాత బాగున్నది. తప్పు లంతగా లేవు. శైథిల్యము లేదు. గ్రంథపాతములు లేవు.

బమ్మెరపోతనామాత్యాదులచే రచియింపఁబడిన యాంధ్రభాగవతప్రబంధమందలి యేకాదశ ద్వాదశస్కంధములు.

## R. No. 85.

Palm-leaf. 15 × 1½ inches. Foll. 24. Lines, 6 in a page. Telugu. Injured.

Presented by D. Tirupati Śāstri of Cocanada in 1911-12

ఆంధ్రశబ్దచింతామణిప్రవృత్తిః (ససూత్రమ్).

### ĀNDHRAŚABDACINTĀMAṆIPRAVṚTTIḤ WITH SŪTRAS.

This contains the Sūtras on Telugu grammar generally attributed to Nannayabhaṭṭāraka, and a Sanskrit commentary thereon. The name of the commentator is not known

Breaks off in the fifth Paricchēda

**Beginning:**

౧౨. కేవలతయా ముసర్వత్ర్యభే చ యే యుంయ గౌతథాభాషా॥

పార్థక్యేన యథేచ్ఛం యే యం భాషా ఉభే చ ఆద్యే తత్ర మాదిభి రనువర్తతే; చంద్రుఁడు వనము ఇత్యాద్యా స్సంస్కృతస మాః; చందురుఁడు సాద్రము ఇత్యాద్యా స్తద్భవాః; జగ జముఁడు ఇత్యాద్యాః ప్రాకృతసమాః; కంబము, బోనము, ఇత్యాద్యా స్తద్భవాః; ఏవం శౌరసేన్యా మతే తత్సమతద్భవత్వం చింత్యమ్ ౧౩ ఆద్యాయాః పంచాశద్వర్ణాః

**Colophon:**

ఇత్యంధ్రచింతామణి ప్రవృత్తౌ తృతీయో జంతపరిచ్ఛేదః.

**End:**

లఘ్వేకాక్షరపూర్వక్రియాంతిమస్యానయోర్ద్వేదిద్వా ॥

లఘు ఏకాక్షరం పూర్వం యస్యాంతిమాక్షరా దిత్వం వా స్యాత్ ఘటియించెఁ ఘటించెఁ నటియించెఁ నటించెఁ లఘు కిమ్? రంజించెఁ, ఏకాక్షరం కిమ్? కరుణించెఁ, క్వచి త్త్రిపది కయోగేపి, అత్తరిఁ ఉత్తరియించెఁ.

తిఙ్మధ్యనామకా స్స్యుర్మధ్యమపురుషా శ్చ యే రమాంతాశ్చ యే మధ్యమపురుషక్రియాశబ్దాః యే రేఫమకారాంతాశ్శబ్దా స్తేపి చ తిఙ్మధ్యనామకా స్స్యుః.

(వి-వి.)—

అసమగ్రము. మొదటిపత్రము పోయినది. అయిదవపరిచ్ఛేదనాగు క్రియా పరిచ్ఛేదము కొంతభాగము వఱకే వ్రాయఁబడియున్నది. అంతవఱకు గ్రంథ మెల్లఁ గలదు. వ్రాఁత బాగున్నది. తప్పులు లేకపోలేదు. శైథిల్యము కలదు. గ్రంథపాతములు కలవు.

ఇది నన్నయభట్టారకకృత మనఁ బరఁగుచున్న యాంధ్రశబ్దచింతామణియను వ్యాకరణగ్రంథమునకు సంస్కృతభాషలోనే చేయఁబడిన వివరణము రచియించిన దెవరో తెలియదు. ఇందు మూలసూత్రములు కూడఁ జేర్పఁబడియున్నవి.

---

R. No **86**

**Palm-leaf** 18 and 19 × 1⅜ inches Foll 199. **Lines, 6 in a page.** Telugu. Good.

Presented by K. R. V. Krsna Rao Bahadur of Cocanada in **1911-12.**

బృహన్నారదీయము.

BRHANNĀRADĪYAMU.

This is a Telugu rendering in six Aśvāsas of the Sanskrit Purāna of this name: by Krottalanka Mṛtyuñjaya, son of Viśvanātha of Bōdhāyanaśūtra and Bhāradvājagōtra. The work is dedicated to God Lakṣmanēśvara, worshipped in the shrine at Komaragiri, situated on the bank of the river Kauśiki.

Complete.

**Beginning** ·

**శా.** శ్రీవాణీవరముఖ్యసర్వసుమనశ్శ్రేణీమహోతాండవ
ప్రావీణ్యంబులు సూచుచుం గిరిజతో భాషించుచుం దేవతా

భావంబుల్ గొని వారివారికోలఁదుల్ భావించి యీ దేర్చునా
దేవారాధ్యుఁడు లక్ష్మణేశ్వరుఁడు మత్ప్రీతిం గనుం జేయఁగన్
[(యుతన్ ?)

* * *

గీ. సకలసారపురాణముల్ సరసకవులు
తెలుఁగు లోనరించి రిదియును దెలుఁగుసేయఁ
గనఁగ లేరైరి నాదుభాగ్యంబు కతనఁ
దెనుఁ గొనర్తు బృహన్నారదీయ మిపుడు.

* * * *

గీ. మహితచర్య భారద్వాజమానివర్య
గోత్రబోధాయనాఖ్యానసూత్రకలిత
క్రొత్తలంకవంశాంబుధి కువలయాప్తుఁ
డగుచు వెలయుఁ బోతాపంతు లను ఘనుండు.

కం. అతనికి సర్వాపంతులు
చతురుం డగు విశ్వనాథ సత్కవి యనఁగా
సుతు లిరువురు జనియించిరి
మతిమంతులు విబుధలోక మాన్యులు ధరణిన్.

మ. ఘనచారిత్రుఁడు విశ్వనాథకవియుం గాంచెం గుమారత్రయం
బునునత్యంతప(తి(వ?)విత్రతాతిలకముల్ భూషించుసర్వప్రభా
మినియందుం దగ వీరభద్రభగవన్మృత్యుం జయాఖ్యాకులన్
జననాథోత్తమపూజలం దనరువాంఛన్ నిర్జరాచార్యులన్.

వ. వారిలోన,

గీ. సకలవిద్వత్కవీంద్రులు సన్నుతించి
ప్రస్తుతింపంగ గావ్యముల్ విస్తరించి
పలుక నేర్తును నుభయభాషలను నేను
నచ్చరంబుగ మృత్యుంజయాఖ్యకవిని.

**End:**

భు-ప్ర. మదాయత్తదైతేయమార్గప్రభంగా
పదారాధనాశీలభక్తాబ్జభృంగా
చిదానందలీలావశీకారచిత్తా
సదారా సదానంద శర్వా మహేశా.

**Colophon:**

ఇది శ్రీమత్కౌశికీతీరనివాసి సర్వవర్ణ విరాజమానశ్రీకౌమర గిరి పట్టణసంస్థిత శ్రీలక్ష్మణేశ్వరమహాదేవ కృపాకటాక్ష పరిలబ్ధస ర్వవిద్యానిధానబోధాయనాఖ్యకసూత్రపవిత్ర శివద్విజోత్తమ క్రొ త్తలకంఠవిశ్వనాథపుత్త్రి సకలసుకవిజనవిధేయ మృత్యుంజయనామ ధేయ ప్రణీతంబైన బృహన్నారదీయంబను మహాపురాణంబునందు (అతని ?) పుత్త్రులైన యజ్ఞమాలిసుమాలులు మోక్షంబునందుటయు నుదంకమాహాత్మ్యంబును జయధ్వజరాజుచారిత్రంబును నింద్రసుధర్మ సంవాదంబును జతుర్యుగధర్మంబులును గీర్తితంబుల య్యె నను నిప్పు రాణంబునందు) సర్వంబును షష్ఠాశ్వాసము.

ప్రతివిలేఖకుఁడు గ్రంథాంతమం దిట్లు వ్రాసినాఁడు:—"ప్లవ నామసం॥ కార్తీకశు॥ ౧ స్థిరవారము వఱకు బృహన్నారదీయములో ఆఱవ యాశ్వాసము పానుగంటి కామన్న వ్రాసి కసిరెడ్డి వమ్మన్నగా రికి ఇచ్చెను."

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత సొగసుగా నున్నది. తప్పులు గలవు. శైథిల్యము లేదు. గ్రంథపాతములు లేవు.

ఇది యష్టాదశపురాణములలో నొకటియగు బృహన్నార దీయమునకుఁ దెలిగింపు. క్రొత్తలంక మృత్యుంజయకవిచే నాఱా శ్వాసముల గ్రంథముగా రచితమై కౌశికీతీరమునఁ గల కొమరగిరి

పట్టణమున (?) వెలసిన లక్ష్మణేశ్వరమహాదేవునకు సమర్పింపఁబడినది. గ్రంథకర్త బోధాయనసూత్రము భారద్వాజగోత్రము గల శివద్విజుఁడు.

## R. No. 87.

Palm-leaf 16⅛ × 1½ inches. Foll 134. Lines, 8 in a page. Telugu. Much injured.

Presented by Brahmānanda Rao of Cocanada in 1911–12.

ప్రభులింగలీలలు.

### PRABHULIṄGALĪLALU.

Same work as the one described under R No 17 *ante*.

Breaks off in the fourth Āsvāsa.

(వి-వి.)—

అసమగ్రము. మొదటిమూఁడాశ్వాసములును సమగ్రముగాఁ గలవు నాలవయాశ్వాసమునఁ గొంతభాగమే కలదు. వ్రాఁత యొకమాదిరిగా నున్నది. నిర్దుష్టము కాదు. శైథిల్యము మెండుగఁ గలదు. గ్రంథపాతములును గలవు. కొన్నిపత్రములు తారు మారైనవి.

ఇది నెం 17 న వర్ణితమగు గ్రంథమే. పుస్తకము శిథిలమై యుండుటచే నిందును విషయవివరణము కావింపఁ బడదయ్యె.

## R. No. 88.

Palm-leaf. 14 × 1¼ inches. Foll. 4. Lines, 7 in a page. Telugu. Good.

Presented by Burrā Śēsagiri Rao of Vizianagaram in 1911–12.

రసజ్ఞనృసింహపంచవింశతి.

RASAJÑANRSIṀHAPAÑCAVIṀŚATI.

This contains 25 stanzas of praise and prayer addressed to God Nrsimha, worshipped at Ahōbala (Kurnool district) : by Garugulālu, son of Laksmanasing, grandson of Dhanasing and great grandson of Makaranasing He calls himself a Ksatriya and prays to Nrsiṁha to destroy the Christians who are accused of injustice and wickedness and of trying to injure the Hindu Dharmas. He appears to have lived in the time of the Sepoy Mutiny of 1858.

Complete.

**Beginning:**

సీ. శ్రీకమాలోల యాశ్రితజనమందార
లోకేశ సద్భక్తలోకపోష
బాలార్కజితనేత్ర భావజాహితవంద్య
దంభోళిసమధగద్ధగితదంష్ట్ర
వజ్రాయుధప్రభావజితనఖాంకుర
ధవళధరాధరోదార దేహ
సంపూర్ణవిక్రమసంయుతభుజదండ
ప్రళయకాలాంతకప్రతిమకోప

గీ. కుమతజనశిక్ష ! మాధవాక్రూరవరద
దానవాంతక వల్లవీధైర్యచోర
క్రీస్తుమతజులఁ జెండుమా కినుకతోడ
వైరిగజసింహ ! ఓబళనారసింహ.

**End:**

సీ. వసుధలో క్షత్రియవంశాబ్ధిచంద్రుఁడౌ
మకరనసిం గనుమానధనుఁడు
అతనిపుత్రుఁడు రమాపతిపూజితుండగు
ధనసింగు పేరిటి ధన్యచరితుఁ

డతనికిఁ బుత్త్రిండు నబ్ధిగంభీరుండు
సకలశాస్త్రపురాణసంగ్రహుండు
నిత్యదానవినోది సత్యవచస్కుండు
దేవబ్రాహ్మణభక్తిభావరతుఁడు
ఆచారవంతుండు నతిదయాపరమూర్తి
లక్ష్మణసిం గను లక్షణాఢ్యుఁ
డతనికి నే హైమవతిదేవివరమున
జననమొందితి నయ్య జగతియందు
పేరు గరుగులాలు ప్రేమతో నెప్పుడు
నీపాదభక్తియే నిత్యమనుచు
నిరతంబు నేఁ బూనియిలలోని క్రీస్తుల
చేత కోర్వక వార్ని సమయఁ జేయ

గీ. పంచవింశతిఘనసీసపద్యములను
విన్నవించితి నీకు నే విశదముగను
తప్పు లేమైనఁ గల్గిన నొప్పికొమ్ము
తనయు తప్పులు దప్పులే తండ్రులకును
నామొ రాలించి భువిని దుర్నయము లెల్ల
సాహసంబునఁ గడతేర్చు చక్రహస్త
క్రీస్తుజనులను జెండుమా కినుకతోడ
వైరిగజసింహ! ఓబలనారసింహ!

ప్రతివి లేఖకుఁడు తుద నిట్లు వ్రాసికొనెను :—“ క్రోధివత్సర పుష్య శు॥ ౮ సౌమ్యవారము రోజున నృసింహపంచవింశతి భవానీ సింగుకు గర్గలాల్ వ్రాసి యిచ్చెను.”

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత బాగున్నది. తప్పులు గలవు. శైథిల్యము లేదు. గ్రంథపాతములు లేవు.

క్రైస్తవుఁ మూలమున దేశమున కేదో ముప్పుమూడినట్లు తల పోసి గరుగులాలను తుత్రిముందు, క్రైస్తవులకుఁ జేటు గల్గుఁగావు తమని యహోబలనరసింహస్వామి వేఁడికోలుగా నీయిర్వదియైదు సీసపద్యముల రచియించెను.

## R. No. 89.

Paper. $9\frac{1}{4} \times 6\frac{3}{8}$ inches Foll 216. Lines, 24 in a page. Telugu. Good.

Presented by K. R V. Krsna Rao Bahadur of Cocanada in 1911-12.

శుకసప్తతి.

ŚUKASAPTATI.

This consists of 70 amorous stories said to have been related, one on each night, by a parrot to a woman when she was about to start in the night to meet her paramour It is stated that she was thus prevented from leaving her house until the return of her husband who had been absent from home. This work is different from one of the same name in Sanskrit, although similar to it in plan and character. The author of the work is Pālavēkari Khadiripati, son of the chief of the country called Khadira (Kadiri in the Ceded Districts) and grandson of the king Tādigōlla Kariyamāṇikya.

Incomplete.

**Beginning :**

వ. అభ్యుదయపరంపరాభివృద్ధిగా నాయొనర్పం బూనిన శుకసప్తతియను మహాప్రబంధంబునకుఁ గథాక్రమం బెట్టి దనిన.

**Colophon :**

ఇది శ్రీమత్ఖాదిరీనృసింహాకరుణాకటాక్షవీక్షణసమాగతకవితాధార పాలవేకరి కులకలశాంభోనిధిసుధాకర తాడిగోళ్లకరియమాణిక్యనృపహార్యక్షపౌత్ర పవిత్రచరిత్ర ఖదిరధరామండలాఖండలపుత్త్రి

విద్వత్తల్లివిరక్షణానుసంధాయక ఖదిరీపతినాయక ప్రణీతంబైన శుకసప్తతియను మహాప్రబంధంబునందు ద్వితీయాశ్వాసము.

**End:**

**ఉ.** కంటిరె యెంతవింత కలగన్నవు డెల్లను మీరు వచ్చి న
న్నంటినయట్టు లుండ నది యంగన రాతిరి మిమ్ముఁ బాసి నే
నొంటిగఁ బవ్వళించుటకు నోపక చింత వహింప నంతలోఁ
గంటికి నిద్రవచ్చెఁ గలగంటి భవద్రతి గల్గినట్లుగాన్.

గీ. వామహస్తము నుదుముపై వైచి నిదుర
చెందుతఱిఁ గాని కలగందు రందు రెందు!
నవ్విధంబునఁ బవళించి యైనఁ గలయఁ
గంటి భవదీయకారుణ్యగరిమవలన.

క. అని పలుకుదానిమాటలు
విని నిశ్చయమని తలంచె విభుఁ డాపద్మా
నన యంత నేర్పుగలిగినఁ
జనవచ్చు నటంచుఁ గీరచంద్రుఁడు పల్కెన్.

(వి-పి.)—

ఆసమగ్రము. మొదటినుండి నాల్గవయాశ్వాసము కొంత వఱకుఁ గలదు. కృత్యవతరణము లేదు. వ్రాఁతబాగున్నది. తప్పులు లేవు. శైథిల్యము లేదు. గ్రంథపాతములు లేవు. ఇది మూఁడుసంపుటములుగాఁ గలదు.

శుకసప్తతియను పేరుగల యీగ్రంథమునఁ గామచారేచ్ఛగల యొక వనితను, దేశాంతరగతుఁడగు భర్త వచ్చునందనుకను దుర్నీతికిఁ జొరనీక కాపాడుచుఁ జిలుక చెప్పుచువచ్చిన శృంగారనీతికథలు గలవు. ఈప్రతియందిరువదియొకటవ కథవఱకే కలదు. గ్రంథకర్త పాలవేకరి ఖదిరిపతి. ఈతనితండ్రి ఖదిరధరామండలాఖండలుఁడఁట. తాత తాడిగోళ్లకరియమాణిక్యనృపుఁడు. సంస్కృతముననున్న శుకసప్తతితో నిది భేదించుచున్నది.

## R. No. 90.

Palm-leaf. 17¾ × 1½ inches. Foll. 113. Lines, 6 in a page. Telugu. Slightly injured.

Presented by K. R. V. Krsna Rao Bahadur of Cocanada in 1911-12.

### ఒడయనంబివిలాసము.

### ODAYANAMBIVILĀSAMU.

A Prabandha in six Āśvāsas illustrating the importance of Śiva-pūja by means of a story connected with Odayanambi. The author of the work is Ajvara Pērayalinga, son of Kondamantri and Pāpamāmba and grandson of Pērayāmātya of Bhāradvāja-gōtra. He was the pupil of Ivatūri Pedarāmanātha and married Yellama

Almost complete

**Beginning:**

సీ. శ్రీకంఠుప* పద్మ సేవచే నాదిమ
శివభక్తరూఢిచేఁ జెలఁగినాఁడ
పెంపొంద నివటూరి పెదరామగురువర్య
దత్తమంత్రస్ఫూర్తిఁ దనరినాఁడ
మహితభారద్వాజనామానిసద్గోత్రాంబు
(రాశిచం?) ద్రుఁడనఁ బబలినాఁడ
ఘనసాధ్వి పాపాంబికును గొండమంత్రికిఁ
బుత్త్రరత్నంబనఁ బొల్చినాఁడ

గీ. సరవి నెల్లాఖ్యకులసతీసదయహృదయ
పద్మపద్మాప్తమూర్తినై ప్రబలినాఁడ
నజ్వరపుసత్కులాధ్యత్ముఁ డనుచు బుధులు
లెన్నఁగా నెంచఁ బేరయలింగకవిని.

మ. మహితాదిత్యపురాణహారమునకుఁ మధ్యప్రభారత్నమై
బహుశైవోన్నతశాస్త్రమార్గమునకుఁ బ్రత్యక్షమై నిత్యమై
యహిభూషాంకితమై తనర్చుపురసంహారంబు పూర్వంబుగా
మహిపై వర్తిలునీకథాక్రమము నీమం బొప్ప వర్ణింపుమీ.

క. ఆనతి యిచ్చిన శంభుని
కానతి గావించి లేచి హర్షించుచు నే
నానాటను రచియింపఁగ
బూనితిఁ గృతి బ్రహ్మకల్పమును ధర నిల్వన్.

* * * *

గీ. భవుఁడు తనసాదియగు వీరభద్రసుతుఁడు
సూరమాంబకుఁ బార్వతీసుందరికిని
నాథుఁ డివటూరిపెదరామనాథగురుఁడు
మద్గురుస్వామి గావున మహిమ నెంతు.

* * * *

క. ధర నాభారద్వాజుని
గురుగోత్రమునందుఁ బుట్టి కొండన ధైర్య
స్ఫురణయు సత్ప్రక్షంబును
గరిమ మహాన్నతియుఁ గల్గి ఘనసంగతుఁడై.

శా. శ్రీరంజిల్లఁ జెలంగుచున్న గజరాట్సింహాసనాధ్యక్షునిన్
ధారాళంబుగ వేదశాస్త్రఘనవిద్యారూఢి మెప్పించి యా
వీరాగ్రేసరుఁ డీయఁ గొండన మహావిఖ్యాతిగాఁ గౌతమీ
తీరక్షోణిని సజ్వరంబనఁగఁ దాఁ దెచ్చెన్ మహాగ్రామమున్.

చ. అతఁడు ముగుళ్లవంశమున నర్థిఁ జనించియు రాజదత్తమై
క్షితిఁ జెలువొందు సజ్వరము చేకొని పాలన మొప్పఁ జేయు భా
సితగతి సజ్వరంపుఁగులసింధుసుధాకరుఁడై చెలంగె నా
శ్రితులును బాంధవుల్ హితులు ప్రేమ నుతింపఁగఁ గొండమం
[త్రియున్.

క. ధాత్రిని విద్వజ్జనములు
పాత్రత్వముచేతఁ గొండుభల్లన ఘనచా
రిత్రం గంగమఁ జేకొని
పుత్త్రికఁ గనె మల్లమంత్రిపుంగవు నెలమిన్.

గీ. మహినిసర్వజ్ఞమూర్తి? (మ?)
యజ్వరపువంశాధ్యక్షుఁడైనట్టియా
హరి. ంత్రిన్ హరిమంత్రిఁ బోల్పఁదగు
వాక్యపౌత్రి నెంచంగ నా
హరిరాజకర్మయందుఁ బుత్త్రికుల
నుద్యత్ప్రీమతోఁ గాంచె నా
సరవిం గొండనఁ బేరుధీరుని
మహాసర్వజ్ఞుఁ దిమ్మాహ్వయున్.

వ. వారిలో నాగజుండు,

ఉ. ఆరయ నజ్వరంపువారియప్పసుతుండగు కొండమంత్రి దా
వీరమసాధ్వియందుఁ గడువేడుకఁ బుత్త్రిలఁ గాంచె నల్వురన్
మేరునగధైర్యు హార్యపను నీతివిచక్షణు వెంగళేంద్రునిన్
వీరనదండనాయకుఁ బ్రవీణుని సింగమంత్రిశేఖరున్.

వ. అజ్జనకానుజుండు,

గీ. రమణ హరిరాజసుతుండు పేరప్రధాన(నుఁ ?)
య(డ ?)జ్వరపుసత్కులాధ్యక్షుఁ డగుచు ధాత్రి
ఘనతగాంచెను బుధబంధుకల్పశాఖి
యనుచుఁ దను వేడ్క ద్విజు లెల్ల నాశ్రయింప.

వ. తదనుజుండు.

క. శ్రీరమ్యఘణిపవాక్యవి
శారదుఁ డజ్వరపుఁదిమ్మసచివుఁడు గాంచెన్

గాఁగిమి సింగనయందు ను
దారుని నరసింహుఁడనెడితనయుని నలరెన్.

వ. అజ్జనకాత్మజుఁడు.

ఉ. దండిగ నజ్వరంపుఁగులధన్యుఁ డనందగుపేరమంత్రిమా
గ్రాండుఁడు భార్య యైతనరురామకయమ్మున కాంచె బుత్రులన్
బండితు లాశ్రితుల్ హితులు బాంధవు లెంచఁగ వీరనార్యునిం
గొండయదండనాయకు నకుంఠితవైభవు వేంకటేంద్రునిన్.

వ. వారిలో నగ్రజుఁడు,

పేరామాత్యుఁ వీరమంత్రిమణి.

గీ. మాన్యుఁడై యజ్వగప వీరమంత్రివర్య
యాత్మసతియైనకొండాంబయందు మంగ
సుతుల నిద్దఱ బంధుసన్నుతుల బేగ
దండనాథుని మాచప్రధానవరుని.

శా. భారద్వాజసగోత్రజుండు మహితాపస్తంబసూత్రుండు వి
ద్యారాజీవభవుండు పేరయసుతుం డాయజ్వరంపుం గులో
దారుండిం ముకళాకిరీటపదపద్మధ్యాననిష్ఠాపరుం
డై రంజిల్లెను గొండమంత్రి సుజనాహ్లాదంబు సంధిల్లఁగన్.

ఉ. శంకరసేవనాధృతివశంకరభాసురచక్రమూర్తి ని
శ్శంకరమావిలాసముచు సత్యవచోమహిమానురక్తిఁ యున్
బొంకముగాఁగ బేరఘుమపుత్త్రికుఁ డజ్వవుంగులాఢ్యుఁ డా
వేంకటమంత్రి మించెను బ్రవీణత వేంకటభర్తృకైవడిన్.

గీ. ఇతనియన్నగు కొండమంత్రీశ్వరునకు
భార్య లిద్దఱు పేరాంబ బాపమాంబ

పావనాచారరూపసౌభాగ్యములను
ఘనత కెక్కిరి పార్వతీగంగ లనఁగ.

వ. వారిలోన,

ఉ. పొఁతురి వేంకటాద్రికిని భవ్యసతీమణి లక్ష్మిదేవికిన్
గూఁతురు బాపమాంబ తనకుం గులభామినియై చెలంగ వి
ఖ్యాతి(గన?) జ్వరంపుఁగులగణ్యుఁడు కొండయమంత్రిబాపమాం
బాతరళాక్షియందుఁ గనెఁ బ్రౌఢి ననుం గవి పేరయాఖ్యునిన్.

క. తదనంతరంబ బాఁపను
సదయత మల్లాంబయను నెడు సాధ్విని గన న
మ్ముదితయుఁ గందెపుఁగులమున
మది ర జిల వెల సె బుధులు మానిని యనఁగన్.

వ. తదగ్రజుండు,

ఉ. బమ్మెరసత్కులంబునఁ బ్రౌఢసరస్వతిసద్గుణాంచి తా
నెమ్మె దగర్పు కేసనసుకీర్త్వరు డప్పలనామసాధ్వియం [డన్
దిమ్మహిఁ గాంచెఁ గన్నసుత యెల్లమయందున పేరయార్యు
సమ్మతిఁ గాంచితిన్ సుతుల సభ్యుల సిద్ధుల గంగనాఖ్యులన్.

క. వాగ్విహారకరవిభవోజ్జ్వల
కరుణారస మెలమి గల్గ కావ్యులు మెచ్చన్
ధరనజ్వరపు గంగా
ధరమంత్రిద్వయము వెలసెఁ దత్తన్మహిమన్.

గీ. వారితోడ నగ్రవనితయెల్లమయందు
వీరనరసమాంబ వేడ్కఁ బుట్టి
కూర్మి నోడ రేపుకులపవిత్ర యనంగఁ
బ్రబలెఁ జెన్నమంత్రిభార్య యగుచు.

వ. ఇవ్విధంబున . . . . . . . . . .
మదీయవంశంబు వర్ణించి యనంతరంబ . . . . . . .
మత్కృతీశ్వరుండైన యానంటరామేశ్వరస్వామి నభివర్ణించెద.

**End:**

చ. అని శివుఁ డానతిచ్చి కమలాసనముఖ్యుల నంపి వేడ్కతోఁ
జనె నని మౌనికోటికిని జాతుని సూతుఁడు విన్నవించు లా
గునను ధరిత్రి నజ్వరపుఁ గొండయమంత్రికిఁ బాపమాంబకుం
దనయుఁడు పేరసత్కవిముదంబునఁ గావ్యము చేసె నాంధ్రతన్.

*

పృథ్వి. సహస్రకోటి భానుతేజ శౌర్యధైర్యలక్షణా
బహుప్రతాపదుర్మదప్రబంధవైరిశిక్షణా
అహీంద్రభవ్యభూతి

**Colophon:**

ఇది శ్రీమచ్ఛివటూరి పిరామనాథగురూపదిష్టశైవపంచాక్షర
జపపరాయణ లింగప్రాణిపారావిరవిందనానందభారద్వాజగో
త్ర పేరయామాత్యసోత్రకొండమంత్రిబాపమాంబాసుపుత్త్రి యల్ల
మాంకశాత్ర అజ్వరపుకులపవిత్ర పేరయలింగనామధేయప్రణీతం
బైన యొడయనంబివిలాసంబను మహాప్రబంధంబునందు షష్ఠాశ్వా
సము.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత బాగున్నది. తప్పులు లేవు. తుదిప
త్రము లైదు కొంచెము శిథిలము లయినవి. వానియందే గ్రంథ
పాఠములు గలవు.

ఒడయనంబివిలాస మను పేరుగల యీయారాశ్వాసముల ప్ర
బంధము, అజ్వరపుఁ బేరయలింగ నను కవిచే రచియింపఁబడినది ఈ

తఁడు ఇవటూరి పెదరామనాథగురుశిష్యుఁడు. భారద్వాజగో త్రుఁడు. కొండమంత్రిబాపమాంబలకుఁ బుత్త్రుఁడు. ఈతనిభార్య యెల్లమ. ఒడయనంబియును వీరశైవులయొక్కయు, పరమనాచియ ను వేశ్యయొక్కయుఁ జరిత్ర మిందుఁ బ్రధానముగా వర్ణింపఁబడినది. ఈ కథ యాదిత్యపురాణమునఁ గల దఁట

R No 91.

**Palm-leaf** 14⅞ × 1⅜ inches Foll 259 Lines, 5 in a page. Telugu Good.

Purchased from G. Śrīnivāsa Rao of Mysore in 1911-12.

కౌత్,ల్రము.

VĀSAVĪMĀHĀTMYAMU.

This is a Prabandha in eight Āśvāsas describing how Vāsavi, the daughter of Kusumasetti of Penukonda (Anantapur district), kept her chastity by dying in a fire pit when she was compelled by the king, Visnuvardhana, to become his wife. The work incidentally describes the manner and customs of the Vaiśyas and of the greatness of their Guru, Bhāskarācārya It seems to be a Telugu rendering of the Sanskrit Kanyakāpurāna which is said to form part of the Skāndapurāna and which was first related by the prophetic Sālankāyana to the sages of Naimiśa The author of the Telugu work is Bhāskarācārya who is himself a Guru of the Vaiyśas.

Complete.

**Beginning:**

ఉ. ఆరయ నొకరునాఁడు కుసుమాంబతనూభవ వాసవాంబ తాఁ
జేరి మదీయస్వప్నమునఁ జిత్తములో భ్రమదీఱ నాపయిన్
గోరి ప్రబంధ మవ్వయవిగుంభముగాఁ దగఁ జెప్పు మన్నచో
నేర నటన్న జిహ్వపయి నిల్చి ముదంబునఁ దెల్పె(ల్పఁ?)బలికితిన్

క. మోదమున వైశ్యకులమును
సాదరముగఁ బ్రబలఁజేయ సాహసవృత్తిన్
ఈధరణిని గుసుమాంబకు
మోదముతోఁ బుత్త్రివైతి మునిసన్నుతిగాన్.

వ. దేవీ భవదీయచిత్తంబున విన నవధరింపుము.

క. కైలాసపురనివాసులు
శైలాధిపపుత్త్రిపాదసేవాపరులున్
శ్రీ లలరు వైశ్యవర్యులు
లాలితసుజ్ఞానపరులు లక్షణధుర్యుల్.

* * * *

వ ఇటువంటి వైశ్యఘనులు,

ఉ. ఇప్పుడు నన్ను వేడ్క రచియింపు మటన్న వణిక్పురాణ మిం
పొప్పు మదంకితంబుగను మోదముతో రచియింప సంపదల్
విప్పుగ మాకు నంచుఁ దగ వీడె మొసంగి సువర్ణనిష్కముల్
కప్పురమున్ సుచేలములు కర్ణవిభూష లొసంగి యంపినన్.

* * * *

క సల్లలిత బ్రహ్మపుత్త్రిఁడ
నుల్లసితకవిత్వతత్త్వయుక్తుఁడ సుమనః
పల్లవితకీర్తిమహిమో
ద్వేల్లితహరిదంతరుండ ధృతి భాస్కరుఁడన్.

వ. అని తన్నభివర్ణనంబు చేసికొని గుణవంతులగు వైశ్యుల
పురవర్ణనం బెట్టిదనిన.

*

చండవిభవంబు శ్రీపెనుగొండపురము.

*　　*　　*　　*

క. నగరేశ్వరభక్తులకును
నగరాధీశులకు బాలనగరాధ్యులకున్
నగరాంకస్థితమతులకు
నగరస్వాములకు బాలనగరాధ్యులకున్.

*　　*　　*　　*

**End:**

వ. . . . . . . . . . . . . ఇచ్చట నశేష వైశ్యసంఘంబులును నగరేశ్వరజనార్దనవాసవాంబాభాస్కరాచార్యులకారుణ్యంబునఁ బుత్త్రపౌత్త్రాభివృద్ధియై పెనుగొండపురంబున వెలసి రని సాలంకాయనుండు వైశ్యఋషికుమారులకుం జెప్పిన కైవడి నకథకుండు శౌనకాదిమహామునులకుం జెప్పినవిధంబున భాస్కరాచార్యుం డాంధ్రభాషఁ బురాణరూపంబున బాలనగరంబు లకుం జెప్పిన వారలు సంతోషభరితులై యమ్మహాత్మునిఁ బెక్కువందనంబు లాచరించి సంతుష్టాంతరంగులై సుఖంబుండి రాచంద్రతారార్కంబును మఱియును,

సీ. ఈప్రబంధము విన్న నింపుగా వ్రాసినఁ
జదివినఁ జూచిన సంతతమును
బ్రత్యక్షపాంచాలబాహటనటనాది
శయ్యల నుడివిన జనుల కెపుడు
నాయువు సంపద లారోగ్యభాగ్యముల్
ధనకనక(?)వస్తువాహనసమృద్ధి
కల వెందు వర్తించుఁ గలుగును శుభమును
దిగ్విజయంబును దేవుఁడొసఁగు

గీ. నెనిమి దాశ్వాసముల రూఢి నిడియెఁ బ్రౌఢి
కల్ప మనఁగను జెలఁగెను ఘనత ధరను

భాస్కరాచార్యవిరచితపరమకృతియు
సరససత్కవిబుధులును సన్నుతింప.

మ.కో. వందనాగతామరేంద్రబృందచారువర్ణనా
నందపూర్ణమానసాబ్జ నవ్యభవ్యవిక్రమా
కుందచంద్రికాప్రకారకోమలాంగశోభితా
నందివాహనాధిరూఢ నాగభూషణోజ్జ్వలా !

**Colophon :**

ఇది శ్రీసరస్వతీచరణసరసీరుహనిష్యందమకరందసందోహ మధురధురీణమధుకరాయమానసరసకవితావిలాస శ్రీభాస్కరాచార్యనామధేయప్రణీతంబైన శ్రీవాసవీమాహాత్మ్యంబను మహాపురాణంబునందు సర్వంబును నష్టమాశ్వాసము సంపూర్ణము.

గ్రంథాంతమం దిట్లు కలదు :—

[వా
చ. తెలుఁగులవారు సంస్కృతము తేటయెఱుంగరు సంస్కృతజ్ఞు
రలు తెలుఁగందుఁ గల్గు వడిప్రాస మెఱుంగఁగ లేరు వేడ్క భూ
వలయములోన సంస్కృతమువచ్చి తెనుంగులగద్యవాక్యముల్
పలుకఁగ నేర్చుసత్కవులు పాలనసేతురు గాక యీకృతిన్.

[హేశం
శ్లో. ఆదౌ బ్రహ్మోరుజాతా ఘనభువి తపసా తోషయిత్వామ
స్థిత్వా కైలాసశైలే చలసుతశివయో శ్చైవ తైర్వాహకా లే
వైశ్యా గోకర్ణజాతా భువి ముఖరముఖాష్టాదశ గ్రామనాథా
రాష్ట్రా కన్యామవంతం (?) శమనను ఖేదైర్యవము క్త్వైర తాపః.

శ్లో. క్రతుకాలే యాచమానో
కర్మకాలే పురోహితః

నిత్యాకాలే గురుశ్చైవ
భాస్కరాచార్య ఉచ్యతే.

* * * *

సాధారణనామ సం॥ పుష్య బ. ౧౦ భానువారం వ్రాసినది.

(బి-బి.)—

సమగ్రము. వ్రాంత యొకమాదిరిగా నున్నది. తప్పులు హెచ్చు. శైథిల్యము లేదు. గ్రంథపాతములు లేవు

వాసవీమాహాత్మ్యమను నీగ్రంథము సంస్కృతమునకుఁ దెనుఁగు. ఈపురాణమునఁ గల్గుకథకు సంగ్రహ మిది:—పెనుగొండపురమునఁ గుసుమ శెట్టియను వైశ్యునకు వాసవకన్యక యను కూఁతురు గలదు. విష్ణువర్ధనుఁడను తేఁడాకన్యను మోహించి తన కిమ్మని బలాత్కరించెను. ఎక్కడికిఁ జొరక యావాసవకన్యకయుఁ దక్కినకొండఱు వైశ్యులును నగ్నికుండములం జొచ్చిరి. కన్యకాశాపమున విష్ణువర్ధనుఁడు తలప్రకలయి మడిసెను—

విశేషించి యిందు వైశ్యులకులాచారధర్మములును, వారిగురువులగు భాస్కరాచార్యులను వారిమర్యాదలును మొదలగు విషయములు తెలుపఁబడినవి. దీనిసంస్కృతగ్రంథము స్కాందపురాణములోనిదని తెలుపఁబడినది. పెనుగొండలో విష్ణువర్ధనుని కాలమున జరిగిన యీచరిత్రాంశము స్కాందపురాణమున నెట్లు చేరఁగల్గెనో! సాలంకాయనుఁడను ముని భావిపరిజ్ఞానముతో నైమిశమున వైశ్యమునులకుఁ జెప్పినట్లు కలదు. దీని నాంధ్రమున రచించినయాతని పేరు భాస్కరాచార్యులు ఈతఁడు వైశ్యగురువృలపరంపరలోనివాఁడే. ఈపుస్తకభాండాగారమందలి వేఱొకప్రతికంటె నీప్రతియందుఁ గృత్యాదిని బెక్కుపద్యము లెక్కువగాఁ గలవు. ఈకథయే తిమ్మనయనుకవిచే యక్షగానముగాఁ గూడ రచియింపఁబడినది.

## R. No. 92.

Palm-leaf. 13½ × 1¼ inches Foll. 177. Lines, 5 in a page. Telugu Good.

Presented by Brahmānanda Rao of Cocanada in 1911-12.

భాస్కరరామాయణము (కిష్కింధా-సుందర కాండములు).

BHĀSKARARĀMĀYANAMU (KISKINDHĀ AND SUNDARA KĀNDAS)

Same work as the one described under R. No 23 *ante*. According to the colophon in this MS the author of Sundarakānda is Bhāskara and not Mallikārjuna

Complete.

**Colophon**:

కిష్కింధాకాండము గద్యము.

ఇది శ్రీమదష్టభాషాకవికులపవిత్ర భాస్కరసత్కవిపుత్ర మల్లికార్జునభట్ట ప్రణీతంబైన రామాయణంబను మహాకావ్యంబునందు కిష్కింధాకాండ సర్గంబు నేకాశ్వాసము.

**Colophon:**

సుందరకాండగద్యము.

ఇది శ్రీమదష్టభాషాకవిమిత్రకులపవిత్రయశస్కరభాస్కరప్రణీతంబైన రామాయణమహాకావ్యంబునందు సుందరకాండ సర్గంబు నేకాశ్వాసము.

(వి-వి.)—

సమగ్రము. వ్రాత బాగున్నది. తప్పులు లేవు. శైథిల్యము లేదు. గ్రంథపాతములు లేవు.

ఇది నెం 23 రున వర్ణితమగు గ్రంథమునభాగమే గాని వేఱు గాదు ఎల్లయెడ సుందరకాండము మల్లికార్జున భట్టరచితమని యుండగా నిందు భాస్కర రచితమనికలదు.

---

## R. No 93

Palm-leaf 16¼×1½ inches. Foll 120 Lines, 6 in a page. Telugu. Injured.

Presented by Puligaḍḍa Gangarāju of Vizianagaram.

భాస్కరరామాయణము (యుద్ధకాండము).

BHĀSKARARĀMĀYANAMU (YUDDHAKĀNDAMU).

Same work as the one described under R. No 23 *ante* The Yuddhakānda here is said to have been composed partly by Bhāskara and partly by Ayyalabhatta at the instance of Pedavēdagirināyaningāru.

Incomplete.

(వి-వి.)—

అసమగ్రము. తుదను కొన్నిపత్రములు శిథిలములై పోయినవి. వ్రాఁత బాగున్నది. తప్పులు లేవు. శైథిల్యము కలదు. గ్రంథపాతములు కలవు.

ఈ యుద్ధకాండము కొంత భాస్కరకృతి యనియుఁ దర్వాత పెదవేదగిరినాయనింగారు అయ్యలభట్టుచేతఁ జెప్పించిరనియు నిందుఁ గలదు.

## R. No. 94.

Palm-leaf. 18×1¼ inches. Foll. 136. Lines, 6 in a page. Telugu. Injured.

Presented by Brahmānanda Rao of Cocanada in 1911–12.

భాగవతము.

BHĀGAVATAMU.

Same work as the one described under R. No. 20 *ante*.

Breaks off in the third Skandha.

(వి-వి.)—

అసమగ్రము. మొదటినుండి మూఁడవస్కంధము కొంత భాగమువఱకుఁ గలదు. వ్రాఁత ముచ్చట గూర్చుచున్నది నిర్దుష్టము గాదు. శైథిల్యము గలదు. గ్రంథపాతములు లేవు.

ఇది నెం 20 రచన వర్ణితమగు గ్రంథమే. ద్వితీయస్కంధాంతమునఁ బ్రతిలేఖకుఁ డిట్లు వ్రాసికొన్నాఁడు :—

"శార్వరినామసం॥ భాద్రపద బ ౧౪ గురువారం సరికి ఆళ్ల సన్యాసికుమారుడు కామయ్య మాతృకలోనున్నక్రమాన నూతి చిన యజ్ఞేశం కుమారుఁడు బుచ్చయ్య శ్రీకృష్ణమూర్తివారి అనుగ్రహంవల్ల వ్రాసెను."

తుద నాల్గుపత్రము లందు కూచిమంచి తిమ్మకవి నీల సుందరీ పరిణయమున భాగముకొంత వ్రాయఁబడియున్నది

## R. No. 95.

Palm-leaf. 18 × 1½ inches Foll. 108. Lines, 6 in a page. Telugu. Injured.

Presented by Brahmānanda Rao of Cocanada in 1911-12.

భాగవతము (ప్రథమద్వితీయతృతీయస్కంధములు).

BHĀGAVATAMU (SKANDHAS 1 TO 3)

Same as the above.

Incomplete.

(బి-బి.)—

అసమగ్రము. మొదటినుండి మూఁడవస్కంధమున సగము వఱకుఁగలదు. వ్రాఁతబాగున్నది. నిర్దుష్టము కాదు. శైథిల్యము కలదు. గంథపాతములు కలవు.

ఇది కొంత వర్ణించిన గ్రంథమే. ఈ ప్రతి యసమగ్రమును, శిథిలము నగుటచే విషయవివరణము చేయఁబడదయ్యె.

## R. No. 96.

Palm-leaf. 13¼ × 1⅓ inches. Foll 34. Lines, 5 in a page Telugu Good.

Purchased from P. D. Śrīnivāsa Śāstri of Tanjore in 1910-11

మాయాచిదానందమంజరి.

MĀYĀCIDĀNANDAMAÑJARI.

This is a work treating of the principles of the Advaita Vēdānta: by Nādindla Umāpati, son of Śēṣayya, a Niyōgi

Brahmin of Ārvēla class and of Ātrēyagōtra. The author was a Karaṇa of Nādındla village. He states that he was asked by his teacher Cidānandaghanayōgi, in a dream, to compose this work.

Complete.

**Beginning:**

ద్వి. శ్రీవాసుదేవైక చిదచిదానంద
పావనామృతరాశి బ్ధిక గాశి (?)
తాపత్రయాంతకుఁ దత్త్వార్థవేది
వ్యాపకు నవ్యయు వ్యక్తు సర్వజ్ఞ
* *
సాక్షియై వెలుఁగొందు సద్గురుస్వామి
పాదపద్మంబులు భక్తితోఁ గొలిచి
* * * *
మాయాచిదానందమంజరి యనెడి
ద్విపద గావింతును ధీరాత్ము లరసి
* * * *
చెలువగు నొకమహాసిద్ధవేషమునఁ
గలను జిదానందఘనయోగి ననుచు
సరసత వివరించి సకలవేదాంత
పరమరహస్యముల్ బయలుపడంగఁ
గర మొప్పఁ దనపేరఁ గథ సేయు మనిన
కరయ నాచేతఁ గా దది యనియంటి
* * * *
సత్కృతి నాదిండ్లశాసనాంకుండు
ఉమ్మయామాత్యుండు నొనరించెఁ బ్రేమ
ధర హరికీర్తనఁ దప్పొప్పు లున్న
నరసి దిద్దుదురు కా దన కాత్మవిదులు.

**End:**

సదయుండు నాదిండ్లశాసనాంకుండు
కూరిమి వీరయకులపవిత్రుండు

నారూఢిఁ దనరుబుధాగ్రగణ్యుండు
అతనిపుత్త్రుఁడు శేషయామాత్యుఁ డనఁగ
నతిప్రఖ్యాతిఁ దల వేంగమాంబందుఁ గనియె
సకలవిద్యావిచక్షణుం డగునట్టి
యశ్లంకమతి పుణ్యుఁ డనఘచరిత్ర
గుణనిధి యాత్రేయగోత్రపవిత్ర
మణియగు నార్వేలమంత్రిశోభితుఁడు
అసమా(?)ధురీచిత్రయమితవిస్తార
భాసురవాక్ప్రౌఢీభావవిచిత్ర
సర్వవేదాంతనిశ్చయరహస్యములు
నుర్విని ద్విపద లోకోపకారముగ
గరిమ నుమాపతి కావింపఁ బూనె
నరయఁ జిదానందు ననుమతిఁ జేయఁ
గరుణించరయ్య సత్కవివరులార
ధరణిలో నాచంద్రతారార్కముగను.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత యొకమాదిరిగా నున్నది. తప్పులు కుప్పలు. శైథిల్యము లేదు. గ్రంథపాతములు లేవు.

ఇది మాయాచిదానందమంజరియను పేర ద్విపదరూపమున రచింపఁబడిన వేదాంతగ్రంథము. నాదిండ్లశాసనుఁడు (కరణము?) అయిన యుమాపతి దీక్షితుఁ గర్త. ఇందు, అద్వైతవేదాంతవిషయము ప్రతిపాదింపఁబడినది. విశేషము లుదాహృతములగు గ్రంథభాగముల మూలమున గుర్తించునది.

## R. No. 97.

Palm-leaf. 15¼ × 1⅛ inches. Foll. 117. Lines, 7 in a page. Telugu. Good.

Presented by Vasantavada Jagannāthamgāru of Vizianagaram in 1911–12.

భారతము (అశ్వమేధపంచకము).

BHĀRATAMU (FIVE PARVAS FROM AŚVAMĒDHA-PARVA)

Another portion of the work described under R. No. 21 *ante*

Contains the following five Parvas: Aśvamēdha, Āśramavasika, Mausala, Mahāprasthāna and Svargārōhana.

(వి-వి.)—

సమగ్రము. వ్రాంత ముచ్చట గూర్చుచున్నది. తప్పులు లేకపోలేదు. శైథిల్యము లేదు. గ్రంథపాతములు లేవు.

తిక్కనసోమయాజీ రచియించిన భారతమందలి యశ్వమేధాదిస్వర్గారోహణాంతమగు పర్వపంచక మిందుఁ గలదు.

R. No. **98.**

Palm-leaf. 13½ × 1¾ inches. Foll. 36. Lines, 6 in a page. Telugu. Good

Purchased for the Library in 1911–12 from E. R. Kṛṣṇmācāri of Kalyānapuram, Tanjore district.

గురుశిష్యసంవాదము.

GURUŚISYASAṀVĀDAMU.

This work contains the teachings imparted by a religious teacher to his disciple in regard to his conduct towards the teacher, the mode of renunciation, the division into three Gunas, the five sheaths of the soul and such other topics connected with Vēdānta. The author of the work is Yōgānandāvadhūta, a disciple of Linga-guru. He composed also another work, called Paramānanda-śataka.

Complete.

**Beginning:**

ద్విపదము. శ్రీకరసౌందర్యచిన్మయాకారు
లోకనాయకు సర్వలోకసంచారు

నిరుపమామృతపూర్ణ నిర్మలగాత్రు
సురుచిరానందమయు సుజ్ఞాననేత్రు
[illegible]మాంతగోచరు సత్యప్రకాశు
అగణితదయసింధుఁ డగులింగగురుని
విమలపదధ్యానవిభవంబునందు
అమర యోగానంద అవధూతస్వామి
నగునట్టి నేను నా లింగగురుని
జిగిరైన యాజ్ఞను శిరసావహించి
గురుశిష్యసంవాదగురుతరద్విపద
విరచింతు లెస్సగా విస్తరముగను.

**End:**

అని యిట్లు సంతోషహర్షాశ్రువులను
తనుపులకాంకురధర్మంబు నొంది
మాటిమాటికి గురుధ్యానంబు చేసి
పాటించి గురుపాదపద్మంబులందు
భక్తియుక్తముగాను ప్రణుతియుఁ జేసి
యుక్తమౌ గురునాజ్ఞ యొనర తలనుంచి
అమలజీవన్ముక్తుఁడై శిష్యవరుఁడు
అమితమౌ గురునందు నైక్యమై యుండు
సరణి యీగురుశిష్యసంవాదబోధ
గురుతరంబుగ లింగగురు నర్పితముగ
ఒనరఁ జేసినయట్టి యొప్పైనద్విపద
జను లెవ్వరైనను జెలఁగుచు విన్న
భక్తితోడుత నిది పఠన చేసినను

* * * *

పరమసామ్రాజ్యమౌపదముఁ బొందుదురు.

(వి-81.)—

సమగ్రము. వ్రాఁత బాగున్నది. నిర్దుష్టము కాదు. శైథిల్యము లేదు. గ్రంథపాతములు లేవు.

గురుశిష్యసంవాదరూపమున నీగ్రంథమందు గురుసేవావిధము, వైరాగ్యపద్ధతి, షోడశవికారములు, షడూర్ములు, గుణత్రయవిభాగము, పంచకోశపద్ధతి మొదలగు వేదాంతవిషయములు వివరింపఁబడినవి. గ్రంథకర్త యోగానందావధూత. లింగగురుని శిష్యుఁడు. పరమానందశతకాదు లీతని యితరకృతులు.

గ్రంథాంతమున మూఁడుపత్రములందు సిద్ధమతమునను, మునిమతమునను బంచవింశతితత్త్వ నిర్ణయము తెనుఁగుమాటలతోను శ్లోకముతోను గలదు.

R. No 99.

Paper. $12\frac{7}{8} \times 8$ inches. Foll. 138. Lines, 38 in a page Telugu. Good

Purchased in 1911-12 from Krottapalli Sūrya Rao of Cocanada.

దాశరథివిలాసము.

DĀŚARATHIVILĀSAMU

This is a Prabandha in seven Āśvāsas treating of the story of Rāma by Krottapalli Laccaya, son of Rāmanārya, a Vaidika Brahmin, of Kauṇḍinyagōtra He is also the author of Sūrya-śataka. The work under notice is dedicated to God Vēṅkatēśvara worshipped at Tirupati

Complete.

**Beginning:**

శా. శ్రీమద్దైరికధాతువేష్టితమునై జీమూతసంవ్యాప్తమై
రామంబై తనరారువేంకటనగేంద్రంబుఁ బారిజాతవరో(రసో)
ద్దామంబై మృగనాభిలిప్త మగుపద్మాదేవివక్షోజ మం
చా మోదించెడు వేంకటేశ్వరుఁడు మమ్మాసక్తి రక్షించుతన్.

క. కృతినుతుని వేంకటేశునిఁ
గృతినాథునిఁ గా నొనర్చి కృపపుట్ట నమ
స్కృతి గావించెద మఱి స
త్కృతి యింతటికన్నఁ గలదె యెన్నివిధములన్.

* * * *

గీ. వెలయు నజునికగుణ విమలరామకథాప్ర
పంచ మెల్లఁ గానఁబడిన వేడ్కఁ
బ్రచురభంగిఁ జెప్పఁ బ్రాచేతసుండు శు
భక్రమంబుగా నుపక్రమించి.

వ. అట్టి మహామహనీయాభివర్ణనీయసుగుణసంతానంబును సంశ్రితదీనసంతానసంతానంబు నగు రామకపుణ్యసంతానంబునం జతుర్థపుత్రుండనగు నేను,

గీ. పరమభక్తిని దుష్కరప్రాసకంద
సూర్యశతకంబు విరచించి సూర్యదేవ
తాశిరోమణి కర్పించి తద్గ్రామావి
శేషమాధుర్యకసుధాప్రసిద్ధి మఱియు.

End.

మం-భా. సుమునిప్రకాండనుత సూరవందితా
కుమతిప్రజాపహతకుంభినీహితా
కమనీయచక్రధర కాంచనాంబరా
విమలాంతరంగవర వేంకటేశ్వరా!

Colophon

ఇది శ్రీసూర్యనారాయణపదాబ్జధ్యానపరాయణభూసురధైర్య వినయ రామనార్యతనయ పండితసేవాసమున్నత కొత్తపల్లి లచ్చయ ప్రణీతంబైన దాశరథివిలాసంబను మహాప్రబంధంబునందు సర్వంబును షష్ఠాశ్వాసము సంపూర్ణము.

(ఖి-ఖి.)—

సమగ్రము. వ్రాత బాగున్నది. తప్పులు లేవు. శైథిల్యము లేదు. గ్రంథపాతములు లేవు.

దాశరథివిలాసమను పేరుగల యీ యేడాశ్వాసముల ప్రబంధమున శ్రీరామచరిత్రము వర్ణింపఁబడినది. గ్రంథకర్త కొత్తపల్లి లచ్చయ్యకవి. కౌండిన్యగోత్రుఁడు. వైదికబ్రాహ్మణుఁడు రామనార్యుని పుత్త్రుఁడు. దుష్కరప్రాసములతోఁగూడిన సూర్యశతకము రచించినవాఁడు. ఈ కృతి తిరుపతివేంకటేశ్వరస్వామికి సమర్పింపఁబడినది.

## R No 100.

Palm-leaf 16¼ × 1¼ inches Foll. 117. Lines, 5 in a page. Telugu. Good.

Purchased in 1911–12 from K. Sūrya Rao of Cocanada.

ఆంధ్రభాషార్ణవము.

ĀNDHRABHĀSĀRNAVAMU

This is a lexicon of Telugu words written in the form of stanzas and in the same plan of arrangement as Amarasiṁha's Nāmalingānuśāsana in Sanskrit. The author of the work is Nudurupāti Venganārya, son of Mahōddandakavi Sītārāmārya. He composed this work at the instance of his patron, Rāya raghunātha of Pudukōta, who was the same as the author of Pārvatīparinaya described under R. No 55 *ante* The stanzas giving the patron's genealogy in this work happen to be the same as those found in the Pārvatīparinaya The work now under description was dedicated to God Mātṛbhūtēśvara worshipped at Trichinopoly. In the last two leaves are given different readings in regard to the text of the work.

Complete in three Kāṇḍas.

**Beginning :**

శా. శ్రీమాతృప్రకటీకృతాంగరుచి సారెం జూచి భాషించుచో
నామే నైనత్రిలోకమాత యగుటన్ వైశ్యాంగనన్ దల్లినై
ప్రేమం బ్రోచుట చూడమే . . . శ్రీమాతృభూతేశ్వరుం
డామోదంబునఁ బ్రోచుఁగాత రఘునాథాధీశ చూడామణిన్.

* * * *

వ. . . . . . కొలువు డి నన్ను రప్పించి సన్మా
నంబు సేయుచు వినయంబున,

క. ఖచరీకచకుచవిచల
ద్విచికిలహారప్రసన్నపీనమరంద
ప్రచురరుచిం బెనఁగొన్నచ
కచ (కల్?) నీకవిత లెన్నఁ గవివెంగన్నా!

గీ. ఆంధ్రగీర్వాణకవనంబులందు నీకుఁ
గలుగుజ్ఞానం బదేరికిఁ గలుగ నేర్చు
నాశ్రితుండ వంచు నుతియించు టట్లు కాదు
కాని యవి యేల యిపుడు వేంకనకవీంద్ర!

గీ. దేవతలభాషగాఁవునఁ దెలుఁగుకన్న
సంస్కృతమె మిన్న యాయుక్తి సరియె తెలిసె
రసికుఁడగువాఁడు తనదుజారుసిగలోనఁ
దుఱిసినే యిడుకొనునొ జాజులనె యిడునొ.

గీ. కాన నీయాంధ్రకృతులను గలుగునట్టి
పదములకు నెల్ల నర్థ మేర్పడెడు రీతి
నద్భుతంబుగఁ గృతిని జేయంగవలయు
నర్థమైన రసస్ఫూర్తి యగుట యరుదె!

గీ. కృతికి నాయకు మాతృభూతేశుఁ జేయ
వలయు నని నేను నీతల పల పసిండి
సొమ్ము సేయించి పంటరా ల్లిమ్ము గాను
జెకిగ్గి నను మేలె రతనంబుఁ జెకగ్గికున్న.

వ. అంకితంబు : నాయొనర్పంబూనిన యాంధ్రభాషార్ణవం బను మహాకృతికి సందర్భం బెట్లనిన,

**End :**

గీ. అశ్రుత గ్రామ్యవి స్మృతవ్యర్థసులభ
శంకితాలస్యనిర్ముక్తశబ్దవితతి
దగఁ రచియించు నీకృతి దయను గొనుము
మాతృభూత జగత్త్రయీమాతృభూత !

* + * *

మాలిని. సకలభువననాథా సంతతస్వావబోధా
మకుటఘటితసోమా మంగళాధారనామా
సుకవిహృదయగేహా సుందరస్వచ్ఛదేహా
యకలుషనిజచర్యా యాశ్రితామోదవర్యా !

**Colophon :**

ఇది శ్రీపరమేశ్వరకరుణాకటాక్షసంప్రాప్తసర్వజ్ఞత్వాదికవిప యగుణస్వాస్థ్య తదితర సకలగుణగౌపమ్య ఆసేతుహిమాచలఖ్యాత మహోద్దండకవిబిరుదప్రశస్త సీతారామార్యవర్యతనూజాత శౌర్యధైర్యస్థైర్యసకలచిరత్న రత్నాకర శ్రితజనశ్రీకర కోటిసమాఖ్యవంశసుధాపయోనిధిరాకాశశాంక ఘంటికాతురగనీలాతపత్రహనుమద్ధ్వజమకర కేతనదివాదీపవివిధభేరికాదినిఖిలబిరుదాంక బృహదంబికాకటాక్షస జాతసామ్రాజ్యధురంధర విమలయశోబంధుర కర్ణాటచోళపాండ్యమహీపాలాదిసంస్తూయమాన శ్రీరాయరఘునాథ మహీనాథసభాంగణబిరుదాయమాన ఆర్యనుతచర్య వేంకనార్యప్రణీతంబైన శ్రీమదాంధ్రభాషార్ణవంబునందుఁ దృతీయకాండము సంపూర్ణము.

కొత్తపల్లిగంగయ్య స్వంతముకు వ్రాసెను.

(వి-వి.) —

సమగ్రము వ్రాఁత బాగున్నది. తప్పు లంతగా లేవు. శైథిల్యము లేదు. గ్రంథపాతములు లేవు.

ఆంధ్రభాషార్ణవ మను పేరుగల పద్యరూపమగు నీ నిఘంటువు నుదురుపాటి వెంగనార్యునిచే రచియింపఁబడినది. పుదుకోటప్రభువగు కోటిరాయరఘునాథరాయ లేతత్కృతిరచనమునకుఁ బ్రేరకుఁడు. మాతృభూతేశ్వరస్వామి కీకృతి సమర్పింపఁబడెను.

సంస్కృతమున నామలింగానుశాసనమువలె నీ నిఘంటువు స్వర్గ్వ్యోమదికాలాదివర్గములతో మూఁడు కాండములుగా రచియింపఁబడినది. ఏతత్కృతిప్రేరకుఁడగు రఘునాథరాయలు పార్వతీపరిణయ మను ప్రబంధమును రచియించెను. ఆతని వంశవర్ణనమున నాగ్రంథమం దున్న పద్యములే యిందును గలవు. ఆ గ్రంథము నెం ౫౫ రున వర్ణింపఁబడెను. ఆయావిశేషముల నాచోటఁ జూచునది.

గ్రంథముతుద రెండుపత్రములందు గ్రంథమునందలి పాఠభేదాదికము కొంత వ్రాయఁబడియున్నది.

## R. No. 101.

Palm-leaf. 5⅜ × 1¼ inches. Foll. 35. Lines, 10 in a page. Telugu. Injured.

Purchased from K Rāmasvāmi Ayyangār of Magadı in 1911–12.

కావ్యాలంకారసంగ్రహము.

### KĀVYĀLAṄKĀRASAṄGRAHAMU.

This is a treatise on rhetoric and poetics. By Mūrti. This MS. contains only the Rasaprakaraṇa forming the third Āśvāsa.

(వి-వి.)—

అసమగ్రము. మూఁడవయాశ్వాసము మాత్రమే కలదు. శైథిల్యము కలదు. గ్రంథపాతములు లేవు; వ్రాఁత చిన్నది. తప్పులు లేవు; కాని కొంతగ్రంథభాగము ముందు వెనుకలుగా వ్రాయఁబడినది.

మూర్తికవిచే రచియింపఁబడిన కావ్యాలంకారసంగ్రహమందలి తృతీయాశ్వాసమగు రసప్రకరణ మిందుఁగలదు. గ్రంథ మసమగ్ర మగుటచేఁ దక్షిణనయంశము లిందుఁ దెల్పఁబడవయ్యె.

## R. No. 102.

Palm-leaf 11 × 1¼ inches. Foll. 40. Lines, 5 in a page. Telugu Good.

Purchased from Krottapalli Sūrya Rao Gāru of Cocanada in 1911-12.

### ప్రశ్నశాస్త్రము.

### PRAŚNAŚĀSTRAMU.

This is a treatise on prediction and divination. There are given here 40 questions and 9 answers for each question.

Complete

**Beginning:**

౧

ఈ చింతించినప్రయోజనం అయ్యేనో కాదో?

౧ ఈ చింతించినప్రయోజనం ఒక ధోరవల్ల అవును.

౨ సర్వథా ఆలస్యానకాని కాదు.

౩ ఈసొమ్ము తీసి నట్టఁటనే మంచెపకదిక్కున పెట్టేని.

౪ ఈ స్త్రీ బిడ్డలుగన్న వెనుక చచ్చీని.

౫ ఈకన్యకకు ధనలాభం అవును.

**End:**

౪౦.

ఈతనితో జగడంచేస్తే గెలిచేనో గెలవదో?

౧ ఈతనితో జగడంచేస్తే గెలవదు. దేశత్యాగమై వక డూపాయేని.

౨ ఈసమర్తాడినముహూర్తం సంపద కడు లెస్సయ్యీని.

3 ఈ అప్పు ఈయేడు తీరదు. ముందర తీరేని.
౪ ఈయిచ్చిన అప్పు జగడానగాని రాదు.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత తిన్ననిది. నిర్దుష్టము కాదు. శైథిల్యము లేదు. గ్రంథపాతములు లేవు.

ఇది యొక ప్రశ్నగ్రంథము. ప్రశ్నచూచువిధ మేమో యిందుఁ దెలుపఁబడి యుండలేదు. నలుబది ప్రశ్నములును, ఒక్కొక ప్రశ్నకుఁ దొమ్మిదేసి బదుళ్లును గలవు. ఇంతకంటె నీ గ్రంథమును గూర్చి యెఱుఁగఁదగినది లేదు.

## R. No. 103.

Palm-leaf. $16\frac{3}{4} \times 1\frac{1}{4}$ inches Foll. 303 Lines, 6 in a page. Telugu Good.

Purchased from Cirrāvūri Viśvanātha Śāstri of Vizianagaram in 1911-12.

భాగవతము (దశమస్కంధము).

BHĀGAVATAMU (TENTH SKANDHA)

Same work as the one described under R. No. 75 *ante*.

Complete.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత తిన్ననిది. తప్పులంతగా లేవు. శైథిల్యము లేదు. గ్రంథపాతములు లేవు.

ఇది బమ్మెరపోతరాజాదులచే రచియింపఁబడిన భాగవతపురాణమందలి దశమస్కంధ మనెడు భాగము. ఇది నెం. 75 రు పుస్తకము సమానవిషయములే.

## R. No. 104.

Palm-leaf. 17 × 1⅜ inches. Foll. 47. Lines, 8 in a page. Telugu. Injured

Presented by Brahmānanda Rao of Cocanada in 1911-12.

హరవిలాసము.

## HARAVILĀSAMU.

This is a Prabandha in seven Āśvāsas describing the story of Siruttondanāyanār, a Tamil Śaiva saint, as also the story of the marriage of Pārvatī and Śiva and other stories connected with Śiva. The author of the work is the famous Śrīnātha, son of Mārayāmātya and grandson of Kamalanābha, and it is dedicated to the author's friend, Avaci Tripurāri, son of Avaci Seṭṭi and grandson of Pāvāṇi Seṭṭi of Simhavikramapaṭṭana. The patron of the author is said to have lived at Conjeevaram and to have been a descendant of Śiruttondanāyanār. This patron's father was a friend of Reddi Vēmabhūpāla, who built a flight of steps to ascend the Śrīśailam hill in the Kurnool district. The author's brother, Tirumalanātha, was the friend of Kumāragirirāja, the patron of Kātayavēma, the author of a commentary on Kālidāsa's dramas, and assisted him in successfully conducting the Vasantōtsava (spring festival). Another brother was Cāma Seṭṭi, who looked after trade which was their profession, and extended even to distant countries. For fuller details see Telugu remarks and the extracts given below.

Contains only the first five Āśvāsas.

**Beginning :**

ఉ. శ్రీమహిళాపయోధరహరిన్మణిహారము హస్తిభూధర
స్వామి పయోజసంభవునిజన్మముగాచినవేల్పు దేవతా
గ్రామణి కంచిశ్రీవరదరాజు మనోహరపుణ్యకోటివీ
థీమణిమండితుం డవచిదేవయతిప్పు గృతార్థుఁ జేయుతన్.

* * * *

వ. అని ప్రార్థించి త్రిపురాంతకదేవదివ్యశ్రీపాదపద్మారాధకుం
డును, పరబలసాధకుండును, కమలసంభవోరఃప్రదేశసంభవవిమల

వంశోన్నతోరుండును, సర్వదానిష్ఠబిరుదాధారుండును, సుజనవిధేయుండును, కర్పూరవసంతరాయుండును, కీర్తివనితావల్లభుండును, ప్రతిదివసారాధితపరమేశ్వరుండును, మాణిక్యసింహాసనాధీశ్వరుండును, అంగీకృతభూసురాశీర్వాదుండును, కిషిరంధాచలక్రీడావినోదుండును, దానధర్మపరాయణుండును, ఇష్టదిగరుడనారాయణుండును నిజకీర్తిశాసనస్తంభాయమానదిగంతదంతావళుండును, అభయప్రదానిళుండును, వశీకృతనిఖిలభూభుజుండును, సతతత్యాగధ్వజుండును, వినిర్మలకులశీలుండును, పాండ్యరాయకందుకక్రీడావిలోలుండును, కవిజనస్తోత్రపాత్రుండును, కౌండిన్యగోత్రపవిత్రుండును, చతుష్షష్టివిద్యాజన్మభూమియు నయోధ్యానగరస్వామియు, ననం బరంగి జంబూద్వీపభూభువనమండలీమకుటమండనాయమానం బగు కొండవీ ( ? ) లతాధిష్ఠితాష్టాదశ ద్వీపాంతరాళుండుననగు కొమరగిరి భూపాలువలన నాందోళికాచ్ఛత్రచామరతురంగ భద్రదీపికాదిరాజ్యచిహ్నములు వడసి యమ్మహారాజునకుం బ్రతివత్సరంబును సంవత్సరో (వసంతో?) త్సవంబు నక (లగ?) స్తూరీకుంకుమ సంకుమద కర్పూర హిమాంబుకాలాగురు గంధసార ప్రధానంబులగు సుగంధద్రవ్యంబు లొడంగూర్చియు జీని సింహాళ తవాయి హురుమంజి జోణంగి ప్రభృతి నానాద్వీపనగరాకరంబుల ధనకనక వస్తువాహన మాణిక్య గాణిక్యంబులు దెప్పించియు గవి వైగమిక వాదివాంశిక వైతాళికాదులగు నర్థిజనంబులకు నర్థంబులు గుప్పించియు ధీరుండన, నుదారుండన, సదాచారుండన, భువన విఖ్యాతి కైకొని యొప్పు నవచితిప్పప్రభుం డొకనాం డాస్థానమండపంబున సుఖోపవిష్టుండై.

సీ. కమలనాభుని పౌత్త్రుఁ గవితామహారాజ్య
భద్రాసనాసీనుఁ బరమపుణ్యుఁ
బాత్రు నాపస్తంబసూత్రు భారద్వాజ
గోత్రు సజ్జనమిత్రుఁ గులపవిత్రు

భిమాంబికామారనామాత్యనందను
నఖిలపురాణవిద్యాప్రవీణు
నధ్వర్యు వేదశాఖాధీతినిష్ణాతు
నంధ్రభాషానైషధాబ్జభవుని

గీ. నుభయభాషాకవిత్వ ప్రయోగకుశలు
బాలసఖు గారవించి తాత్పర్య మెసఁగ
నవచిత్రిపురాంతకుం డలకాధిరాజు
హితమి ( . . . . . . )

క. కంటిఁ బ్రవిశుద్ధసంతతి
వింటిఁ బురాణములు పెక్కు విశ్వము పొగడ
మంటి బహువత్సరమ్ములు
గొంటి యశోధనము సుకవికోటి నుతింపన్.

సీ. కట్టించె నొకతాత కంచి హర్మ్యంబులు
హరిణాంకమౌళి కేకామ్రపతికి
బాలార్కమణియైన పద్మరాగము దాఁచె
నొకతాత కంచినాయకునినాభి
నొకతాత గట్టించె యోజనత్రయదీర్ఘ
వరతటాకాంభోధి తిరువళూర
కావేరి గట్టించెఁ గార్పాసరాసుల
నుబ్బి చోడఁడు మెచ్చ నొకక తాత

గీ. ప్రతిదినంబును గపురదీపములు వేయు
వ్రతములుగ నొకక తాత యాశ్వగున కొసఁగె
నిఖిలలోకప్రసిద్ధవాణిజ్యవ శ
ధరులు మా తాత ఉభయగోత్రమ్ములందు.

గీ శైవవైష్ణవ సమయదీక్షాళి శేష
ధన్యమానసు లుభయగోత్రములవారు

నాయభీష్టంబు కడుఁ జిన్ననాఁటనుండి
పరమమాహేశ్వరాచార భక్తిపరము.

గీ. ఆగమజ్ఞాననిధివి తత్త్వార్థఘనివి
బహుపురాణజ్ఞుఁడవు శుభభవ్యమతివి
బాలసఖుఁడవు శైవ(సు?) థ మొకటి
యవధరింపుము నాపేర నంకితముగ

వ. అనిన నేను శుభముహూర్తంబుగాన నిజాంతరంగమంగళాయతనాధిష్ఠిత కుమారాచల త్రిపురాంతకుం డవచిత్రిపురాంతకుండు కృతిస్వామిగా హారవిలాసంబను ప్రబంధంబు చెప్పం దొడంగితి నప్పుడా ప్రారంభంబునకు ముఖతిలకంబగు తదీయవంశావతారం బెట్టి దనిన

సీ. ముయ్యేడు వాసరంబు లకాలవర్షంబు
జడివట్టి కురియఁ బర్జన్యుఁ బనిచి
తానొకరుఁడుఁ దనకుఁ దకొరు శివయోగి
యూర (లేకుండంగ మే?)ర వెట్టి
క (కు?) దవంగఁ బెట్టినకొడుకు మాంసముతోడి
భోజనంబునకై విభూతి యొసఁగి
పుత్త్రుఁ బాకముచేసి బోనాము పెట్టినఁ
గుడువంగ నొల్లక పెడము వెట్టి

గీ. పరమాహేశ్వరాచారపథియందు
నిజము లిపించె నెవ్వాని నీలగళుఁడు
వాఁడు పాత్రుండు గాఁడె కైవారమునకు
దురితదూరుండు శ్రీచిఱుతొండనంబి.

సీ. అర్ధరాత్రంబున నల్లాడనాథుండు
తానె యెవ్వనికిఁ గైదండయిచ్చె
సదకంపుఁబ (?) మి పై వేయవచ్చిన
దనుజారి నిల్పె నెవ్వనినిజంబు

అలిగిపోయిన వేంకటాచలంబున కేఁగి
కొనివచ్చె నెవ్వానిఁ గంధగ?రుఁడు
వైకుంఠనాథుఁ డెవ్వని సేవనకు మెచ్చి
యాత్మసతాంరకళ్యాణ మొసఁగె
గీ. అతఁడు భాగవతోత్తముఁ డతడు శుద్ధుఁ
డతఁడు వైరాగ్యసంపన్నుఁ డతఁడు ఘనుఁడు
పరమవైష్ణవసభ నుతింపం దగండె
కాంచినగరికుటుంబి తిరుకం(గరం?)చినంబి.

వ. అందు

గీ. సింహవిక్రమపట్టణ శ్రేష్ఠుఁడైన
సెట్టిజగజెట్టి పావాణిసెట్టివిభుఁడు
ఘనుఁడు నగరేశచంద్రశేఖరపదాబ్జ
వందనానందితాత్ముండు వంశకరుఁడు.

క. శ్రీపర్వతసోపాన
స్థాపితుఁ (పకుఁ?) డను రెడ్డి వేమజగతీపతికిఁ
బ్రాపైనయచివధీమణి
యాపావాణికి జనించె నభ్యుదయముతోఁ.

ఉ. విశ్వజగత్ప్రసిద్ధిక (?) వివేకనిరంజన రామనాథయో
గీశ్వర పాదసేవకుఁ డహీన దయాగుణశాలి ఓగమా
హేశ్వర చక్రవర్తి తరుణేందు కళాధర భక్తిభావనా
శాశ్వతమానసుం డవ( ! ) త్రుఁడే !

ఉ. ఆతతభక్తిసంపద నహర్నిశముఁ ఘృతఖండశర్కరా
పాతముతో నపూపములు పాయసముం గదలీఫలంబులుఁ
స్ఫీతముగాఁగ నన్నములు పెట్టును శంకరభక్తకోటి కా
సేతుహిమాచలం బవచి సెట్టికి నెవ్వరు సాటి యిమ్మహిఁ.

మ. ఖుసిమీఁదన్ సురధాణి నిండుకొలువై కూర్చున్నచో నీకరా
భ్యసనప్రౌఢినుతించురా యవచితిప్పా చంద్రసారంగనా
భిసముత్పాదిత తాళవృంత పవనప్రేంఖోళనప్రక్రియా
వసరోదంచిత సాగసౌరభరసవ్యాలోల రోలంబముల్.

క. తిప్పఁ ధనార్థుల పట్టుం
గొమ్ము వివేకాది సకలగుణరత్ననిధా
నమ్ముఁ ద్రిపురారియనుఁగుం
డమ్మను బుధజనము సంతతమ్మును బొగడున్.

చ. వారిహర రాయ ఫేరోజసహా సురధాణగజాధిపాదిభూ
వరులు నిజప్రభావ మభివర్ణనసేయఁ గుమారగిర్యధీ
శ్వరుని వసంతవైభవము సర్వము నొకఁడ నిర్వహించు మా
తిరుమలనాథ సెట్టికిని ధీగుణభట్టికి నెవ్వరీడగున్.

శా. చామున్ వైశ్యకులాబ్ధిసోము విలసత్సౌందర్యలీల కళా
ధా (కా?) మున్ దానగుణాభిరాము సుమనఃకల్హారవాటీసుధా
ధామున్ గోమలయామినీశధవళోత్తంసప్రశంసారుచి
శ్రీమన్మానసశైవయోగివిహితక్షేము న్నుతింపం దగున్.

సీ. పంజార(బు?)కర్పూర పాదపంబులు తెచ్చి (చ్చె?)
జలనోగ బంగారు మొలక తెచ్చె
సింహళంబున గంధసింధురంబులఁ దెచ్చె
హురుమంజి బలుతేజి హరులఁ దెచ్చె
గోవసశుద్ధ సంకుమదద్రవము దెచ్చె
నాఁపకట్టాణిముత్యాలు దెచ్చె
భోటక (క?) స్తూరికాపు (?) ములు దెచ్చెఁ
జీనిచీనాంబరశ్రేణి తెచ్చె
గీ. జగదగోపాల రాయవేశ్యాభుజంగ
పల్లవాదిత్యభూదాన పరశురామ

కొమరగిరిరాజ దేవేంద్రు కూర్మిహితుఁడు
జాణజగజట్టి దేవయచామసెట్టి

గీ. తమ్ము లిద్దఱుఁ దనయాజ్ఞఁ దల ధరించి
యన్నిదీవులఁ దెచ్చులాభార్థకోటి
యర్థులకు నిచ్చి కీర్తిబేహార మాడు
నవచిత్రిపురాంతకుండు వంశాబ్ధివిధుఁడు.

మ. తిరుణాసీరితివాయిగోవరమణాస్థానంబులం జందనా
గరుకర్పూరహిమాంబుకుంకుమరజఃకస్తూరికాద్రవ్యముల్
శరధిం గప్పలి బొంగు(?)వల్లివలికాసమ్మాన్లఁ(?) దెప్పించునే
ర్పరియై వైశ్యకులోత్తముం డవచతిప్పం డల్పుఁడే యిమ్మహిన్.

గీ. పండువా డిల్లి రాఘాదిపట్టణముల
యధిపతులు మార్కిఁ దాల్చురత్నాంకురములు
అవచిత్రిపురాంతకానీతయానపాత్ర
సింహళద్వీపమండలక్షేత్రజములు.

* * * *

ఉ. ధీచతురుల్ సహోదరులు తిప్పయ(ర్యల ?) సెట్టియుఁజామి
[సెట్టియున్
మాచన విశ్వనాథ చినమల్లుకుమారులు వీర లాత్మజుల్
శ్రీచెలువంబు నైకొనఁగ చేడియ యన్నమదేవి భార్యగా
గోచరమే నుతింప నయకోవిదుని త్రిపురాంతకాధిపున్.

వ. అభ్యుదయపరంపరాభివృద్ధిగా నే నొనర్పం బూనిన హార
విలాసంబను ప్రబంధంబునకుఁ బ్రథమవిలాసంబైన నాయకుని వాణి
జ్యవంశంబునకుఁ గూటస్థుండైన చిరుతొండనంబిచరిత్రంబు చెప్పెద
నది యెట్టి దనిన—

**End:**

మాలిని. . . . . . . . . . . . .

మృగమదఘనసారో న్మేళనాసంప్రయోగ
ప్రగుణితహిమవారిప్రౌఢ కేళీవిహార
అగురుఘుసృణపంకా . . . . .

**Colophon:**

ఇది శ్రీమత్కమలనాభ పౌత్ర మారయామాత్యపుత్త్ర, సకల సుకవిజనవిధేయ శ్రీనాథనామధేయప్రణీతంబైన హరవిలాసంబు నందుఁబంచమాశ్వాసము.

(వి-వి.)—

అసమగ్రము అయి దాశ్వాసములుమాత్రమే యిందుఁ గలవు. వ్రాత యొకమాదిరిగా నున్నది తప్పులు లేవు. శైథిల్య మెక్కువగాఁ గలదు. గ్రంథపాతములును గలవు.

హరవిలాసమను పేరుగల యేడాశ్వాసముల యీరసవత్ప్రబంధము ప్రఖ్యాతుఁడగు శ్రీనాథకవి సార్వభౌమునిచే రచియింపఁబడినది. ఇందుఁ జిఱుతొండనంబిచరిత్రము, గౌరీకళ్యాణము, దారువనవిహారము, మొదలగు శివవిలాసములు వర్ణింపఁబడినవి. ఈ కృతి త్రిపురాంతకుఁడను వైశ్యునకుఁ గృతిసేయఁబడెను.

కృతిపతి విషయము.

సింహాసిక్రమపట్టణశ్రేష్ఠుఁడయిన పావాణిసెట్టికి అవచిసెట్టి కుమారుఁడు. ఈతఁడు శ్రీపర్వతమునకుసోపానములు కట్టించిన రెడ్డి వేమన్నపాలునకుఁ బ్రాపయినవాఁడు. రామనాథయోగీశ్వరుని శిష్యుఁడు, అవచిసెట్టికి మాచాంబయను భార్యయందుఁ త్రిపురారి, తిరుమలనాథుఁడు, చామసెట్టి యను మువ్వురు పుత్త్రులు జనించిరి. వీరిలోఁ బెద్దవాఁడగు త్రిపురాంతకుఁడే యీకృతికి భర్త. అతనిపెద్దతమ్ముఁడు తిరుమలనాథసెట్టి, హరిహరరాయలు, ఫిరోజిషాహ, గజపతిరాజు, మెచ్చునట్లు కొండవీటిరెడ్డిరాజగు కుమారగిరి

భూపాలుని వసంతోత్సవములను నిర్వహించుచుండెడివాఁడు. రెండవతమ్ముఁడు చామసెట్టి, పంజా(బు ?)నుండి కర్పూరపుఁజెట్లు, జలనోగినుండి బంగారు మొలకలును, సింహళమునుండి మదపుటేన్గులను. హురుమంజినుండి గుఱ్ఱములను, గోవనుండి జవ్వాదిని ఆప(? )నుండి యాణిముత్తెములను, బోటనుండి కస్తూరిని, జీనినుండి యంబరములను దెచ్చుచుండెడివాఁడు. వీరికి ద్వీపాంతరములతో నోడలమీఁద వ్యాపారము జరుగుచుండెడిది. త్రిపురారికి,అన్నమదేవి భార్య. మాచన, విశ్వనాథుఁడు, చినమల్లి, అనువారు కుమారులు. ఈ త్రిపురారివంశమునపూర్వులలో నొకఁడు కంచి యేకామ్రేశ్వరునకుఁ బ్రాసాదములు కట్టించెను. వేఱొకఁడు కంచివరదరాజస్వామిబొడ్డున బాలార్క మనియెడు మణిని బొదిగించెను. ఇంకొకఁడు, తిరువళ్లూర మూఁడామడలపొడవుగల తటాకము త్రవ్వించెను. మఱియు నొకఁడు కావేరిని గట్టించెను. ఈ వైశ్యులు చిఱుతొండనంబివంశ్యులు. శ్రీనాథకవిసార్వభౌముఁడీత్రిపురారిసెట్టికి బాలస్నేహితుఁడు. ఈకృతి చెప్పించునాఁటికిఁ ద్రిపురారిసెట్టి మిక్కిలి వృద్ధుఁడు. ఈతనివాసస్థలము కాంచీపురము. ఇంతకంటెను విశేషముల కుదాహరింపఁబడిన పద్యములఁ జూచునది.

## R. No. 105

Paper. 11 × 8¾ inches. Foll 65. Lines, 7 in a page Telugu. Good.

(*a*) హయలక్షణవిలాసము.

HAYALAKṢAṆAVILĀSAMU.

Foll. 1*a*—31*b* Fol. 32 is left blank.

Restored from a MS. in the Library in 1911-12.

This work purports to explain in Telugu the characteristics of good horses, the diseases they are liable to, and the remedies for these diseases—all these as treated by Śālihōtra in his Sanskrit work. The author of the Telugu work is Manumañcibhaṭṭāraka,

son of Bhairavācārya. It is dedicated to king Kampa, son of Aubalarāya From a comparison of the titles and attributes of this king, as found in this MS., with those of Sāḷuva Narasiṁharāya, as given in Jaimini-Bhārata, it may be concluded that Kampa belonged to the Sāḷuva dynasty and not to the Cālukya dynasty

The work here breaks off in the fifth Āśvāsa; the introduction also is wanting.

**Beginning:**

క. (శ్రీ?) శ్రితరక్షణ్ణ్యంభువ
నాశ్రిత భుజఠరక్షరుపమాశ్రయ వస్తూ
పాశ్రయహృదయాంబుజని
త్యశ్రేయోజాల కంపధరణీనాథా

వ. అభ్యుదయపరంపరాభివృద్ధియు, పుత్రపౌత్రాభివృద్ధియు నాయురారోగ్యైశ్వర్యాభివృద్ధియుం గా నేఁ జెప్పం బూనిన హాయలక్షణవిలాసం బనుకృతికిఁ బ్రారంభం బెట్టెదనిన--అశ్వప్రశంసయు, దినావర్తలక్షణంబును, దశక్షేత్రవిభాగంబును, వయోజ్ఞానంబును, క్షేత్రప్రమాణనిశ్చయంబును, వర్ణలక్షణంబును, గంధలక్షణంబును, పుండ్రలక్షణంబును, గతిస్వరలక్షణంబును, సామాన్యదోషమహాదోషమప్రకారలక్షణంబును, ఉత్తమాశ్వలక్షణంబును జికిత్సయు లవణవిధియు, గడ్డికవణప్రకారంబును, గ్రమంబునఁ జెప్పెద నందు నశ్వప్రశంస యెట్టి దనిన.

*   *   *   *

[యా

చ. అనఘుఁడు శాలిహోత్రుఁడు హయంబులకుఁ మును చెప్పినట్టి
యనుపమలక్షణంబులు వయఃపరిమాణము రోమజంబులున్
దెనుఁగున నెల్లవారలకుఁ దేటపడన్ రచియింతు సత్కవుల్
వినఁగొనియాడ దానగుణవిశ్రుత . . . మేదినీశ్వరా.

**Colophon:**

ఇది సకల సుకవిజనసంస్తూయమానకవితాచాతురీధురీణ సకలభాషాప్రవీణ భైరవాచార్యపుత్త్ర మనుమంచిభట్టప్రణీతం బయిన హయలక్షణవిలాసంబునందు ఆవర్తలక్షణం బన్నది చతుర్థాశ్వాసము.

**End:**

సీ. పసనైన శొంఠి పిప్పలి మిరియంబులు
నింగువు నతివస నేనయుఁ దూఁచి
సగ చూర్ణములు చేసి సమకూర్చి ప్రియమునఁ
దనర యచ్చవె ? నీళ్ల ననుదినంబు
వాయుతైలంబున వత్తితోడుతఁ బెట్టి
సక్యపాదంబులు సమకఁ జేసి
మేన మర్దనచేసి మేలుతోడుత వల
(?) యుపట్లనునిసుకపాత్రమునఁ గాఁచి.

(వి-వి.)—

అసమగ్రము. కృత్యవతరణిక లేదు. గ్రంథాదినుండి ఐదవయాశ్వాసమున ౧౦౭ పద్యమువఱకును గలదు వ్రాఁత తప్పులు గలవు. మాతృకలోఁ గల్గు గ్రంథపాతము లిందును జేరినవి.

'హయలక్షణవిలాస' మను పేరుగల యీ యశ్వశాస్త్రము మనుమంచిభట్టారకునిచే రచియింపఁబడినది ఇం దశ్వముల మంచి చెడుగులు వానిరోగముల లక్షణములు, ఆరోగముల ప్రతిక్రియలు, మొదలగు విషయములు ప్రతిపాదింపఁబడినవి. గ్రంథకర్త బ్రాహ్మణుఁడు. భైరవాచార్యుని కుమారుఁడు ఈగ్రంథము కంపభూపాలున కంకితము చేయఁబడినది. ఈ కంపభూపాలుఁగూర్చి కొంత యీక్రింద నుదాహరింపఁబడు సంబోధనములవలన దెలిసికొన నగును: —

'శత్రు నిర్భర ! రాయవేశ్యాభుజంగ, రాజకులదీప ఓబళరాయకంప' మోహనమురారి, అహితహృచ్ఛల్ల, రాయచౌహత్తమల్ల, మహితవిభవేంద్ర, కంపకుమారచంద్ర, చండభుజసార మీసరగండకంప, ఓబళయ్యకుమారా, రాయగండరమాళీ, బర్బరబాహ, సాళువబిరుదాంక కంపజగతీనాథా, ఫణిఘోణమల్ల నిరుపమకీర్తి, సన్నుతచాళుకీతిలక సాళువకంపకుమారమన్మథా, సరసోదారకుమారకంపనృపతీ చాళుక్యచూడామణీ, గన్నవసుధాధీశా, పుడమీ (?) శ్వరకొండనృపతిభోగసురేంద్రా, శ్రీపతిపాదాబ్జయుగళసేవకకొండా, సమతనూజా, గోకర్ణ ద, సమరజయకటారిసాళువాంక, గండరగూళికుమారకంపయా,.

పై సంబోధనములం దేతత్కృతిస్వామి చాళుక్యుఁడుగను సాళువవంశ్యుఁడుగను గూడఁ బేర్కొనఁబడెను. అయినను బెక్కుబిరుదములు సాళువవంశ్యులవి యగుటవలన నీతఁడు జైమినిభారతకృతి నందిన సాళువనరసింహరాయలవంశమువాఁ డయియుండునని యూహింపఁజెల్లును. ఈతని తండ్రిపేరు ఓబళరాయలు. 'భీమతనూజుఁడని'యు బేర్కొనబడెను. ఈతఁ డేకాలపువాఁడో తెలియదు. గ్రంథావతరణిక గలప్రతి చిక్కుట లేదు.

(b) దశరథరామచంద్రశతకము.

DAŚARATHARĀMACANDRAŚATAKAMU

Foll. 33*a* to 55*b*. Fol. 56 is left blank

Transcribed from a MS. of B. Satyanārāyana of Vizianagaram in 1911-12.

This is a poem of one hundred stanzas of praise and prayer addressed to Rāma and containing the refrain in each stanza "రమ్యగుణసాంద్ర! దశరథరామచంద్ర". By Vakkalanka Pantayamantri.

Complete in 128 stanzas.

**Beginning:**

సీ. శ్రీజానకీచిత్తసీమాంతరవిహార
నీరజాతాయతనేత్రసార

సారసాప్తపవిత్రసత్కళాధార ని
స్సారసంసారవిదూరధీర
ధీరదైతేయసంహార మాణిక్యకే
యూరభూషితచిదాకార వీర
వీరాధివీర సన్నిగదాకారశ
రీరపూర్ణప్రభాపూర హార

గీ. హీరకర్పూరతారపటీరహార
తారకానిభకీర్తివిస్తార శూర
పోషితమునీంద్ర రఘుకులాంబోధిచంద్ర
రమ్యగుణసాంద్ర దశరథరామచంద్ర.

**End :**

సీ. లాలిత్యముగ వకళాలంకపంతయమంత్రి
రచియించినట్టియారామచంద్ర
శతకంబుగాఁ జేయ సల్పినపద్యంబు
లకనికి మేనల్లుఁడైనపాలె
పాన్వయసంభూతుఁడగు వేంకనాహ్వయుం
డతులితభక్తి సత్యా (?) సురక్తి
ననుకూలముగను జెప్పినభంగి వ్రాసెను
దత్కాలమున సన్నిధానవర్తి

గీ. యాట నసమానలేఖకుఁ డనుచుఁ జూడ
దాశరథియైన నీ కిష్టదైవముగను
నమ్మికొల్చుట నీపాదనళినయుగము
రమ్యగుణసాంద్ర దశరథరామచంద్ర.

* * * *

సీ. గీ. కాను కొసఁగితినంచు దయానుసార
మతిని గైకొని నన్ను సన్మతిగఁ జేయు
మఖిలభోగానురాగమం దాస లేక
రమ్యగుణసాంద్ర ! దశరథరామచంద్ర. ౧౨౮

(వి-వి.)—

సమగ్రము. ౧-౨౮ పద్యములు గలవు. వ్రాఁత నిర్దుష్టము కాదు. గ్రంథపాతములు లేవు.

"రమ్యగుణసాంద్ర దశరథరామచంద్ర" అను మకుటముతో మఱియు సీసపద్యములశతకము వరలంకపంతయమంత్రిచే రచియింపఁబడెను. ఇందు శ్రీరాముని స్తుతియును లోకనీతియును బ్రతిపాదింపఁబడినవి.

---

(*c*) తిట్టుదండకము.

TIṬṬUDAṆḌAKAMU

Foll. 57*a*—58*a*.

Transcribed from a MS. of B. Śēsagiri Rao of Vizianagaram in 1911-12

This contains the curses of a certain Brahmin on one Kastūri Appaya, who is said to have dispossessed him and certain other Brahmins of the lands granted to them by the Pūsapāti kings of Vizianagaram.

Complete.

**Beginning**:

ఉ. శ్రీయుతపూసపాటికులసింధుసుధాకరులైన భూపతుల్
వేయుతరాలనుండి కడువేడ్క నొసంగినయట్టిమాన్యముల్
న్యాయము దప్పి ఘాతకొడిగట్టిన నీకులముఁ యశంబు నీ
యాయువు క్షీణమై చను యథార్థము నమ్ముర కస్తురప్పయా.

* * * *

దండకము. ఛీ ఛీ హుంకారు ఛీ లండి ఛీ మొండి ఛీ కండి.

**End**:

నీకెంతచేటున్నదో కాని భూలోకమం దెన్నఁడున్ లేని దుర్మార్గపాలోచనల్ సంభవించెన్ మఱిన్ నీకు నీసారి యార్నెల్లకే తప్పినన్ ఒకఁడేదాదికిన్ మీఁదుగాకుండ నీచావు నిక్కంబుగా నమ్మనీ బ్రహ్మదేవుండు శంభుండు నీకడ్డమై వచ్చినాఁగాని నా మాటకుం దప్పఁగారాదు ఛీలండి మొండి శిఖండీ గులామా.

(వి-వి.)—

సమగ్రము వ్రాఁత తప్పులు మెండు. గ్రంథపాతములు లేవు.

విజయనగరసంస్థానమునఁ బూసపాటివారు బ్రాహ్మణుల కొసఁగినభూములకుఁ గస్తూరియప్పయ యనునాతఁడు విఘాతము కలిగించుచుండఁగా నెవరో తిట్టుచుఁ జెప్పినదండకము.

(*d*) తాండవనదీమాహాత్మ్యము (?).

TĀNḌAVANADĪMĀHĀTMYAMU (?).

Foll. 59*a*—65*b*.

Transcribed for the Library from a MS. of Rāmacandra Rao of Samalkot in 1911-12.

The name here given was found written on the cover-leaf of the original MS ; and as it contains neither the beginning nor the end of the work, it is difficult to verify its name and to find out the author and the subject-matter. The work contains a description of Piṭhāpuram and the story of a woman who attempts to pluck a fruit from a tree by piling up the corpses of her sons, one above the other, and standing on them

**Beginning:**

సీ. . . . . . . .
. తలఁగకేపురమున నిలిచియుండె
దివిజనాయకసంప్రతిష్ఠితుండై కుక్కు-
టేశ్వరుం డేపీట నిరవుకొనియె
పృథుతరాష్టాదశపీఠంబులకుఁ బెద్ద
పురుహూతికాంబ యేప్రోల వెలసె
పరమపావనమైన పాదగయాక్షేత్ర
మేరాజధానియం దేపుమీఱె
గీ. సేతుకాశీప్రయాగాద్యశేషదివ్య
తీర్థరాజంబు లట్లు ప్రతిష్ఠ గాంచె

నేమహాపట్టనం బది యెన్న నలరు
భువనసారంబు పీఠికాపురవరంబు.
సీ. వివిధశాస్త్రపురాణవేదవేదాంతసం
విదులై ప్రకాశించువిప్రవరులు

ఉ. అంతనికుండమానవవరాగ్రణిచేడియ తత్ప్రికార మా
ద్యంతముపీనుల న్విని రయంబున నాహవభూమి కేంతయుఁ
వంత దలిర్ప నేఁగి కదనస్థలిఁ ద్రెళ్లినప్రాణనాయకుఁ
బంతిగఁ దూలి యున్నసుతవర్గముఁ గన్గొని శోకమగ్నయై.

**End:**

వ. అప్పుడు పాలంతి నితాంతజరరానలసంతప్తసకలావయ
వయగుచు సమీపంబునం బడియున్న పుత్త్రికు నాకరానిం దెచ్చి
వైచి యెకిరి యందుకొనం బోయునఁ దత్ఫలం బందక యంతరంబు
గలిగి యుండె నట్లు క్రమంబునఁ బుత్త్రిశతంబు సోపానవద్ధతిం
గావించి కోయంబోవుచున్న నది యెప్పటియట్ల యందకున్న
నత్యంతదీనాననయై కన్నుల నశ్రుకణంబులు రాల నేమియుం
దోఁచక చికాకుపడి ఫలం బెగదిగం జూచుచున్న సమయంబున.

(ఓ-వి.)-—

మొదలు లేదు. చివగ లేదు. అల్పభాగమే కలదు. వ్రాఁత
నిర్దుష్టముగాదు.

ఉపలబ్ధమగు నేరద్గ్రంథైకదేశమున గ్రంథనామము లేదు;
కాని, యీ ప్రతికి మాతృకయగు ప్రతి ముఖపత్రమునఁ దాండవనదీ
మాహాత్మ్యమని పేరుకలదు. ఇది యెవ్వరిచే రచింపఁబడెనో
గుర్తింపరాదు. పితాపుర మిందు వర్ణింపఁబడినది. ఇంతకంటె
నీగ్రంథమునుగూర్చి యెఱుఁగఁదగినవిషయ మగపడదు.

## R. No. 106.

Paper. 11 × 8¾ inches. Foll 90. Lines, 18 in a page. Telugu. Good.

Transcribed from a MS. of P Laksmayyagāru of Guntur in 1911–12.

పట్టాభిరామవిలాసము.

PAṬṬĀBHIRĀMAVILĀSAMU.

Same as the work described under R. No. 16 *ante*.

Complete.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత తప్పులు మెండు. స్థూలదృష్టిని గొన్ని దిద్దఁబడినవి. గ్రంథపాతములు లేవు.

ఇది నెం 16 రున వర్ణితమగు గ్రంథమేకాని వేఱుకాదు.

## R. No. 107.

Paper. 11 × 8¾ inches. Foll 20. Lines, 18 in a page. Telugu. Good.

Transcribed from a MS of B Śēsagiri Rao of Vizianagaram in 19 1-12.

శృంగారామరుశతకము.

ŚṚṄGĀRĀMARUŚATAKAMU.

This is a Telugu rendering of the 100 stanzas of the Sanskrit Amaruśataka By Tiruvēngalappa, son of Tāḷḷapāka Vēnkatēśadīksita. Each stanza has a small introduction in prose There is another Telugu rendering of this Sanskrit work in the Library.

Complete.

**Beginning:**

ఉ. శ్రీరుచిరాంగనాశ్రమవిచిత్రవిభూషణనూనచందనో
దారవిలాసదీక్షితము నై యసితోత్పలకాంతి మించి శృం
గారరసంబు దోఁచె ననఁ గన్నులపండువు నైన మేనియొ
య్యారముఁ జూపు వేంకటనగాధిపుఁ డీవుత మాకుఁ గోరికల్.

వ. శృంగారరసప్రధాన మమరుకకావ్యము. శృంగారము సంభోగము, విప్రలంభము నని రెండువిధములు. అందులో సంభోగశృంగారము మొదలగా నుద్యోగించి శృంగారరసానకు ఆలంబనవిభావమైన నాయికాస్వరూపమునే దేవతగా భావించి తృతీయపురుషార్థమును గూర్చి ఆశీర్వచిస్తున్నాఁడు.

చ. చెదరి చలించుముంగురులు, స్వేదకణంబుల నింతజాఱు బొ
ట్టొదవు రతాంతకాంతిమెయి నొయ్యన సోలెడుకన్నుఁదామ [రల్
కదలెడుకుండలంబులను గల్గిన పౌరుషభాసమానయౌ
ముదితముఖారవింద మతిమోదము మీకు నొసంగుఁ గావు [తన్.

**End:**

వ. నాయికాపాదతాడితుండైన నాయకుఁడు మదనదేవునకుఁ బ్రియుఁడని కావ్యాంతమందుఁ గవీశ్వరుడు మంగళాచరణమును జేస్తున్నాఁడు:—

ఉ. యావరసార్ద్రమైఁ గసలయారుణకోమలమై వినూత్నర
త్నావళినూపురంబును ననాదాలసభావము నొప్పంబుచే
నేవరపూరుషుండు ప్రణయేర్ష్యఁ బరాంగనచేతఁ దాడితుం
డై విలసిల్లు వాఁడు కుసుమాయుధదేవునకుఁ బ్రియుం డగున్.

క. ఇలఁ దాళ్లపాక సత్కుల
తిలక శ్రీవేంకటేశదీక్షితసుతుఁడు

జ్జ్వలకవితానిధి తిరువేం
కళయప్ప యమ్మృగము (ప్ప యమరుకము)? తెనుఁగు
[గా విరచించెన్.

క. శ్రీతిష్ఠె నాచంద్రార్క
స్థితి మించఁగఁ దాళ్లపాకతిరువేంగళదీ
క్షితుఁ డమరుకము వేంకట
పతికి సమర్పణముగాఁగఁ బరువడిఁ జేసెన్.

శ్రీ కృష్ణార్పణమస్తు.

తుదఁ బ్రతివిలేఖకునివ్రాఁత యిట్లున్నది :—

చ. హరి నిజజన్మకర్మచరితామృతపానమొనర్చు దాసులన్
బరమపదంబుఁ జేర్చుటకుఁ బల్మఱు ధాత్రి జనించెఁ గాక దు
స్తరబలగర్వకంటకనిశాచరకాననముల్ దహింపఁ ద
త్తరకమలాంతరోజ్జ్వలసుదర్శనవహ్నికణంబు చాలదే!

గీ. వ్రాసెఁ గాళయుక్తి వైశాఖబహుళాష్ట
మీందువాసరంబునందుఁ బొన్న
పాటి శేషమంత్రిప్రతినున్నగతిని గొం
గాళరామచంద్రకవి ముదమున.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత తప్పులు లేవు. గ్రంథపాతములు లేవు.

అమరుకకవిచె సంస్కృతమున రచియింపబడిన శృంగారపద్య శతకమున కిది తెలిఁగింపు. తాళ్లపాక వేంకటేశదీక్షితుని కుమారుఁడు తిరువేంగళప్పచే రచియింపఁబడినది. ఇందుఁ బ్రతిపద్యమునకు వచనమున నవతరణిక కలదు. ఈ యమరుశతకమునకే వేఱొకకవిచేఁ జేయ బడిన తెలుఁగుసేఁతయు నీ పుస్తకభాండాగారమునఁ గలదు.

## R. No. 108.

Paper 11 × 8¾ inches. Foll 27. Lines, 19 in a page. Telugu Good.

Transcribed from a MS. of B Satyanarayana of Vizianagaram in 1911-12.

### కుక్కుటేశ్వరశతకము.

### KUKKUṬĒŚVARAŚATAKAMU

A hymn of 100 Sīsapadyas in praise of Kukkutēśa, this being the name of Śiva as worshipped at Piṭhāpuram in the Godavari district · by Kūcimañci Timmakavi

Contains stanzas 1 to 92

**Beginning:**

సీ. శ్రీకరధవళాంగ శ్రితజనావనసంగ
కరనివిష్టకురంగ పురవిభంగ
తరణీచంద్రగతాంగ ధరణీతలశతాంగ
విదళితానంగ గోవృషతురంగ
వలయీకృతభుజంగ విలసితఖట్వాంగ
ధృతనభోగంగ వార్నిధినిషంగ
మునిమనోంబుజభృంగ ఘనసమరాభంగ
యతిదయాపాంగ పుణ్యాంతరంగ

గీ. శైలజాసంగ నీకొక్కశతక మిపుడు
కూర్చి యర్పింతుఁ గైకొమ్ము కోర్కె లిమ్ము
భూనుతవిలాస పీఠికాపురనివాస
కుముదహితకోటిసంకాశ ! కుక్కుటేశ !

*          *          *          *

సీ. గురుతరకౌండిన్యగోత్రపవిత్రుండ
గంగనమంత్రిశేఖరునిసుతుఁడ
కూచిమంచ్యన్వయాకూపారచంద్రుఁడ
వితతతావకకృపావిత్తణాప్త

సత్కవితామహాసామ్రాజ్యభారధౌ
రేయుఁడ బుధజనప్రియసచివుఁడ
ఘనదెందులూరిలింగనగురూత్తిమదత్త
సారశైవాచారసంగ్రహుఁడను

గీ. తిమ్మకవిచంద్రుఁడను నేను తివిరి నీకు
శతక మొనరింతుఁ గైకొమ్ము సంతసమున
భూనుతవిలాస! పీఠికాపురనివాస!
కుముదహితకోటిసంకాశ! కుక్కుటేశ!

**End:**

సీ. అన్నంబు నాలుక కరుచియై కన్పట్టు
గలచినచో నీళ్ళు నలవిగాదు
మనుజేంద్రుతో నైన మాటాడ నైపడు
పనులయందేమియు మనసులేక
నడచుచో నడుగులు తడబాటు గైకొను
దగఁబండువులనైన నగవుగాదు
తెవులుపుట్టినరీతి దేహంబు కృశియించుఁ
గలనైన నిద్దుర కలుగఁబోదు

గీ. శివశివా! ధాత్రిఁ దా వలచినవధూటిఁ
బాయునెడ వడ్డసు మ్మెట్టిపలువకైన
భూనుతవిలాస! పీఠికాపురనివాస!
కుముదహితకోటిసంకాశ! కుక్కుటేశ!

(వి-వి.)—

అసమగ్రము. ౯౦ పద్యములు మాత్రమే కలవు. వ్రాఁత నిర్దుష్టము కాదు. గ్రంథపాతములు లేవు.

"భూనుతవిలాస! పీఠికాపురనివాస, కుముదహితకోటి సంకాశ! కుక్కుటేశ!" అను మకుటముతో ముగియు సీసపద్యములు గల యీశతకము కూచిమంచి తిమ్మకవిచే రచియింపఁబడి

నది. పిఠాపురమున వెలసిన కుక్కుటేశ్వరస్వామి యను శివుని పేరనున్న యీశతకమునపద్యములు లోకనీతి, స్తుత్యాత్మకములుగా నున్నవి.

---

## R. No. 109.

Paper. 11 × 8¾ inches. Foll 32. Lines, 20 in a page. Telugu. Good.

Transcribed from a MS. of K R V Krsna Rao Bahadur of Cocanada in 1911-12.

(*a*)కృష్ణలీలావిలాసము.

KṚṢNALĪLĀVILĀSAMU.

Foll 1*a*—23*b*

This work, as found herein, has neither the beginning nor the end. The portion contained in the MS narrates the story of the marriage of Krsna and Rukmini. The work is a compilation and is mostly made up of stanzas culled from various ancient works coming down to Vijayavilasa Some of the stanzas are perhaps composed by the compiler himself.

**Beginning**:

క. శ్రీకర ! దుష్టమదాసుర
భీకర ! సురవిసరవినుతపృథుతరగుణర
త్నాకర ! కటకీకృతద
ర్వీకర ! కరుణాంతరంగ ! వృషభతురంగా.

వ. అవధరింపుము,

క. ఆలోపల నేతమున
నాలోలవిశాలనేత్ర యగురుక్మిణి త
న్నాలోకలోచనుఁడుహరి
యాలోకముచేసె కదియఁ డని శంకితయై.

**End:**

సీ. తనుకాంతిగ్రమ్మిన వనభూజములుచుట్టు
తళుకుమే లపరంజితరువులుగను
దరువులపై బ్రాలు మెఱుగారుకూపులు
కాటుకరేఖలఁ గలయఁబర్వఁ
గాటుకరేఖలఁ గ్రమ్మిముద్దులచిన్ని
నవ్వు వెన్నెలతేట నివ్వటిల్ల
వెన్నెలతేటపై వెడచల్లు నట్టులు
హస్తపల్లవకాంతు లలమికొనఁగ

గీ. మదన సామ్రాజ్య లక్ష్మి దా నదను దెలిసి
చైత్రుఁ డత్యంతసంతుష్టి చిత్ర . . .

* * * *

సీ. గీ. కాక యిటువంటి శోభనకాంతి మోహ
నాంగవైఖరి సౌందర్య మరయ నరిది
కూడఁ జూడంగ మఱియును జోద్య మగుచుఁ
గానవచ్చెడు వీని శృంగారమహిమ.

(వి-వి.)—

అసమగ్రము. మొదలు లేదు తుది లేదు. వ్రాఁత నిర్దుష్టము కాదు. గ్రంథపాతములొండు రెండు గలవు.

కృష్ణ లీలావిలాసమను నీగ్రంథ మొకకవిచే రచింపఁబడినది కాదు. విజయవిలాసాది ప్రబంధములవఱకును గల ప్రాచీన ప్రబంధములందలి మంచిమంచి పద్యముల నేర్చి యెవరో ప్రబంధముగా సంధానించిరి. ఎడనెడ సంధాయకుని పద్యములు గూడ నుండిన నుండఁబోలును. ఇన్ని యాశ్వాసములుగా నిది విభక్త మయ్యెనో గుఱుతింపరాదు. ఉపలబ్ధమగు నీ గ్రంథైకదేశమున రుక్మిణీకృష్ణుల పరిణయకథ కలదు.

ఈ గ్రంథము తర్వాత నేఁడు పుటలలోఁ గొన్ని చాటుపద్యములు గలవు.

(b) సూర్యవంశాగ్రణీశతకము.

SŪRYAVAṀŚĀGRAṆĪŚATAKAMU

Foll. 28b–31b

A hymn of 100 stanzas in the Mattēbha and Śārdūla metres in praise of Rāma of the solar race of kings. The name of the author is not known. All the stanzas end with the same refrain.

Contains the first 32 stanzas

**Beginning :**

శా. శ్రీధాత్రీతనయామణీహృదయరాజీవ ప్రియాకార భ
క్తాధీనాత్మవిహార సత్కలితవ్యాహారనీహారతా
రాధీశ స్ఫటికాబ్జచందనసముద్యత్కీర్తి విస్తార లో
కాధారా! రఘువీర! రామ! రఘువర్యా! సూర్యవం
[శాగ్రణీ!.

**End :**

శా. విధ్వస్తారిచయాత నేత్ర! బంధురధనుర్విద్యాసు లీలామహా
గ్రధ్యానామ (?) నిషంగ నిర్దళిత గీర్వాణద్విషద్గాత్ర! పా
పధ్వాంతాంబుజమిత్ర! నీలజలదాభప్రస్ఫురద్గాత్ర ధ
ర్మాధ్వారూఢచరిత్ర! రామ! రఘువర్యా! సూర్యవంశా
[గ్ర !

(వి.-వి.)—

అసమగ్రము. ముప్పదిరెండు పద్యములు మాత్రమే కలవు. వ్రాఁత యొకమాదిరిగా నున్నది. తప్పు లంతగా లేవు. గ్రంథపాతములు లేవు.

" రామ! రఘువర్యా! సూర్యవంశాగ్రణీ" అనుమకుటముతో ముగియు మత్తేభశార్దూల వృత్తములు గల యీశతక మెవరిచే రచింపఁబడెనో తెలియదు. ఇందలి పద్యములు శ్రీరామస్తుత్యాత్మకములు.

## R. No. 110.

Paper. 11 × 8¾ inches Foll. 132 Lines, 18 in a page. Telugu. Good.

Transcribed from a MS of Śistlā Hanumat Śāstri of Guntur in 1911-12.

కుబ్జాకృష్ణవిలాసము.

KUBJĀKṚṢNAVILĀSAMU.

Foll. 1*a*—126*a*

This is a Prabandha in four Āśvāsas describing how Kṛṣna by his divine powers transformed a hunchback into a handsome lady and then married her The author of the work is Akkana-Pregada Haridāsa, son of Rāyanamantri, and it seems to have been composed in 1841 A.D

Complete.

**Beginning:**

శా. శ్రీమద్భూమితనూభవాకుచయుగ శ్రీగంధ కాశ్మీరరే
ఖామందారుణపంకచిహ్నితలసత్కందర్పపీఠోపమా
సామీచీన్యవిశాలవక్షుఁడు మహాసామ్రాజ్యుఁడౌ జానకీ
రామప్రాణవిభుండు నాకొసఁగు నశ్రాంతంబు సౌభాగ్య
[ముల్.

* * * *

సీ. జగతియం దకరన ప్రెగడాన్వయంబున
సారిది నాపస్తంబసూత్రమునను
కౌండిన్య గోత్రసంకలితుఁడై జనియించె
శేషప్ప యను బుధశ్రేష్ఠుఁ డతని

సతి పుణ్యవతి పతివ్రత సుందరాంగియు
నైనట్టి సావిత్రమాంబగర్భ
జనితులై యిద్దఱు తనయులు సంతతా
మోదులై కడుశాంతమూర్తులగుచు

గీ. సకలవిద్యలలో నెల్ల సభలయందు
మాన్యుఁడై నట్టి రాయనమంత్రివరుఁడు
మేరుపర్వతమును బోలు ధీరబుద్ధి
రన్యుఁడై యొప్పుచున్నట్టి రామఘనుఁడు.

గీ. వార లిరువురిలో
. . . . రాయన మంత్రివరుఁడు.

క. రయమున నన్నాప్రెగడా
న్వయుఁడగు కృష్ణాఖ్యమంత్రి వరసుత సుగుణో
చ్చయశీల సీతమాంబను
బ్రియసతిగాఁ బెండ్లియాడెఁ బెంపుదలిర్పన్.

క. అమ్మానవతియుఁ బతికి హి
తమ్ములు సల్పుచుఁ బతివ్రతా మణియనలో
కమ్మున నుతి కెక్కెను నా
నెమ్మిగ బహుసద్గుణముల నెగడుటవలనన్.

సీ. అట్టి సత్పాత్రులైన రాయనమంత్రి
కిని సీతమాంబకు ఘనత వెలయ
జనియించినారము తనయుల మిరువుర
మార్యు లెల్లను గృప నాదరింప
వరపిచ్చయామాత్యు హరిదాసుఁ డన నేను
నతిసుగుణుఁడు భుజంగాహ్వయుఁడనఁ
బరఁగుచు నున్నమాయిరువురిలోపల
సుజనహితుం డగ్రజుండు నైన

గీ. నన్నుఁ గరుణించి జానకీనాయకుండు
బాల్యముననుండి తన దివ్యపదసరోజ
భక్తిధనము కవిత్వ సంపద యొసంగెఁ
గాన నప్పటినుండి నేమానసమున.

*   *   *   *

వ. ఇట్టి నాచేత విరచితంబైన తత్ప్రబంధ సామ్రాజ్య పట్టాభిషేకుండగు శ్రీరామచంద్రునకు నంకితంబుగా వక్ష్యతంబులు రచియించెద.

**End:**

మాలిని. దశరథనృపపుత్రా తాపసాజ్ఞాతమిత్రా
నిశిచరగణజైత్రా నీలజీమూతగాత్రా
కుశలకరచరిత్రా కోవిదాగణ్య చైత్రా
శశిధరధరమిత్రా జానకీసత్కళత్రా.

**Colophon:**

ఇది శ్రీభద్రాచల సీతారామచంద్ర వరప్రసాదలబ్ధ కవితాపి చిత్ర, అకెల్ల ప్రెగడరాయన మంత్రి పుత్త్ర శుభగుణవికాస, హరిదాస విరచితంబైన కుబ్జాకృష్ణ విలాసం బను శృంగారకావ్యంబునందు సర్వంబును జతుర్థాశ్వాసము సంపూర్ణము

గ్రంథాంత మం దిట్లు కలదు:—స్వస్తి శ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవర్షంబులు ౧౭౬౪ అగు నేటి ప్లవనామ సంవత్సర శ్రావణ శు ౧౫ ల వరకు అకెల్ల ప్రెగడ పిచ్చయాఖ్య హరిదాసు రచియించిన కుబ్జాకృష్ణవిలాసము నాలుగు ఆశ్వాసములు సంపూర్ణము.

సాధారణనామ సంవత్సర అధిక వైశాఖ శుద్ధ ౧౦ ఆదివారము వఱకు, అకెల్ల ప్రగడ శ్రీహరిదాసు రచియించిన కుబ్జాకృష్ణ విలాసంలో వున్న క్రమానను కొలిపాక వెంకటప్ప శ్రీగోవిందార్పణంగా కుబ్జాకృష్ణ విలాసము నాలుగాశ్వాసాలు శ్రీసాంబశివార్పణంగా వ్రాసుకొనెను,

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత తప్పులు మెండు. గ్రంథపాతములు లేవు.

శ్రీకృష్ణుఁడు కురూపయగు కుబ్జను సుందరరూప నొనర్చి ప్రేమించు కథ కుబ్జాకృష్ణవిలాస మను పేరుగల యీప్రబంధమున వర్ణింపఁబడినది. గ్రంథకర్త యఱ్ఱెన్నపెగడ హరిదాసకవి. ఈయన మంత్రికొడుకు. గ్రంథము నాల్గాశ్వాసములు గలది. విశేషముల కుదాహరింపఁబడిన పద్యములఁ జూచునది.

గ్రంథావసానమునఁ బదుమూఁడు పుటలందు భాగవతమందలి సాత్రాజితీపరిణయకథయు, దక్షిణామూర్త్యష్టకమును (టీకతో) గలవు.

---

## R. No. 111.

Paper 11 × 8¾ inches. Foll. 98. Lines 20 in a page. Telugu. Good

Transcribed from a MS. of Addēpalli Rāmaśēsayya of Repalli in 1911-12.

పరతత్త్వరసాయనము.

PARATATTVA RASĀYANAMU.

This is a work on Vēdānta and Yōga and consists of five chapters; the subjects treated of in them are given below in the Telugu remarks. The author of the work is Phanibhatta, son of Īśvarabhatta of the Īśvara family and of Āpāstambasūtra and Gārgyagōtra, and a disciple of Sadānandāvadhūta to whom the work is dedicated. The source of the work is said to be the teachings given by Bhīsma to Yudhisthira, as based on the conversation between Hara and Sanatkumāra in the Mahābhārata. But in this work the teachings referred to above are not traceable to the conversation between Hara and Sanatkumāra. It has to be noted that the author mentions Nannaya, Tikkana, and others as ancient Telugu poets.

Complete.

**Beginning:**

శా. శ్రీకైవల్యరమావివాహ . . . . . ంబుభూషాళిగా

. . . ల్బుబ్రహ్మము దయాస్వాంతుండు నిత్యంబుదా
నా కిష్టార్థ మొసంగు గావుత సదానందాదిదేవుం డిలన్.

శా. హస్తం బొక్కటఁ బట్టి యొక్కటఁ గుచ మన్యం బాత్మతుండా [గ్రవి
న్యస్తప్రౌఢిమ దుగ్ధముల్ గొనుచు దివ్యామోద మామో [దకం
బస్తోకాకృతి మెక్కుచుం జనని నాహ్లాదించు విఘ్నేశుఁడీ
ప్రస్తోతవ్యమదీయకావ్యమున కాపాదించు నిర్విఘ్నమున్.

సీ. ప్రథమకవిత్వహేవాకిని వాల్మీకి
భారతాదికథావిభాసు వ్యాసుఁ
గావ్యత్రయీప్రవికాసుఁ గాళిదాసు
హరికథాదళితమహాఘు మాఘు
వివిధప్రబంధవాగ్విశ్రాము బాణుని
సారార్థవిజ్ఞానధీరుఁ జోరు
నఖిలవిద్యామనోహారు మయూరుని
సన్నుతకవివర్యు నన్నపార్యు

గీ. తిక్కయజ్వాదిపూర్వప్రథితకవుల ను
తించి యేతత్కవీంద్రుల నెంచి భావి
కావ్యకరులఁ బహూక్రియాకలన నుంచి
ఫణితి చేసెద నొకకృతి పుణ్యనియతి.

* * * *

వ. అని యభీష్టదేవతానుస్మరణంబున . . . .
. . . సద్గురుకరుణావిశేషంబున నే రచియింపఁబూనిన

యొక్క మహాప్రబంధరాజంబున కధీశ్వరుండైనశ్రీసదానందావధూత
గురువర్యు నభివర్ణించెద.

సీ. గీ. ఏమునీంద్రుని కరుణామయేక్షణంబు
లాశ్రితాఘౌఘరోగరసాయనంబు
లాతఁ డలగ సదానందయతి యనంగ
నవనిఁ జెంపొందు భువనత్రయంబుఁ బొగడ.

* * * *

వ. ఇట్టి మహాపుణ్యచరిత్రుఁడైనయవధూతపతి యొక్క
నాఁడు——

సీ. గీ. తనదుసల్లాపరుచి పార్శ్వజనులధృతుల (?)
దప్పి దీర్పంగ వేంచేసెఁ దగ మదీయ
మందిరంబున కలసదానందమౌని
విభుఁడు మత్పూర్వభవపుణ్యవిభవమునను.

క. వచ్చినమునిఁ గని నామది
పెచ్చు పెఱుఁగ ప్రొక్కి భక్తి, వినయము, హర్షం
బచ్చుపడఁగ నర్ఘ్యాదుల
విచ్చలవిడిఁ బూజచేసి వివిధాన్నంబుల్.

వ. నైవేద్యంబిడి తాంబూలం బొసంగి వివిక్తస్థలంబున సుఖోపవిష్టుండైన యతనిచరణారవిందంబులకుఁ బునఃపునఃప్రణామంబులాచరించి హస్తంబులు మొగిడ్చికొని వినయవినమ్రదేహుండనై తత్పాదపద్మంబులకయిం జూడ్కి నిలిపి భయభక్తితాత్పర్యంబులతోడ నేకపార్శ్వంబున నొదిగి యున్న నన్నుం గరుణారసపూరితకటాక్షవీక్షణంబుల నిరీక్షించి సాదరంబుగా మెల్ల రమ్మని పిలిచి సమీపంబునఁ గూర్చుండ నియమించి దీనాభయదానప్రశస్తుండైన

తనదివ్యహస్తంబు మన్మస్తకంబుపై నిడి యభయంబొసంగి మదీయపూర్వభవసంచితపుణ్యఫలం బెట్టిదియో యెఱుంగ నత్యద్భుతంబుగా సకలవేదాంతసిద్ధాంతంబైన యద్వయబ్రహ్మవిద్యారహస్యంబుపదేశించిన నేనత్యాశ్చర్యరసావేశపులకితతనుండను హర్షాశ్రుపూరితనేత్రుండనై పాదంబుల కెఱఁగిన సతికృతార్థుండవు గమ్మని దీవించి యథేచ్ఛ నేఁగె నాఁటనుండియు.

సీ. కర్ణరంధ్రంబు లాఘనునిపలుకాలించు
చవిబొంది యొకవంక జరుగ వెపుడు

. . . . . . . . .

నాదుసర్వేంద్రియము లాత్మనాథుఁ బొంది.

వ. ఇట్లు పరమేశ్వరుండైనసదానందగురునియందలి భక్తి దినదినప్రవర్ధమానం బగుచుండె నర్థప్రాణమనఃకాయంబు లతనిం జేర్చి వాగ్వ్యాపారంబు వృథగాకుండ నొకకృతి రచియించి యర్పించెద నని తలంచి మద్గురునాథసంపూర్ణకరుణావిశేషంబున.

*　　　*　　　+　　　*

వ. ఇట్లు విరచింపఁబూని మదీయవంశావతారం బభివర్ణించెద.

క. శ్రీకరకవిత్వవిద్యా
సాకల్యం బఖిలశాస్త్రచతురము నిగమ
వ్యాకీర్ణ మీశ్వరాన్వయ
మాకల్పయశోభిరామమై ధర వెలయున్.

వ అందు—

సీ. సురుచిరాపస్తంబసూత్రుఁడీశ్వరవంశ
పాత్రుండు గార్గ్యసగోత్రుఁ డఖిల
వేదశాస్త్రపురాణవిఖ్యాతుఁ డభినవ
వ్యాసుండు సద్యశోభాసురుండు

ఫణిపతిభట్టనఁ బ్రఖ్యాతుఁ డతనికి
లక్ష్మమ్మ యను శుభలక్షణాంగి
పరమపాతివ్రత్యగరిమచే గిరిజాత
యన నుతిగన్న యయ్యతివ పత్ని

గీ. వారి కుదయించి రఖిలవిద్యారసజ్ఞు
లైన వేంగళభట్టు, సూరార్యుఁ డనఘుఁ
డైన గరుడాద్రిభట్లన నాత్రిమూర్తు
లందుఁ బూర్వజుఁడగు వేంగళార్యమౌళి.

క. అతనిసతి యన్నదాన
వ్రతయుక్తి హితార్థిబంధువర్గసమగ్రా
దృతి పత్యనురక్తియుఁ గల
యతిసద్గుణ కొండమాంబ యలరు ధరిత్రిన్.

క. ఆదంపతులకుఁ బుట్టెను
మేదిని వెలుఁగొందు విబుధమిత్రుం డనఁగా
వేదవిదుం డీశ్వరభ
ట్లాదరమున నగణులందు నగ్నియపోలెన్.

గీ. విద్యలకుబ్రహ్మ ప్రావీణ్యవిభవమునకు
విష్ణుఁ డమలత కీశుండు వేదవిత్త్వ
మున కలవసిష్ఠుఁ డగు జ్ఞానమునకు గురుఁడు
వక్తృత కహీశుఁ డీశ్వరభట్టు జగతి.

గీ. అతని కొసఁగెను దోర్బలచతురుఁ డనఘుఁ
డమలవాధూలగోత్ర తిరుమలభట్టు
లఖిలవిదుఁ డలలక్ష్మమ్మయందుఁ గనిన
కన్య రామమ్మ నధికసౌజన్య నెలమి.

క. ఆమిథునమునకుఁ బుట్టి
మేము త్రిమూర్తులును బోలె నిల ముప్పురము
ద్దామయశుఁడు గొండయ శో
భామణి నారాయణయ్య ఫణిపతి యనఁగన్.

గీ. అందుఁ బూర్వుండు కొండుభట్లఖిలయంత్ర
మంత్రతంత్రోద్ధరణుఁ డాగమములఁ బూర్ణుఁ
డతని కనుజుండు నారాయణార్యుఁ
. . . . కవివినుతుఁడు.

క. ఆయిరువుర కనుజన్ముఁడ
నాయత గురుసేవనాగతాద్వయవిద్యా
ధీయుతుఁడ నుభయకవనో
పాయుఁడ ఫణి . . . .

* * * +

క. . . . . . కీర్తివి
హారికి సత్కృత్తకలుషహారికి భువనో
ద్ధారికి ధీరమనోవ్యా
పారసదానందగురు విభాధారునకున్.

వ. సమర్పితంబుగా నాయొనర్ప బూనిన పరతత్త్వరసాయనం
బను మహాప్రబంధమునకు గథాక్రమం బెట్టిదనిన.

**End:**

కాంతి. పంచభూతవిభ్రమ ప్రపంచకల్పనాదికో
దంచితక్రియానుకూలహర్షమూర్తిధారిన
క్తంచరారి శౌరిసూరి కల్మషాపహారిని
ర్వంచితాత్మభక్తముక్తి వర్ధనాఢ్యసత్కృపా !

మాలిని. సకలభువనరక్షా సజ్జనానందదక్షా
సకలుషరిపుశిక్షా సర్వలిక్షాణదీక్షా

ప్రకటసుగుణపక్షా భక్తదాక్షిణ్యవీక్షా
స్వకసుఖదదిదృక్షా సర్వభక్తౌఘమోక్షా

**Colophon :**

ఇది శ్రీమదద్వయబ్రహ్మవిద్యాగహనస్వావబోధననిపుణతాధురీణ సాక్షాన్మహేశ్వరశ్రీసదానందసద్గురురాయపట్టభద్రకరుణాతరంగిణీ రంగత్తుంగాభంగతరంగహేలాందోళితహంసడింభాయమానేశ్వరాన్వయసంభూతేశ్వరభట్టతనూజఫణిభట్టప్రణీతంబైన పరతత్త్వరసాయనంబను మహాకావ్యంబునందు రాజయోగవిచా . . . క్షత్రియలక్షణంబును రక్షాచార్యమహత్త్వసంకీర్తనంబును ఉన్మన్యవస్థాలక్షణంబును పంచ . . . అమనస్క-విధంబును, యోగసిద్ధుని వృత్తులు నను వార్తలం గలుగు రాజయోగ ప్రకరణంబు పంచమాశ్వాసము సర్వము సంపూర్ణము.

(వి-వి.) —

సమగ్రము. వ్రాఁత తప్పులు గలవు. మాతృకలోని గ్రంథపాతము లిందును జేరినవి. ఈ గ్రంథపుఁదుదియాశ్వాసమున కీపుస్తకశాలలోఁ బ్రత్యంతరము కలదు.

పరతత్త్వరసాయన మను పేరుగల యీ వేదాంతగ్రంథమీశ్వరాన్వయుఁడగు ఫణిభట్ట రకునిచే రచియింపఁబడినది. భారతేతిహాసమున భీష్ముఁడు ధర్మరాజున కుపదేశించినట్లుండు హరసనత్కుమారసంవాదమే యిట్లు ప్రబంధముగా రచియింపఁబడినట్లు కవి చెప్పికొన్నాఁడు. శ్రీసదానందావధూతస్వామి యేతత్కృతిస్వామి. గ్రంథకర్త కీయవధూతస్వామి గురుఁడు. ఆశ్వాసాద్యంతములం దీయవధూతస్వామి వర్ణనము చేయఁబడుటయే గాక గ్రంథము నడుమను గూడ గురునిఁ గూర్చిన ప్రస్తావము వచ్చునెడ శ్లేషభంగిచేఁ దద్వర్ణనము కావింపఁబడినది. ఈగ్రంథ మైదాశ్వాసములుగలది.

ప్రథమాశ్వాసమున కర్మయోగప్రకారము, ద్వితీయాశ్వాసమున అనాత్మవివేకము, తృతీయాశ్వాసమున ఆత్మవివేకము, చతు

ర్థాశ్వాసమున యోగత్రయలక్షణము, పంచమాశ్వాసమున రాజ యోగప్రకారము వివరింపఁబడినవి.

ఈగ్రంథకర్త యాంధ్రకవీశ్వరులలో నన్నయతిక్కనలను బూర్వప్రథితకవులఁ బేర్కొనెను. ఒక్క తిక్కననే గాక 'తిక్కనాది' యని మఱికొందఱనుగూడఁ గూర్చి చెప్పుటచేఁ దిక్కనకుఁ దర్వాత మఱి కొంతకాలమునకు వెలసినవాఁడయి యుండునని యూహింపఁదగును.

ఆపస్తంబసూత్రము, గార్గ్యసగోత్రమును, గల యాశ్వరాన్వయమున ఫణిపతిభట్టు జనించె. అతని భార్య లక్ష్మమ్మ. వారిర్వురకు వేంగళభట్టు, సూరార్యుఁడు, గరుడాద్రిభట్టు అనువారు మువ్వురు పుత్త్రులు జనించిరి. అందు వేంగళార్యునకుఁ గొండమాంబ భార్య- వారిర్వురకు నీశ్వరభట్టను కుమారుఁడు గలఁడు. అతనికి వాధూల గోత్రుఁడగు తిరుమలభట్టారకుని కుమార్తె రామమ్మ భార్య యయ్యెను. వారిర్వురకుఁ గొండయ నారాయణయ్య ఫణిపతి యనువారు కొడుకులు- అందు మూఁడవవాఁడగు ఫణిభట్టారకుఁడే యేతత్కృతికర్త- విశేషములకుఁ బైనుదాహృతములగు పద్యములఁ జూచునది.

## R. No. 112.

**Paper.** 11 × 8¾ inches. Foll 122. Lines, 18 in a page. Telugu. Good

Transcribed from a MS. of B. Satyanarayana of Vizianagaram

మహాభారతకూలంకష (ఉద్యోగపర్వము).

MAHĀBHĀRATAKŪLAṄKAṢA (UDYŌGAPARVAMU).

Foll. 1*a*-111*b*

This contains a commentary on the Udyōgaparva of the Telugu Mahābhārata of Nannayabhaṭṭa and others. The commentary is

called Kūlankasa; and the commentator is Lakṣmīpati, son of Lakṣmīnrsimha and Sūrama

Complete in four Āśvāsas

**Beginning:**

శ్రీగౌరులకు ప్రియుడౌ, . . పటుయోగానకు ఆశ్రయమైన వాడౌ, తీగ వలెనే యొప్పుచున్న దేహము గలవాడౌ 3. యద్వా, శ్రీగౌరపల్లవపుటయోగాశ్రయమంజరీసముజ్జ్వలమూర్తి. అనిన్ని కలదు. శ్రీగౌరులు అనే రెండు దళములు గల చిగురుయొక్క యోగానకు ఆశ్రయమైనది గనుకనే తీగవలె ఒప్పుచున్న దేహము గలవాడౌ.

**End:**

అపరిమిత=తెలియబడ్డ రహస్యమునుయున యమనియమాసన ప్రాణాయామప్రత్యాహారధ్యానధారణసమాధులు అనే అష్టాంగముల సమ్యక్ప్రకారమందు వేడుకగల గురువుయొక్క కరుణావిస్తారముచేత గాఢశాంతియందు అభిముఖమయిన మనఃపద్మమందు ప్రకాశించుచున్న విజ్ఞానసారానకు అవ్యవహితమైన పరమానందానుభవమే యేకరూపముగా గలవాడా!

**Colophon:**

ఇది శ్రీమదుభయకవితాశూర, సూరమాలక్ష్మీనృసింహసూరి కుమార భారతాన్వయధీర కైశోరప్రభృతిసమారాధితశ్రీపతి లక్ష్మీపతి ప్రణీతంబైన శ్రీమహాభారతకూలంకషాఖ్యవ్యాఖ్యానంబునందుద్యోగపర్వంబు సర్వంబును జతుర్థాశ్వాసము.

(వి-వి.)—

సమగ్రము. ఒకటియుద్యోగపర్వవ్యాఖ్యానమే యిందుగలదు. వ్రాంతతప్పులు గలవు. గ్రంథపాతములు లేవు.

ఇది నన్నయాదులచే రచియింపఁబడిన యాంధ్రమహాభారతమునకు భారతము లక్ష్మీపతిపండితునిచే రచియింపఁబడిన 'మహాభా

రత్నమాలంకష' యను వ్యాఖ్యానమునందలి యుద్యోగపర్వ వ్యాఖ్యానము. తక్కిన పర్వముల కన్నింటికి వ్యాఖ్య రచియింపఁబడెనో లేదో తెలియదు. సూరయయు, లక్ష్మీనృసింహసూరియు నేత గ్రంథకర్తకుఁ దలిదండ్రులు.

(111b to 114b) గ్రంథాంతమున నేఁడుపుటలందుఁ గురుక్షేత్రమునఁ గురుపాండవులకు జరిగిన పదునెనిమిదిదినముల సంగ్రామమునందే యే నాఁడే యే వ్యూహములు పన్నఁబడెనో యెవ్వ రెవ్వ రెవ్వ రెవ్వరిచేఁ జంపఁబడిరో యాయావిశేషము లెల్లఁ దెలుపఁబడినవి.

వదపడిన దున్నైదుపుటలందుఁ (115a to 122a) గొన్ని తద్భవపదముల కొకపట్టికయు, (అపూపః = అప్పము, అర్ఘః = అగ్గువు, ఆజ్ఞా = ఆన, . అంసః = అంచ) తత్సమరూపభేదములు దెలుపు కొన్ని పదముల కొకపట్టికయు (బలవత్ = బలవంతము, లక్ష్మీవాన్ = లక్ష్మీవంతుఁడు, . . . కిమ్ = కిమ్ము)—మఱికొన్ని దేశ్యపదముల కొకపట్టికయు (అందము అందలము, . తాలి, గోడ, మిట్ట)—అర్థములతోఁ గొన్ని తెలుఁగుఁబలుకుల కొకపట్టికయు (అలవోక = అవిచారితము, ఓలాకుపడనీక = చెదరనియ్యక, . . చెప్పుడు = చెప్పుట, బొమ్మలార్చి = బొమ్మలాడించి) వ్రాయఁబడి యున్నవి.

---

## R. No. 113.

Palm-leaf. 11⅞ × 1⅜ inches. Foll. 23. Lines, 8 in a page. Telugu. Much injured.

Purchased from E. R. Kisnamacāriyar of Kalyanapuram in 1911-12.

ఆయుర్వేదార్థసంగ్రహము.

ĀYURVĒDĀRTHASAṄGRAHAMU

This is a medical treatise describing the nature of some diseases and the manner of treating them. The author of the work is

Vēdayakavi, son of Anantāmātya, and it is dedicated to God Varadarāja worshipped at Conjeevaram.

Āśvāsas one and two only.

**Beginning** :

క. శ్రీరమణీప్రియరమణుని
కారుణ్యగుణాభిరాము ఘనభుజదాముఁ
నీరజనాభుఁ గొలతును
గారుడగమనేకవరద(?) కాంచిపురీశుఁ.

వ. ఇట్లు దండప్రణామంబు లాచరించి నారచియింపంబూనిన యాయుర్వేదార్థసంగ్రహంబను ప్రబంధంబునందలి కథాక్రమం బెట్టి దనిన.—

**Colophon**

ఇది శ్రీగోవిందవరప్రసాదలబ్ధవాగ్విభవ అనంతనామాత్యసంభవ వేదయ ప్రణీతంబయిన ఆయుర్వేదార్థసంగ్రహప్రబంధంబునందలి క్షయరోగనిదానంబును, రక్త . . . . ప్రకారంబును, ఆమ్లపైత్యలక్షణంబును కాసగుణంబులును . . . . . .

. . . . . . . . . . . . . . .

శూలనిదానంబును, విపృతినిదానంబును, దచ్చికిత్సలు భగంధరలక్షణంబును అతిసారగ్రహణినిదాన . . . . ద్వితీయాశ్వాసము.

(వి-వి.)—

అసమగ్రము. రెండాశ్వాసములే కలవు. వ్రాఁత తప్పులు మెండు. శైథిల్య మెక్కువ. గ్రంథపాతము లధికము.

ఆయుర్వేదార్థసంగ్రహమను నీవైద్యశాస్త్రగ్రంథము గోవిందవరప్రసాదలబ్ధవాగ్విభవుఁడును, అనంతామాత్యసంభవుఁడు నగు వేదయకవిచే రచియింపఁబడినది. ఇందుఁ గొన్ని వ్యాధులనిదానములును వానిచికిత్సలును దెలుపఁబడినవి. ఈ గ్రంథము పద్యాత్మకము. కృతిస్వామి కంచివరదరాజు.

R. No. **114**.

Paper 11 × 8¾ inches Foll 29. Lines, 18 in a page. Telugu
Good

Restored from a palm-leaf MS. of the Library in 1911-12.

భిన్నప్రకీర్ణాదిగణితములు.

BHINNAPRAKĪRNĀDIGANITAMULU.

This is a mathematical work on fractions and miscellaneous problems on fractions: Pāvulūri Mallana's Telugu rendering of Vīrācārya's mathematical work in Sanskrit was considered by the author to be inadequate and difficult to understand. The author is Eluganṭi Peddana, son of Koṇḍana of Kāśyapagōtra and Kātyāyanasūtra.

Incomplete.

**Beginning**:

క. శ్రీమన్మహామహిమ నీ
నామస్మరణమునఁ గల్గు నన్నుం దయతో
భూమిఁ బ్రసిద్ధిగఁ బ్రోవుము
నామదిలో నిలిచి సూర్యనారాయణుఁడా!

క. ఇల శుక్లయజుర్వేదము
గల కాత్యాయనక సూత్ర కాశ్యపగోత్రుఁ
డెలుగంటికొండయప్రభు
కులముఖ్యుఁడఁ బెద్దఘనుఁడ గణితజ్ఞుఁడనే.

క. గణపతిని సూర్యనారా
యణదేవుని భక్తిఁ గొలిచి యనవరతము భూ
గణకులను దలఁచి వారిక
రుణతోడుత భిన్నగణితరూపముఁ గంటిన్.

* * * *

క. ఘనుఁడై వీరాచార్యులు
తనమహిమను వెలయఁ జేసి దశవిధగణితా
లనుపద్ధతులు ధరిత్రిని
మునుపే యష్టాధికారములు మొద లనియున్.

క. గుణకారముఖ్యముగఁ గల
గణితంబులలోన భిన్నగణితము లెఖ్ఖదుర్
గుణియింపఁ గష్ట మగునని
గణితజ్ఞులచేత వినియుఁ గనియుర్ వేడ్కర్.

* * * *

**Colophon :**

ఇది శ్రీసూర్యనారాయణవరప్రసాదసకలగణితజ్ఞయెలుగంటి కొండయామాత్యపుత్రి పెదననామధేయప్రణీతంబైన అష్టాధికారంబులంగల భిన్నగణితమునం దష్టమోత్తరాలితము సమాప్తము.

ప్రకీర్ణగణితాదిని —

క. శ్రీనారాయణమూర్తిని
నానాజీవాత్ము లోకనాథుఁ బ్రసన్నుం
డైనత్రిగుణాత్ము సూర్యునిఁ
బూని ప్రకీర్ణమున కాది బుద్ధిఁ దలంతుర్.

* * * *

క. ఘనకాశ్యపగోత్రుండను
జను కాత్యాయనుఁడఁ బ్రథమశాఖాన్వయుఁడర్
జనమల్లమాంబకొండన
తనయుఁడ నెలుగంటిపెద్దధన్యుఁడ జగతిర్.

క. నారాయణవరలబ్ధుఁడఁ
బారీణుఁడ సకలగణితపద్ధతులందుర్
ధీరుఁడను రాజసభలను
జేరే యెలుగంటివంశ పెద్దన యనఁగర్.

ఇది శ్రీసూర్యనారాయణవరప్రసాదలబ్ధసకలగణితజ్ఞ యెలుగంటికొండయామాత్యపుత్రి పెద్దననామధేయ ప్రణీతంబైన యష్టాధికారవిశేషంబులంగల ప్రకీర్ణగణితంబునందు నష్టమోత్తరాలితము సమాప్తము.

శా. వీరాచార్యులు సంస్కృతాన గణితావ్విఖ్యాతిగాఁ జేసెఁ దా
నారూఢిఁబదిపావులూరికవిమల్లామాత్యుఁ డెల్గించె (?) నఁ
పేరే గాని గుణించలేరు గణకుల్ భిన్నప్రకీర్ణంబు లీ
తీరైనన్ నెలుగంటిపెద్దన యవిన్ దెల్పెన్ గుణించన్ ధరన్

క. భిన్నప్రకీర్ణగణితము
లన్నవి గుణియించఁ గఠిన మందఱ కనఁ గా
నెన్న నెలుఁగంటిపెద్దన
చెన్నలరంగఁ బాలబోధ చేసెం దెలియన్.

క. హాటకమయినప్రకీర్ణము
పాటించి గుణించఁ జేతు బహుపద్ధతులన్
గాటంబగులెక్కలు క
ర్ణాటకమున వెలయసూర్యనారాయణుఁడా.

* * * *

గీ. భిన్నములు ఉన్న పాల్గొను భిన్నసంఖ్య
ప్రతులు రెంటికిఁ బంపు లేర్పఱిచి కూడ
నగరితుష్టియుఁ గాపుల నష్టి తెలియ
బృథివిఁ గల్పించె నెలుగంటిపెద్దఘనుఁడు.

* * * *

**End:**

* * * *

సీ. గీ. క్రొవ్వి చెలరేఁగి పుట్టలు గ్రొచ్చి పగ్గ
తములు దోలిచె నాదాయాది దర్ప మెసఁగ
వనవరాహంబు లిరువదిదినము లోలి
నుండె నీవరాహంబు లెన్నుండుఁ జెపుమ.

౭ కి రు ౦౨ శేషభాగము ౫ మూలము ౧౦.

(బి-బి.)—

అసమగ్రము. వ్రాఁత తప్పులు మెండు.. గ్రంథపాతములు
లేవు.

ఈగణితశాస్త్రగ్రంథము శుక్లయజుర్వేదియుఁ గాశ్యపగోత్రుఁడును కాత్యాయనసూత్రుఁడును నగు నెలుగంటి పెద్దన యను కవిచే రచియింపఁబడినది. ఈతనితండ్రి పేరు కొండన. సంస్కృతమున వీరాచార్యులు గణితముల రచియించె. పావులూరిమల్లామాత్యుఁడు తెల్గించెను. అందు భిన్నప్రకీర్ణగణితములు దుర్గ్రాహ్యములుగానుండును కావున వానిని విస్పష్టముగా నేను రచించితినని యాతఁడు చెప్పికొనెను. అష్టాధికారములతో భిన్నగణితమును, ప్రకీర్ణగణితమును వివరింపఁబడిన తర్వాత సువర్ణధాన్యాదులగణితములను గొన్ని తెలుపఁబడినవి. గ్రంథ మసమగ్రముగా నుండుటచే విస్పష్టముగా గ్రహింపఁ గుదురదయ్యె. అంకవిన్యాసముతో నిందు గణనవిధముగూడ జూపఁబడినది. వ్రాఁతతప్పులు మెండగుటచే గ్రంథము మిక్కిలి భ్రష్టమయ్యెను.

## R. No. 115.

Paper 11 × 8¾ inches Foll. 384 Lines, 16 in a page. Telugu. Good

Restored from a MS. of the Library in 1911-12

వచనభారతము.

VACANABHĀRATAMU.

This is a prose version of the Sanskrit Mahābhārata; and the portion contained in the MS. under notice is the Ādiparva, which consists of three Āśvāsas and notes the divisions into Adhyāyas as found in the Sanskrit original. The version is fuller than Nannayabhaṭṭa's Telugu Mahābhārata, and is dedicated to Gōpālasvāmi. According to the colophon at the end of the first Āśvāsa, the author is Kaḷuve Vīrarāju, son of Doddarāju, a Ksatriya of Bhāradvājagōtra and Āśvalāyanasūtra. He was appointed as the ruler of Seringapatam by Cikkadēvarāya of Mysore; and is said to have defeated the Mahratta commanders such as Jasvanta Rāya

and Nīmmōji-dādōji. The work, called Vīrabhūpālīya, which deals with poetics and rhetoric like Appakavīya, is named after this author Vīrarāju. His son, Nañjarāju, composed a prose work called Hālāsyamāhātmya as well as other works. According to the colophon at the end of the second Āśvāsa, there was a joint author called Tupākula Anantabhūpāla, the son of Krsnabhūpāla of Candragiri and the author of works such as Visnupurāṇavacana, etc.

Breaks off in the third Āśvāsa.

**Beginning** :

శ్లో. నారాయణం నమస్కృత్య నరం చైవ నరోత్తమమ్ ।
దేవీం సరస్వతీం వ్యాసం తతో జయ ముదీరయేత్ ॥

శ్లో. యత్ర యోగేశ్వరః కృష్ణో యత్ర పార్థో ధనుర్ధరః
తత్ర శ్రీ ర్విజయో భూతి ర్ధ్రువా నీతి ర్మతి ర్మమ.

శ్రీవైభవశరణ్యం బయిన నైమిశారణ్యంబున శౌనకుండను మహామునీంద్రుండు సంద్రెండు సంవత్సరంబు లాచరించందగిన సత్ర యాగంబు నడపుచు నొకనాండు తపోనిష్ఠులగు మునిశ్రేష్ఠులుం దాను నిష్టగోష్ఠిం బ్రవర్తిల్లుచుండ నాసమయంబున . . . రోమహర్షణతనయుండగు నుగ్రశ్రవుండను సూతుండు వచ్చుటయు నమ్మహామును లతనివలన విచిత్ర . . . కథలు వినం . . . గలవారగలగుచు నతనిం బరివేష్టించి సుఖాసీనులై యుండ నాసూతనందనుండును, వారలకందఱకు వందనం బాచరించి, యంజలిసేసి, కుశలం బడిగి వారలచేత నభినందితుండై తదీయానుమతంబు వడసి సుఖాసీనుండై యుండుటయు నతండును సవినయంబుగా.

* * * *

క. రాధారమణీపృథులప
యోధరమధురాధరాంతరుచితసువేశా
సాధారణనఖరదనా
సాధితసముదారిసదన సారసవదనా.

మాలిని. వివిధనటనలీలా విస్ఫురద్రాసలోలా
కువలయదళనీలా గోపికాసంగశీలా
దివిజరిపువిఘాలా దివ్యసౌవర్ణచేలా
ప్రవిమలగుణజాలా బాలగోపాలలీలా ।

**Colophon:**

ఇది శ్రీరామచంద్ర చరణారవింద సేవాభినందన పవననందన వరప్రసా దాసాదిత గీర్వా ణాంధ్ర కర్ణాటకాది నానాభాషా కావ్యరచనా చతుర శ్రీమ న్మహారాజాధిరాజ రాజపరమేశ్వర రాజమార్తాండ ప్రౌఢప్రతా పాప్రతిమ వీరనరపతిబిరుద ఎంతెంబరగండబిరుదాంకిత శంఖచక్రమకరమత్స్య హనూమ ద్గరుడ గండభేరుండసింహ శరభ సాళ్వాది నానావిధ దేవార్హ ధ్వజాంకిత యాదవవంశాబ్ధితిలకాంగవంగకళింగకాశ్మీర లాటమరాటద్రవిడద్రావిడాదినానా దేశాధీశ్వరకిరీటకోటిసంఘట్టనరత్న స్తనిస్తులనవరత్నపరాగపరాగితనిజభవనద్వారాసక్తానేక భూపాలఫాలతలసంఘటితాంజలిపుంజరంజితారవిందకరాయమాణ సభాస్థానస్థ సింహాసనాధిరూఢ నానావిద్వదభీష్టవరప్రసాద (చిక?) దేవరాజ కరుణాప్రాప్త కర్ణాట రాజ్యలక్ష్మీ నృత్తరంగాయమాన శ్రీరంగపట్టణ పరిపాలనార్థాదృత సైన్యాధిపత్యనిర్వాహక మహారాష్ట్రమదేభవంచానన కేళాదివంశాటవీదావాన మథురానాథమదవిమర్దన జయాఘాటశిరరికందుక క్రీడన యసవంతరాయనాసికాకృంతన రెమోంజీసమూలోన్మూలన దాదోజీప్రాణవారణ దండధర, పతాపశిల్పవితలఘా లేరాయఘాంకుర విదళన నానావిధానేకాంతర్బాహ్యాదిశాత్రవమేఘాఘుజంఝామారుతపరరాజగర్వాంధకారవిదళనదినరాజ దళవాయిదొడ్డరాజతనూజ యాచకసురభూజ భుజబలాటోపపరాజితారిరాజన్యసమర్పితానేకరత్నరాశియుతధనకనకవస్తువాహనాదిసువస్తువిస్తారితసంతోషితాఖిలభూసురాశీర్వాదానువర్ధితపుత్రపౌత్రాదివంశాభివృద్ధివిరాజమాన కళువేకులవంశాంబుధిరాకానిశాకర ఆశ్వలాయనసూత్ర పరమపవిత్ర భారద్వాజగోత్రప్రదీప కాసేతుశీతాచలమధ్యవర్తి కాశీ

ప్రభృతిపుణ్యక్షేత్రతనిత్యాన్నదానవినోదనేకధర్మశాస్త్రోక్తదానదీక్షావిచక్షణ క్షాత్రాధీశ్వర కార్యఖడ్గప్రవీణానవధికాగ్రహారారామ క్షేత్రాదసంతోషితాఖిలకవిరాజ వీరరాజప్రణీతంబైన మహాభారత వచనకావ్యంబునందు ద్వితీయాశ్వాసము.

**End:**

ప్రాజ్ఞోత్తముండును నగు పారాశర్యమునీంద్రుండు వారలకు సన్నిధానంబు చేసినవారలతని హితం (?) బులగు నభివాదనంబులు చేసి కృతాంజలులై నిలిచినఁ గుంతీదేవియు నతనిచరణంబులకుఁ బ్రణామంబు గావించెనంతఁ గృష్ణద్వైపాయనుండును వారలం గనుంగొని యోభరతముఖ్యులారా! అధర్మప . . . ర్త రాష్ట్రులవలన మీర లిట్లు స్థానభ్రంశంబుఁ జెందుట నామనంబునం దెలిసి మీకు హితంబు సేయవలయు నను తలంపునం జనుదెంచితి. మీమనంబుల సంతాపంబు లుడుంగుఁడు మీకు శుభంబులు . . . . పూర్వజన్మంబున మీరలు సుహృజ్జనంబులకు వియోగంబు గల్పించితిరిగావున మీకు నట్టివియోగంబు సంభవించె నిట్టి దుష్కృతంబు పరిక్షీణంబగు కాలంబున కెప్పటట్ల నిజనగరంబున.

(బి-బి.)—

అసమగ్రము. మూఁడవయాశ్వాసమునఁ దుదిభాగము కొండొక లేదు. తప్పులు గలవు. మాతృకలోని గ్రంథపాతము లిందును జేరినవి.

సంస్కృతపువ్యాసభారతము ననుసరించి యీవచనభారతము రచియింపఁబడినది. ఉపలబ్ధమయిన యీయాదిపర్వభాగము మూఁడాశ్వాసములుగా విభజింపఁబడియున్నది. సంస్కృతభారతప్రకార మిందధ్యాయవిభాగమును గలదు. నన్నయభట్టారకుని పద్యభారతపుఁ గథాగచనముకంటె నిందలికథారచనము కొంతవిపులముగా నున్నది. ఈకృతి శ్రీగోపాలస్వామికి సమర్పింపఁబడెను. ఆశ్వాసాద్యంతములందుఁ బద్యములు గలవు. ఏతద్గ్రంథకర్త

కళువె వీరరా జని కలదు. ప్రథమాశ్వాసమున పై నుదాహరింపఁబడినవీరరాజుగద్యమే కలదు. ద్వితీయాశ్వాసమునను వీరరాజుగద్యముగలదు. కాని యీక్రింద నుదాహరింపఁ బడు తుపాకుల యనంతభూపాలునిగద్యముగూడఁ గలదు.

**Colophon:**

ఇది శ్రీనందనందనచరణారవిందసేవానుభావభావితసారసారస్వతైశ్వర్యధుర్య, చక్రవర్తిధకవితాసామ్రాజ్యభోజ, చంద్రగిరికృష్ణభూపాలకతనూజ, సాంద్రతేజోవిశాల తుపాకులయనంతభూపాలకప్రణీతం బయిన శ్రీమహాభారతవచనకావ్యంబునందు, ఆదిపర్వంబున ద్వితీయాశ్వాసము.

ఎవ్వరిగద్యము న్యాయ్యమైనదో గుర్తింపరాదు. వీరరాజు తండ్రి మైసూరుప్రభువగు చిక్కదేవరాయలచే శ్రీరంగపట్టణపరిపాలకుఁడుగా నేమింపఁబడినవాఁడు. జస్వంతరాయ, నిమోజి, దాదోజి, మొగలగు మహారాష్ట్రుల నాతఁడు జయించెనఁట! ఆతని పేరు దొడ్డరాజు. వీరు ఆశ్వలాయనసూత్రము, భారద్వాజగోత్రము గలక్షత్రియు లఁట! దొడ్డరాజుప్రతాపాదికము, వీరరాజుదాతృత్వాదికము గద్యమును బట్టి గ్రహించునది. ఈవీరరాజుపేరనే "వీరభూపాలీయ" మని యప్పకవీయమునుబోలిన లక్షణగ్రంథ మొకటి కలదు. ఈతనికుమారుఁ డగునంజరాజుచే హాలాస్యమాహాత్మ్యాదు లనేకవచనకావ్యములు రచియింపఁబడినవి.

ఇక దుపాకులయనంతభూపాలుఁడు చంద్రగిరికృష్ణభూపాలుని కుమారుఁడు. విష్ణుపురాణవచనము మొదలగునవి యీతని కృతులు. ఇతరం బె విశేషముల కుదాహరింపఁబడిన గద్యములఁ జూచునది.

## R. No 116.

Paper 11 × 8¾ inches Foll 48 Lines, 18 in a page Telugu. Good.

Restored from a MS of the Library in 1911-12.

పతితపావనచరిత్రము.

PATITAPĀVANACARITRAMU.

A Prabandha in three Āśvāsas describing the story of a person who became degraded and then regained his status and respectability by the power of the Rāmamantra. The author of the work is Yadavalli Vēnkatakavi, son of Kiccanāmātya of Hārītagōtra and of the Ārvēla community. He was a disciple of Dattātrēyayōgi and dedicated his work to God Vēnkatēśvara worshipped at Tirupati.

Complete.

**Beginning:**

ఉ. శ్రీయుతకౌస్తుభాతపముచేఁ బయిఁ గెక్కిన యిందిరాతను
చ్ఛాయ యనంగ దక్షిణభుజాశిఖరంబున నుర్విఁ దాల్చి తా
నాయరవిందలోచనల నర్మిఁ గరంచుచునుండు భోగని
శ్రేయసదానశీలుఁ డగు శేషగిరీశుఁడు మమ్ముఁ బ్రోచుతన్.

సీ. అత్యంతగూఢమై యర్థంబుగాని సం
దర్భంబుకవిత కొందఱకుఁ బ్రియము
సరవి నశ్రుతపూర్వశబ్దప్రయోగముల్
బెరసినకవిత కొందఱకుఁ బ్రియము
పొఁడిమి రెట్టింప వాడికమాటలు
తఱచైనకవిత కొందఱకుఁ బ్రియము
నెలయేళ్లుదుమికిన సరణిఁ జంఝూళి
తంబైనకవిత కొందఱకుఁ బ్రియము

గీ. భువిని నందఱమనసురాఁ గవిత సెప్పి
మెప్పుగైకొనఁ గా (గన ?) శక్య మప్పసమున
దాఁచ నేటికి బుద్ధికిఁ దోఁచినట్లు
రచనచేసెద వినరయ్య రసికులార !

వంశావళి.

క. హారితసగోత్రుం డెడవలి
పురవరుఁ డార్వేలవంశభూషణ మతిసు
స్థిరకీర్తి తమ్మనార్యుఁడు
ధరపై మును పల్లకీపదస్థుం డలరున్.

క. చెలువమున నతఁడు గాంచిన
నలవేంకటమంత్రి భూజనంబులు మెచ్చన్
విలసితవిద్యాప్రజ్ఞల
నలరుచు గుడిపాటివారియల్లుం డయ్యెన్.

సీ. ధీరుఁ డతఁడు మల్లతిరునాథమంత్రీశ
శ్వరునిచే నురుహాయచ్ఛత్రముఖ్య
బహుమానమును బొంది ప్రౌఢుఁడై గుడిపాటి
వంశాఢ్యుఁ డన వన్నెవాసి గాంచి
రమణఁ బతివ్రతారత్నంబు తిమ్మాంబ
యర్ధాంగలక్ష్మియై యభిమతంబు
లొనగూర్ప నామెయం దనఘమానసులైన
సుతుల నేవ్వురఁ గాంచె నతిముదమున

గీ. మానధనుఁడు పెదప్పన్న మంత్రిమకుట
మణి చినప్పన్న సకలధర్మస్వరూపి
నాగరాజు వచోజితనాగరాజు
నగుచు వెలసిరి యాఘనుల్ జగతియందు.

ఉ. దక్షుఁడు నాగయప్రభుఁడు ధర్మవధూమణి తిర్వెరంగుఁ గా
మాక్షకుఁ కిచ్చె ప్రభుని మానవతీమణి తిమ్మమాంబ నీ
తిక్షమనైన వేంకటపతిప్రతయుం బును బుచ్చి వెంగళన్
లక్షణవంతు గోసనను లక్షణపుణ్యులఁ గాంచె నెంతయున్.

క. ముందు వరించెను లింగమ
యందముగా వెనుక వేంగమాంబను వరియిం
చెం దగఁ గృష్ణార్యుఁడు గో
విందమ్మ వరించె బాలవేంకటపతియున్.

క. మతిశాలి బాలవేంకట
పతి గోవిందమ్మ పుత్త్రపౌత్త్రాదికసం
తతి వడసి వితతభాగ్యా
యతిచేఁ జుట్టాలసురభియై ముదమందెన్.

గీ. అభ్యుదయపాత్ర మైనవంశాభివృద్ధి
గన్న కిచ్చయ వేంగమ నన్నుఁ గనియె
నేను వేంకటకవిని మానితకవిత్వ
కల్పనానల్పశేముషీకౌశలుండ.

ఉ. కావున నాకరుక్రొత్తకథ కావ్యము చేసెద నంచు నెమ్మదిన్
భావన సేయుచోఁ బతితపావననామచరిత్ర పాత్రమై
వావిరిఁ దోచెఁ దోఁచుటకు వారక మైనది నిర్ణిరోధవాం
ఛావరణీయభాగ్యవిలసత్త్వమొ రామకథామహత్త్వమో.

**End:**

మాలిని. శకటదనుజహంతా సద్గుణశ్రీనిశాంతా
శుకవ్యాదయనిబద్ధా శోభితానంద ముద్ధా
ముకురనిభకపోలా మోహనాకారలీలా
స లజగదనస్తా (?) శంఖచక్రాంకహస్తా.

* * * *

**Colophon:**

ఇది శ్రీదత్తాత్రేయయోగీశ్వరకరుణాకటాక్షసాక్షాత్కృత వి
ద్యానవద్యసంస్కృతాంధ్రకవితామాధుర్యధుర్య కిచ్చనార్యనందన
వేంకటకవిసాక్రందన విరచితంబైన పతితపావనచరిత్రం బనుమ
హాప్రబంధంబునందు తృతీయాశ్వాసము.

(బి-బి.)—

సమగ్రము. మాతృకలోని తప్పులును గ్రంథపాతములును నిందుఁ జేరినవి.

పతితపావనచరిత్రమను పేరుగల యీ మూఁడాశ్వాసముల ప్రబంధమునఁ బతితుఁడగు నొకబ్రాహ్మణుఁడు శ్రీరామమంత్రప్రభావమునఁ బవిత్రుఁడగు కథ వర్ణింపఁబడినది. తిరుపతివేంకటేశ్వరస్వామికి సమర్పింపఁబడినది. గ్రంథకర్త యడవలి వేంకటకవి. హారితగోత్రుఁడు. ఆర్వేలబ్రాహ్మణుఁడు. కిచ్చనామాత్యునికుమారుఁడు. దత్తాత్రేయయోగీశ్వరుని శిష్యుఁడు. విశేషములకుదాహరింపఁబడిన పద్యములఁ జూచునది.

## R No. 117.

Paper. 11 × 8¼ inches. Foll. 51. Lines, 18 in a page. Telugu. Good.

Restored from a MS. of the Library in 1911–12.

(*a*) అమరుకావ్యము.

**AMARUKĀVYAMU.**

Foll. 1*a*—33*a*.

This is a Telugu version of the Sanskrit Amaruśataka, but different from the work described under R. No. 107 *ante*. The name of the author is not known.

Incomplete.

**Beginning :**

సీ. శ్రీవాగ్గమాధరాభృత్తు తానాను లా
గమశిలోచ్చయనిశాకాంతధరులు
కాంచననీలహీరాంచితవర్ణులు
దురితభోజపతిత్రిపురమథనులు

రాజమరాళతార్క్ష్యగోవాహాక్షగమనులు
సృష్టిప్రపుష్టివినష్టికరులు
బ్రహ్మశిరాస్త్రచక్రత్రిశూలాయుధు
లాజిభుక్స్మరమూవకాశ్వజనకు

గీ. నైనపరమేష్ఠికేశవేశాను లరసి
పాటవంబైన యమరుప్రబంధవికృతి
కృతి నొనర్పఁగఁ బూనున న్నిపుడె సొంత
కృతిసిగాఁ జేసిప్రోతురు కుతుక మొప్ప.

శ్లో. జ్యాకృష్టిబద్ధకటకాముఖపాణిపృష్ఠ
ప్రేంఖన్నఖాంశుచయసంవళితో మృడాన్యాః।
త్వాం పాతు మంజరితపల్లవకర్ణపూర
లోభభ్రమద్భ్రమరవిభ్రమభృత్కటాక్షః॥

సీ. భండచండాదిదోర్గండదర్పోద్దండ
శౌండారిఖండనసమయమందుఁ
గఠినకార్ముకగుణాకర్షణహితకట
కాముఖనామకకరవరోప
ప్రస్ఫురన్నఖఘృణిజాలమిళితంబు
గావున మంజరీకలితసత్ప్ర
వాళకర్ణాకల్పవాంఛాభ్రమద్భృంగ
విభ్రమవాహియై వెలయు పీర

గీ. ముద్రికారూఢయైపొల్చు భద్రకాళి
యోరచూపు దయారసం బుప్పతిల్ల
సిప్పు డతివేగమునఁ గుప్పతెప్పలుగను
సిరుల నొడఁగూర్చి సిన్న రక్షించుఁగాత!

**End:**

శ్లో. లాక్షాలక్ష్మలలాటపట్టమభితః కేయూరముద్రా గళే
వక్త్రే కజ్జలకాళిమా నయనయో స్తాంబూలరాగోఽధరః

దృష్ట్వా కోపవిధాయి మండనమిదం ప్రాతశ్చిరం ప్రేయసో
లీలాతామరసోదరే మృగదృశ శ్శ్వాసాః సమాప్తిం గతాః.

సీ. వేవినప్పుడు వచ్చువిభునిఫాలంబుపై
నంటులాక్షాచిహ్న మలుకఁ జూచి
వేవినప్పుడు వచ్చు విభునికంఠ బుపై
నంటు నంగదచిహ్న మలుకఁ జూచి
వేవినప్పుడువచ్చువిభునివక్త్రంబుపై
నంటుకజ్జల చిహ్న మలుకఁ జూచి
వేవినప్పుడువచ్చువిభునినేత్రములపై
నంటుపీటీచిహ్న మలుకఁ జూచి

గీ. కొంత చింతించి పెఱకాంతఁ గూడివచె
నంచుఁ బోడమికయూర్పు లీలాబ్జమందుఁ
బుచ్చి చెలి నిద్ర లేదు గాఁబోలుఁ బవ్వ
ళించు మని ప్రభునకు నల్వరించెఁ బాన్పు.

(వి-వి.)—

అసమగ్రము. వ్రాఁతతప్పులు గలవు. స్థూలదృష్టినిగొన్ని దిద్దఁబడినవి. గంథపాతములు లేవు.

అమరుకవిచే సంస్కృతభాషలో రచియింపఁబడిన శృంగారరసాత్మకమగు పద్యశతకమున కిది తెలిఁగింపు. రచించిన దెవరో యింకుఁ దెలియవచ్చుటలేదు. నెం 107 రున వర్ణింపఁబడిన రచనము వేఱు, ఇది వేఱు.

---

(b) కలగూరగంప.

KALAGŪRAGAMPA.

Foll. 35a—51b

This is a gleaned collection of stanzas from various sources describing the valour of many kings of ancient times and also of some of recent times.

**Beginning:**

సీ. శు త్తిదుర్గాస క్తిఁగూడినమన్నీలఁ
బోఁ(?) కార్చ్బె నేరాజు భంగపఱిచె
నరసి పోవఁగఁ గొల్ల లాడించె నేరాజు
పటుశక్తి నుదయూద్రిపట్టణంబు
సాధించె నేరాజు చలపట్టిభుజబలో
ద్యల్లీలఁ బోరిమామిళ్లపురము
కామలాపురభయంకరవ్రవ మేరాజు
విక్రమక్రమరూఢి నాక్రమించె

గీ. నతఁడు తగుబద్దెపోల్ పట్టణాభిధాన
మాతృనామైకలక్ష్మమాంబాతటాక
వేంకటేశప్రతిష్ఠాదివివిధసుకృత
శాలి తిరువేంగళక్షమాపాలమౌళి.

---

**End:**

సీ. పోలయవేమన్న పాలుపారఁబండెంటఁ
బ్రజ్ఞఁజేసెను బ్రజాపాలనంబు.

*　　*　　*　　*

గీ. సప్తసంతానములు చేసి జగతియిందు
మించి రారెడ్లు గహరాజు మేడ గట్టి
ఎలమి సబ్బంగి నాతఁడు లేలినారు.

వ్రాఁత తప్పులుకుప్పలు. మాతృకలో మెందుకొన్న గ్రంథ
పాతములి దును జేరినవి.

ఈకఁగూరగంపలో (1) మట్లవంశ్యులమీఁది పద్యములు,
(2) ఆర్గురు చక్రవర్తులమీఁదపద్యములు, (3) షోడశమహారాజులమీఁ
దిపద్యములు (భారతమందలివి), (4) ఖడ్గతికన్నమీఁదిపద్యములు,
(5) నెల్లూరునుగూర్చిపద్యములు, (6) రెడ్లపాలనమునుగూర్చిపద్యము,
కలవు.

## R No. 118.

Paper. 8¾ × 5⅝ inches Foll. 111 Lines, 8 in a page Telugu. Good.

Transcribed from a MS. of B. Satyanārayana of Vizianagaram in 1911–12.

వాస్తుసారసంగ్రహలక్షణము.

VĀSTUSĀRASAṄGRAHALAKSANAMU

This treatise on architecture treats of the construction of houses and other domestic buildings, and of the determination of auspicious times for beginning their construction. By Gaṇapayāmātya, son of Vengalāmātya and Mallamāmba of Vāsisthagōtra and Āśvalāyanasūtra

Complete.

**Beginning:**

గీ. . . . . . .

వాస్తుశాస్త్రంబు మది నెంచి వారగాంచి
మహిని జెలువొందు గణపయామాత్యకవిని.

ఉ. వారిజసంభవప్రముఖవాస్తువిధిజ్ఞుల శాస్త్రసారముల్
గూరిచి లక్షణంబు సమకూర్పగ నెంతటివాడ నైన నా
నేరిచినట్టు లోకరాకృతి నిర్మితిచేసెద నందు నేరుపుల్
నేరములుం గ్రహించి కరుణింపదగున్ గవులార మ్రొక్కెదన్.

క. వాస్తుగతుల్ బహువిధములు
విస్తార మొనర్ప గ్రంథవిస్తార మగున్
ప్రస్తుతము కొలందినీగృహ
వాస్తువు మాత్రం బొనర్తు వసుధం దెలియన్

* * * *

క. ఖరకరకిరణస్ఫురదురు
సురుచిరచేలునకుం బేరుసోమలనగర

స్థిరనిత్యోత్సవపూజా
గరుపరతేలునకు మదనగోపాలునకున్.

వ. సమర్పణంబుగా నాయొనర్పం బూనిన వాస్తుసారసంగ్రహలక్షణంబునందు గృహారంభమాససంక్రాంతి పక్షతిథివారనక్షత్రయోగకరణగ్రహచారలగ్నశుభాశుభంబులను . . . .

అష్టవాటంబులరూపనిర్ణయంబును, కూపఖనననిరూపణంబును గృహాంగణవృక్షనియమం బును గ్రమంబున వివరి చెద—

**End:**

మా. విమలచరితహ్వాద్యా వేదవేదాంతవేద్యా
సమధికగుణగణ్యా సర్వదేవాగ్రగణ్యా
అమరవినుతిపాత్రా యంబుదశ్యామగాత్రా
ప్రమథితశిశుపాలా రాజగోపాలబాలా!

క. మీచరణార్పితమతిప్ర
జ్ఞాచతురిమ వాస్తుసారసంగ్రహ మెలమి
న్నే(?)చేసినాఁడ నిద్ధర
నాచంద్రార్కముగ నిల్పుమయ్యా ముకుందా!

**Colophon:**

ఇది శ్రీమన్మదనగోపాలస్వామికృపాకటాక్షవీక్షణప్రసాది . . . . . . కలగణితగుణితప్రశస్తవిస్తారశాస్త్రాంబురాశిప్రమథనమందరాచలాయమాన మేధావైశద్యానవద్యహృద్యచరిత్రమహాశ్వలాయనసూత్ర వాసిష్ఠసగోత్ర పేరుసోమల యామాత్యపౌత్ర వెంగళామాత్యమల్లమాంబాసగర్భ . . . ముక్తాఫలవిరాజమాన సుధీజనవిధేయ గణపయనామధేయ ప్రణీతంబైన వాస్తుసారసంగ్రహలక్షణం బన్నది సర్వంబు నేకాశ్వాసము సంపూర్ణము.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత తప్పులు మెండు. గ్రంథపాతములు లేవు.

వాస్తుసారసంగ్రహలక్షణ మను పేరుగల యీవాస్తుశాస్త్రగ్రంథము గణపయామాత్యకవిచే రచియింపఁబడినది. ఈతఁడు వాసిష్ఠగోత్రుఁడు. ఆశ్వలాయనసూత్రుఁడు. వేంగళామాత్యమల్లమాంబలకుఁ బుత్త్రుఁడు. ఈగ్రంథమున, గృహాదినిర్మాణరీతులును, తదారంభశుభాశుభకాలనిర్ణయాదికమును వివరింపఁబడినవి.

## R. No 119.

Paper. 11 × 8¾ inches Foll 28 Lines, 18 in a page Telugu. Good.

Restored from a MS of the Library in 1911-12.

(*a*) ఐరావతచరిత్రము.

AIRĀVATACARITRAMU.

Foll. 1*a*—16*b*

This is a Prabandha describing how Arjuna enabled Kunti to perform the Airāvatavrata by bringing actually the Airāvata elephant itself from the Indralōka for being worshipped in place of its image as is usually the case. This MS. contains neither an introduction nor a colophon indicating its authorship, etc. Although the story is connected with some of the chief characters of the Mahābhārata, it is not found either in the Sanskrit or in the Telugu Mahābhārata. But there seems to be a work of this name dealing with the same story in Kanarese.

Complete

**Beginning:**

చ. అనఘువరేణ్య! నాదుచెవు లారఁగఁ గౌరవపాండవేయవ
ర్తనములు సర్వముఁ బ్రకటితంబుగ నీకృప వింటి శైశవఁ

బునను ధనంజయుండు సురపుంగవుదంతి ధరిత్రికిం బలం
బునఁ గొనివచ్చి కుంతివ్రతముం దగఁ జేసినభంగిఁ జెప్పవే!
వ. అని యడిగిన జనమేజయునకు వైశంపాయనుం డిట్లనియె:—
క. విను జనమేజయ ఘనుఁ డ
ర్జునుఁడు మహాద్భుతముగాఁగ సురకరి నిలకుఁ
దనభుజశక్తిని గొనివ
చ్చినతెఱఁ గంతయును దెలియఁ జెప్పెద నీకున్.

**End:**

సీ. విశ్వవిశ్వంభరాశాశ్వతోన్నతనుత
పాలనాంచితధనుఃపాణిచేత
ప్రణుతభూవరశిరోమణిగణస్ఫురతర (దురు?)
పృథులశాశ్వతపాదపీఠిచేత
సురుచిరమృదువాక్యసురకామినీమనో
మోదితస్పృహదివ్యమూర్తిచేత
చక్రవాళవిశాలశైలోన్నతస్థల
కేళివిహారసత్కీర్తిచేత
గీ. క్రీడిచేత గగనకీలితదివ్యాస్త్ర
విరచితసో (?) పానవేదిచేత
నిఖిలలోకమునకు నేత్రసుపర్వమై
యెంతయును జెలంగెఁ గుంతినోము.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత తప్పులు మెండు. స్థూలదృష్టిని గొన్ని దిద్దఁబడినవి.

ఐరావతచరిత్ర మను నీగ్రంథ మెవ్వరిచే రచింపఁబడెనో తెలియదు. ఇందలి కథాంశము మహాభారతమునకు సంబంధించియున్నది; కాని యట్టు మహాభారతమున నున్నట్టు కన్పట్టదు. ఈ గ్రంథము, కృత్యవతరణికయు గ్రంథాంతపద్యగద్యాదికమును లేక యేదోయొకగ్రంథమున నేకదేశ మయియుండినట్టు కన్పట్టుచున్నది.

కవిత్రయపుటాంధ్రమహాభారతప్రతులందుఁ జూపట్టదు. కవిత్రయ ప్రయోగములకు విరుద్ధములగు ప్రయోగములు గూడ నిందుఁ బెక్కు గన్పట్టుచుండుటచేఁ దత్కృత మనరాదు. కర్ణాటభాషలోఁ గూడ నిది పద్యకావ్యముగా రచియింపఁబడినది. సంస్కృతమునఁ గాన రాదు.

ఇందలికథకు సంగ్రహ మిది :—

కౌరవపాండవులు ద్రోణాచార్యునొద్ద విద్యాభ్యాసముసేయు చుండుకాలమున, వేదవ్యాసునిచే నిబోధితయై గాంధారి యైరావత వ్రత మాచరించెను. ఐరావతము నుబ్రత్యక్షముగాఁ గొనివచ్చుట దుష్కరముగాన, మన్నునఁ దత్ప్రతికృతి కల్పించి నోము నోమెను. నాఁడు, గాంధారి యైశ్వర్యప్రమత్తయై కుంతీదేవిని జులుకనచేసి పిలువ దయ్యె. కుంతి యందులకు సంతాపపడి యర్జునున కెఱిఁ గింప నాతఁడు బాణములతో స్వర్గమునుండి భూమికి సోపానములు గట్టి దేవేంద్రునియొద్దనుండి ప్రత్యక్షముగా నైరావతమును దెప్పిం చి మహావైభవముతోఁ గనదల్లిచేఁగూడ నానోము నోమించెను.

(b) సుందరీమణిశతకము.

SUNDARĪMANIŚATAKAMU

Foll. 17a—27b

A centum of erotic stanzas expressing the emotions of a lover separated from his beloved The author of the work is not known. The stanzas are written in Campakōtpalamalikā, metrical combination, and each of them ends with the refrain Sundarīmanī.

Incomplete; contains stanzas 1—88.

**Beginning:**

ఉ. శ్రీ లలరంగఁ జంద్రకళ చెల్వున లేనునవ్వువెన్నెలల్
గీలుకొనంగ నంగజశిలీముఖరీతిఁ జెలంగుచున్న నీ
లీల గనుంగొనంగ నవలీల నఖండసమస్తభూతలం
బేలినకన్న సౌఖ్యమని యెంచుఁజుమీ మది సుందరీమణీ!

* * * *

చ. సరసములాడు నేర్పు కను సైగలు సేసెడు నేర్పు, నామనం
బెఱిఁగెడు నేర్పు, నెమ్మది సొకించుకకోపము సేయు నేర్పు క్ర
న్నఱి మురిపంబుతోడఁ బలిమాలెడు నేర్పు, మనోజకేళిలోఁ
గరఁగెడు నేర్పు, నీకె తగు గాదె తలంపఁగ సుందరీమణీ!

**End:**

ఉ. తే వదనస్య చంద్రరుచిధిక్క్రియ ప్రతిభాస్తు తే దృశో
ర్భావభవోత్పలాంబురుహబాణకదంబజయో స్తు సంతతం
తే వచనస్య కోకిలతతిప్రవరాయసక్య (?) ద్విధోస్తు టం
చే బనుతింతు నీకు శుభ మీయఁగ దేవుని సుందరీమణీ!

(బి-బి.)—

అసమగ్రము. ౧౧ పద్యములు గలవు. వ్రాఁత తప్పులు
లేవు. గ్రంథపాతములు లేవు.

"సుందరీమణీ" యను మకుటముతో ముగియు చంపకోత్ప
లమాలికావృత్తములుగల యీరసోత్తరశృంగారశతక మెవ్వరిచే
రచియింపఁబడెనో తెలియదు. ఈశతక మెల్ల విప్రలంభశృంగా
రపుఁగూర్పునఁజొరపంచాశత్తు మొదలగు గ్రంథములను మీఱియున్నది.

---

R. No 120.

Paper. 11 × 8¾ inches Foll. 29. Lines, 18 in a page. Telugu Good.

Restored from a MS. of the Library in 1911-12

శృంగారసీసపద్యశతకము.

ŚṚṄGĀRASĪSAPADYAŚATAKAMU

This is a centum of erotic stanzas, in the Sīsa metre, in most of which the Gīti is omitted. From the Gīti given inthe first stanza it is surmised that a poet of the time of Cikadēva of Mysore composed this work based on the love incidents of Krsna and Rādha. The work is divided into various sections like Vēśyāvidhamu, Svastrīvidhamu,etc.

Breaks off in the 107th stanza.

**Beginning :**

సీ. వింతగాఁ బొడగన్న వెలఁదిని నవలీల
సాధించు దేవవేశ్యాభుజంగ
ముందటఁ బొడకట్టు మొ(?)గనాగి నైనను
దొరకించుకొనునట్టి దుండగీఁడ
తిరునాళ్ల కనివచ్చు పరువంపు వెలఁదులఁ
దిరిగిపోనీయని ధీరవిటుఁడ
వేటకుఁబోవుచో నెవ్వతెఁ గన్న
ననుపులఁ దేలించు నటనకాఁడ

గీ. నీదు శృంగారనటనల నేర్పువగల
శతక మొకటి వినిపింతుఁ జక్రహస్త
భక్తసుగసాల! చికదేవ . . . . . ||౧||

సీ. వాలుఁజూపులఁ జేర వలచువైచును గాని
తనివితీఱక చూచుతగులు గలదె
చెలిపులకుఁ జెట్ట(?) తేక నవ్వును గాని
ననుపుసిగ్గుల చిన్నినవ్వు గలదె
వంచనార్థమె తాను వలచితి ననుఁగాని
నిమిషంబు పాయని నెనరు గలదె
మేలు మెచ్చులకు మే(?)ర్చును గాని
. , . దీర్ఘక్రమము గలదె.

**End :**

సీ. మన్ననయొకకంట మక్కువ యొకకంట
సంతసం బొకకంట సందడింప
లాలనం బొకకంటఁ బాలనం బొకకంట
మార్దవం బొకకంట మస్తుమీఱ

కారుణ్య మొకకంటఁ గంద. యొకకంట
సౌహార్ద మొకకంట సరస మెసఁగ
ఆరజం బొకకంట నార్తంబు లొకకంట
దాక్షిణ్య మొకకంటఁ దగులువాఁఱ

*  *  *  *

(వి.వి.)—

అసమగ్రము.(?) ౧౦౭ పద్యములు గలవు; కాని యేపద్యము నకును, ఎత్తుగీతి వ్రాయఁబడియుండలేదు. వ్రాఁత తప్పులు తక్కువ. గ్రంథపాతములు పెక్కుకలవు.

ఈ శృంగారసీసపద్యశతక మెవ్వరిచే రచియింపఁబడెనో పేరేమో తెలిసినది కాదు. తొలిపద్యమున "చక్రహస్త! భక్తసుర పాల! చికదేవ. . . . అనియుండుటచే, మైసూరు ప్రభువగు చిక్కదేవరాయలకాలమున నేకవియో కృష్ణునిపేర రచియించి యుండునని యూహాపొడముచున్నది. ఇందు వేశ్యావిధము, స్వస్త్రీవిధము పరస్త్రీవిధము, మొదలగు విషయములతోఁ బద్యములు విభాగింపఁబడినవి.

---

## R. No 121.

Paper. 11 × 8¾ inches. Foll 111 Lines, 18 in a page Telugu. Good

Restored from a MS. of the Library in 1911–12.

శృంగారరాఘవము.

ŚRṄGĀRARĀGHAVAMU

This is a Prabandha describing the story of Rāma. By Ceruku-mūḍi Kṛṣṇakavi, the daughter's son of the well-known Telugu poet Dhūrjaṭi and son of Vēdayārya, a Pākanādi Niyōgi Brāhmin of Āpastambasūtra and Śrīvatsagōtra The author's foster-father was Vēṅkaṭādri The work is dedicated to Kātēpalli Nārāyanārya, a Nandavara Brahmin A description of his family is not given here, but is found separately mentioned in a palm-leaf MS. in the Library. The author is said to have composed also Vāmadēva-caritra,

Incomplete; contains Āśvāsas 1 to 3 only.

**Beginning:**

శా. శ్రీవక్షఃప్రభవాబ్జవాహనగుణ లక్ష్మీనాథవాఙ్నాథవం
ద్యాదిత్యప్రముఖామరుల్ గొలువ మోహాసక్తిఁ గ్రీగంటఁ జెం
తే జూచి గని వేడుకొందు శివు డర్థి వాత సంస్తుత్యనా
నాదామోజ్జ్వలుఁ గాకెపల్లికులజున్ నారాయణుం బ్రోవు
[తన్.

ఉ. నాగసుశాసనున్ సుకవినాగనుశాసను గుండలీంద్రు వి
ద్యాగురుకుండలీంద్రు విదితమ్యతిసోముని సోమునిన్ రుచిన్
భాగసుభాసురున్ విబుధభాసురు ధూర్జటిధూర్జటిన్ మహా
భాగుల వీరి నెంతు సురవర్యశుభాహ్వయసత్కవీంద్రులన్.

కి ష్మమాంబాగర్భపయఃపారావారరాకాసుధాకరుండును, సుధాకరస్తవరచనామోదితసోమసోమనామాత్యసహోదరుండును, నందవరకులకమలాకరప్రభాకరుండును కాకెపల్లాహ్వయసమంచితాన్వయసముదయుండును, ప్రధానవర్యాయ్యనామాత్యోత్తమునిపుత్రుండును, వసిష్ఠగోత్రపవిత్రుండును, సాత్త్వికగుణప్రత్యక్షనారాయణుండగు నారాయణమంత్రిపుంగవుండు . . . . పేరోలగంబున నుండి,

సీ. గురుతరశ్రీవత్సగోత్రు నాపస్తంబ
సూత్రు నిత్యార్చితసోమగాత్రుఁ
బ్రాకనాబాలేన్వేలవాగలలో మేటి
ధూర్జటిదౌహిత్రు దురితదూరు
వెలరు వేదామాత్యువలన సుసాధ్వి యా
నకమాంబాగర్భమందు జనితుఁ

డగువాని నలవేంకటాద్రికి (దత్తునిఁ?)
చెరుకుమూడికులేంద్రు వరకవీంద్రు

గీ. దక్షిణామూర్తికరుణాకటాక్షలబ్ధ
చారుసామర్థ్యనిర్మితభూరికావ్య
నందితానేకబుధకోటి నన్ను వేడు-
దనరఁ బిలిపించి పలికె (మోదమునఁ?) దలిర్ప.

చ. అనువుగ వామదేవచరితాదినుతోత్తమపద్యకావ్యముల్
మునుకొని యెన్నియైనను బ్రమోదముతో రచియించినావుగా
ఘనుడవు నీవు నన్నిక ... న్నుతికీర్తనసేయఁగాఁ దలం
చిన నొకభవ్యనవ్యకృతి జేసి యొసంగుము కృష్ణసత్కవీ!

* * * *

**End:**

స్ర. శ్రీరాజత్కీర్తిభామాజితసురవిచధిస్వస సేవాలజాల!
క్షీరాంభోరాశివస్యాంచితమహిశిఖరిశ్రేష్ఠశకం శేశ్వరాం (..
........) బింబలక్ష్మీభవనపదశిరఃపుణ్యధీశాధరిత్రీ
ధారాధారాంసకాటేపలికులజలజబ్రధ్ననారాయణార్యా.

**Colophon:**

ఇది శ్రీదక్షిణామూర్తికటాక్షవీక్షణానిర్మితప్రబంధగ్రథిత శృం
గారజ్ఞానవైరాగ్యరచనాతోషితసకలసుకవికోటిదూర్జటి దౌహిత్ర
వేదయార్యప్రదత్త వేంకటాద్రిసుపుత్రి చెరుకుమూడికులపవిత్ర
సరసపాండిత్య కృష్ణయామాత్యప్రణీతంబైన శృంగారరాఘవం
బను మహాప్రబంధంబునందుఁ దృతీయాశ్వాసము.

**(బి-బి.)**—

అసమగ్రము. మూఁడాశ్వాసములే కలవు. వ్రాఁత తప్పులు
మెండు. మాతృకలోని గ్రంథపాతము లిందును జేరినవి.

శృంగారరాఘవ మను పేరుగల యీ గ్రంథమున రామకథ వర్ణింపఁబడినది. ఈ గ్రంథ మెన్నియాశ్వాసములుగా రచియింపఁబడెనో తెలియదు. గ్రంథకర్త చెఱుకుమూడి కృష్ణకవి. శ్రీవత్సగోత్రుఁడు. ఆపస్తంబసూత్రుఁడు పాకనాటినియోగి బ్రాహ్మణుఁడు. ప్రఖ్యాతాంధ్రకవీశ్వరుఁడగు ధూర్జటికవికి దౌహిత్రుఁడు. ఈతఁకన్నతండ్రి వేదయార్యుఁడు, పెంపుడుతండ్రి వేంకటాద్రి.

ఈ గ్రంథకర్త యింతకుముందు వామదేవచరితాదిప్రబంధములను రచియించినట్లిందుఁ దెలుపఁబడినది. ఈ గ్రంథము కాటేపల్లి నారాయణార్యుఁడను నందవరపు బ్రాహ్మణున కంకితము సేయఁబడెను. తద్వంశవర్ణనభాగ మీ ప్రతియందు విడనాడఁబడినది కాన వివరింపఁ గుదురదయ్యె. ఆ భాగముమాత్ర మీ పుస్తకశాలలోనే వేఱొకచోఁ గలదు. దానినైయడి చూచునది.

---

R. No. **122.**

**Paper 11 × 8¼ inches Foll. 192. Lines, 18 in a page. Telugu**
Good.

Restored from a palm-leaf MS. of the Library in **1911-12.**

**ఉత్తరహరివంశము.**

UTTARAHARIVAṀŚAMU

This is a Prabandha rendering into Telugu the latter **part of** the Sanskrit Harivaṁśa The author is Nācana **Sōmanātha, who states that** he composed this work after Tikkanasōmayāji composed **his** Bhārata.

Breaks off in the sixth Āśvāsa and wants the introductory portion.

**Beginning:**

క. శ్రీ సర్వమంగళాకుచ
వాసంతీవకుళగంధవద్వనమాలా
వాసుకివిలాసవేద
వ్యాసమునిమనోనివాస ! హరిహరనాథా !

వ. దేవా వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె.

**Colophon:**

ఇది శ్రీమదుభయకవిమిత్రకొమ్మనామాత్యపుత్త్ర బుధారాధన విరాజి తిక్కనసోమయాజి ప్రణీతంబైన శ్రీమహాభారతకథానంతరంబున శ్రీమత్సకలభాషాభూషణ సాహిత్యరసపోషణ సంవిధాన చక్రవర్తి సంపూర్ణకీర్తి నవీనగుణసనాథ నాచనసోమనాథ ప్రణీతంబైన యుత్తరహరివంశంబునందు బంచమాశ్వాసము.

**End:**

క. . . . . . . . . . .

విడువిడు మనిశూరగణము వేగురపడఁగా
గొడుగులు గగనముఁ గప్పఁగ
జడనిధి పతి వచ్చి నిలిచె సన్నిధ . . .

(వి-వి.)—

అసమగ్రము. ఆఱవయాశ్వాసము తుదముట్ట లేదు. వ్రాఁత తప్పులు సవరింపఁబడినవి. గ్రంథపాతము లెక్కడనే నొకటి రెండు గలవు.

ఇది నాచనసోమనాథకవీశ్వరునిచే రచియింపఁబడినది. ఈ ప్రతియందుఁ గృత్యవతరణము లేదు. గ్రంథకర్తనుగూర్చి యింతకంటె నెక్కువ విశేషము తెలియరావు.

R No. 123.

**Paper.** 11 × 8½ inches Foll. 72 Lines, 8 in a page. Telugu Good.

Restored from a MS of the Library in 1911-12.

**(a)** శివభక్తిదీపిక.

ŚIVABHAKTIDĪPIKA.

Foll. 1a—10a.

**This is a** devotional poem in praise of Śiva by **Ranganamantri.** It is written in a metre called Nayanaragada.

**Complete.**

**Beginning:**

క. శ్రీపార్వతీశుఁ జూడక
పాపాత్ముఁడ నగుచుఁ బోవఁ బథమునఁ జక్రుల్
దీపించు సృష్టి తొలఁగిన
శ్రీపతి నడుగంగఁ జెప్పె శివుఁడే కీర్తిగా.

రగడ.

శ్రీశైలవల్లభుని శిఖరంబుఁ బొడగంటిఁ
గాశీపురాధీశుఁ గౌరీశుఁ బొడగంటిఁ
సర్వలోకేశ్వరుఁ సర్వేశుఁ బొడగంటి
సర్వసంరక్షకుని సర్వంబు పొడగంటి
పరమాత్ము నీశానుఁ బరమేశుఁ బొడగంటి

**End:**

కడఁగి సంసారంబు కడగంటి నని కంటి
కడఁగి శ్రీగిరిచెన్న కారుణ్య మని కంటి
ఘనుఁడు రంగన దూషకరగండఁ డనికంటి
జనకల్పతరులలో జయశాలి యని కంటి
తవిలి రంగనమంత్రి ధన్యాకృతి యని కంటి
భువిలోనఁ బోలాంబ పుణ్యవతి యని కంటి
ఇంక శ్రీగిరి చేర నేఁగందు నని కంటి
శంకరునికృపవడయ సమయ మిది యనికంటి
ఇంక నాయెత్తుకృతు లిత్తు నని పొడగంటి

మృదుఁ డిఁక నాకృతుల్ మెచ్చునని పొడగంటి
తనర శ్రీరంగకవి దాతయని పొడగంటి
భువిలోపలఁ బ్రసిద్ధపుణ్యుఁ డనఁగాఁ గంటి
శివభక్తిదీపి కాచంద్రార్క మని కంటి
శ్రీగిరీశునకు నర్పింతునని పొడగంటి
శ్రీగిరీశ్వరునికృప చెన్నలరునని కంటి

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁతతప్పులు స్థూలదృష్టిని దిద్దఁబడినవి. ఇది యీపుస్తకశాలలోని 13చే యగు శిథిలతాళపత్రప్రతినిబట్టి వ్రాయఁబడినది. గ్రంథపాతములు లేవు.

ఇది 'శివభక్తిదీపిక' యను పేర, రంగనమంత్రిచే శివభక్తిప్రతిపాదకముగా రచియింపఁబడిన రగడ - దీనికి 'నయనరగడ' యనియుఁ బేరుగలదు. గ్రంథకర్తను గూర్చి విశేషము లుదాహృతములగు గ్రంథభాగములను బట్టి గుర్తించునది.

(*b*) సాంబవిలాసము.

SĀMBAVILĀSAMU

Foll 11*a*—71*b*.

This is a Prabandha in two Āśvāsas describing the story of the marriage of Sāmba, son of Śrī-Krsna, with Laksanā, the daughter of Duryōdhana. The author of the work is Vēnkataramana, son of Anantakavi and grandson of Peddana of Kātyāyanasūtra and Bhāradvājagōtra, and a student of the White Yajurvēda The grandfather and the father were poets, and he himself was the author of many other works. Details regarding these are given in the colophon and in the Telugu remarks below

Complete.

**Beginning :**

ఉ. శ్రీకనకాంగివక్షమునఁ జేరిచి సౌఖ్యమునందు దేవున
స్తోకదయాకటాక్షమునఁ జూచి నిజాశ్రితరాజికిఁ సిరుల్
జోక నొసంగు దానగుణశూరు నుమావిభునుత్యచర్యు ద
ర్వీకరరాజగోత్రమున వేడుక నుండెడు స్వామిఁ గొల్చెదన్.

* * * *

సీ. సర్వలక్షణసార సంగ్రహం బొనరించి
తనరె మీతాత పెద్దకవీంద్రుఁ

దలవారిశ్చంద్ర నలాధీశసత్కథా
శ్లేషసత్కృతికిఁ బ్రసిద్ధిగాఁగఁ
గవిహితంబైన వ్యాఖ్యానంబు నొనరించి,
మఱియు . . తినల (?) పరిణయంబు
మొదలైన సత్కావ్యములు చేసి రహిగాంచె
నచల మీతండ్రి యనంతసుకవి •

౪. చిత్రకవి మంజులాన్వయక్షీరవార్ధి
చంద్రమూర్తివి సద్బుద్ధిశాలి. .
నతి ర్వంగఁ బూను
కృతిగతంనంబు (?) నతనికి కంకితమొనర్చు.

**End:**

తోటకము. శరణాగతసజ్జనసంభరణా
శర వాలివినీలలసత్కరణా
స్థిరతామర సవ్రజజిచ్ఛరణా
యురురాక్షసబాహుబలోద్ధరణా!

**Colophon:**

ఇది శ్రీహనూమదీశ్వరప్రసాదలబ్ధసారసారస్వతపాత్ర భారద్వాజ
గోత్రపవిత్ర ప్రథమశాఖావంశసంభవసముజ్జ్వలకావ్యాయఃసూ
త్రలక్షణసారసంగ్రహరచనావిశారదచిత్రకవిపెద్దనార్యపౌత్ర హరి
శ్చంద్రనలోపాఖ్యానవ్యాఖ్యాన హరిహర శ్లేషోదాహరణ సకలజీవ
సంజీవనప్రబంధబంధురవంశావళిసృజనాధురంధరానంతసత్కవీంద్ర
పుత్త్రదయాదాక్షిణ్యాదికసమస్తసద్గుణకదంబాంబాసమానాబళాం
బికాగర్భక్షీరవారాశికుముదబాంధవచరిత్ర శ్రీసుబ్రహ్మణ్యేశ్వరాంజనే
యాంకనమంజుల త్రిలోకసంజీవన్యభిమన్యువిలాససకలవర్ణనాపూ
ర్ణరామాయణ కుమారగురువిలాసాదిదివ్యకావ్యకరణాతిధురీణ
శేముషీవిశేషపారీణ రాఘవపాండవీయ విష్ణుచిత్తీయవసుచరిత్రప్ర
ముఖ దివ్యకావ్యార్థబోధనసర్థమహ్యాదయకమలసకలవిద్వత్కవీం

ద్ర విధేయ వేంకటరమణనామధేయ కవీశ్వర విరచితంబైన సాంబవి లాసంబను మహాప్రబంధంబునందు ద్వితీయాశ్వాసము

(వి-వి.)—

సమగ్రమము. వ్రాంత తప్పులు మెండు. కొన్ని స్థూలదృష్టిని దిద్దఁబడినవి. గ్రంథపాతములు తొల్త గలవు.

సాంబవిలాస మను పేరుగల యీ గ్రంథమున శ్రీకృష్ణదేవుని కుమారుఁడగు సాంబుఁడు దుర్యోధనుకుమార్తె యగు లక్షణను పెండ్లియాడు కథ వర్ణింపఁబడినది. ఈ కృతి వేంకటేశ్వరస్వామి కర్పింపఁబడెను. గ్రంథకర్త చిత్రకవి వేంకటరమణకవి. భార ద్వాజగోత్రుఁడు ప్రథమశాఖద్విజుఁడు. ఈతని తాతతండ్రు లును బ్రఖ్యాతకవీశ్వరులు. తాత, చిత్రకవి పెదన—సర్వలక్షణ సారసంగ్రహకర్త. తండ్రి అనంతకవి—హరిశ్చంద్ర నలోపా ఖ్యానవ్యాఖ్యానము, హరిహరశ్లేషోదాహరణము, సకలజీవ సంజీ వన ప్రబంధము, వంశావళి, యను కృతులు రచియించినవాఁడు తాను—సుబ్రహ్మణ్యేశ్వరాంజనేయాంకనమంజులత్రిలోకసంజీవన్య భిమన్యువిలాస సకలవర్ణనాపూర్ణరామాయణ, కుమారగురువిలా, సాదికావ్య కర్త. మఱియు, రాఘవపాండవీయ విష్ణుచిత్తీయ, వసుచరిత్రప్రముఖ కావ్యార్థబోధనదక్షుఁడు.

---

R. No. 124.

**Paper.** 11 × 8¼ inches Foll. 88 Lines, 17 in a page. Telugu Good.

Transcribed from a MS. of K. R. V. Krṣna Rao Bahadur of Cocanada in 1911-12.

(*a*) హరికారికావళిః (సవృత్తిః).

HARIKĀRIKĀVALIḤ WITH EXPLANATIONS.

Foll. 1*a*—44*b*.

**This is a Sanskrit metrical treatise dealing with Telugu grammar. Explanations and illustrations are said to have been**

added by Śiṣṭu Kṛṣṇamūrti Śāstri. The Sanskrit text and the printed Telugu grammar of Cinnayasūri of Madras closely follow each other, so much so that either of them may be a rendering of the other. As the authors were contemporaries, it cannot be determined who was the borrower. Some are of opinion that Kṛṣṇamūrti Śāstri himself is the author of the Harikārikāvali also.

Complete.

**Beginning:**

శ్లో. శ్రియా హనూమతా మిత్రై
శత్రుఘ్నభరతాంగదైః ।
విభీషణాంగదసుగ్రీవై
స్సేవితం రామ మాశ్రయే.

శ్లో. శివకులకలశజలనిధి
శీతకరః కృష్ణమూర్తిసంఖ్యావాన్ ।
పద్ధ్యేనీస్వతంత్ర
స్తనోతి హరికారికావళీవృత్తిమ్.

సంజ్ఞాపరిచ్ఛేదము.

శ్లో. తాలవ్యదంత్యభేదేన చ జౌ తు వికృతౌ ద్విధా ।
ఇదీ దదే ద్వయయుతౌ తాలవ్యౌ తౌ న చాన్యతః ॥

ఉ. చిలుము, చీటు, చెలి, చేట, జిల, జీను, జెట్టి, జేగురు.

**End:**

శ్లో. యవలా లఘవోఽలఘవ
స్స్యుహ్యాంతి నరౌ తథా లరో రేఫః ।
అన్యే విశేషవిషయా
శ్చార్యవ్యవహారసరణితో జ్ఞేయాః ॥

ఇతిప్రకీర్ణకపరిచ్ఛేదః.

శ్లో. శ్రీకృష్ణమూర్తిరచితా
వృత్తిర్హరికారికావళే శ్శేషా ।

నికటే నివస త్వవనా
వాచం వ్రిరచం కవీంద్రదరింభో ళేః ॥

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁతతప్పులు లేకపో లేదు. గ్రంథపాతములు లేవు.

ఇది సంస్కృతశ్లోకరూపమున నున్న యాంధ్రవ్యాకరణము చిన్నయ్యసూరిగారిచే రచియింపఁబడిన బాలవ్యాకరణమును ఇయ్యదియును ప్రాయికముగా సమానవిషయములై కన్పట్టుచున్నవి. ఒకదానిని బట్టి మఱియొకటి రచింపఁబడినట్లు తోఁచఁదగును. ఏది ముందటిదో! ఈకారికలరచియించిన దెవరో యిందుఁ దెలుపఁబడి యుండలేదు. కాని, తెలుఁగున నున్న యీకారికలవృత్తిమాత్రము శిష్టుకృష్ణమూర్తిశాస్త్రిగారిచే రచియింపఁబడినట్లు గ్రంథాద్యంతములందలి శ్లోకములు తెలుపుచున్నవి. కారికలను గూడఁ గృష్ణమూర్తి శాస్త్రిగారే రచియించి రని వాడుక కలదు. ఎంత నిజమో!

(*b*) ఆంధ్రకౌముది.

ANDHRAKAUMUDI.

Foll. 45*a*—88*a*.

This is a treatise on Telugu grammar resembling the Sanskrit Siddhāntakaumudī of Bhaṭṭōjidīkṣita in plan and arrangement. The Sanskrit Sūtras are explained in Sanskrit and illustrated in Telugu. The author refers to Ātharvana, Kāṇva and Bārhaspatya as older Telugu grammars. He states that Puṣpadanta and Kaṇva were great expounders of Telugu grammar. He also quotes from many works unknown to previous authors The name of the author is Lakṣmīnṛsimhakavi, and he was the son of Varadayajvan and Nāñcāramāmba. From the quotations contained in the work it may be inferred that he lived in recent times.

**Incomplete; stops with the 52nd Sūtra in the Kriyāprakaraṇa.**

**Beginning:**

శ్లో. వాచే భద్రం భవతు వినతానూనవేఽస్తు ప్రణామో
ధ్యాత్వా లక్ష్మీం నృహరి మధునా మానసే సోమచంద్రౌ।
కణ్వం సోమం భృగుముని మహం పుష్పదంతం కవీంద్రం
విష్ణుం చంద్రం సురమునిగురుం నాగరాజం నమామి॥

శ్లో. అథర్వణాని కాణ్వాని బార్హస్పత్యాని సంవిదన్ ।
కౌముదీ మాంధ్రశబ్దానాం సూత్రాణి చ కరోమ్యహమ్ ॥

శ్లో. నాంచారమాంబాతనయ స్సూనుర్వరదయజ్వనః ।
లక్ష్మీనృసింహసుకవీ రాజతే మండ? ధ్వవంశజః ॥

శ్లో. అష్టభాషాసు విరతో భాండీరప్రాకృతాదిషు ।
వాచా చాతుర్యవిజితత్రిదశాచార్యవాక్పతిః ॥

పూర్వమే వాంధ్రభాషోత్పత్తి ర్భగవతా వాల్మీకినాప్రోక్తాప్రాకృతాదిషు.

**End:**

౫౨ వర్ణలోపాగమాః పురుషార్థవచనేషు.

ప్రథమాదపురుషేషు తద్ధర్మాద్యర్థేషు వచనేషు చ దేశ్యక్రియాణాం వర్ణలోపాగమాస్స్యుః వర్ణానాం లోపశ్చ ఆగమశ్చ వర్ణలోపాగమాశ్చ

ఉ. వచ్చెను, వచ్చుచున్నాఁడు, రాఁగలఁడు, రప్పించెన్, రాఁడు, తినెను, తించున్నాఁడు, తినును, తినఁగలఁడు, ఇత్యాది.

(వి-వి.)—

అసమగ్రము. ఆదినుండి క్రియాప్రకరణమున నేఁబదిరెండవ సూత్రమువఱకుఁ గలదు. తప్పు లల్పము గ్రంథపాతములు లేవు.

సంస్కృతభాషకు సిద్ధాంతకౌముదియను పేర నున్నవ్యాకరణ గ్రంథమువలెఁ దెల్గునకును సంస్కృతభాషలోనే సూత్రరూపముగా వరదయజ్వకును నాంచారమాంబకును కుమారుఁడగు లక్ష్మీనృసింహ

కవిచే నాంధ్రశబ్దముదియను నీగ్రంథము రచియింపఁబడినది. అథర్వణ కాణ్వ వార్హస్పత్య సూత్రములఁ బరిశీలించి యీగ్రంథము రచియింపఁబడినట్లు గ్రంథకర్త చెప్పికొన్నాఁడు. పుష్పదంత కణ్వాదులు తొల్లి యాంధ్రభాషాలక్షణప్రవర్తులయిన ట్లందుఁ జెప్పఁబడెను. సూత్రములకు సంస్కృతమునఁనే వృత్తియును [illegible]న నుదాహరణములును జేర్పఁబడినవి. అసాధువులుగాఁ దలఁపఁబడుపదములు పెక్కు యీగ్రంథమున సాధువులుగా రూపనిష్పత్తి కల్పింపఁబడినది. ఈవ్యాకరణమున నుదాహరింపఁబడిన లక్ష్యములను బట్టి యిదికొలఁది కాలముక్రిందటి గ్రంథమే గాని ప్రాచీనమైనది గాదని గుర్తింప నగును. ఈ గ్రంథమును బఠించిన నిం దసత్యకల్పనములు కొన్ని కావింప బడినట్టు స్పష్టపడును.

---

R No. 125.

Paper. 11 × 8½ inches. Foll 63. Lines, 18 in a page. Telugu. Good.

Restored from a palm-leaf MS. of the Library in 1911-12.

(*a*) చంద్రాభ్యుదయము.

CANDRĀBHYUDAYAMU

Foll 1*a*--31*b*

This Prabandha narrates the story of Suśīla and describes her chastity and faithfulness as a wife. The author of the work is Pōcana, son of Nṛsiṁhasōmayāji; and it is dedicated to Cinnayāmātya, son of Ammanamantri and Sūrama.

Incomplete; contains to the end of the second Āśvāsa; the introduction is wanting

**Beginning:**

సీ. మందారమంజరీమధుకరాయితసౌధ
వలభివాసనశిలావలయు(యి?)తంబు
కల్పపాదపకోరకచ్ఛటాయితరాజ
మార్గతోరణలతామౌక్తికాళి

సంతానశాఖాకినః యాయితస్థార
హార్మ్యరమ్యాబ్జరాగాంశులవారి
హరిచందనద్రుమనూనా వాయితగోత్రు
రాట్రగోకృధికో గ్రపరిధ

గీ. పారిజాతపిక వ్రాతపచమయి
తాళనవచంద్రశైలావిహార శౌర
యువతిగీతాద్భుతస్వాంతః విధగగన
చరమునై యొప్పు ధరం ప్రతిష్ఠానపురము.

**End:**

చా. ధరాధరానివార్యధైర్యధామభీమధీ
ఘరాశు(?)గానుభావభావబంధుసింధువారిధీ
నరాంతరాహి(?)వాసనస్వకీర్తిచందనా

**Colophon:**

ఇది శ్రీధేనువాగీశ్వరప్రసాదలబ్ధకవితావైభవ నృసింహాసోమయాజితనూభవ బుధవిధేయ పోచననామధేయప్రణీతంబైన చంద్రాభ్యుదయంబునందు ద్వితీయాశ్వాసము.

(వి-వి.)—

అసమగ్రము. రెండాశ్వాసములుమాత్రమే కలవు. కృత్యవతరణము లేదు. వ్రాంత తిన్నగిది. తప్పులు గలవు. గ్రంథపాతములు గలవు.

చంద్రాభ్యుదయమును పేరుగల యీ ప్రబంధము పోచనయను కవిచే రచియింపబడినది. ఈతని తండ్రిపేరు నృసింహాసోమయాజి. ఈకృతి యన్మనమంత్రికిని నారమకును కుమారుండగు చిన్నయామాత్యున కంకితము సేయబడినది. సుశీలయను పతివ్రతాచూణి చరిత్ర మిందు వర్ణింపబడెను. ఈ ప్రతియందు గ్రంథమసమగ్రమై యుండుటచే, కాతకంబెట్టు తెలుపదగిన విషయము కన్పట్టినది కాదు.

(*b*) సస్యానందము.

SASYĀNANDAMU.

Foll. 33*a*—60*b*.

This is a short treatise in verse on agriculture, dealing chiefly with the value of rain in the various seasons of the year and the character of the crops to be raised in various kinds of localities in relation to the seasonal rains By Addanki Lingakavi, son of Drōṇayāmātya

Complete

**Beginning**:

క. శ్రీనగమందిరు గౌరీ
మానసపంకరుహామత్తమధుపేంద్రుని ని
త్యానందమూర్తి శంకరు
నానతవాగీశు మల్లికార్జునుఁ గొలుతున్.

క. సదమలవాక్యస్ఫురణము
పదలాలిత్యంబు దాచి ప్రాజ్ఞులు మెచ్చన్
ముదమున సస్యానందము
వదలక రచియింతు విబుధవర్గం బలరన్.

**End**:

క. ఈసస్యానందమునకు
భాసురముగఁ గాలగతులు పరమార్థముగా
నీసవి సెలఁగుం దని కృతి
వాసన నద్దంకి లింగనార్యుఁడు చెప్పెన్.

**Colophon**:

ఇది సకలజనస్తుత్య (ద్రోణయామాత్యపుత్ర) సజ్జనవిధేయ అద్దంకిలింగననామధేయ ప్రణీతంబైన సస్యానందము సమాప్తము.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత తప్పులుగలవు. గ్రంథపాతములును గలవు.

సస్యానందమను పేర నద్దంకి లింగకవిచే రచియింపఁబడిన యీ గ్రంథమున దేశకాలాది భేదములనుబట్టి కల్గు వృష్ట్యాదియోగములును, తత్తత్సస్యలాభాలాభములును దెలుపఁబడినవి.

---

(c) ప్రభవాదివత్సరఫలము.

PRABHAVÂDIVATSARAPHALAMU

Foll. 61*a*—62*b*.

A treatise predicting the rainfall and other allied meteorological conditions in each of the sixty cyclic years named Prabhava, Vibhava, etc.

Incomplete.

**Beginning:**

క. భూనాథుల కతిశయముగ
వానలుపాడకట్టుఁ గూరియు వసుమతియందున్
ధేనువులు పిదుకు నధికము
శ్రీనిధి ప్రభవాబ్దమందు సింహాద్రివరా ।

**End:**

క. ధరమన్మథదుర్ముఖులును
నరయంగా మధ్యవృష్టి నారంభంబుల్
నెఱి నల్పఫలితమందును
పరమభయము దక్షిణాదిపథముల నొందున్

(వి-పి.)—

అసమగ్రము. వ్రాఁత తప్పులుగలవు.

ప్రభవమొదలగు వత్సరములందు వర్షయోగము లెట్లుండునో యిందుఁ దెలుపఁబడినది. గ్రంథకర్తయెవరో తెలియదు.

---

## R. No 126.

**Paper.** 11 × 8½ inches. Foll. 20. Lines, 18 in a page. Telugu. Good.

**Restored from a palm-leaf MS. of the Library in 1911-12.**

(*a*) పెదళ్లరివిజయము.

PEDAḶGARIVIJAYAMU.

Foll. 1*a*—13*b*.

This narrates in stanzas in the Peddayutpalamālika metre the victory won on the four ramparts of the Tanjore fort by Pedaḷgari, a ruling chief of Tanjore, over the son of Sāhaji, who attacked it to regain it as one of his father's possessions.

Complete.

**Beginning:**

ఉ. పోటరి నంట తా సహాజిపుత్త్రుఁ డాకానాకనాఁడు తూరుపుం
బేఁటకుఁ జేరి తంజపుటభేదనఁ గదలి విష్ణుచక్రపుం
గోటకు లగ్గ లెక్కుమదిఁ గోరి కరోరవజీరకోటికిన్
హాటకటంకముల్ బిరుదులైనసవాలు సరాలు మాడ లే
ర్పాటుగఁ *డెమ్ముల్ మెఱఁగుఁబట్టెసముల్ దగళ్లాల్ నెరాజి
[రాల్

**End:**

. . . . . . . . . . . . పెళ్లగిమా
పాలునితోడుతన్ దెలుపఁ బల్కులు వారికి వస్తువాహనాల్
చేలములున్ ధనంబులు విశేషమణుల్ దయచేసి కోపపా
పాలయులైన వారిసకలార్థములున్ సమానాఁడ ఖాసదా
గీలకు వెచ్చపెట్టి విగిరించిన చిత్తముతోడ వేడుకల్
చాలుకొనన్ బసి డిమొగసాలఁ గిరీటపతుల్ నుతింపఁ బే
రోలగమై తదీయవిజయోచితవార్త నెఱంగ సంగతిన్
సా(?)లుమలోన జాగటలు చాటఁగఁ బంచి భజించి రాజగో
పాలునకున్ రథోత్సవము బళి తిరునాళ్ల ఘటించి నిత్యల
క్ష్మీలనాభివారుఁ డయి చెను గహించుచు ముద్దుపిరభూ
పాలపెదళ్లరిప్రభుఁ డపారశుభోన్నతి ధాత్రివర్ధిలున్.

(వి-వి)—

సమగ్రము. వ్రాఁతతప్పులు గలవు. మాతృకలోనియల్పపుగ్రంథపాతము లిందును జేరినవి.

పెదళ్గరివిజయ మను పేరుగల యీ గ్రంథమునఁ బూర్వమాలిక, దక్షిణపుమాలిక, పడమటిమాలిక, ఉత్తరపుమాలిక యని నాల్గు పెద్దయుత్సేమాలికలు గలవు. పెదళ్గరి ప్రభుఁడు తంజావూరుపాలకుఁడైయుండు కాలమున, శాహాజపుత్త్రుఁడు(?) తంజావూరుజయింపఁబోయి యచ్చటిడికోట నలుప్రక్కలను బెదళ్గరితోఁబోరాడి యోడిపోయిన విధము నాలుగు మాలికలలోను వర్ణింపఁబడినది.

(*b*) వనవిహారవచనము (?)

VANAVIHĀRAVACANAMU

**Foll.** 13*b*—16*a*

This is a description of lovers' sports in a forest; and as the name of Rāghava occurs in it, it seems to be a portion of a work probably based on the story of Rāma. The portion contained in the MS. is grouped in nine sections each of which is characterised by particular syllables in alliteration.

Wants beginning and end.

**Beginning:**

ఇత్తెఱంగున నత్తెఱవ లత్తఱిసి వత్తగిలని బిత్తరితనంబున నడలు హత్తిన బిత్తరపుఁ బుత్తడిపతిమలన నుత్తరిగలుమఱియ నెత్తరవుల పొలపు రిత్తగా రయాయత్తంబులగు పత్తద్గతుల నుత్తరంగితకుతుకంబు చిత్తంబున నత్తమిల్ల రుచిమత్తల్లికలు మత్తిల్లిన తత్తరంబున నెలదీఁగయల నెత్తిన యలరుగొత్తుల ప్రోబగు గుత్తి గొనుచు.—

**End:**

చూపుఁగోపు లుద్దీపనంబుగాఁ జూపుం గుసుమాపచయంబు సేయుచు, నయ్యంగజయానను దండ(?)గతులఁ జెలంగ నారాఘవుఁడుం దుమవనంబుద డకు. జని యొండొరులం గనుంగొను (?)౯॥

(వి-వి.)—

మొదలు లేదు, తుది లేదు. వ్రాఁతతప్పులు గలవు. గ్రంథపాతములు గలవు.

ఈవచనమున రాఘవుని పేరు వచ్చుటచే నిది యొక రామాయణరచనములోనిదై యుండునని యూహింప నగును. తొమ్మిది తెలుఁగులయనుప్రాసములతో నీవచనము తొమ్మిది తుంపులుగా విభజింపఁబడినది. ఇందు వర్ణింపఁబడినవిషయము వనవిహారమే.

(c) శేషార్యోదాహరణము.

SEṢĀRYŌDĀHARAṆAMU.

Foll. 16a—20b.

This consists of eight stanzas, each of them being followed by passages in the Kalika and Utkalika metre which are intended to be sung. The work is in praise of Śēsārya of Nallandigaḷ family, and a minister of a king of Madura. Each of the stanzas describe him, using his name in one of the eight declensional cases. The author of the work is Anantaya.

Complete.

**Beginning:**

ఉ. శ్రీనల్లందిగళన్వవాయ మవనిఁ జెన్నొందు నేవంశమం
దానారాయణజీయ్యలంచనఁగఁ దా నారాయణుం డుద్భవం
బైనాఁ డందుఁ జెలంగు తిర్మలసుధీపాథోధిచంద్రుండు దా
నానూనస్థిరకీర్తి శేషఘనుఁ డుద్యద్ధర్మశర్మాఢ్యుఁడై.

కలిక.

మఱియు పారసగర్భసారసమగ్రసారసమాన్యచరితుఁడు
వరసభార సభావభారసవర్ణ్యభారసమాన(?) రితుఁడు.

**End:**

ఉత్కలిక.

శ్రీరామపదభజన
సారస్వతిద్వ్యజన
సారశ్యసంప్రాప్త

వైరశ్వరహితాప్త
రక్షణవినిస్తంద్ర
వీక్షలక్ష్మీసాంద్ర
నవ్యనిజమణిసౌధ
భవ్యగుణగణబోధ

ము. కులరత్నాంబవు నీవు, నిన్నెనయు శ్రీ, కొల్లాప్పు నీచేతఁ, గీ
ర్తులు నీకై హరియిచ్చు, నీవలన మీఱఁగా వన్నెయుఁగా వాసి, నీ
కలరుఁ గా సొమ్ములు విద్య, హృద్యముగ నీయం దార్జవం బౌరనం
చలద క్ష్యంచశరాంక! తిర్మలయ శేషా పోషితార్యోత్తమా!

క. చెలఁగ నుదాహరణం బిది
కలసన్నిభ కలకవియనంతయ నీకై
వెలయించెఁ దీనిఁ గైకొను
మలఘుసమున్నేష! తిరుమలార్యుని శేషా!

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁతతప్పులు గలవు. గ్రంథపాతములు లేవు.

నల్లందిఘళ్ వంశజనితుఁడయిన శేషార్యుని ప్రశస్తిని వర్ణించుచు బాలకవియనంతయ్య యీ యుదాహరణమును రచియించెను. ఉదాహరణ మనఁగా—సంబుద్ధితో నెనిమిద యగు విభక్తులతో నెనిమిదిపద్యములును, కళికలును, నుత్కళికలును గలుగునట్లు చెప్పఁబడిన ప్రబంధభేదము. విశేషముల నుదాహరింపఁబడిన పద్యములఁ జూచునది.

## R. No. 127.

**Paper.** 11 × 8¾ inches. Foll. 411. Lines, 18 in a page. Telugu. Good.

Restored from a palm-leaf Ms. of the Library in 1911-12.

సకలవర్ణనాపూర్ణరామాయణము.

SAKALAVARṆANĀPŪRṆARĀMĀYAṆAMU.

This is a Prabandha in six Kāṇḍas dealing with the story of the Rāmāyaṇa: by Vēṅkaṭaramaṇa, who is the same as the author of Sāmbavilāsa described under R. No. 123(*b*) *ante*. For further particulars about him, see under that number. The work is dedicated to one Subbarāya.

Complete.

**Beginning:**

సీ. శ్రీలక్ష్మీ నురమునఁ జేర్చి సంతోషంబు
గాంచువాఁ డసురులఁ ద్రుంచువాఁడు
జాళువాబంగారు మేలిదుప్పటి గట్టి
మలయువాఁ ?
? బులునహించి
తనరువాఁ డచలమా నెనరువాఁడు

గీ. భూరి ? కారకారి
వారిశుభకరానంతకళ్యాణగుణుఁడు
శక్రముఖ్యాఖిలామరసక్రసక్తి
కీర్తిసద్వృత్తి శ్రీవిష్ణుమూర్తియొప్పు.

**End:**

మ. అనఘుప్రాభవదర్పణాభరణదీవ్యన్మందిరా ఘుందిరా
వనజాతీవరధాత్రుశంకరసుఖాపారోప సందారితా
రినికాయాగయసంభృతార్తజనసద్రీచీనచర్యాతిపా
వన దీనావన దానభాజనజనప్రస్తూయమానోదయా!

క. ప్రతిపర్వదివససేవా
గతభూజననేత్రమోదకరనూర్యవిభా
తతదివ్యమంగళాకృతి
భృతసేవక సుబ్బరాయ బుధ (?) జనగేయా!

భు ప్ర. ధరాభాగభక్తప్రతానావనాఢ్యా
స్ఫురత్తేరగంధర్వసూరిప్రజేడ్యా
శరప్రోద్భవాకార! సాధుప్రచారా
స్థిరానందసంయుక్త! దివ్యద్విహారా!

**Colophon**:

ఇది శ్రీహనుమద్వరప్రసాదలబ్ధసారస్వతపాత్ర భారద్వాజగోత్రపవిత్ర, లక్షణసారసంగ్రహరచనావిశారద చిత్రకవి పెద్దనార్యపౌత్ర, హరిశ్చంద్రనలోపాఖ్యానవ్యాఖ్యానహంసార శ్లేషోదాహరణస్రుజనధురంధరానంతసత్కవీంద్రపుత్ర, దయాదాక్షిణ్యాదికసమస్తసద్గుణకదంబాంబాసమానౌభళాంబికాగర్భశుక్తిరత్నాగాశికుముదబాంధవచరిత్ర, శ్రీసుబ్రహ్మణ్యేశ్వరాంజనేయాంకనమంజులత్రిలోకసంజీవన్యభిమన్యువిలాసాదికదివ్యకావ్యకరణాతిధురీణశేముషీపారీణ, రాఘవపాండవీయముఖ్యకఠినకావ్యార్థబోధనసమర్థవ్యాపకమల, సకలవిద్వత్కవీంద్రవిధేయ, వేంకటరమణనామధేయకవీశ్వర విరచితంబైన విద్వత్కవికర్ణరసాయనశ్రోత్రైకదక్షా సకలవర్ణనాపూర్ణరామాయణం బను మహాకావ్యంబునందు యుద్ధకాండంబు సంపూర్ణము.

(వి-వి.)—

సమగ్రము. కృత్యవతరణ మిందు లేదు. వ్రాంతతప్పులు హెచ్చు. గ్రంథపాతములును మెండుగాఁ గలవు.

'సకలవర్ణనాపూర్ణరామాయణ' మను నీప్రబంధమున శ్రీరాముఁ చరిత్రము వర్ణింపఁబడినది ఏతద్గ్రంథకర్త చిత్రకవి వేంకటరమణకవి. నం. 123b రునవర్ణింపఁబడిన సాంబవిలాస మీకవిచే నేతద్గ్రంథరచనానంతరము రచింపఁబడెను. కవిని గూర్చి తెలిసికొనవలసినదాని కచ్చోఁ జూచునది. ఈగ్రంథము, ఎవ్వరో 'సుబ్బరాయఁ' డనునాతనికిఁ గృతిగా నొసఁగఁబడినది. కృత్యవతారమిందు లేమిచే నావిషయము లిందు విస్పష్టముగాఁ దెలుపఁబడుదరదయ్యె.

R. No. **128.**

Paper 11 × 8¾ inches. Foll. 75. Lines, 18 in a page. Telugu. Good.

Restored from a palm-leaf MS. of the Library in 1911–12.

This MS. contains mainly a number of hymns of praise addressed to deities worshipped in some of the shrines in Southern India.

(*a*) సింహాద్రినాథశతకము.

SIṀHĀDRINĀTHAŚATAKAMU.

Foll. 1*a*—8*a*.

A hymn of a hundred stanzas in praise of God Nṛsiṁha worshipped in the shrine on the hill at Siṁhācala in the Vizagapatam district. All the stanzas end with the same refrain. The name of the author is not known.

Contains only stanzas 1 to 13.

**Beginning:**

సీ. శ్రీదేవి నలివిరాజిత భుజాంతరమునఁ
దాల్చిన దేవ! నీదాసులకును
పుణ్యతీర్థము పదాంభోజాతతలమునఁ
జేసిన దేవ! నీసేవకులకు
చక్రముఖాయుధచయము కరంబునఁ
బట్టిన దేవ నీభక్తులకును
కారుణ్యరసము శృంగారలోచనములపైఁ
జేర్చిన దేవ నీభృత్యులకును
గీ. కలఁగరాదు దారిద్ర్యంబు కల్మషంబు
దరలరాదు భయంబును దుర్గతియును
నీవె గతి నాకు నన్ను మన్నించి ప్రోవు
మాశ్రితామరయూథ! సింహాద్రినాథ!

nd

సీ. పైదైన నెకకార్య మెంచి గ్రక్కునఁ జేసి
వెనుకఁ జింతించుట వెఱ్ఱితనము

ఎంతటిసామ్మైన నెడలి చేతప్పిన
పిదపఁ జింతించుట మదటతనము
ఎప్పు డాడినమాట కప్పు డుత్తరమీక
పిమ్మటఁ దలపోఁత బేలుఁదనము
పరిఠి నె॥నైన నికుఁపాటునఁ జికిఁ (?)
యిలుదూరి యెన్నుట యెన్నదనము (?)

గీ. . . . . . . . .
ఎంతగలిగినబోనేర దంత యెఱఁగి
చంచరింపనువాఁడు సుజ్ఞానవంతుఁ
డాశ్రితామరయూథ! సింహాద్రినాథ!

(వి-వి.)—

అసమగ్రము. ౧౩ పద్యములు మాత్రమే కలవు. వ్రాఁత తిన్ననైనది కాదు. తప్పులు మెండు.

"ఆశ్రితామరయూథ! సింహాద్రినాథ" అను మకుటముగల యీసీసపద్యశతక మెవరిచే రచింపఁబడెనో తెలియదు. విశాఖ పట్టణమండలమందలి సింహాచలపున్నసింహస్వామి పేర నిందలిపద్యములు, లోకనీతిస్తుత్యాత్మకములై యున్నవి.

---

(*b*) విహంగవాహనశతకము.

VIHAṄGAVĀHANAŚATAKAMU

Foll. 8*a*—16*b*.

A hymn of one hundred stanzas in the Campakōtpalamālika metre and in praise of Raṅganātha worshipped in the Viṣṇu shrine at Rangapaṭṭaṇa. Whether Srirangam or Seringapatam is meant by Rangapaṭṭana cannot be ascertained.

Complete.

**Beginning:**

ఉ. శ్రీరమణీమనం బలరఁ జిత్తజుఁ గన్నకృపాపయోనిధీ
నీరజనేత్ర! నీవె గతి నిర్మలగాత్ర మునీంద్రవంద్య నేఁ

గోరినకోర్కు లన్నియును దీరిమి నీకృపచేత యిమ్ముగాఁ
జేరునె రంగపట్టణము శ్రీపతి రంగ విహంగవాహనా!

**End:**

చ. సిరిగలదేవ దేవనుత చిన్మయమూర్తి యనంతశాయి యో
నిరుపమసత్కృపామహిమ! నీకును వృత్తశతంబు భక్తితో
నరయఁగ విన్నవించి తిపు డౌననఁ గైకొని నన్ను నేలుమీ
స్థిరముగ రంగపట్టణము శ్రీపతి రంగ విహంగవాహనా!

(వి-వి.)—

సమగ్రము. ౧౦౦ పద్యములు గలవు. వ్రాఁత తప్పులు మెండు.

"రంగపట్టణము శ్రీపతిరంగవిహంగవాహనా" యను మకుటము గల యాచంపకోత్పలమాలికల శతకము రచియించిన దెవరో తెలియదు. రంగపట్టణమున వెలసిన రంగనాయకస్వామిమీఁద శృంగారస్తుత్యాత్మకములుగా నీపద్యములు రచియింపఁబడినవి. ఈరంగపట్టణము తిరుచనాపల్లిదగ్గరిదో మైసూరుప్రాంతమందలిదో గుర్తింపరాదు. గ్రంథాంతమున మూషకమార్జాలములపైఁ జెప్పఁబడిన సీసపద్యములు రెండుగలవు.

(*c*) సరస్వతీతారావళి.

SARASVATĪTĀRĀVALI

Foll. 16*b*—20*a*.

A hymn of twenty-seven stanzas in praise of Sarasvatī, the goddess of learning.

Complete

**Beginning:**

ఉ. శ్రీనిధివై సమస్తజనసేవితపాదసరోజయుగ్మవై
భూనుతకీర్తివై విపులపుస్తకహస్తవు గాఁగ నీపద
ధ్యానము చేసి వే . . కటాక్షముగా మది మెచ్చ నీయవే
మానక సంస్తుతింతు మది మానవతీ యువతీ సరస్వతీ!

**End:**

చ. పరిణతవాగ్విలాసముల భక్తిని మీఁ పచేత వృత్తముల్
స్థిరముగ తారహారముగఁ జేసియు నీకును విన్నవించి త
ట్లరయఁగ ధాత్రిపై సుకవు లౌననఁ జేకొని వేడ్క నేలు నఁ
మఱవక భారతీ సుదతి మానవతీ యువతీ సరస్వతీ!

(వి-వి.)—

సమగ్రము. ౨౭ పద్యములు గలవు. వ్రాఁత నిర్దుష్టము కాదు.

“మానవతీయువతీసరస్వతీ” యను మకుటముగల యీ యిరువదియేడుపద్యములు నెవ్వరిచే రచియింపఁబడెనో గుర్తింపరాదు. ఇందు సరస్వతీస్తుతి ప్రతిపాదింపఁబడినది.

(*d*) చెన్నకేశవశతకము.

CENNAKĒŚAVAŚATAKAMU.

Foll 20*a*—26*b*.

A centum of stanzas in Śārdūlavikrīdita metre in praise of Visnu worshipped as Cennakēśava at Gundālapura.

Incomplete ; contains stanzas 1 to 55.

**Beginning:**

శా. దండం బంబుధికన్యకాధవునకున్ దైత్యారికిన్ శరణు (?)
దండం బభ్రగరాజవాహునకున్ దాక్షాయణీశస్తుతా
ఖండప్రాభవశాలికిన్ సకలలోకస్వామికిన్ నీక [illegible]
గుండాలాధిప! చెన్నకేశవ హరీ గోవర్ధనోద్ధారకా!

**End:**

శా. కండల్ రక్తము మూత్రమున్ మలము త్వక్ఛల్యాదిగల్పించిన
ట్టిండుల్ మేనులు ప్రాణవాయుచయ మీ హేయంబులోనుండి కే
దోండింబోవునా నిర్దయుల్ జమునిభృత్యుల్ నన్ను రక్షింపవే
గుండాలాధిప! చెన్నకేశవ! హరీ! గోవర్ధనోద్ధారకా!

(వి-వి.)—

అసమగ్రము. 55 పద్యములే కలవు. వ్రాఁత తప్పులు మెండు గ్రంథపాతములు లేవు.

"గుండాలాధిప చెన్నకేశవహరీ గోవర్ధనోద్ధారకా" అనుమకుటపు శార్దూలవృత్తములు గల యీశతక మెవనిచే రచింపఁబడెనో తెలియదు. గుండాలపురమున వెలసిన చెన్నకేశవుని పేరఁ జెప్పఁబడిన యీశతకపుఁ బద్యములు లోకనీతిస్తుత్యాత్మకములై యున్నవి.

---

(*e*) మాధవాష్టకము.

MĀDHAVĀṢṬAKAMU.

Foll 26*b*—27*a*.

Eight stanzas in praise of Visnu worshipped as Mādhava in the shrine at Gōrantlapura

Complete

**Beginning:**

మామకును సవు కోడ లైతివి మాఁగలోనే వుంటివి
మాఁగకూతురు మగనితమ్ముని మాడుపై పవళిస్తివి
మామలో జనియించి పెంచిన మంచికోడలి దెస్తివి
మామతమ్ముడవైన గోరంట్ల మాధవేశ దయానిధీ!

**End:**

మాధవాష్టక మెవరు చదివిన మనుజు లెవ్వరు వ్రాసినా
ఆఁగరమ్మున విన్నవానికి నష్టభోగము లిత్తువూ
బోధగలిగిన మంచిపుత్త్రుల పుణ్య మధికం బిస్తివూ
రాధికావిభుడైన గోరంట్లమాధవేశ దయానిధీ!

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత తప్పులు గలవు. గ్రంథపాతములు లేవు.

గోరంట్లపురమున వెలసిన మాధవునిపై వ్యావహారికభాషలో స్తుత్యాత్మకముగా నీయష్టక మెవనిచేతనో రచింపఁబడినది.

(f) వేంకటేశ్వరాష్టకము.

VĒṄKAṬĒŚVARĀṢṬAKAMU.

Foll. 27b—28b.

Eight stanzas in praise of Viṣṇu worshipped as Vēṅkaṭēśvara on the Tirupati hills.

Complete

**Beginning** :

> శ్రీరమాంగమణీమనోహర శీతభానుకళాననా
> వారిజాసనవంద్య దానవవంశసంహారకారణా
> వారిజాక్షిని జూడరా శుకవాణిరా పువుబోణిరా
> వీరసామజసింహ తిరుపతి వేంకటాచలవల్లభా !

**End** :

> పొందు లక్ష్యము సేయ నేటికి పొన్నపూవులపాన్పుపై
> అంద మలరంగ జాజికయ్యను అతివ నేలుకొ వేడ్కతో
> ముందు నీ వని నమ్మియుంటిని మోసపోతిని దానికి
> ఇందుపై దయసేయు తిరుపతి వేంకటాచలవల్లభా !

(వి-వి.)—

సమగ్రము. వ్రాంత తప్పులు గలవు. గ్రంథపాతములు లేవు. తిరుపతివేంకటేశ్వరస్వామి మీఁద శృంగారరసాత్మక మగు నీపద్యాష్టక మెవ్వరిచే రచింపఁబడెనో తెలియదు.

---

(g) రఘురామాష్టకము.

RAGHURĀMĀṢṬAKAMU

Foll 28b—29a and 30a

Eight stanzas in praise of Rāma, worshipped at Oṇṭimiṭṭa in the Cuddapah district

Complete.

**Beginning** :

> మానవతి వినవమ్మ చంద్రుఁడు మంచివెన్నెల గాసెనే
> సూనశరముగ వింట మదనుఁడు సూటిదప్పక (యేసెనే !)

భాను తేజుఁడు తెలిసి యంతటఁ బంతమున నను డాసెనే
మేన గంధము పూసెనే ఒంటిమిట్ట శ్రీరఘురాముఁడు

**End:**

మంచిగుణముల జనుల . మహిమతో రక్షించునే
పంచబాణునిబాహుబలముల . . పారఁగఁ దోలునే
మించి కృప నన్నేలునే ఒంటిమిట్ట శ్రీరఘురాముఁడు.

(బి-కి.)—

సమగ్రము. వ్రాఁత నిర్దుష్టముకాదు. పాఠములు గలవు.

ఈ యష్టకము ఒంటిమిట్ట పురమున వెలసిన శ్రీరాముని మీఁదఁ జెప్పఁబడినది. రచించినదెవరో. శృంగారరసాత్మకము.

---

(*h*) రాఘవాష్టకము.

RĀGHAVĀṢṬAKAMU

Foll. 29—30*a* and 31.

A hymn of eight stanzas in praise of Rāghava or Rāma, the hero of the Rāmāyana

Complete.

**Beginning:**

కలికిరా పూములికిరా ముద్దుచిలుకరా అల కేలరా
కులుకుగుబ్బలతో ఘుకు చెలఁగెడి కొమ్మరా ముద్దుగుమ్మరా !
ఉభులు మోయఁగ నంతకంతకు నలరి వెన్నెలగాయఁగా
జలజలోచన యోర్వలే దిఁక జానకీపతిరాఘవా !

**End:**

పొంచి మదనుఁడు శరము వేయుచు నంచగమనపై నించఁగా
మించె విరహము మీనలోచన యెంచఁగా దయయుంచరా
అంచితంబుగ దైవరాయ మే లెంచియును లాలించియుఁ
చంచలాక్షిని నేలు వేడుక జానకీపతి రాఘవా !

వసుమతీసుత వాసవార్చిత వారిజానన మిక్కిలీ
కుసుమకోమలి కిసలయాధర బిసరుహాయతనేత్ర రా

పసిమిగలిగిన భామరత్నము నేలుకో రహిమించరా
. భరమునకు నోర్వదు రామచంద్రదయానిధే!

(వి-వి.)—

సమగ్రము. వ్రాంత తప్పులు గలవు. పాతములు గలవు.

'రాఘవా' యను మకుటముగల యీశృంగారపద్యాష్టక మె
వరిచే రచింపఁబడెనో తెలియదు.

(i) కడపాధినాయకాష్టకము.

KADAPÂDHINÂYAKÂSṬAKAMU.

Foll. 30*a*—31*a* and 32.

Eight stanzas of praise and prayer addressed to God Vēṅkatēśvara, worshipped at Kaḍapapura now known as Cuddapah.

Complete.

**Beginning :**

కలకంఠీ కలహంసచారుగమనా కాంచీకలాపోజ్జ్వలా
అలివేణీ కుసుమాంగి చంద్రవదనా హంస్యకమధ్యా శుభా
. . . . దయతో నాపై కటాక్షించవే
చెలియా నే కడపాధినాయకుడనే శ్రీవేంకటాధీశునే :

**End:**

వడదేరఁగ విడె మిచ్చి మచ్చి కలరఁగ వామాక్షి నీ చెంతలో
కడువేడ్కఁగ మరుకేళిగూడితివిగా సౌఖ్యంబు నాకబ్బెనే
పుడమిన్ యిద్దర మొక్కటై జగములన్ బోషించుచున్ యెప్పుడున్
కడపాదున్ వసియించి యుందము సదా కాంతాశిరోరత్నమా!

(వి-వి.)—

సమగ్రము. వ్రాంతతప్పులు గలవు. పాతములు గలవు.

కడపపురమున వెలసిన వేంకటేశ్వరస్వామిపేర నున్నయీ
శృంగారపద్యాష్టక మెవ్వరిచే రచింపఁబడెనో యెఱుఁగరాదు.

(*j*) కోనేటిరాయాష్టకము.

KŌNĒṬIRĀYĀṢṬAKAMU.

Fol. 33.

Eight stanzas in praise of God Kōnētirāya worshipped in the village of Kīlupatla.

Incomplete; contains only 5 stanzas

**Beginning:**

శ్రీలు మించినపేడమీద వసించి వుయ్యాలశయ్యను
బాల నిన్నటినుండి వుండె నీపాదమాన నిజంబురా
ఏలరా చెలి గోలరా దయ నేలరా కడువేడ్కతో
ఏలతాంగిని కీలుపట్లకోనేటిరాయ దయానిధీ!

**End:**

జారుకొప్పును దువ్వి కస్తురి నీరుబొట్టును దిద్దియుక్
కోరపయ్యెద చక్కనొత్తి యొయారిగుబ్బలనొత్తినీ
గోరచెక్కిలి గిరి ముద్దిడి కోమలాంగిని గూడరా
వేరుసేయక కీలుపట్లకోనేటిరాయ దయానిధీ!

(ఐ-ఐ.)—

అసమగ్రము. ఐదు పద్యములే కలవు వ్రాంతతప్పులుగలవు.

"కీలుపట్లకోనేటిరాయదయానిధీ" అను మకుటముగల యీ శృంగార పద్యాష్టకము గూడ నెవరిచే రచియింపబడెనో తెలియదు.

(*k*) జనార్దనాష్టకము

JANĀRDANĀṢṬAKAMU.

Foll. 33*b*—34*a*

Eight stanzas in praise of God Visnu as Janārdana worshipped at Kandukur.

Complete.

**Beginning:**

సిరులు మించిన పసిమిబంగరు జిలుగుపచ్చటి జారగా
చరణపద్మముమీద దేహము చంద్రకాంతులు దేరగా

ముగావునూపగ వచ్చినావో మోహనాకృతి మీరగా
గరుడవాహన దనుజమర్దన కందుకూరి జనార్దనా !

**End :**

కొదవ లన్నియు దీర్చుకొంటివి గుణము లెంచగ శయ్యను
అదను నెఱిగి నన్నేలితివి విరవాదిపూవులశయ్యను
మదనకేళికి నీవె జాణవు మారుతాపము మాన్పరా
కదిగు రా దనుజమర్దన కందుకూరిజనార్దనా !

(వి-వి.)--

సమగ్రము. తప్పులు గలవు.

కందుకూరిలో వెలసిన జనార్దనస్వామిమీఁదఁ జెప్పఁబడిన యీ శృంగార పద్యాష్టకము యతకర్తృకమో తెలియదు

ఆవల రెండుపుటలందుఁ గేళీగృహవర్ణన సీసములు రెండు (విజయవిలాస రుక్మాంగదచరిత్రములలోనివి) కలవు.

(*l*) నవనీతచోరకాష్టకము.

NAVANĪTACŌRAKĀṢṬAKAMU.

Foll. 35*a* –36*a*.

Eight stanzas in the Campakōtpalamālika metre in praise of Kṛṣṇa, here addressed as Navanītacōra, *i.e.*, as one who steals butter

Complete.

**Beginning :**

ఉ. ప్రస్ఖుచు (?) బ్రాణభీతి మెయి సారె భయంపడు దేహధారి గుం
డ్రాళ్లను రువ్వినన్ శితశరంబులునాటిన రోఁ మొం(మం?)
[టిన (గ?)
(నీళ్ల?) మునింగినన్ రిపులు నిర్దయులై గరళంబు వెట్టినన్
ద్రెళ్లనె బ్రహ్మవ్రాలు కడతేరక యోనవనీతచోరకా !

**End:**

చ. కనరేడికాఁపు ధూర్తయగు కామిని దుష్టగు బంటు వట్టిగా
జనమున నుబ్బు సుందరి నిజం బొకయింతయు లేదిదాసి న
ప్పనమును రమ్మహామ్మలియుఁ బ్రార్థనచేసిన లెక్క సేతురే
మసలక చేతికొల్ది బడిమారక యోనవనీతచోరకా!

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁతతప్పులు గలవు. గ్రంథపాఠములును గొండొక గలవు

'నవనీతచోరకా' యను మకుటముతో ముగియు నీ చంపకోత్పలమాలికల యష్టక మెవ్వరిచే రచింపఁబడెనో తెలియదు. ఈ పద్యములు నీతిబోధకములు.

(*m*) శ్రీశైలమాహాత్మ్యము. (?)

ŚRĪŚAILAMĀHĀTMYAMU.

Foll 36*a*—38*b*.

Contains only fourteen stanzas belonging to a work which gives obviously a legendary account of the greatness and sanctity of Śrīśaila in the Kurnool district, where Śiva is worshipped The author of the work is not known. The stanzas given here are not found in Śēsanārādhya's work of this same name.

**Beginning**.

శా. కారుణ్యంబున నమ్మహాసురుఁడొకం డర్థార్థకామక్రియా
సారంబుల్ సరిగాఁ జరించి తుద మోక్షశ్రీ నపేక్షించి సం
సారాంభోనిధియానపాత్రమగు శ్రీశైలంబుమీఁదం దపం
బారంభింపఁ దలంచి నందనుల డాయం బిల్చి తా నిట్లనెన్.

గీ. దేవ శ్రీమన్మహాదేవ దేవదేవ
నాగమణిహార కృష్ణవేణ్ణావిహార

నతభూపాపాంగ శాంభవీసంగతాంగ
పాలితాఖిలజగదీశ పార్వతీశ !

**End:**

సీ. పాలు పొంగ నెల నెలఁ బూఁ వెన్నెలఁజల్లు
చిన్నిపూఁ దలదాల్చు వన్నెకాని
మెఱవడిఁ గప్పుదెమ్మెర లాని మెఱుఁ గెకుర
పడిగెలతోడవులు తొడుగువాని
మురియు చుంగులుదీర్చు మువ్వన్నెపులితోలు
గట్టిపుట్టము మొలఁ గట్టువాని
వడకు గుబ్బలిరాచవారి ముద్దులపట్టి
సామేన నిడికొన్న బూమెకాఁడ

గీ. నేచి తెల్లని యెద్దుపై నెక్కువానిఁ
బొసఁగను మ్మొనకైదువుఁ బూనువాని
మించియన్నియుఁ దానయై మెఱయువాని
వేల్పులకు నిల్ల పెద్దయై వెలయువాని ౧౮.

(వి-వి.)—

అసమగ్రము. వ్రాఁత తప్పులు గలవు. ౧౮ పద్యము లున్నవి.

శ్రీశైలమాహాత్మ్యమును దెలుపు నీపద్యము లేగ్రంథములోనివో గుర్తింపఁ గుదురలేదు. శేషనాధ్యరచిత శ్రీశైలమాహాత్మ్యమునఁ గన్పట్టలేదు.

---

(*n*) రుక్మాంగదచరిత్రము.

RUKMAṄGADACARITRAMU

Foll. 38*b*–44*b*.

Certain portions of this work, which illustrates by means of a story the importance of fasting on the Ēkādaśī day *i, e.*, the 11th lunar day in every fortnight, are selected and given here. The author of the work is Mallana

(వి-వి.)—

వ్రాంతతప్పులును గ్రంథపాతములును మెండు.

మల్లన రుక్మాంగదచరిత్రమునుండి యన్నదానఫలము, కాశీ మహిమ, ఇష్టకామేశ్వర స్తోత్రము, మఱికొన్ని హరిహరస్తుతి పద్యములును, ఎత్తివ్రాయఁబడినవి. తుదిపద్యములు కొన్ని రుక్మాంగద చరిత్రమునఁ గన్పట్టవు ఎందుకో!

---

(*o*) ధనాభిరామము

DHANĀBHIRĀMAMU

Foll. 44*b*—49*a*

A few stanzas from the Prabandha called **Dhanābhirāma which** is a discourse on the relative merits of wealth and beauty by Sūranakavi are here given

(వి-వి.)—

వ్రాంతతప్పులును గ్రంథపాతములును మెండు.

నూతనకవి సూరనకవిచే రచియింపఁబడిన ధనాభిరామ మను ప్రబంధమందలి పద్యములు కొన్ని వ్రాయఁబడినవి.

---

(*p*) రత్నశాస్త్రము.

RATNAŚĀSTRAMU.

Foll 49*a*—53*b*.

Same work as the one described under R. No. 29 *ante*.

Incomplete

(వి-వి.)—

అసమగ్రము. వ్రాంతతప్పులును గ్రంథపాతములును మెండు.

భైరవకవిరచిత మగు రత్నశాస్త్ర మసగ్రముగా వ్రాయఁబడినది. అది నె 29 రున వర్ణింపఁబడెను.

(q) పొగాకుపద్యములు.

POGÂKUPADYAMULU.

Foll. 58b—60b.

A number of stanzas in appreciation of tobacco

**Beginning:**

సీ. ఆఁకొన్నమనుజుల కమృతంపుసేవన్నై
యుండుగా నీరాక హో పొగాక
మతిహీనులకు సరస్వతిప్రసన్నతయునై
యుండుగా నీరాక హో పొగాక

**End:**

క. చేతులఁ గానులు పోయెను
నేతీరున నగ్గి దెత్తు నెవరి నడుగుదుఁ
రోఁతలఁ బెట్టకమును పే
పొలివిగా నోఁ. నెత్తి పొ (?) గాకుచిట్టీ!

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁతతప్పులు గలవు. గ్రంథపాతములును గలవు.

పొగాకుమీఁదఁ జెప్పఁబడిన చాటుపద్యములు. యతత్కర్తృకములో!

(r) రుక్మాంగదచరిత్రపద్యములు.

RUKMÂṄGADACARITRAPADYAMULU.

Foll. 60b—63a.

Another portion of the work described in sub-division (n) above.

(వి-వి.)—

వ్రాఁతతప్పులు గలవు. మల్లన రుక్మాంగదచరిత్రమందలి సత్య వాక్ప్రశంస, పుత్త్రలాభప్రశంసల పద్యములు వ్రాయఁబడినవి.

(8) పాండవవయోవ్యాపారనిర్ధారణము.

PĀNḌAVAVAYŌVYĀPĀRANIRDHĀRANAMU

Fol. 63.

A memorial stanza indicating the place of occurrence of the various incidents in the life of the Pāndavas and their age at the time.

Complete.

**Beginning:**

సీ. ఇభపట్టణంబున కెలమిఁ బాండవు లేఁగ
(?) ధర్మరాజుకు షోడశాబ్దములు సుమ్ము

**End:**

పరీక్షిత్తురాజుకు పట్టంబు తగఁగట్టి
సోదరుల్ సతిఁగూడి సారెది దివికి
చని . . . గ్గానసౌఖ్యంబు నొందిన
ధర్మరాజు కీర్తి ధరణి వెలసె.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁతతప్పులు మెండు. గ్రంథపాతములును గలవు.

ఈ సీసమాలికయందుఁ బాండవు లేవయస్సున నెక్కడ నేమి చేసిరో తెలుపఁబడినది. అవల నొకటిరెం డాంధ్రభారతపద్యములు వ్రాయఁబడినవి.

(*t*) అఱవలపద్యములు.

ARAVALAPADYAMULU

Foll. 63*b*—64*b*.

A number of humorous stanzas satirising the manners and customs of the Tamil people

**Beginning:**

సీ. కూడు తలఁపఁ జోళ్లు కూర కారాముళ్లు
చెన్నలంత వ్రేలాళ్లు చేలు మళ్లు

**End:**

వేపాకు వెంచించి వేసినవాళ్లను
గింజానఁ గాంచినఁ గక్కుఱ్ఱవచ్చు
నఱవవారింటివిం దెల్ల నాగడఁబు
చెప్పవత్తురు తమతీరు సిగ్గులేక

(వి-వి.)—

వ్రాఁతతప్పులు గలవు. పాతములు గలవు.

అఱవవారిపై వెక్కిరింపుగా నున్న యీపద్యములు రచించినవా రెవరో ।

(*u*) శృంగారచాటుపద్యములు.

ŚṚṄGĀRACĀṬUPADYAMULU

Foll. 64*b*—70*a*.

Twenty-three stanzas of love poetry

**Beginning:**

సీ. పరిణామ మే మయ్యెఁ బ్రాణనాథునివార్త
వింటివో యనియుందుఁ జందమామ
విరహాగ్ని చల్లఁగా విభునియాకారంబు
కందువో యని యుందుఁ జందమామ.

**End:**

ఉ. వారిజనేత్ర నీకు దయవాఁడ నటంచును నీతనప్రభా
పూరతరంగిణిన్ మునిఁగి మ్రొక్కెద నీకుచలింగపాళి నీ
బాహలేఁదు కొప్పుకీలుజడ పామును బట్టెద వాటమైననీ
యారుకటారిపైఁ బడెద నవ్వెల నవ్వెలరాజుసాక్షిగన్.

(వి-వి.)—

వ్రాఁతతప్పులు గలవు   పాతములును గలవు.

ఇరువదిమూఁడు శృంగారచాటుపద్యములు.   యతిప్రాస ములో.

(v) విప్పుకథలపద్యములు.
VIPPUKATHALAPADYAMULU.

Foll. 70a—74b.

A number of riddles in verse.

*   *   *   *

**Beginning:**

చ. కమలజకృష్ణశంకరులు కాంచననిలపటీరవర్ణు లా
గమనగచంద్రధారు లఘుకంసపురారులు హంసతార్క్ష్యగో
. . . . . . . . .
. . . కరుణావిభూతి గుణోత్కటులఁ బ్రోతురు మిమ్ము నెప్పుడున్.

**End:**

శ్లో. లతామండపసంయుక్తం
పత్రపుష్పపు (?) లంకృతమ్।
సర్వాంగంభూత . .

(వి-వి.)—

వ్రాఁతతప్పులును గ్రంథపాతములును మెండు.

'పాడుపుకథ' అనఁబరఁగు కథలు కొన్ని పద్యరూపమున రచింపఁబడినవి.

## R. No. 129.

Paper. 11 × 8¾ inches. Foll 78. Lines. 16 in a page. Telugu. Good.

Restored from a palm-leaf MS. of the Library in 1911-12.

పారిజాతప్రబంధము, యక్షగానము.

PĀRIJĀTAPRABHANDHAMU YAKSAGANAMU.

This is a Yakṣagana composition relating the story of the fetching from heaven of the divine Pārijāta tree by Kṛṣṇa to appease the anger of his jealous consort Satyabhāma. The author of the work is Nārāyanakavi, son of Muttaya and Kalanāmba of the goldsmith caste. The author's patron was Kumārēca, son of Veligōti Bangaru Yācamanāyaka of Venkatagiri.

Complete.

**Beginning:**

కీర్తన. అంబుజాసనురాణి హరిరాణి కొలువఁ అంబావో
భ్రమరాంబావో,
తుంబురు నారదాదులు హెచ్చి పాడెరు అంబావో
చెలఁగుచు నవకోటి సిద్ధులుగొలువఁగా అంబావో!

* * * *

సీ. సరస నరుకూరి ముత్తధీరుని కాళ
మాంబతనయుండ విశ్వకర్మాన్వయుండ

నమితయశుఁడును నారాయణాఖ్యకవిని
నేరచించు కథాక్రమం బెట్టి దనిన.

వ. ఇట్టి పారిజాత ప్రబంధం బను శృంగారయక్షగానకావ్యంబు నకుఁ గథాక్రమం బెట్టి దనిన.

**End:**

అని యిట్టు లీకథ నాద్యంతముగను
జనమేజయునకు వైశంపాయనుండు
వినిపించె నయ్య కోవిదజనాధార
ఘనవెలిగోటిబంగరుయాచనృపతి
తనయ కుమారేచక్షోణీతలేంద్ర
వినవయ్య యిది జగద్వినుతప్రభావ
మిది పుణ్యచారిత్ర మిది బుధస్తోత్ర
మిది జన్మసాఫల్య మెవ్వరువిన్నఁ
జదివిన వ్రాసిన జనులకు నెల్ల
ముదముగా నాయువ(?)భీష్టమును సమకూడి
ధరణిలో నాచంద్రతారార్కముగను
బరమకళ్యాణులై ప్రబలియుండుదురు.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁతతప్పులు గలవు. గ్రంథపాతములు లేవు.

పారిజాతప్రబంధమను పేరుగల యీ యక్షగానమునందు శ్రీకృష్ణుఁడు కుపితయగు సత్యభామను దేర్చుటకై స్వర్గమునుండి పారిజాతమును గొనివచ్చినకథ వర్ణింపఁబడినది. గ్రంథకర్త విశ్వకర్మవంశ్యుఁడు. ముత్తయ్యకును గాళమాంబకును గుమారుఁడు. పేరు నారాయణకవి. పారిజాతాపహరణ మను పేరుగల యక్షగానము వేఱొకటి కలదు. ఈ కృతి వెలిగోటిబంగరు యాచనృపతి కుమారుఁడగు కుమారేచభూపాలుని పేర రచింపఁబడినది.

## R No 130.

Paper. 11 × 8¾ inches. Foll. 98. Lines, 20 in a page. Telugu Good.

Restored from a palm-leaf MS of the Library in 1911–12.

చంద్రతారావిలాసము.

CANDRATĀRĀVILĀSAMU

This is a Yaksagāna based on the story of the love between Candra and Tārā: by Ellayakavi, son of Mallanārya of Ātrēya-gōtra, an inhabitant of the village Mallasamudra, situated near Salem.

Complete

**Beginning**:

క. శ్రీకరు నగజముఖాబ్జప్ర
భాకరు విఘ్నౌఘహరు శుభాకరు సద్వి
ద్యాకరు మునిజనహృదయవ
శీకరు గణనాథు గొల్చి సేవించెదనా (?).

* * * *

సీ. శ్రీరహిం మించిన చెరదేశంబులో
జెలువంది వెలయును సేలపురము
దాని చేరువను నుద్దండమల్లసముద్ర
మను గ్రామమున నుండు నాంధ్ర విప్రుఁ
డాత్రేయగోత్రజుం డమలతేజస్కుఁడౌ
రామభక్తుండైన రామభద్రుఁ
డాతని తనయులు ననఘులు నిద్దఱు
నందగ్రజుండు మల్లనార్యుఁడనఁగ

గీ. నతని కనుజుండు విశ్వనాథాఖ్యుఁ డనయ (?)
వన్నెకెక్కినకులసతి వేంకటాంబ

గర్భకలశాబ్ధిచంద్రుండు కవిరేణ్కు
లకును శిష్యుండు యెల్లయసుకవిహితుఁడు.

* * * *

సీ. గీ. రాజితంబుగఁ గళ్యాణరామకృపను
చంద్రతారావిలాసంబు సరసయుక్త
గానముగ నేను బల్కెద గౌరవమున
వినుఁడు జనులార! విరులవిందుగాను.

**End:**

ఘనులు మునులు కవిగాయకులు
వినుతిసేయ భటవిరులతో
జనకజనకగురుజనులుముద మెరర
దనరినసీతారామ... నను॥ శోభానే॥

(వి-వి.)—

సమగ్రము. వ్రాతతప్పులంతగా లేవు. గ్రంథపాతములు గలవు.

చంద్రతారావిలాస మను పేరుగల యీయక్షగానమునఁ దారాచంద్రుల చెల్మి వర్ణింపబడినది. సేలపురము చేరువ నుండు మల్లసముద్ర మను గ్రామమున వసించు నెల్లయకవిచే నీ గ్రంథము రచింపఁబడెను. గ్రంథకర్త బ్రాహ్మణుఁడు. ఆత్రేయగోత్రుఁడు. మల్లనార్యుని కుమారుఁడు.

---

R. No. **131.**

Paper. 11 × 8¾ inches Foll. 233. Lines, 20 in a page. Telugu. Good.

Restored from a palm-leaf MS. of the Library in 1911–12.

యథావాల్మీకిరామాయణము.

YATHĀVĀLMĪKIRĀMĀYAṆAMU

This is a rendering into Telugu of Vālmiki's Rāmāyaṇa in Sanskrit. By Khanagiri (Kanigiri) Rāmakavi, son of Ahōbilasūri and grandson of Vēṅkaṭagiriṁbhaṭṭa of Āpastambasūtra and Bharadvājagōtra, a disciple of Lakṣmīnṛsiṁha Śāstri.

Breaks off in the 12th Āśvāsa which corresponds to the 76th Sarga of the Bālakāṇḍa.

**Beginning** :

శా. శ్రీకల్యాణమునందు వేంకటనగాగ్రశ్రీ మించు నేఘంబు నీ
లాకారద్యుతి పెంపునన్ నవరసాలంకారమై యొప్పఁగా
లోకిన్ గీర్నవశుక్ల కాయనుచు నాలో శంకిలన్ మాన్పు నా
లోకాధీశుని వాసచంద్రికలఁ గొల్తున్ స్వార్థసంపత్తికిన్.

ఉ. వ్యాసకృతిన్ దెనుంగుధగ వర్తిలఁ జేసిన నన్నయార్యులన్
వాసిగలట్టి తిక్కన నవార్య . . . సతత్ప్రథల్
భాసిలఁ జేయు సోమనను భాస్కరయన్ నుతిసేసి ప్రమోదితోయు
ల్లాసముతోడఁ దక్కుఁగవులన్ వినుతించెద ప్రీతియుక్తుఁడై.

వ. అని యిష్టదేవతాప్రార్థనంబును, సుకవిజనకీర్తనంబునుం
గావించి

చ. అనవరతప్రబోధమగు నాదికథామృతవార్ధిఁ గ్రోలి శ
ఘ్ననతరమాధురీమహితధారల దోఁగి తదంతికోర్వరా
కలితరసార్ద్రిమం జితరగమ్యము లైనమదీయచిత్తసం
జనితసదుక్తులన్ దెనుఁగు సల్పఁగ నేఁ దలపోసి యాత్మలోన్.

వ. కావున నివ్విధంబున రామాయణంబు దెనిఁగింప నెంచి
యథావాల్మీకం బను రామాయణంబు రచియింపం బూనిన మావాశ
క్రమం బెట్టి దనిన.

శా. సారాచారవిచారవాక్పటిమసాత్త్వాదబ్జసంభూతి దు
ర్వారస్థైర్యమతిక్రియాకలన నవ్యాచస్ఫూర్తిఁ బోలియుఁ
బేర్రై యొప్పును యెల్లయార్యుఁ డనఁ గాఁ . . . యా
భారద్వాజపవిత్రగోత్రభవశోభారూఢి భాసిల్లఁగన్.

శా. ఆవిప్రోత్తము డార్యుఁ డధ్వరసమగ్రామ్నాయనిష్ణాతుఁడై
ప్రావీణ్యస్థితి నొప్పువాఁగ కిగ నొప్పన్ నాట్యరంగప్రధన్
గా వేనిన్ జతురాననుం డనుచుం బలర్చన్ గల్గునే ధాత్రిభూ
దేవవ్రాతసమస్తపూజ్యతనువర్ధిష్ణుండు నై శీలతన్.

సీ. గీ. లసదిజప్రఖ్యవాణీవిలాసియయ్యు
లసదజప్రఖ్యవాణివిలాసియగుచు
నెన్నికకు నెక్కె పెన్గొండయెల్లయార్యుఁ
డుర్వియఁ దతిసతశ్లాఘాయుక్తిఁ దనరి.

క. ఆయెల్లయార్యసుతుఁడై
కాయజశుభుఁ డచ్చమాంబగర్భమునను సు
శ్రీయుతుఁడై పుట్టెను నా
రాయణసుసమాఖ్యఁ గూడి ప్రకటవిభూతిన్.

వ. అతనికి భార్య యక్కమ దయాసియమార్దవశీలసంతత
వ్రతపరిశీలయై తదనువర్తన తద్హృదయానుకూలయై
ప్రతిదినమున్ బుధాళికిఁ గరంబును నాదరవృత్తి నిచ్చు న
చ్యుతమతితోడ నవ్యసితరూపరసాదులతోడ నన్నమున్.

క. అలవేంకటగిరివర్యుని
లలి శేషాహ్వయునిఁ గాంచి లావణ్యవతీ
తిలకం బగునయ్యక్కమ
చెలఁగెన్ బ్రఖ్యాతగుణవిశేషవిభూతిన్.

వ. అం దగ్రజుండు

సీ. గీ. ఒలిఁగృపాంబుధి యనఁగఁ జాలఁగను నికిర
. . . . . . . భూరియశుఁడు
ఘనుఁడు వేంకటగిరి సూరివినయసుగుణ
భాసురాకారుఁడై యొప్పు భద్రమూర్తి.

వ. తదీయభార్య

సీ. గీ. నిరుపమాత్మీయసుప్రభానికరములను
నలరువిను చాయల మెలంగుజలజపాణి
సతి రమాకాంత వాగ్వధూచ్ఛాయలను గ
ణింప వెంకమ యొప్పును నిస్తులముగ.

వ. ఆవేంకటగిరిసూరి కనుజుఁడు

సీ. గీ అతికులాచార సంఖ్యచే నలరె వసుధ
వసుధనవ్రాత ధాన్యసంవర్ధమాన
మానసుఁడగు శేషయామాత్యమంత్రి
మంత్రిజపశీలనియమసామర్థ్యవిష్ఫురి.

చ. అతనికి భార్య సీతను మహాగుణశీల వయోభిరామ వి
శ్రుతమతిరూపవిభ్రమవచోవిభవంబుల శ్రీ నుమా శచీ
రతి నున . . . దమయంతు లహల్య తారయుఁ
రతిని నరుంధతీసతి దరంబుని పట్టి దరంబె! యేరికిన్.

ఉ. వారలచేతఁ బూజ్యుఁడయి వారుణినామక యైనగౌరి య
న్వారిగఁ బుత్రపౌత్రధనవస్తుసమగ్రత లీను చుండు నా
గారమునందు లక్ష్మి యనుకంపజనింప పటీరతారకా
హీరయశుండు వేంకటగిరీంద్రుఁడుమంత్రులమిన్న యొప్పుగన్.

క. అల వేంకమాంబకును సిరి
గల వెంకటగిరివరేణ్యు కతులితధృతికిన్
గలిగిరి సుతు లేవురు పా
ల్జలధికి సురతరువు లట్లు సాంద్రవిభూతిన్.

క. ఘను వేంకటేశుఁ, డిష్ణు
ప్పును, నారణమంత్రివర్యు ననుపమసుగుణా
భినుతు నహోబలధీరుని
ననఘుని శేషాచలాఖ్యు నప్రతిరూపున్.

* * * *

క. ఆభాసురసంతానక
శోభనపంచకము వెలయు సుఖసమితిమహో
ప్రాభవమున నందలి శ్రీ
శాభుఁ డహోబలసమాఖ్య రంజిలు ధృతిమై.

ఉ. ఆమహనీయశీలవినయాప్రతికల్పధరాసురేంద్రుకున్
గామినియైన మంగమ జగన్నుత తన్మహిళావతంసరా
మామణిగర్భశుక్తితలమౌక్తికయుగ్మము . . దుతో
రాముఁడనంగ నగ్రజుఁడ రామునిఁ గొల్చినవాఁడ నాటచేన్.

* * * *

శా. రామకృపాకటాక్షసువిరాజితవాక్ప్రతిమావిభూతి శ్రీ
రామకథన్ బ్రచేతసచిరంతనసత్కృత మాదికావ్యమా
రామసుతానుగీతము ధరాస్థలిలోఁ దెలిఁగించినాఁడ నే
రామకవిన్ సుధీమణులు రంజిలఁగా నొనరింతు నీకృతిన్.

ఉ. శ్రీలక్ష్మీనరసింహశాస్త్రులకు నే శిష్యుండఁ దద్బోధనా
మూలస్ఫారకవిత్వసత్యయతనాభూయిష్ఠసంసేవనా
శీలుండౌటఁ దదీయసత్కృపను రక్షించుతుండ సద్భక్తి స
ర్వాలంకారకృతిన్ రచించితి యథావాల్మీకమున్ కావ్యమున్.

**Colophon:**

ఇది శ్రీమద్రామచంద్రచరణారవిందద్వంద్వకందళితస్వాంతమానసాంద్రతరధారాసారమకరందరసాపూరస్పందనతుందిలాయమానమానసేందిందిర నిరుపమకవితాధురంధర భారద్వాజగోత్రపవిత్ర విమలాపస్తంబసూత్ర ఘనగిరివేంకటగిరిభట్ట పౌత్త్ర, అహోబలసూరిపుత్త్ర సకలబుధసుకవిజనారాధనకరణవిలసచ్ఛరి రామకవి ప్రణీతంబైన యథావాల్మీకంబను నాంధ్రరామాయణమున బాలకాండమందలి యేకాదశాశ్వాసము.

**End:**

శా. విన్నందోడ్కొని తేరఁదండ్రి పనిచెన్ నీ మేనమామైన సం
పన్నుం డీతఁడు మైథిలాహ్వయపురప్రాంతంబు(?)వచ్చెనో
యన్నా నీ విపుడేగి తాతఁ గన నర్హు(?)ండౌట మాతామ
[హుల్
. . . . శత్రుఘ్నుఁడుం బోదుగన్.

మ. మిథిలాపట్టమునందు మామ సదనా మేల్మిన్ బలిక్రీడదొల్లి యో.

(వి-వి.)—

అసమగ్రము. బాలకాండముకూడఁ దుదముట్టలేదు. మొదటి నుండి పంద్రెండవయాశ్వాసముకొంతవఱకుఁ గలదు సంస్కృత రామాయణమున బాలకాండము డెబ్బదియాఱవసర్గవఱకీ తెలుఁగు భాగము సరిపోవును. వ్రాతతప్పులు తంపోపతండములు. గ్రంథపాతములు మితిమీఱియున్నవి. గ్రంథము మిక్కిలి యస్వస్థాభావమును బొగసినది.

వాల్మీకిమహర్షి సంస్కృతమున రచించిన రామాయణకావ్యమునకియ్యది సరియయిన తెనిఁగింపు. ఆపస్తంబసూత్రుఁడును భారద్వాజగోత్రుఁడును వేంకటగిరిభట్టపౌత్త్రుఁడును అహోబలసూరిపుత్త్రుఁడును లక్ష్మీనృసింహశాస్త్రుల శిష్యుఁడును నగు ఘనగిరిరామ

కవిచే రచియింపఁబడినది. ఈకృతి ప్రత్యాశ్వాసముతుదను మిక్కిలిగా బంధకవిత్వము గలదు.

## R. No. 132.

Paper. 11 × 8¾ inches Foll 128 Lines, 20 in a page. Telugu. Good.

Restored from a palm-leaf MS of the Library in 1911-12.

మార్కండేయపురాణము (ద్విపదము).

MĀRKAṆDĒYAPURĀṆAMU (DVIPADAMU)

This is a Telugu rendering of the Sanskrit Mārkaṇḍēyapurāṇa, and is said to have been composed at the instance of certain weavers: By Narasiṁhakavi, son of Kr̥ṣṇa of Yallakara family and a disciple of Tirumala Lakṣmaṇācārya The work is dedicated to God Rājagōpāla worshipped at Komaravōlu. In the introduction the origin and the greatness of the weaver caste are described.

Complete.

**Beginning.**

ద్విపదము. శ్రీకమలాధీశుఁ జిచిత్ప్రకాశు
ప్రాకటసచరాచరాత్మనివేశు
మకరకుండలకర్ణు మహితాభ్రవర్ణు
సకలాత్మసంపూర్ణు సద్భావదీర్ణు

* * * *

కొమరవోల్ ఘనరాజగోపాలరాయు
నుల్లంబులోపల నొగిభక్తియుక్తి
నెల్లప్పుడును నిగ్గి యొఱఁగి సేవించి

* * * *

ఘను నన్నపార్యుఁ దిక్కనసోమయాజి
ననఘు శ్రీనాథు నయ్యంబరాజు రామ
కవిని బెద్దనఁ దిమ్మకవియాదిశబ్ద

పరిపూర్ణచంద్ర శోభనగుణసాంద్ర
నరసింహాకవివర్య నగసమధైర్య
లలిమీఱ దిరుమలలక్ష్మణాచార్యు
చెలఁగు పాదాంభోజసేవాధురీణ
ప్రచురవాక్యములచే భారతి సావిత్రి
రచియించితివి కవిరాజులౌ ననఁగ
విను మనఘాత్మ మావిన్నపం బొకటి
మనవి చేసెదను భూమండలంబునను
ననుపమశబ్దశబ్దార్థసంగతుల
ఘను లెన్నఁదగిన మార్గమున దేయవతాని
పరపురాణంబు గీర్వాణం[illegible] వ్వారికి
తరము గాదిది యర్థతాత్పర్య మరయ
విను మది గావున విహితశబ్దముల
పసిఁబూసి యది యాంధ్రభాషను ద్విపద

**End:**

అని యఖిలాండనాయకుఁడు శ్రీధరుఁడు
దనుజసూదనుఁడు బృందారకనుతుఁడు
నిరుపమకౌమారపురి నిలయుండనంగఁ
బరఁగెడు మదనగోపాలుని పేర.

కొలువసేసు[illegible]గిడ నరంగమున
నేలఁ గూల్చిన రణనిపుణుల పేర

పద్మతంతువులచేఁ బ్రబలిలోకముల
ఘనవస్త్రనిర్మాణకలితచాతుర్యు
లననొప్పుపద్మసాలాఖ్యుల పేర

కొమరవోల్ ఘనగోరాజపాలదేవు
ప్రమదదయారసపరిపూరలబ్ధ
కవితాచమత్కారగాంభీర్యధుర్యు
డవిరళయల్లకరాన్వయాంభోధి
పరిపూర్ణచంద్రుండు భద్రయశుండు
ధరం గృష్ణయాహ్వయ తనయనృసింహ
కవిప్రణీతంబునై కలియుగంబునను
గవిజననుత యలంకారసంగతుల

అందాంక నీకథ యఖిలభూప్రజల
కందమై సుగుణవిహారానురాగ
కందళితానందకరమునై పరంగు.

(వి-వి.)—

సమగ్రము. వ్రాంతతప్పు లల్పముగాం గలవు గ్రంథపా
తములు నత్యల్పముగాం గలవు.

సంస్కృత భాషనున్న మార్కండేయపురాణమున కద తెలిం
గింపు. పద్మసాలెకులుల ప్రేరణమున ఎల్లకరవంశ్యుండును, కృష్ణ
యాహ్వయుని పుత్రుండును, తిరుమల లక్ష్మణాచార్యుల శిష్యు
డును, నగునరసింహకవిచేం గొమరవోలు రాజగోపాలదేవునికిం
గృతిగాం రచియింపంబడినది. కవి యేకులపువాండో తెలియదు.

ఒంటికంబపు మేడను సాధించిరనియుం గాలువసేనుని యుద్ధ
రంగమునం జంపిరనియుం బ్రహ్మతంతులచే జయించిరనియు భావన
ఋషి వంశ్యులనియుం బద్మసాలెలనుగూర్చి మఱియుంగొన్ని విశేష
ములు తెలుపంబడినవి. ఉదాహరింపంబడిన గ్రంథభాగములను జూచు
నది. గ్రంథాంతమున నాల్గుపుటలలో భావనఋషిమీంది మంగళా
రతి వ్రాయంబడినది.

R. No. **133.**

Paper, 11 × 8¾ inches. Foll. 109 Lines, 20 in a page. Telugu
Good

(*a*) యోగీంద్రవర్యశతకము.

YŌGĪNDRAVARYAŚATAKAMU.

Foll. 1*a*—24*b*.

Restored from the palm-leaf MS described under R. No. 28 *ante* in 1911-12.

Complete

(వి-వి.)—

సమగ్రము. వ్రాంతతప్పులు గలవు. గ్రంథపాతములు గలవు.

ఇది నెం 27 రున వర్ణింపఁబడిన గ్రంథమేగాని వేఱుగాదు.

(*b*) వేంకటేశ్వరవిలాసము.

VEṄKAṬĒŚVARAVILĀSAMU.

Foll, 26*a*—108*a*.

Restored from the MS described under R. No. 37 *ante* in 1911-12

Incomplete

(వి-వి.)—

అసమగ్రము. వ్రాంతతప్పులు గలవు. గ్రంథపాతములును గలవు.

ఇది నెం 37 రున వర్ణింపఁబడిన గ్రంథమే. అప్రతినిబద్ధియే యిది వ్రాయఁబడినది.

R. No. **134.**

Paper 11 × 8¾ inches Foll 25. Lines, 20 in a page. Telugu
Good.

Restored from a palm-leaf MS. of the Library in 1912–13.

## సర్వలక్షణశిరోమణి (దశమోల్లాసము).

## SARVALAKSANAŚIRŌMANI (TENTH ULLĀSA)

This MS. contains the tenth Ullāsa of Sarvalakṣaṇaśirōmaṇi, which is a comprehensive treatise on Telugu grammar, prosody, poetics, etc. The author of the work is Ganapavara Vēṅkaṭakavi, who is stated to be a disciple of Perumbūdūr Yatirāja and to have composed also Prabandharāja-Vēnkātēśvaravilāsa. The work is dedicated to God Vēṅkatēśvara worshipped on the Tirupati hill. The chapter contained inthis MS. deals with Dvirūpa, *i.e.*, words like those contained in Harṣa's Dvirūpakōśa which deal with words having two or more than two different forms

**Beginning** :

క. శ్రీభామాసత్కీర్తిక
రాభవనజమందహాసధాగధగ(గ
శోభితశుభతనురుచకు
భాభోగవిలాస! వేంకటాచలవాసా!

సీ. సరసాశుమధురవిస్తరము లేక దినప్ర
బంధనిర్మాణప్రభావశక్తి
కత లేఖినీపద్యసంధానపటిమ చి
త్రసమస్యాపూరణము త్రివాంక
సంఘటనయు నిరోష్ఠ్యమ్ము సచ్ఛాచాక్య
ములును వ్యస్తాక్షరములు (?)
నల్లంట్లు(?) వాగ్గోపనమచలజిహ్వక (?)
(?) లుకమ్మచదువవర్ణ

గీ. సమితియింతని తెలుపుప్రజ్ఞ యురువడవ
ధానములు నాదిగఁ దగు చిత్రవిధ మార్గ
లక్షణ మెఱింగి సరిలేని లక్షణకవి
యప్పకవి వేంకటపతినా నలరుకవిని.

క. సమకాలమువారలు తమ
తమమతులకు మిగుల సమ్మతం బని మతా
వ్యములందలినుడులు ప్రయో
గము కుదుకొనుచుఁ బొగడఁగాఁ దగు సుకవిన్.

గీ. సంధులను దత్సమముల నౌ శబ్దములను
నుపపదప్రత్యయమ్ముల నొనరుశబ్ద
ములు విభక్తులఁ గ్రియలను గలుగుశబ్ద
ములు ద్విరూపాదులగు శబ్దములును గూర్చి.

సీ. గాంధి గీర్వాణద్విరూపకోశమునకుఁ
బ్రతిగఁ గవుల కుపకృతిగఁ బూర్వ
సత్ప్రయోగంబులు సర్వంబుఁ గాంచి ప్ర
పంచము బ్రహ్మ నిర్మించినగతి
నతులితాంధ్రోక్తిమయప్రపంచమ్మున
కొకప్రోవ సేయ నుద్యుక్తుఁడ నయి
వృత్తముల్ వచనంబు వెడలించి సీసకం
దములు గీతులును బద్యములు నూట

గీ. యిరువదిగ జిగిబిగినును (పె?)నయఁ జల్లి
పూదె లెందేని రానీక యెమునాళ్ల
సరసతాంధ్రద్విరూపకోశమ్ము నీదు
పేరఁ జేసితి వినుఁడు శ్రీవేంకటేశ!

క. తెనుఁగు ఋషిప్రోక్తముగా
దని, యాకర మెందు లేనిదని, పలెంౘడిమం
దుని వెట్టి నూన్పుమం దగు
నను వొందుద్విరూపకోశ మహిన్శైలేశా!

క. ఇది గలదో లేదోయను
మదిలోపలిసంశయంబు మాత్సర్యంబున్
వదలిచి కవు లిందును గల
విధమున రచియింప దారి వేంకటశౌరీ!

సీ. కలిమి కల్మి యనంగ బలిమి బల్మియన జూ
టులు జూట్లు నాఁగ వేడుకలు వేడ్క

* * * *

**End:**

సీ. మహిలోపల నిది శ్రీమత్పెరుంబూదూరి
యతిరాజగురు కరుణాతిలబ్ధ
మహితాంధ్రకవనసామ్రాజ్య . .
. . . . . న్వయార్ణవశశాంక
వాసిష్ఠగోత్రభవ్యాశ్వలాయనసూత్ర
మాసద్వ్యక్ష్మంగమాంబాసమేత
గణపవరాన్వయఖ్యాతిమజ్జకకరా
పాలమేల్మంగాదయాంతరంగ
గీ వేంకటేశాంకితంబుగ వేంకటపతి
రచితసర్వలక్షణశిరోరత్నాకృతిఁ
గూఢిగఁ దనర్చునాంధ్రద్విరూపకోశ
మన వెలయు షష్ఠోల్లాస మనసమలీల.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁతతప్పులు లేకపోలేదు. గ్రంథపాతము లొండు రెండు గలవు.

ఇది గణపవరపు వేంకటకవీశ్వరునిచే రచియింపఁబడిన సర్వలక్షణశిరోమణి యను విపులాంధ్రలక్షణ గ్రంథమంగలి పదియవ యుల్లాసమగు ద్విరూపకోశము. శ్రీహర్షుని సంస్కృతద్విరూపకోశమును బోలు నీగ్రంథమున ద్విరూపపదములు మొదలు షష్ఠరూపపదములవఱకు నిరూపింపఁబడినవి. గ్రంథకర్త పెరుంబుదూరియతిరాజగురుశిష్యుఁడు. ప్రబంధరాజ వేంకటేశ్వరవిలాస మీ వేంకటకవికృతియే. ఈ సర్వలక్షణశిరోమణి తిరుమలవేంకటేశ్వరునకు సమర్పింపఁబడినది. సర్వలక్షణశిరోమణి యెన్నియుల్లాసములు గలదో, ఏయే యుల్లాసముల నేయేవిషయములు ప్రతిపాదింపఁబడి

నవో తెలిసినది కాదు. ఈ గ్రంథమున ద్వితీయోల్లాసమగునిఘంటు నీ పుస్తకశాలలోఁగలదు. దానినే వేంకటేశాంధ్రమందురు ఉదాహృతపద్యములఁబట్టి గ్రంథకర్త ప్రజ్ఞల నెఱుంగ నగును.

## R. No. 135.

Paper 11 × 8¾ inches Foll. 33. Lines, 20 in a page Telugu Good

Restored from a palm-leaf MS. of the Library in 1912–13.

లీలావతి.

LĪLĀVATI.

This is a Telugu rendering of Bhaskarācārya's Sanskrit mathematical work of this name : by Vallabhārya *alias* Kavidēvēndra, son of Rāghavasūri and grandson of Kōdūri Yarrayāmātya of Hāritagōtra The author was a disciple of Prabōdhānandaguru, and the work was composed at the instance of Bommalāṭa Kaḷayārya, who was an officer in the courts of Kṛsnadēvarāya and Acyutadēvarāya and a disciple of Kumāratātayārya. Here and there one can glean historical information from the work, It contains also illustrative problems and a statement in figures of the data involved in the problems.

Incomplete, contains Āśvāsas 1 to 3 complete.

**Beginning:**

క. హరిహరహిరణ్యగర్భుల
వరదుల జల(?)నిభనిభవాని(?) వాణీకాంతే
[illegible]
కరుణకును సుకవిజనులకును వినతుఁడనై.

సీ. . . . . . . . . శుఁడ
సుజనహితుఁడ నాపస్తంబసూత్రకలిత
హరితగోత్రపయోధినీహారకరుఁడ
నలఘుచరితుఁడ వల్లభాహ్వయుఁడ నేను.

ఉ. శ్రీనరసింహనందను నరిందమవిక్రముఁ గృష్ణరాయభూ
జానిని వెండియుం దదనుజన్మని నచ్యుతదేవరాయని
దా నధికాప్తుఁడై కొలిచి తద్దయు మన్నగాంచి మించువి
ద్యానిధిబొమ్మలాటవిరుపాధిపుకాళని పార్థనంబునన్.

* * * *

క. అని పొగడ గణకులో నొ
నన సంస్కృతభాష భాస్కరాచార్యులు చె
ప్పినపాటిగ లీలావతి
యొనర్తుఁ దెనుఁగున . . .

సీ. నరసనరేంద్రనందనుఁడైన యచ్యుత
దేవరాయలకృపాదృష్టిఁ జేసి
ఆందోళికారూఢుఁ డగుచు (?) బొమ్మ
లాటకాళఁడు వేడుక నృగాళి
లో నాత్మగురునాథుఁడైన కుమారతా
తాచార్యవర్యున కర్థమిచ్చె
ద్విజులకు (శే ?)షత్రిణీయముల్ రెండిడి
శేషపాదము కవిశ్రేణి కొసఁగె

గీ. స్నేహమునఁ దనచెలులకు శేషనవమ
భాగపంచకమంతయుఁ బంచిపెట్టెఁ
గవిమహేంద్రున కర్పించె మిగిలినట్టి
వేయినూఱు పదు ఱెంత వితరాశి.

**End :**

వక్రసృత్యయకరణసూత్రము. పద్యములు ౨౮౬.

* * * *

ఉద్దేశ్యము. క. క్రమమున మధ్యకుఁ జెప్పుము
సమార్ధసమవిషమవృత్తసంఖ్యలుఁ బ్రస్తా

రము నష్టవిధానోద్ది
ష్టము తెల్పి లగక్రియలును షట్ప్రత్యయముల్.

* * * *

మధ్యమములోన, లగలయెన్నోవృత్తం అంటేను—అపరవృత్తము అన్ని ౧౨ ల గక్రియ, ఏకగురువ్యక్తులు. 3, ద్విగురువ్యక్తులు, 3, త్రిగురువ్యక్తులు(?) ఇక్లేకలఘువ్యక్తులు 3, ద్విలఘువ్యక్తులు 3, త్రిలఘువ్యక్తి ౧ు, సమవృత్తసంఖ్య ౮, ఈ ప్రకారాననే యిరువదియారు ఛందాలకున్నూ షట్ప్రత్యయాలు.

**Colophon:**

ఇది శ్రీపరమహంసపరివ్రాజకాచార్య ప్రబోధానందశ్రీచరణసన్నిధరుచ్ఛాత్ర హరితగోత్ర కోడూరు యెల్లయామాత్య పౌత్ర రాఘవసూరిపుత్రకవిదేవేంద్రాపరనామధేయ సుజనవిధేయ సహజధైర్య వల్లభార్యవిరచిత మైన లీలావతియనుపాటీగణితంబునందు శ్రధ (శ్రేఢీ?) వ్యవహారము సమాప్తము.

(వి-వి.)—

అసమగ్రము. శ్రధ(శ్రేఢీ?)వ్యవహారాంతమువఱకుఁగలదు. అల్పముగా వ్రాఁతతప్పులును గ్రంథపాతములును గలవు.

సంస్కృతభాషను భాస్కరాచార్యునిచే రచియింపఁబడిన లీలావతి యను గణితశాస్త్రమున కిది తెలిఁగింపు. కవిదేవేంద్రాపరనామధేయుడును, ప్రబోధానందగురుశిష్యుండును, హరితగోత్రుఁడును, కోడూరియెల్లయామాత్యపౌత్రుడును, రాఘవసూరిపుత్రుఁడును నగు వల్లభార్యునిచే రచియింప బడినది. శ్రీకృష్ణదేవరాయలవారియు, నచ్యుతదేవరాయలవారియు నాస్థానమున నుద్యోగియై పేరుపొందిన బొమ్మలాటకాళయార్యుఁ డేతత్కృతిరచనము నకుఁ బ్రేరకుఁడు. ఇతఁడు కుమారతాతార్యుని శిష్యుఁడు. గ్రంథమున మఱియుఁ గొన్ని చరిత్రాంశములు దొరకఁగలవు. ఈ గ్రంథమున నంకవిన్యాసముతో నుదాహరణములుగూడఁ జూపఁబడినవి.

## R. No. 136.

Palm-leaf. 14 × 1¼ inches Foll 75 Lines, 6 in a page Telugu Injured

Presented by M. Subba Rao of Rajahmundry in 1912-13

వసుచరిత్రము—సవ్యాఖ్యానము.

VASUCARITRAMU WITH COMMENTARY

The text here is the same as the one described under R. No. 34 *ante.* The name of the commentator is not given in the portion contained in this manuscript

Contains only a portion of the fourth Asvasa

**Beginning:**

క. శ్రీరంగరాయకలశాం
భోరాశిసుధాసహాయ భూభువనధురా
ధౌరేయ వీరగోష్ఠీ
ధీరాద్భుతసాంపరాయ తిరుమలరాయా.

శ్రీరంగరాయ+సహాయ. శ్రీరంగరాయ, శ్రీరంగరాయండ
నెడు, కలశాంభోరాశి=క్షీరసముద్రమునకు, సుధాసహాయ=చం
ద్రుండైనవాండా! భూభువనధురాధౌరేయ, భూభువన=భూలోక
ముయొక్క, ధురా-భారమునకు. ధౌరేయ=ధురంధరుండైనవాం
డా!

**End:**

సీ. అనుంగుంగొమ్ములబాసి కనుసన్నలమెలంగు
నిందిరం ద్రోణముగా నేంగునపిన

* * * *

అనుంగుండమ్ములంబాసి=ప్రియానుజుల నెడంబాసి, కనుసన్నల
మెలంగు=అజ్ఞా వశవర్తియై ప్రవర్తించుచున్నటువంటి, ఇందిర=లక్ష్మీ
కాంతను.

(వి-వి.)—

మొదలు లేదు. చివర లేదు. నాల్గవ యాశ్వాసము కొంత భాగము వఱకే కలదు. వ్రాంత ముద్దులు గూర్చుచున్నది. తప్పులు లేవు. శైథిల్యము గ్రంథపాతములును గలవు.

రామరాజభూషణకవిరచిత మయిన వసుచరిత్రమున కిది వ్యాఖ్యానము. ఎవరిచే రచియింపఁబడినదో పేరేమో యీ గ్రంథభాగమును బట్టి గుర్తింపరాదు.

---

R. No. **137**.

Palm-leaf. $17\frac{3}{4} \times 1\frac{1}{4}$ inches Foll. 374. Lines, 5 in a page Telugu Injured

Presented by M. Subba Rao of Rajahmundry in 1912–13.

ఉత్తరరామాయణము.

UTTARARĀMĀYAṆAMU

This Prabandha in eight Āśvāsas is a Telugu rendering of the Uttarakāṇḍa of Vālmīki's Rāmāyaṇa The author of the Telugu work is Pāparāju, son of Kankanti Appayāmātya, a Niyōgi Brahmin of the Ārvēla community The author states that he composed this work with the assistance of Puspagiri Timmakavi and that he also composed a Yaksagāna named Visṇumāyāvilasa. A work of this same name in the Dvipada metre is also known to have been composed by a younger brother of Pāparāju

Complete

**Beginning**:

శా. శ్రీగాధాగరబింబముం దొరయుఁ జిలుకన్ సజోరస్థ్సలీ
రారాజన్మణికాంతి గాఁబిలిచి తద్రాకేందుబింబాననా [గనా
స్త్రీరాం (?) కూరముచేఁ గృతార్థుఁడగుచుం జెల్వొందు గోపాం
జారగ్రామణి కృష్ణుఁ డిచ్చుత మహైశ్వర్యంబు మా కెప్పుడున్.

క. అయ్యనవద్యగుణావలి
యయ్యనమంత్రిమణి నరసమాంబ వివాహం
బయ్యె నహోర్యకుమారిని
నెయ్యంబునఁ బెండ్లియైన నెలతాల్పురహిన్.

* * * *

క. ఆనరసమాంబగర్భాం
భోనిధి నమృతాంశుచందమున దానయశో
నూనవిభావిభవైకని
ధానం బగునప్పయప్రధానుఁడు పొడమెన్.

* * * *

క. జననుతుఁ డయ్యప్పఘనుం
డనఘుఁడు చిదురూరినరసయకుఁ దిమ్మమకుం
దనుజామణియై గుణములఁ
బెనుపొందెడునరసమాంబఁ బెండిలియయ్యెన్.

* * * *

గీ. అన్నరసమాంబయందు స
మున్నతగుణుఁ డప్పనార్యముఖ్యుఁడు గనియెన్
సన్నుతుని బాపరాజా
ఖ్యు న్నరసింహాభిధానుఁ గులము వెలయఁగన్.

గీ. వారిలోఁ బాపరాజాఖ్యవనెగన్న
వాఁడ నేఁ బూర్వకృతపుణ్యవాసనావి
శేషమునఁ గృష్ణదేవునిఁ జెలఁగి కొలిచి
తత్కృప మహాకృతి యొనర్పఁ దలఁచినాఁడ.

**End:**

క. ఎందాఁకఁ జెలఁగు వేదము
లెందాఁకం దివిఁ జరించు రిందుఁడు సూర్యుం
డెందాఁకఁ గులగిరులు దగు
నందాఁకం బొసఁగు కృష్ణమహాకావ్య మిలన్.

మాలిని. సరసిజదళనేత్రా చారుసౌవర్ణగాత్రా
గరుడజవన పత్రా కాలభిత్కంకపత్రా
చరణవినతమిత్రా శాత్రవధ్వాంతమిత్రా
కరధృతఘనగోత్రా కంజవిద్వేషిగోత్రా.

**Colophon:**

ఇది శ్రీమదనగోపాలకృపాలాలితకటాక్షవీక్షాసమాసాదిత చతుర్విధానవద్యకవితావిద్యావధానాధునాతనభోజరాజ సకలవిద్వజ్జనాభివర్ణితోదీర్ణవితీర్ణివైభవాధఃకృతరాజరాజ రాజయోగసామ్రాజ్యలక్ష్మీవిలాసధురంధర గంధవహసభాంతరస్తవనీయనయకళాయుగంధర బంధురవనీపాలిశేషసంధానవసుంధరాధర శోధితాగణిత గణితశాస్త్రరత్నాకర వినయాదికగుణరత్నాకర కంకంటివంశపయఃపారావారపరిపూర్ణరాకాసుధాకర అప్పయామాత్య సంక్రందననందన విజ్ఞానవిభవవిజితసనందన విష్ణుమాయావిలాసాభిధాన యక్షగాననిర్మాణప్రవీణతానిధాన పాపరాజప్రధానప్రణీతంబయిన శ్రీమదుత్తరరామాయణం బను మహాకావ్యంబునందు సర్వంబును నష్టమాశ్వాసము.

(వి-వి.)—

సమగ్రము. వ్రాంత చక్కనిది. తప్పులు లేవు. శైథిల్యము గ్రంథపాతములును గలవు.

వాల్మీకిరామాయణపు టుత్తరకాండమున కిది తెలిఁగింపు. గ్రంథకర్త కంకంటి పాపరాజు. ఆర్వేలనియోగి బ్రాహ్మణుఁడు. అప్పయామాత్యునికుమారుఁడు. విష్ణుమాయావిలాస మను యక్షగానమును రచియించినవాఁడు. సమీరకుమారవిజయమును రచియించిన పుష్పగిరితిమ్మకవి కీకవి మిత్రము. ఆకవి తోడ్పాటుననే యీ గ్రంథము రచియించినట్లు పాపరాజు చెప్పుకొన్నాఁడు. తిమ్మకవియే యేతద్గ్రంథమును రచించెననియు, ధనలోభముచే బాపరాజు పేరఁ బ్రకటించెననియుఁ గింవదంతి కలదు. నిజ మెంతో!

విష్ణుమాయావిలాస మనుద్విపదకృతి యొకటి యీ పాపరాజుతమ్ము
నిచే రచింపబడినదికలదు.

---

R. No. **133** (of the Sanskrit part)

Śrītāla. 10¼ × 2 inches Foll. 50. Lines, 11 in a page Telugu Injured.

Purchased in 1910-11 from K Rāmasāmi Ayyaṅgār of Magadi, Mysore province

(*d*) రత్నపరీక్ష.

RATNAPARĪKṢA

Foll. 40*a*—50*b*

Same as the work described under R No. 29 *ante*

Incomplete.

(మి-మి.)—

అసమగ్రము. వ్రాంత యొకరీతి నున్నది. తప్పులు గలవు.
శైథిల్యము కలదు. గ్రంథపాతములును గలవు.

ఇది నెం ౨౯ రున వర్ణిత మగు గ్రంథమే కాని వేఱు కాదు.

---

R. No. **194** (of the Sanskrit part)

Palm-leaf 15⅜ × 1¼ inches Foll 33 Lines, 5 in a page. Telugu. Much injured.

Purchased in 1910-11 by Prayaga Sītārama Śastri of Guntur

(*c*) ఆంధ్రనామసంగ్రహము.

ĀNDHRANĀMASAṄGRAHAMU

Foll. 17*a*—19*b*.

Same as the work described under R No 1(*a*) *ante*

Incomplete.

(మి-మి.)—

అసమగ్రము. వ్రాంత తిన్నదికాదు. తప్పులు, శైథిల్యము,
గ్రంథపాతములు, కలవు.

ఇది నెం ౧ (*a*) రున వర్ణిత మగు గ్రంథమే కాని వేఱు కాదు.

R. No **324** (of the Sanskrit part)

**Paper.** 6×4¼ inches Foll 42 Lines, 20 in a page Telugu. Good.

Purchased in 1910-11 of Potturi Lakṣmayya of Guntur

(*a*) భక్తిబోధకమగుసువ్విపాట.

BHAKTIBŌDHAKAMAGUSUVVIPĀṬA

Fol. 1

This song explains in metaphorical language the chief tenets of the Śrīvaiṣṇava religion, the soul being here compared to husked rice; and it is intended to be sung especially by the grain-huskers while they are engaged in removing the husk from the grain

Complete

**Beginning:**

కుదురైన శరీర మనె కుందెనా లోనా. అదనైన బద్ధజీవు లను కొలుకూ నించి కదలని గురు సేవ రోకలిచేత బూని పాద లేటి దురహంకారము పొట్టూడదంచి సువ్వీ సువ్వన్న లాలీ సువ్వన్న లాలీ సువ్వన్ని పాడరె మా శ్రీరామానుజుల తిరుమంత్ర మనె మంచి మొరమునా నించి దురితంపు కామక్రోధము పొల్లుగా జెరిగి సరగూన ద్వయమనె జల్లెడబట్టి, మఱి అన్యశేషమనె మెఱికలటు దీసి—

**End:**

అపుడాళ్వందారులు నాథమునూలు, ఇపుడు మాతిరువెంగళప్పాడై మొసగె సేనాసేనాదు లాగగించిన శేషామూ ఆనమ్మ యాళ్వారులారగించిరి శేషాభృత్యుడనైన నేను సేవించగంటి శేషా ప్రసాదములు సేవించగంటి సువ్వీ సువ్వన్నలాలీ.

(వి-మ.)—

సమగ్రము. వ్రాంతతిన్నది. తప్పులు కలవు.

ఈ సువ్విపాట శ్రీ వైష్ణవమతప్రకారము భక్తిని దెలుపుచున్నది.

(*d*) జీవైక్యబోధము.

JĪVAIKYABŌDHAMU.

Foll 4*b*—7*b*.

This is a lecture in verse addressed to the individual soul informing it of its identity with the Supreme Soul

Complete

**Beginning:**

ద్వి. ఆలకింపుమి జీవ! ఆత్మైక్యరీతి
మూలము నీకు నే ముచ్చట వలెను
దేటగాఁ జెప్పెదఁ దెలియంగ వినుము

**End:**

వివరించి నామాట విశ్వసించినను
నీవె బ్రహ్మంబవై నెగడెదు జీవ
ఇతరమతంబుల నితరమార్గముల
నిట్టియైక్యపుమార్గ మిది గల్గఁబోదు
వట్టిమాటలు గావు వైభవములు (?) గావు
నామాట నమ్ముము నయముతో జీవ
జిహ్వాఁద్రిముయనకు జిడంటనిరీతి (!)
భవపాశనిర్ముక్తభవ్యుండ వగుదు
విది నిశ్చయంబుగా నెఱుఁగుమి జీవ

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత తిన్ననిది, నిర్దుష్టము గాదు. శైథిల్యము లేదు. గ్రంథపాతములు లేవు.

ఈ ద్విపదమునందు, అద్వైతవేదాంత విషయము ప్రతిపాదింపఁ బడినది. రచించినవారి పే రిందు లేదు.

(e) పంచీకరణము.

PAÑCĪKARAṆAMU

Foll. 7b—17b

A Vedantic tract in colloquial Telugu explaining how the ninety-six principles may be evolved out of the five elements, viz., earth, water, light, air and ether

Complete.

**Beginning:**

పరాత్పరమందు పరం ; పరమందు శివం ; శివమందు శక్తి ; శక్తియందు నాదం ; నాదమందు బిందువు ; బిందువందు సదాశివం ; సదాశివునందు మహేశ్వరుడు.

**End:**

ఇంక, శరీరాలు రెండు : స్థూలం సూక్ష్మం. స్థూలమనగా అవయవాలు కలిగిన ప్రతిమాకారం. సూక్ష్మమనంగాను జ్ఞానేంద్రియాలు 5 న్ను కర్మేంద్రియాలు 5 న్ను అంతఃకరణాలు 4 న్ను ప్రాణవాయువులు 5 కూడినది. సూక్ష్మశరీరము ఈ రెంటి తోటి విడిచినదిన్నిన్ని భోగసిద్ధి. అంతు తత్త్వాలు ౯౬ శ్రీగురుబ్రహ్మణే నమః.

(వి-వి.)—

సమగ్రము. వ్రాంత తిన్ననిది, తప్పులు కలవు. శైథిల్యగ్రంథపాతములు లేవు.

తొంబదియారు తత్త్వముల పంచీకరణక్రమమిందు వ్యావహారిక వచనమున దెలుపబడినది.

R. No 393 (of the Sanskrit part)

Palm-leaf. 14⅜×1¼ inches. Foll 11. Lines, 5 in a page. Telugu. Good

Purchased in 1911-12 from C Viśvanātha Śāstrigāru of Vizianagaram

(*b*) గణితము.

GAṆITAMU

Foll. 13*a*—41*a*

This manuscript contains the sixth and the seventh chapters of a mathematical treatise The sixth chapter deals with geometry and the seventh with excavation (*i. e*, cubical measurements). This may perhaps form part of Pāvulūri Mallana's treatise and may thus be indebted to the Sanskrit Gaṇitasārasaṅgraha, seeing that in this latter work the subjects dealt with in the sixth and the seventh chapters are the same as those of the work under notice

Incomplete.

**Beginning:**

క. ధాత్రిం బుం గాంతనరచిత
క్షేత్రంబులు సూచి వానిఁ జెప్పెద నోజా
సూత్రము లేర్పడ నంబుజ
నేత్ర సరస్వతికి మ్రొక్కి నిరుపమభక్తిన్.

వ. అందుఁ బూర్వపంచకమందు మిశ్రగణితంబుఁ జెప్పెదఁ దదనంతరంబు సప్తక్షేత్రగణితవ్యవహారంబు చెప్పెద నది యెట్టి దనిన.

* * * *

క. ధారుణిఁ బూర్వపుగణితము
లారంగాఁ జూచి వెలయ నందు ససారం
బారయ నభివర్ణించెద
నేరుపుతో హరునిఁ దలఁచి నిరుపమభక్తిన్.

**End:**

* * * *

క. పరమాణు రేణుకణమును
బరువడితో నొనఁ దలయుఁ బదపడి వ్రీహిన్
అరయఁగ నెనిమిదిగుణముల
బరఁగఁగ నంగుళ మనంగ బర్వతనాథా.

ప్రతులుకూడే లక్షణము.

సీ. ప్రతులు లెక్కలు పరస్పరహతమైనచో
నరనరపాతిక పరంగ నిలుపు
అరకుం బాతికకును బరక యాపరకకు
నరకు వీసము వీస మందుసగము
పరగును మువ్వీస మరంజెంప నరకును
వీసంబునకు నర వీస మయ్యె
నరవీస మగుం జెంప నగుంగాని కానికి
నరకు నానర కాని వరుస నయ్యె
పాతికకుం బాతికవీసమైనర్థు

గీ. వీసమునకు బాతికయుం బెంచ నెలయు
కానికిని బాతికకు చిరకానియయ్యె
నరకు ముక్కాణికిం గాని నగయు నయ్యె
గణితపండిత వినుమిది గణితమతము.

(వి-వి.)—

అసమగ్రము. మొదలు లేదు. చివర లేదు. వ్రాంత తిన్నది. తప్పులు గలవు. గ్రంథపాతములు లేవు.

ఈ గణితగ్రంథ మెవరిచే రచింపబడినదో పేరేమో తెలియవచ్చుట లేదు. క్షేత్రగణితమనియు, హస్తఘాతగణితమనియుం గొంతభాగములు, అంకవిన్యాసముతోను, స్వరూపవిన్యాసముతోను గలవు. పావులూరి మల్లనార్యుని గణితములోని భాగము లగునో? ఇందలి పద్యములు కొన్ని శివసంబోధనములుగా నున్నవి. మఱి కొన్నింట సంబోధనములు "గణితజ్ఞా" ఇత్యాదివిధముల నున్నవి. వేఱు వేఱు గణితగ్రంథములందలి పద్యములు గొన్ని యిందున్నట్లు తోంచుచున్నది.

R. No. **490** (of the Sanskrit part).

Palm-leaf 10¾ × 1⅝ inches. Foll. 32. Lines, 5 in a page. Telugu. The right ends of the leaves have been bitten apparently by rats.

Presented in 1911–12 by C Viśvanātha Śāstrigāru of Vizianagaram

(*a*) మంత్రసారార్థదీపిక.

MANTRASĀRĀRTHADĪPIKA.

Foll. 1*a*—11*b*.

A Śrī-Vaiṣṇava religious tract written in colloquial Telugu explaining the meaning of the eight-syllabled Mantra addressed to Viṣṇu as Nārāyaṇa.

Complete.

**Beginning:**

శ్లో. అర్థపంచకతత్త్వజ్ఞాః పంచసంస్కారసంయుతాః ।
ఆకారత్రయసంపన్నా మహాభాగవతాస్స్మృతాః ॥

అనేస్స్మృతి ప్రకారం చేతను వేదాంత తాత్పర్యము నిశ్చయించేది యెట్లన్నను పంచసంస్కారము ను సదాచార్యులు సచ్ఛిష్యులకు ప్రసాదించినను యెరిగి వుండినవారు శ్రీమహాభాగవతులు అట్టి సదాచార్యులు యెరుక పడేచిన క్రమం బెట్లన్నను—

**End:**

శ్రీమహాభాగవతాభిమానమే పరమప్రాప్యమని నమ్మియుండుట. ఇట్లు పరంపరారహస్యము గాను పలుకబడిన మంత్రసారార్థదీపిక సంపూర్ణ మాయెను ... బెరుమానారు తిరువడిఘళే శరణము.

(బి-ఓ.)—

సమగ్రము. ప్రాచీన లిపి. తప్పులు శైథిల్యము గ్రంథపాతములు గలవు.

మంత్రసారార్థదీపిక యను నీగ్రంథమున శ్రీవైష్ణవమతప్రతిపాద్యమును ప్రవృత్తి వెలయించు నష్టాక్షరీమంత్రమునకు వ్యావహారికపు దెలుంగున విపులముగా నర్థము వివరింపబడినది.

# AUTHOR INDEX

OF THE

# TELUGU PART OF THE TRIENNIAL CATALOGUE OF MANUSCRIPTS

# GENERAL INDEX.

[సూ.—ఆడుగున గీఁత గీయఁబడిన పేళ్లుగల గ్రంథము లీ క్యాటలాగు నందు వర్ణింపఁబడినవి.]